# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 4 హైదరాబాద్ 117 ఏప్రిల్ 2011 పేజీలు : 68 రు. 15

* ఫోకస్ : 2011-12 కేంద్ర, రాష్ట్ర బడ్జెట్లు
* కాకరాపల్లి ప్రజలు అడుగుతున్నదేమిటి?
* హిరోషిమా నుంచి ఫుకుషిమా దాకా
* లిబియాపై అమెరికా దాడుల అంతరార్థం
* కృష్ణా జలాల పంపిణీ వివాదం - వాస్తవాలు
* దంతెవాడ ఆదివాసులపై గ్రీన్‌హంట్
* గోధ్రా తీర్పు - న్యాయం ఎటువైపు?

117

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

ఏప్రిల్ 2011
సంపుటి : 9
సంచిక : 4



## లోపలి పేజీల్లో...

**ఫోకస్ : 2011-12 కేంద్ర, రాష్ట్ర బడ్జెట్లు**





ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ /**
**చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

విద్యావంతులతో పాటు, విద్యార్థులకు కూడా అర్థమయ్యే సరళిలో ప్రస్తుతం రాజకీయ, ఆర్థిక, సామాజిక విషయాలను తెలియజేస్తున్న వీక్షణంకు అభినందనలు. మార్చ్ 2011 సంచికలో సిలువేరు హరినాథ్ రాసిన 'ఫీజు రీయింబర్స్‌మెంట్ విద్యార్థుల కోసమా?' అనే వ్యాసం ఒక విద్యార్థిగా నన్ను బాగా ఆకర్షించింది. రాష్ట్రంలో ప్రవేశపెట్టిన ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం ఎస్.సి., ఎస్.టి., బి.సి., ఇ.బి.సి.ల పేరుతో కేవలం అగ్రవర్ణాలవారు, ముఖ్యంగా అధికారంలో ఉన్న రాజకీయ నాయకులు, వారి బంధువర్గాలు అభివృద్ధి చెందడం కోసమే ఈ పథకాన్ని రాజశేఖరరెడ్డి ప్రవేశపెట్టాడనీ, దీని ఆధారంగానే అనేక కాలేజీలు పుట్టగొడుగుల్లా విస్తరించాయనీ తెలియజేశారు. అంతేకాకుండా ఫీ స్ట్రక్చర్ విధానాన్ని ప్రవేశపెట్టిన తరువాత, అన్ని వసతులు, అత్యున్నత ప్రమాణాలు ఉన్న యూనివర్సిటీ ఫీజు కంటే, నామ మాత్రపు సదుపాయాలు ఉన్న ప్రైవేట్ కళాశాలలకు ఫీజు మూడు రెట్లు అధికంగా చెల్లిస్తుందనీ, దీనివల్ల కేవలం కళాశాల యజమానులకు తప్పితే, విద్యార్థులకు ఏమీ ప్రయోజనం లేదనీ తెలియజేస్తూ, మమ్మలను ఆలోచింపజేసే విధంగా వ్యాసాన్ని రాసిన సిలువేరు హరినాథ్‌కి నమస్కారాలు తెలియజేసుకుంటూ...

**– పులుగుజ్జు గురువర్మ**
చిన్న ఓబినేపల్లి, ప్రకాశం

వీక్షణం మార్చ్ 2011లో ప్రచురించిన కొన్ని వ్యాసాలలో హిందూమత పదాలను వాడడం జరిగింది. ఉదాహరణకు – ఆత్మ, కుంటిసాకులు, గుడ్డి (మంత్రాలు – చింతకాయలు). శాస్త్రీయ పదాలను వాడితే మంచిదని నా అభిప్రాయం.

**– ముత్తన్నగారి రాజేందర్**
భూంపల్లి, మెదక్

వీక్షణంను ఈ మధ్యకాలం నుండే చదువుతున్నాను. వ్యాసాలు సమకాలీన సమస్యలపై ఆలోచించే లాగా ఉన్నాయి. చాలా విషయాలు (నాలాంటి సామాన్యులకు తెలియనివి) ప్రజలకు తెలియజేస్తున్న వీక్షణం మరింత అభివృద్ధి చెంది, నాలాంటి సామాన్యమైన వ్యక్తులకు అందాలని కాంక్షిస్తున్నాను. అయితే నాదో చిన్న సూచన. వీక్షణం పాఠకులు (ఒకే ప్రాంతానికి చెందినవారు) అప్పుడప్పుడు కలుస్తూ పత్రిక ప్రజల వద్దకు చేరేందుకు ఎక్కడైనా చిన్న చిన్న సమావేశాలు జరుపుకుంటే బాగుంటుందని నా అభిప్రాయం.

**– ఎన్.బి. మూర్తి**
విశాఖపట్నం

వీక్షణం మార్చి2011 సంచికలో ఫోకస్ అంశం 'అరబ్ ప్రజా ఉద్యమాల వెల్లువ' గురించి వివిధ ఆలోచనాపరులు వ్యక్తం చేసిన అభిప్రాయాలను గమనించినట్లైతే ఈరోజు ప్రజా ఉద్యమాలు అరబ్ ప్రపంచానికి మాత్రమే పరిమితం కాకుండా ప్రపంచవ్యాప్తంగా ఆయా దేశాలలో ప్రజానీకం వారి ఆగ్రహావేశాలను వ్యక్తం చేస్తున్నట్లు అర్థమవుతోంది. దీనికి కారణం ఆయా దేశాల పాలకులు అమలు చేసే ప్రజా వ్యతిరేక విధానాలతో పాటు గత రెండు దశాబ్దాలుగా అనుసరిస్తున్న ప్రపంచీకరణ విధానాలు కారణం అని చెప్పవచ్చు. వివిధ ప్రాంతాలలోని ప్రజలు తమ ప్రజాస్వామ్య ఆకాంక్షలను నెరవేర్చుకోవడానికి చేసే ప్రయత్నాలన్నింటిని చేస్తుంటే వారి ఆకాంక్షలను అణచడానికి పాలకులు దమననీతిని ప్రయోగిస్తుండడం వల్ల ప్రజలలో లోలోపల అసంతృప్తి, వ్యతిరేకత పెరిగిపోతూ పైకి మాత్రం పరిస్థితి నివురుగప్పిన నిప్పులా ఉంటోంది. ఇప్పుడు జరుగుతున్న వివిధ రకాల ఉద్యమాల నిప్పురవ్వలు ఈ నివురు నుండి బయటపడినవనే భావించాలి. ప్రస్తుతం జరుగుతున్న ఉద్యమాలను గమనించినట్లైతే టునీషియా, ఈజిప్ట్, లిబియా మొదలైన దేశాల నుండి ఇక్కడి తెలంగాణ ఉద్యమం వరకు, అన్నీ కూడ ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం జరుగుతున్న పోరాటాలే అనుకోవచ్చు. ఇందులో కొన్ని తమ స్వంత దేశాలలోని రాజరిక, నియంతృత్వ వంశ పారంపర్య పరిపాలన పట్ల విసుగుచెంది పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కోసం ఆరాటపడేవి, మరికొన్ని ఆత్మగౌరవం కోసం, స్వయంపాలన కోసం కోరుకునేవి. వీటితో పాటు వనరుల దోపిడీకి, అణచివేతకు వ్యతిరేకంగా దేశ సంపదను బహుళజాతి సంస్థలకు కట్టబెట్టే చర్యలను నిరసిస్తూ ప్రజలు అసహనాన్ని వ్యక్తం చేస్తున్నారు. కాబట్టి ఏలికలు ఎరుక ఉంచుకోవలసింది ఒక్కటే – పీఠాధిపతులను చేసేదీ ప్రజలే, పీఠాలను దించేదీ ప్రజలే. దీన్ని గుర్తెరిగి ప్రజల మనోభావాలకు అనుగుణంగా పాలన చేయవలసిన అవసరం ఉంది.

**– బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి**
సిద్ధిపేట, మెదక్

రాజ్యాంగం పౌరహక్కులు, ప్రజాస్వామిక విధానాలతో నిండి ఉంది. అవి ఆచరణలో శూన్యం. సమస్యలపై ఉద్యమిస్తే లాఠీలు, తూటాలు సమాధానం చెపుతున్నాయి. మీ ఎడిటోరియల్‌లో పేర్కొన్నట్లు ఆంధ్రప్రదేశ్ సమస్యల ప్రదేశ్‌గానే ఉంది. ప్రభుత్వం పోలీసులపై ఆధారపడి పాలన కొనసాగిస్తోంది. అణుశయ్యపై జపాన్ ఉంది. సునామి, భూకంపం అణువిద్యుత్‌ప్లాంట్‌ల పేలుడు వలన 8 లక్షల కోట్ల నష్టం, వేలాదిమంది మరణం సంఘటనల నుండి భారత ప్రభుత్వం గుణపాఠం నేర్చుకోవాలి. అరబ్ ప్రజా ఉద్యమాలపై తెలుగు ఆలోచనాపరుల అభిప్రాయాల వలన చాలా సమాచారం తెలిసింది. జ్యోతిషం శాస్త్రం కాదని మూడుదశాబ్దాల క్రితమే ప్రపంచంలోని ప్రముఖ శాస్త్రజ్ఞులు, నోబుల్ బహుమతి గ్రహీతలు పేర్కొన్నప్పటికి 2004లో సుప్రీంకోర్టు ప్రకటించడం మన రాష్ట్రంలో యూనివర్సిటీలు పాఠ్యాంశాలుగా చేర్చడం కొనసాగుతూనే ఉంది. రాజ్యాంగం, కర్మసిద్ధాంతం రెండింటిని సుప్రీంకోర్టు నమ్ముతోంది.

**– తుంపాల శ్రీరామమూర్తి**
*గాజువాక, విశాఖ*

అంతర్జాతీయ రాజకీయాల పైన పి. ప్రసాద్‌గారి వ్యాసాలు వివరణాత్మకంగా బాగుంటున్నాయి. కాని, ఒక సైద్ధాంతికమైన పొరపాటు అవగాహన గురించి రచయిత దృష్టికీ, పాఠకుల దృష్టికీ తేదలిచాను. సోవియట్ యూనియన్ కూలిపోయిన నాటి నుంచి చాలా మంది బూర్జువా రచయితలు ఇప్పుడు ఉన్నది ఏకధృవ ప్రపంచం అని రాస్తున్నారు. ఆ ప్రభావం వల్లనో ఏమో గాని మార్క్సిస్ట్ రచయితలు కూడా ఆ మాట వాడుతున్నారు. ప్రసాద్ గారి వ్యాసాలలో కూడా ఆ మాట ఉంది. కాని తాత్వికంగా చూసినా, రాజకీయార్థ శాస్త్రం ప్రకారం చూసినా ఏకధృవ ప్రపంచం ఉండడానికి వీలులేదు. ఒక వస్తువుకు తప్పనిసరిగా రెండు ధృవాలు ఉంటాయి. వాటి మధ్య ఐక్యతా, ఘర్షణా ఉంటాయి. సామ్రాజ్యవాద యుగంలో సామ్రాజ్యవాదుల మధ్య కూడా పోటీ ఉంటుంది. పోటీ లేని ఏకధృవ సామ్రాజ్యవాదం అనే దానికి అర్థం లేదు. నిజానికి ప్రసాద్ గారి వ్యాసాలలోనే అమెరికా సామ్రాజ్యవాదానికీ, యూరప్ సామ్రాజ్యవాదానికి ఉన్న ఘర్షణ గురించి ఎన్నో చోట్ల రాస్తున్నారు. అంటే, రెండు ధృవాలు ఉన్నాయనే అర్థం. మరి వివరణలో సరిగానే ఉన్న రచయిత పెద్దగా ఆలోచించకుండా ఏకధృవ ప్రపంచం అనే మాట వాడుతున్నట్టున్నారు.

**– కె. వెంకటేశ్వర్లు**
సూర్యాపేట

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

**సవరణ :** వీక్షణం మార్చ్ 2011 సంచికలోని ఆఖరు కవరు మొత్తంగా, మొదటి కవరుపై 'పేజీలు' అన్న అక్షరాలు సాంకేతిక కారణాల వలన సరిగా రాలేదు. ఈ ఇబ్బందికి చింతిస్తున్నాం. – సం.

# మిలియన్ మార్చ్, విధ్వంసం, ఎనిమిదో అధ్యాయం...

**రా**ష్ట్రంలో ప్రజల సమస్యలు నానాటికీ తీవ్రతరమవుతుంటే, పాలకులు, రాజకీయ వ్యవస్థ మాత్రం నిమ్మకు నీరెత్తినట్టు ప్రవర్తిస్తున్నాయి. పరిష్కరించగలిగిన సమస్యలను కూడ నానబెడుతున్నాయి. తమ సొంత ముఠా తగాదాలతో, ఆస్తుల లెక్కలలో మునిగితేలుతున్నాయి. ఇక్కడ సాగుతున్న పాలనకూ, పాలక విధానాలకూ, పాలకులకూ ప్రజల సమస్యలతో, ఆకాంక్షలతో, ఆందోళనలతో ఎంతమాత్రం సంబంధం లేదని ఇటీవలి సంఘటనలు మరొకసారి బయటపెడుతున్నాయి. మరో మాటల్లో చెప్పాలంటే ఇక్కడ సాగుతున్నది ప్రజాస్వామ్య పాలన కాదని, అధికారంలో ఉన్నవారి ఇష్టారాజ్యమని, దొంగల దోపిడీ అని మరొకసారి తేలుతున్నది. ప్రజలు ఎత్తిచూపుతున్న సమస్యలను న్యాయబద్ధంగా, ప్రజాస్వామికంగా పరిష్కరించడానికి ఈ పాలకులకు శక్తి సామర్థ్యాలు, ఆసక్తి లేవని రోజు రోజూ బయటపడుతున్నది. సమస్యలను పరిష్కరించి, ప్రజాజీవితం సాఫీగా సాగేలా చూసే బాధ్యత కోసమే అధికారం చేపట్టిన పాలకులు ఆ పనిని విస్మరించి, సంపద పోగేసుకోవడానికి, హింసా దౌర్జన్యాలు కొనసాగించడానికి మాత్రమే పని చేస్తున్నారు. అందువల్ల సామరస్య పూర్వకంగా పరిష్కారం కావలసిన ప్రజా సమస్యలు అనివార్యంగా ఘర్షణ రూపం ధరిస్తున్నాయి, హింసకూ విధ్వంసానికీ దారితీస్తున్నాయి. శాసనమండలి ఎన్నికలలో తమ అభ్యర్థులను గెలిపించుకోవడానికి అన్ని రాజకీయ పక్షాలూ అవలంబించిన అక్రమాలు, డబ్బు వినియోగం, ముఠాతత్వం, ఓటర్లను బందీలుగా పెట్టుకోవడం, ఒక పార్టీ మీద మరొక పార్టీ, ఒక పార్టీలోనే ఒక ముఠా మీద మరొక ముఠా చేసుకుంటున్న విమర్శలు, బయటపెడుతున్న నిజాలు చూస్తుంటే ఇది ప్రజాస్వామ్య పాలన కాదని స్పష్టమవుతున్నది. ప్రజాస్వామ్య భావనకు తగినట్టుగా పాలన జరగడంలేదని చెప్పడానికి ఇటీవలి పెద్ద ఉదాహరణ మిలియన్ మార్చ్ పై సాగించిన నిరోధ, నిర్బంధ చర్యలు. తెలంగాణ వాదులు ఏడాదికి పైగా సాగుతున్న తమ ఆందోళనలో భాగంగా, కేంద్ర ప్రభుత్వం 2009 డిసెంబర్ 9 ప్రకటనకు కట్టుబడి, పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టాలని కోరుతూ హైదరాబాద్ లో మార్చ్ 10న ప్రజాప్రదర్శన చేపట్టారు. జనవరిలో అరబ్ ప్రపంచంలో అట్టుడికిన ప్రజా ప్రదర్శనల నేపథ్యంలో, ముఖ్యంగా కైరో లో తహ్రీర్ స్క్వేర్ లో జరిగిన మిలియన్ మార్చ్ ప్రేరణగా హైదరాబాద్ లో కూడ అటువంటి ప్రదర్శనకు పిలుపు ఇచ్చారు. ఆ పిలుపు ఇచ్చినవారి అభిప్రాయాలతో, ఉద్దేశాలతో ఏకాభిప్రాయం లేనివారు కూడ సమర్థించవలసిన ప్రజాస్వామిక హక్కు అది. ఫ్రెంచి తత్వవేత్త వోల్టేర్ చెప్పినట్టు 'నీ అభిప్రాయాలతో నాకు ఏకీభావం లేకపోవచ్చు. కాని నీ అభిప్రాయం చెప్పే హక్కును కాపాడడానికి నా ప్రాణమైనా ఇస్తాను' అనేది ప్రజాస్వామిక స్ఫూర్తి. సమాజం, పాలన నిజంగా ప్రజాస్వామికంగా ఉంటే ఆ స్ఫూర్తి అమలయి ఉండవలసింది. కాని తెలంగాణలోని అన్ని జిల్లాలలోనూ రెండు రోజుల ముందు నుంచి తీవ్రమైన అణచివేత మొదలయింది. విచ్చలవిడిగా అరెస్టులు, రహదారుల మూసివేత, వాహనాల యజమానులకు బెదిరింపులు, హైదరాబాద్ లోకి ప్రవేశించే అన్ని వైపులా కాపలాలు, ప్రదర్శనకు వస్తున్నారని అనిపించిన వారి అరెస్టులు, హైదరాబాద్ లో నిషేధాజ్ఞలు, చివరికి మిలియన్ మార్చ్ జరిగే టాంక్ బండ్ కు ఉన్న దారులు మూసివేసి, ఇనుప ముళ్లకంచెల చుట్టలు వేసి, ఒక్కొక్క చోట వందలాది మంది పోలీసుల మోహరింపు... ఇదంతా దేనికి సూచన? పాలకులు అనుకుంటున్నట్టుగా తెలంగాణ వాదం తప్పుడు వాదమే అయితే, దానికి ప్రజలలో ఆదరణ లేకపోతే ఈ ఆటంకాలన్నీ కల్పించవలసిన అవసరమే లేదు, స్వేచ్ఛగా జరగనిచ్చినా అదే విఫలమవుతుంది. లేక, అది నిజంగా ప్రజలలో ఉన్నదే అయితే ఈ ఆటంకాలు కల్పించడం అప్రజాస్వామికం. అటువంటి ఆటంకాలతో అది ప్రతిఘటనకు, మరింత నిరసనకు దారితీసి మరింత ఉధృతమవుతుంది తప్ప సమసిపోదు. ఇన్ని ఆటంకాలు కల్పించవలసినంత బలమైనదని పాలకులే అనుకుంటే దాన్ని ఆమోదించడమే ప్రజాస్వామికమవుతుంది. ఇన్ని ఆటంకాలు కల్పించినా, అన్ని జిల్లాలలోనూ కలిపి దాదాపు నాలుగైదు లక్షల మందిని అడ్డుకుని, నిర్బంధించినా, టాంక్ బండ్ మీదికి అనుకున్న సమయానికి లక్ష మందికి పైగా చేరారు. మధ్యాహ్నం ఒంటి గంట నుంచి నాలుగు గంటల వరకూ అక్కడ గొప్ప ప్రజా సందోహం చెలరేగింది. ఒక్క భావజాలానికి చెందినవారు కాదు, ఒక్క తెలంగాణ ఆకాంక్ష మినహా మరే ప్రమాణంతో చూసినా ఎన్నడూ పక్క పక్కన నిలబడేవాళ్లు కూడ కాదు. నిజంగా అది ఒక విస్తృత, బహుముఖ, బహుళవాద ప్రజాస్వామిక స్ఫూర్తి ప్రదర్శన. కాని అదంతా మరుగున పడిపోయింది. ఆ అణచివేత గురించి గాని, దాన్ని తోసిరాజని ప్రజలు చూపిన ప్రజాస్వామిక స్ఫూర్తి గురించి గాని ఎవరూ మాట్లాడడం లేదు. ఆ ప్రదర్శన చివరి ఘట్టంలో కొందరు ప్రదర్శనకారులు సాగించిన చర్యల మీదనే రెండు వారాలకు పైగా చర్చోపచర్చలు సాగుతున్నాయి. తప్పనిసరిగా ఆ పరిణామం చర్చించవలసిందే. కాని ఏ సామాజిక పరిణామం ఎంత చర్చకు అర్హమవుతుందనే కనీస స్పృహ ఉండాలి. ఏ పరిణామాన్నయినా, మామూలుగా నేరంగా, ఘోరంగా కనబడే పరిణామాన్నయినా దాని నేపథ్యంలో పెట్టి, కార్యకారణ సంబంధాలతో పరిశీలించాలని తెలిసిన వాళ్లు కూడ ఈ విగ్రహ విధ్వంసం గురించి ఆ ఘటన ఒక్కటే జరిగినట్టుగా చర్చిస్తున్నారు. ఆ ఘటన పట్ల ఏ అభిప్రాయాన్ని ప్రకటిస్తామనేదానికన్న ముఖ్యం, ఆ ఘటన ఏ పరిణామాల గొలుసులో భాగంగా జరిగిందో చూడడం. దాన్ని తప్పు అనుకున్నా, ఒప్పు అనుకున్నా ఆ పరిణామాల గొలుసు మారదు. అలాగే అది ఆ విగ్రహాల మీద దాడా, ఆ విగ్రహాలను మరేదానికో చిహ్నాలుగా చూడడం వల్ల దాడి జరిగిందా అనేది కూడ ప్రధానమే. ఈ దేశంలో అత్యున్నతాధికారంగల ప్రభుత్వం ఒక ప్రకటన చేసి దాన్ని పద్నాలుగు నెలల తర్వాత కూడ అమలు చేయనప్పుడు, తమ ప్రజాస్వామిక నిరసన హక్కును కాలరాస్తున్నప్పుడు, ప్రతి ఒక్క రాజకీయ పక్షమూ అవకాశవాదంలో మునిగిపోయినప్పుడు నిరాశా నిస్పృహలతో ఆరువందల మంది ఆత్మహత్యలకు బలి అయిపోయినప్పుడు పెల్లుబికే న్యాయమైన ప్రతిఘటన కూడ పక్కదారి తొక్కుతుంది. అలా పక్కదారి తొక్కడాన్ని విమర్శించేవాళ్లు దానికి కారణమైన అధికార వైఖరిని ముందు విమర్శించాలి. ఈ వివాదం సమసిపోకుండానే ఇంతకాలం శ్రీకృష్ణ కమిటీ రహస్యంగా దాచిపెట్టిన ఎనిమిదో అధ్యాయం బయట పడింది. ఆ అధ్యాయం చదివితే విగ్రహ విధ్వంసం లాంటి చర్యలకు పాల్పడేట్టుగా తెలంగాణ యువతను పాలకులే రెచ్చగొడుతున్నారని స్పష్టమవుతుంది. పాలన ఉన్నట్టుగానే ప్రజాస్పందన ఉంటుంది. పాలన గురించి మాట్లాడకుండా స్పందన గురించి మాట్లాడడం ఉచితం కాదు.

వీ

## భారత పాలన గురించి వికీలీక్స్ నిజాలు

కొన్ని సంవత్సరాలుగా అనేక దేశాల ప్రభుత్వాలను, పాలకవర్గాలను వణికిస్తున్న వికీలీక్స్ పత్రాలు ఇప్పుడు భారత పాలన గురించి, భారత పార్లమెంటరీ రాజకీయాల అసలు స్వరూపం గురించి నిజాలు తెలియజేస్తున్నాయి. వివిధదేశాలలో అమెరికన్ రాయబార కార్యాలయాలు తమ ప్రభుత్వానికి పంపిన సమాచారానికి సంబంధించిన వేలాది కేబుల్స్ ను వికీలీక్స్ సంపాదించింది. వాటిలో భారత దేశంలోని అమెరికా రాయబార కార్యాలయాలు పంపిన కేబుల్స్ కూడ ఉన్నాయి. వాటిలో కొన్నిటిని సంపాదించిన హిందూ దినపత్రిక మార్చ్ 15 నుంచి రోజూ కొన్ని చొప్పున ప్రచురిస్తున్నది. గత రెండువారాలుగా వెలువడుతున్న ఈ సమాచారం, దానిమీద దేశంలో జరుగుతున్న చర్చ, వివిధ పార్లమెంటరీ రాజకీయ పక్షాల స్పందనలు చూస్తుంటే ఈ దేశం అర్ధవలస అనే సూత్రీకరణ అక్షరాలా ఎంత నిజమో బయట పడుతున్నది. ఇక్కడ రాజకీయాధికారం చేపట్టవలసిన వారెవరో అమెరికా ప్రభుత్వం నిర్ణయిస్తుంది. రాజకీయాధికారం చేపట్టినవారిలో కూడ ఏ శాఖను ఏ మంత్రి నిర్వహించాలో అమెరికా పాలకులు నిర్ణయిస్తారు. తమ ప్రయోజనాలకు భంగం కలిగిస్తున్నారని అనుకున్న మంత్రిని మార్చమని అమెరికా పాలకులు ఆదేశిస్తారు. ఆ ఆదేశం క్షణాల్లో అమలవుతుంది. భారత రక్షణ శాఖ ఎన్ని వేల కోట్ల రూపాయలతో ఏయే ఆయుధాలు కొనాలో అమెరికన్ బహుళజాతిసంస్థలు నిర్ణయిస్తాయి. ఇదంతా కేవలం అధికారంలో ఉన్నవారి దళారీతనం అనుకోవడానికి కూడ వీలు లేదు. ఆ అధికారాన్ని ప్రతిపక్షాలు అడ్డుకుంటాయని అనుకోవడానికి కూడ వీలు లేదు. ఆ ప్రతిపక్ష నాయకులు కూడ అమెరికన్ దౌత్య అధికారులతో నిరంతర సంబంధంలో, స్నేహపూర్వక సంభాషణలలో ఉంటారు. తమ పార్టీలు అధికారికంగా ప్రకటిస్తున్న విధానాలకు భిన్నంగా అమెరికన్ దౌత్యవేత్తలతో మాట్లాడతారు, హామీలు ఇస్తారు. మత భావజాలాన్ని స్థిరంగా అంటిపెట్టుకుని ఉండడం 'ఎప్పటికెయ్యది అవసరమో' అన్నట్టు మాత్రమేనని భారతీయ జనతాపార్టీ నాయకులు అమెరికా దౌత్యవేత్త చెవిలో చెపుతారు. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశం పట్ల తమ వ్యతిరేకత బయట ప్రజల కోసం చేసే ప్రకటన మాత్రమేనని, నిజానికి తాము విదేశీ ప్రత్యక్ష పెట్టుబడికి వ్యతిరేకం కాదని భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) ప్రధాన కార్యదర్శి అమెరికన్ దౌత్యవేత్తకు సవినయంగా మనవి చేస్తారు. పైగా ఆ దౌత్యవేత్త తన అభిప్రాయంగా మార్క్సిస్టు పార్టీ కార్యదర్శి ఎంత మెత్తని వాడో, ఎంత కార్యసాధకుడో తన సొంత ధృవీకరణ కూడ జతచేస్తాడు. పాలకపక్షం గురించి నిజాలు బయటపడినన్ని రోజులు ఇల్లెక్కి అరిచిన ప్రతిపక్షాలు, తమ గురించి నిజాలు బయటపడగానే వికీలీక్స్ విశ్వసనీయతను ప్రశ్నిస్తున్నాయి. మొత్తానికి ఆ కేబుల్స్ లో ఉన్నవి నూటికి నూరుపాళ్లు నిజాలు కావనుకున్నా, అవి అమెరికన్ దౌత్యవేత్తల అభిప్రాయాలు మాత్రమేననుకున్నా, వాటిలో పదోవంతు నిజమైనా మన రాజకీయపక్షాలన్నీ అమెరికా పాలకుల దళారులుగా ఉన్నాయనేది స్పష్టమవుతున్నది. నూట పదికోట్ల ప్రజల ఈ ఘనమైన మాతృభూమికి ఏం జరుగుతున్నది? ఇప్పటికైనా మేలుకొని ఈ పిడికెడు మంది దళారీ పాలకవర్గాలను మట్టి కరిపించవలసిన అవసరం లేదా?

## సామ్రాజ్యవాదమే ప్రపంచ ప్రజల అసలు శత్రువు

ప్రపంచ ప్రజలకు సామ్రాజ్యవాదం ఎంత భయంకరమైన, విధ్వంసకరమైన శత్రువుగా ఉన్నదో ఇవాళ జరిగిన, ఇంకా జరుగుతున్న రెండు పరిణామాలు చూపుతున్నాయి. ఒకటి జపాన్ లో భూకంపం అనే ప్రకృతి సహజమైన విపత్తుతో మొదలై, అణు విద్యుత్ కేంద్రాల విస్ఫోటనంతో అపార జననష్టానికీ, సంపద నష్టానికీ దారితీసిన పరిణామం. రెండవది, పొరుగుదేశాలలో ప్రజాస్వామిక ప్రజ్వలనాల ప్రేరణతో సొంతదేశపు నియంతకు వ్యతిరేకంగా లిబియా ప్రజలు ప్రారంభించిన న్యాయమైన ఆందోళనను సామ్రాజ్యవాద సైన్యాలు తమ చేతుల్లోకి తీసుకుని లిబియా సార్వభౌమాధికారం మీద దాడి చేసి వందలాది మంది ప్రజలను, సంపదను భస్మీపటలం చేస్తున్న పరిణామం. ఇరవయో శతాబ్ది మధ్య భాగం నుంచీ సామ్రాజ్యవాదం ప్రారంభించిన అణు పరీక్షలు, కొత్త కొత్త అణ్వాయుధ ప్రయోగాలు అక్కడి భూగర్భంలో, భూఖండాల కదలికలలో గణనీయమైన మార్పులు తెచ్చి, ప్రకృతి సహజమైన వాటికన్న మించిన భూకంపాలకు కారణమవుతున్నాయి. హిరోషిమా, నాగసాకిలలో కోట్లాది మంది మృత్యువాత పడిన అనుభవం తర్వాత, జపాన్ సమాజం తాను మరెన్నడూ యుద్ధాల జోలికి పోనని ప్రతిజ్ఞ తీసుకుంది. కాని పాలకులు, అంతర్జాతీయ అణువిద్యుత్ బహుళజాతి సంస్థలతో కలిసి జపాన్ ను ఈ పరోక్ష యుద్ధంలోకి నెట్టారు. అణువిద్యుత్ కేంద్రం అంటే పేరుకు పౌర విద్యుదుత్పాదనలో ఉన్నప్పటికీ, అది తయారు చేసే వ్యర్థపదార్థాలు అణ్వాయుధాల తయారీకి తప్ప మరెందుకూ పనికి రావు. ఆ వ్యర్థపదార్థాలను నాశనం చేయడం సాధ్యంకాదు, నిలువ ఉంచడం మంచిది కాదు. అలా కుప్పలుగా పోగుపడిన వ్యర్థపదార్థాలను ఇవాళ సునామీ జలాలు భూగోళమంతా విస్తరిస్తున్నాయి. ఈలోగా ఆ అణువిద్యుత్ కేంద్రాలలో సంభవించిన పేలుళ్ల వల్ల అణుధార్మికత గాలిలో వ్యాపిస్తోంది. అరవై ఏళ్ల కిందటి హిరోషిమా నాగసాకి అణుధార్మికత ప్రభావం వల్ల ఇప్పటికీ అనారోగ్యం పాలవుతున్న జపాన్ సమాజం మరొక కొత్త ముప్పును ఎదుర్కొంటున్నది. మరొకపక్క, అరబ్ ప్రపంచంలో నియంతల దుష్పరిపాలనకు వ్యతిరేకంగా వెల్లువెత్తిన ప్రజాగ్రహాన్ని పక్కదారి పట్టించడం కోసం సామ్రాజ్యవాదులు చేస్తున్న ప్రయత్నాలకు ఊతంగా దొరికింది లిబియా. అధ్యక్షుడు మహమ్మద్ గడాఫీ అమెరికా పాలకులను వ్యతిరేకిస్తున్నవాడే అయినప్పటికీ, కనీసం ముప్పై సంవత్సరాలుగా చిత్తశుద్ధితోనో, మూర్ఖత్వంతోనో సామ్రాజ్యవాద విధానాలను ఎదుర్కొంటున్నప్పటికీ దేశంలో ప్రజల మీద మాత్రం దుర్మార్గమైన నిరంకుశ పాలననే నడుపుతున్నాడు. పొరుగుదేశాలలో మొదలయిన ప్రజాస్వామిక ఆందోళనలతో ప్రోత్సాహం పొందిన లిబియన్లు ఇదే అదనుగా గడాఫీ వ్యతిరేక పోరాటాన్ని ఉధృతం చేశారు. గతంలో ఇటాలియన్ పాలకులకు వ్యతిరేకంగా ఒమర్ ముఖ్తార్ పోరాటం నడిపిన ప్రాంతాలన్నీ ఇప్పుడు మళ్లీ ప్రభుత్వ వ్యతిరేకతకు చిహ్నాలుగా నిలిచాయి. ఈ అవకాశం చూసుకుని, గడాఫీ మీద దాడి చేయడానికి ఐక్య రాజ్య సమితితో తీర్మానం చేయించిన అమెరికా నాయకత్వాన సైనిక దాడులు సాగుతున్నాయి. లిబియా ప్రజల న్యాయమైన పోరాటాలను సంపూర్ణంగా సమర్థిస్తూనే, లిబియా మీద ఈ సామ్రాజ్యవాద దాడులను ఖండించవలసి ఉంది. ఈ రెండు పరిణామాల నుంచీ సామ్రాజ్యవాద దుర్మార్గాన్ని అర్థం చేసుకోవలసి ఉంది. వీ







- **కోస్తా కాలుష్య కాసారంలో నిప్పుకణికలై మండుతున్న సోంపేటలు** – సి.పి.ఐ. (ఎం. ఎల్) న్యూ డెమోక్రసీ ప్రచురణలు – 74 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : ప్రజాపంథా; సహచర బుక్ మార్ఫ్, దిశ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో, ప్రజాశక్తి బుక్ హౌస్
- **భూమిపుండు** – ఓపెన్ కాస్ట్ బొగ్గు గనులపై వ్యాస సంకలనం – సంపాదకులు : పిట్టల రవీందర్ – తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురణ – 182 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : ఎం. కోదండరామ్, అధ్యక్షులు, తెలంగాణ విద్యావంతుల వేదిక, 12-13-578, నాగార్జుననగర్, తార్నాక, సికింద్రాబాద్ – 500 017, సెల్ : 9848387001; రాష్ట్రంలోని అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **చిరంజీవి శ్రీశ్రీ** – చలసాని ప్రసాద్ – శ్రీశ్రీ సాహిత్య నిధి, 95 పేజీలు, 1/8 డెమీ, రు.50, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ – 520004; ఫోన్ : 0866-6640595, ఫ్యాక్స్ : 0866-6697375, సెల్ : 9848504649, 9246277375; ఇ-మెయిల్ : srisri_sahityanidhi@yahoo.com
- **పోరు బాటలో తెలంగాణ** (ఉద్యమ సమీక్ష 2009 ఆగస్ట్ నుండి 2010 ఆగస్ట్ వరకు) – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసీ ప్రచురణ – 38 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : ప్రజాపంథా, మార్ఫ్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; సహచర బుక్ హౌస్, దిశ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, మైత్రీ బుక్ స్టాల్, విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో
- **శ్రీకాకుళ సాయుధ గిరిజన రైతాంగ పోరాటం – అనుభవాలు** – పైలా వాసుదేవరావు – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసీ ప్రచురణ – 106 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : ప్రజాపంథా, మార్ఫ్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; సహచర బుక్ హౌస్, దిశ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, మైత్రీ బుక్ స్టాల్
- **సమ్మె పోరులో బీడీ కార్మికులు** – ఆరు లక్షల బీడీ కార్మికుల సమ్మె – పూర్వాపరాలు – డి.వి. కృష్ణ – భారత కార్మిక సంఘాల సమాఖ్య (ఐ.ఎఫ్.టి.యు.) ప్రచురణ – 54 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : వనమాల కృష్ణ, ఆంధ్రప్రదేశ్ బీడీ వర్కర్స్ యూనియన్ కార్యాలయం, శ్రామిక భవన్, కోటగల్లి, నిజామాబాద్
- **నూతన ప్రజాస్వామిక విప్లవ రథసారథి కామ్రేడ్ గణపతి ఇంటర్వ్యూ పూర్తి పాఠం** – ఎర్ర నక్షత్రం ప్రచురణలు – 59 పేజీలు, 1/8 డెమీ, రు. అమూల్యం, ప్రతులకు : ఎస్. లక్ష్మారెడ్డి, రిటైర్డ్ టీచర్, 11-943/1, మునుస్వామినగర్, అమరావతి రోడ్డు, గుంటూరు – 522034
- **హైదరాబాద్ స్వాతంత్ర్య సంరంభం** – పరిచయం, వివరణలు : ఎన్. వేణుగోపాల్ – ప్రాచీ ప్రచురణలు – 62 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : పి.పి.సి. జోషి, ప్రాచీ పబ్లికేషన్స్, 3-3-859/1/ఎ, రెండవ అంతస్తు, ఆర్య సమాజ్ ఎదురు సందు, కాచీగూడ, హైదరాబాద్ – 500027, సెల్ : 9346689306; ఇ-మెయిల్ : joshippc@yahoo.co.in, joshippc@gmail.com, www : pracheepublicastions.com
- **భారతీయ సాహిత్య వ్యాసాలు** – డా. నలిమెల భాస్కర్ – రామయ్య విద్యాపీఠం ప్రచురణ – 106 పేజీలు, 1/8 డెమీ, రు.60
- **శైశవగీతం** – పిల్లల కోసం ఓ కొత్త ప్రపంచం – చుక్కా రామయ్య – అడుగుజాడలు పబ్లికేషన్స్ – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 50, పై రెండు ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, ఇ.నెం. 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో








## బంద్.. సహాయ నిరాకరణ.. మిలియన్ మార్చ్

పార్లమెంట్‌లో బిల్లు పెట్టి తెలంగాణను వెంటనే ప్రకటించాలంటూ తెలంగాణ పొలిటికల్ జె.ఎ.సి. ఫిబ్రవరి 23, 24 తేదీలలో చేపట్టిన నలభై ఎనిమిది గంటల బంద్ నిర్వహించారు. అలాగే ఉద్యోగులు ఫిబ్రవరి 17 నుంచి మార్చ్ 4 వరకు పెద్ద ఎత్తున సహాయ నిరాకరణ చేపట్టారు. మార్చ్ 10న తీవ్ర నిర్బంధం మధ్య ట్యాంక్‌బండ్‌పై చేపట్టిన మిలియన్ మార్చ్ చేపట్టారు. మధ్యాహ్నం 1 నుంచి 4 గంటల వరకు ఈ మార్చ్ జరిగింది. తెలంగాణ సాధించేదాకా ఉద్యమాన్ని కొనసాగించాలని ప్రతినబూనారు. మిలియన్ మార్చ్ ముగింపులో ట్యాంక్‌బండ్‌పై ఉన్న విగ్రహాలపై ఆందోళనకారులు దాడులు చేసి కొన్ని విగ్రహాలను హూసేన్‌సాగర్‌లో పడేశారు.

## నిన్న సోంపేట... నేడు కాకరాపల్లి

శ్రీకాకుళం జిల్లా కాకరాపల్లిలో థర్మల్ విద్యుత్ కేంద్రం ఏర్పాటుకు వ్యతిరేకంగా ఫిబ్రవరి 28న జరిగిన ఆందోళన ఉద్రిక్తంగా మారింది. పోలీసుల కాల్పుల్లో ఆకాశలక్కవరానికి చెందిన జీరు నాగేశ్వరరావు (45), సీరపువాణిపేటకు చెందిన సీరపు ఎర్రయ్య (28) అనే ఇద్దరు రైతులు మరణించారు. ఆ సందర్భంగా జరిగిన కాల్పుల్లో ముప్పై ఆరు మంది తీవ్రంగా గాయపడ్డారు. థర్మల్ పోరాట కమిటీ నాయకుడు ఆకాశలక్కవరపు సర్పంచ్ సుగ్గు రామిరెడ్డి అరెస్ట్‌కు పోలీసులు వస్తున్నారన్న ప్రచారంతో అలజడి మొదలయింది. చుట్టు పక్కల గ్రామాల ప్రజలు పోలీసులను ఎదుర్కోవడానికి సిద్ధమయ్యారు.

## శ్రీకాకుళంలో ఎ.పి.సి.ఎల్.సి. మహా సభలు

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం 15వ రాష్ట్ర మహాసభలు ఫిబ్రవరి 12, 13 తేదీల్లో శ్రీకాకుళంలో జరిగాయి. నూతన అధ్యక్షుడిగా ప్రొ.ఎస్. శేషయ్య ఎన్నికయ్యారు. ప్రధాన కార్యదర్శిగా చిలుకూరి చంద్రశేఖర్, ఉపాధ్యక్షులుగా చిట్టిబాబు, తిరుమలరావు, సురేష్‌కుమార్‌లు ఎన్నికయ్యారు. ఫిబ్రవరి 12న జరిగిన సదస్సులో ప్రొ. అమిత్ భట్టాచార్య (పశ్చిమ బెంగాల్) ప్రసంగిస్తూ రాజ్యహింసకు పౌరహక్కులు బలవుతున్నాయనీ, ప్రజలపై ప్రభుత్వం యుద్ధం కొనసాగిస్తోందనీ అన్నారు. మహాసభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న ప్రొ. ఘంటా చక్రపాణి అభివృద్ధి - ప్రాంతీయ అసమానతలు అన్న విషయంపై ప్రసంగించారు.

## వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీ

కడప మాజీ ఎం.పి., మాజీ ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి కుమారుడు వై.ఎస్. జగన్మోహన్‌రెడ్డి కాంగ్రెస్ నుంచి బహిష్కరణకు గురయ్యారు. సొంత పార్టీ పెట్టారు. వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీగా పేరు మార్చ్ 12న ఇడుపులపాయలో వై.ఎస్.ఆర్. సమాధి వద్ద తల్లి విజయమ్మతో కలిసి ప్రకటించారు. ఈ సందర్భంగా పార్టీ జెండాను కూడా ఆవిష్కరించారు.

## ఇళ్లు పూర్తి కాలేదు

రాష్ట్ర ప్రభుత్వం 2006-07లో ఇందిరమ్మ గృహ నిర్మాణం చేపట్టింది. ఇప్పటి వరకూ మూడు దశల్లో మొత్తం 64 లక్షల ఇళ్లను మంజూరు చేసింది. వీటిలో 31 జనవరి 2011 నాటికి 33.97 లక్షల ఇళ్లు పూర్తయ్యాయని, 13.10 లక్షల ఇళ్లు వివిధ నిర్మాణ దశల్లో ఉన్నాయని, ఇంకా 17.02 లక్షల ఇళ్లు అసలు ప్రారంభమే కాలేదని ప్రభుత్వమే స్పష్టం చేసింది.

## మాకొద్దీ అణు విద్యుత్

శ్రీకాకుళం జిల్లాలోని కొవ్వాడలో నిర్మించ తలపెట్టిన అణు విద్యుత్ కేంద్రాన్ని ఆ ప్రాంత ప్రజలు పార్టీలకతీతంగా వ్యతిరేకిస్తున్నారు. జపాన్‌లో వేలాది మంది అమాయక ప్రజలు ప్రాణాలు కోల్పోయారని, ఇక తమ ప్రాంతంలో అణు విద్యుత్ కేంద్రం వద్దని పలువురు పార్టీ నాయకులు అభిప్రాయ పడ్డారు. మార్చ్ 14న కొవ్వాడలో ర్యాలీ నిర్వహించారు. రాష్ట్ర ప్రభుత్వాలు అణు విద్యుత్ కేంద్రాల నిర్మాణాన్ని ఆపివేయాలని ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక కోరింది. కొవ్వాడ అణు విద్యుత్ కేంద్రాన్ని, కడప, నల్గొండలలో యురేనియం తవ్వకాల సర్వేను ఆపివేయాలని వేదిక జాతీయ కో-కన్వీనర్ సరస్వతి డిమాండ్ చేశారు. అమెరికాలో లేని అణు విద్యుత్ కేంద్రాలు ఇక్కడ ఎందుకు అని ఐ.ఐ.సి.టి. పరిశోధకులు డా. బాబురావు ప్రభుత్వాన్ని ప్రశ్నించారు.

## బడ్జెట్ 2011-12

ఆర్థిక మంత్రి ఆనం రాంనారాయణ రెడ్డి ఫిబ్రవరి 23న 2011-12 రాష్ట్ర బడ్జెట్‌ను అసెంబ్లీలో ప్రవేశపెట్టారు. రు.1,28,543 కోట్ల జమ ఖర్చులతో బడ్జెట్‌ను ప్రవేశపెట్టారు. గత ఏడాదితో పోలిస్తే ఈసారి బడ్జెట్ అంచనా పదిహేను వేల కోట్లు పెరిగింది.

## ఎస్.సి. వర్గీకరణ బిల్లు పెట్టాలి

పార్లమెంట్‌లో ఎస్.సి. వర్గీకరణ బిల్లు పెట్టాలని డిమాండ్ చేస్తూ మార్చ్ 14న అసెంబ్లీ ముట్టడికి ఎం.ఆర్.పి.ఎస్. పిలుపునిచ్చింది. ఆ పిలుపు మేరకు విద్యార్థులు అసెంబ్లీ ముట్టడికి ప్రయత్నించారు. ఆ క్రమంలో మొత్తంగా తొమ్మిది వందల మంది విద్యార్థులను, కార్యకర్తలను పోలీసులు అరెస్టు చేశారు.

## హైదరాబాద్‌కు అణు ముప్పు

న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్‌ను హైదరాబాద్ మౌలాలి ప్రాంతంలో 1971లో ప్రారంభించారు. అప్పట్లో ఈ ప్రాంతం నగరానికి బాగా దూరంగా ఉండేది. ఇప్పుడు నగరం విస్తరించడంతో ఎన్.ఎఫ్.సి. జనావాసాల మధ్యకు వచ్చింది. ఎన్.ఎఫ్.సి.లో రెండు వందల టన్నుల అణు పదార్థం నిలువ ఉంటుందని అంచనా. దేశంలోని ఇరవై అణు రియాక్టర్‌లలో పద్దెనిమిది రియాక్టర్‌లకు ఇక్కడి నుంచే అణు ఇంధనం సరఫరా అవుతుంది. జనావాసాలు విస్తరించిన నేపథ్యంలో ఎన్.ఎఫ్.సి.ని తరలించాలని 1995లోనే నిపుణుల కమిటీ సూచించింది.

## సి.పి.ఎం. నేతల దీక్షలు భగ్నం

దళిత, గిరిజన, పట్టణ పేదలు, కౌలుదార్లు, కార్మికుల సమస్యల పరిష్కారం కోసం మార్చ్ 17 నుంచి నిరవధిక నిరాహార దీక్ష చేపట్టిన సి.పి.ఎం. రాష్ట్ర కార్యదర్శి బి.వి. రాఘవులుతో సహా మరో ముగ్గురు పార్టీ నేతలను మార్చ్ 19 అర్ధరాత్రి పోలీసులు అరెస్టు చేసి ఆస్పత్రికి తరలించారు. వీ

*అభివృద్ధి పేరిట వస్తున్న విధ్వంసాన్ని ప్రాణాలు పణం పెట్టి ప్రతిఘటిస్తున్న ప్రజల పోరాట చైతన్యాన్ని వివరిస్తున్నారు*

**యాటెల్లి రామచంద్రం**

# కాకరాపల్లి ప్రజలు అడుగుతున్నదేమిటి?

ప్రత్యామ్నాయ పోరాటాలను దేశవ్యాప్తంగా విస్తరింపజేసిన ప్రాంతంలో ఇప్పుడు మళ్లీ పోరాట జ్వాలలు ఎగిసి పడుతున్నాయి. శ్రీకాకుళం జిల్లా సంతబొమ్మాళి మండలంలోని కాకరాపల్లి గ్రామ పొలిమేరలో ఈస్ట్ కోస్టు ఎనర్జీ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ 2640 మెగావాట్ల బొగ్గు ఆధారిత థర్మల్ విద్యుత్ కేంద్రాన్ని నిర్మిస్తోంది. అభివృద్ధి పేరుతో ప్రభుత్వాలు తమ జీవనాధారాలపై, ప్రకృతి వనరులపై విధ్వంసం సృష్టిస్తున్నప్పుడు ప్రజల వేదన నుండి వచ్చే ప్రతిఘటన ఎలా ఉంటుందో ఇటీవలి సోంపేట, కాకరాపల్లిలో చూసాం. ఈ ఆందోళనను అణిచి వేయడానికి ఫిబ్రవరి 28న పోలీసులు జరిపిన కాల్పుల్లో ఇద్దరు చనిపోయారు. వందలాది మంది గాయపడ్డారు. ఇంత ఆందోళన జరిగాక కంపెనీ పనులను కొద్దికాలంపాటు ఆపాలని ప్రభుత్వం నుంచి ప్రకటన వెలువడింది. మనుషులు చనిపోతేగాని మన ప్రభుత్వాలకు పట్టడంలేదు.

ఈ ఘటనకు దారితీసిన పరిణామాలను వీక్షణం తరఫున ప్రత్యక్షంగా వెళ్లి మార్చ్ 14, 15 తేదీల్లో ఆకాశలక్కవరం, సీరపువానిపేట, తేలినీలాపురం, వడ్డితాండ్ర గ్రామాల్లో నేను స్వయంగా పరిశీలించిన విషయాలను మీ ముందు ఉంచే ప్రయత్నమే ఈ వ్యాసం.

వడ్డితాండ్రకు నేను వెళ్లేనాటికి కాకరాపల్లి థర్మల్ వ్యతిరేక పోరాట కమిటీ ఆధ్వర్యంలో ఆగస్టు15, 2010లో ప్రారంభించి చేస్తున్న నిరాహార దీక్షలు 214వ రోజుకు చేరాయి. పవర్ ప్లాంట్ నిర్మిస్తున్న స్థలంలో ప్రపంచంలోనే చాల అరుదుగా ఉండే చిత్తడి నేలలున్నాయి. అక్కడక్కడ నీటితో కూడిన నీటి గుంటలున్నాయి. కంపెనీ ముందు నుండి వడ్డితాండ్రకు వెళ్లే పోలాకి – నౌపాడ తారు రోడ్డు ఉంది. రోడ్డును ఆనుకొని రెండు పంటలు పండే ఐదు వేల ఎకరాల మాగాణి భూమి ఉంది. కుడి వైపు జీడితోటలు ఉన్నాయి. కంపెనీకి వెనుక వైపు రెండు కిలోమీటర్ల దూరాన సముద్రం ఉంది. కంపెనీకి 8 కిలోమీటర్ల దూరంలో 5వ నెంబరు జాతీయ రహదారి ఉంది. కంపెనీకి ఎడమవైపున కోలకతా నుండి చెన్నై వెళ్లే రైలు మార్గం ఉంది. దాని పక్కనే 2500 మంది కండ్ర మత్స్యకారులు నివసించే వడ్డితాండ్ర గ్రామం ఉంది. కంపెనీకి నాలుగు కిలోమీటర్ల దూరంలో తేలినీలాపురం ఉంది. ఇక్కడే సైబీరియా నుండి వలస వచ్చే పక్షుల పర్యాటక కేంద్రం ఉంది. కంపెనీ చుట్టూ పంటపొలాలు ఉన్నాయి. ఇది కంపెనీ చుట్టూ ఉన్న స్వరూప స్వభావం.

ఇంతటి వైవిధ్యంతో కూడుకొని ఉన్న ప్రాంతంలో ఈస్ట్‌కోస్టు ఎనర్జీ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీకి 3,333 ఎకరాల భూమిని ప్రభుత్వం కేటాయించింది. పర్యావరణ అపిలేట్ అథారిటీ ఆదేశాలకు, ఇ.ఎ.సి మార్గదర్శకాలకు వ్యతిరేకంగా 2008 సెప్టెంబర్‌లో ఈ కంపెనీ నిర్మాణం కోసం విద్యుత్ కేంద్రం నిర్మాణానికి పర్యావరణశాఖ 2009 ఏప్రిల్ 9న అనుమతులు ఇచ్చింది. చిత్తడి నేలల పరిరక్షణకు ఉద్దేశించిన అంతర్జాతీయ ఒప్పందంపై భారతదేశం 1982లో సంతకం చేసింది. ఈ భూములను కాపాడడం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యత. ప్రభుత్వాలు రూపొందించుకున్న చట్టాలను ప్రభుత్వాలే అమలు చేయడం లేదనడానికి ఇటీవలి సోంపేట, కాకరాపల్లిలే ఒక ఉదాహరణ.

కాకరాపల్లి చుట్టు పక్కల గ్రామాల్లో ఆగస్ట్ 8, 2009న గొల్లగొండి గ్రామంలో ప్రజాభిప్రాయ సేకరణ తంతు ముగించారు. అదే సందర్భంలో అక్కడున్న బుద్ధిజీవులు, పర్యావరణ వేత్తలు, ప్రజా సంఘాలు అభివృద్ధి పేరుతో తెస్తున్న కంపెనీల వల్ల భవిష్యత్‌లో ప్రజలకు జరుగబోయే నష్టాన్ని ఆ రోజే చెప్పారు. ప్రైవేట్ సంస్థలకు లాభాపేక్షే తప్పించి ప్రజల పట్ల బాధ్యత ఉండదని కంపెనీ నిర్మాణాన్ని వ్యతిరేకిస్తూ వివిధ రూపాల్లో తమ నిరసనను వ్యక్తంచేశారు. కంపెనీ అధికారులు, ప్రభుత్వ అధికారులు, స్థానిక రాజకీయ నాయకులు అక్కడి ప్రజలను కలిసి – మీపిల్లలకు కంపెనీలో ఉద్యోగాలిస్తామని, చేపల చెరువులు ఏర్పాటు చేస్తామని, పెద్ద మొత్తంలో ప్యాకేజీ ఇస్తామని నమ్మించారు. సామాన్య ప్రజలను నమ్మించి స్థానిక ప్రజలకు, ఆలోచనా పరులైన బుద్ధిజీవులకు మధ్య చిచ్చు పెట్టే ప్రయత్నం చేశారు.

ప్రపంచీకరణ పేరుతో దేశంలోని సహజ వనరులను కొల్లగొట్టడానికి కార్పొరేట్ సంస్థలు, బహుళజాతి కంపెనీలు రాబందుల్లా వాలుతున్నాయి. వాటికి వంతపాడుతున్న ప్రభుత్వాలు, అధికార యంత్రాగం మొత్తం సహకరిస్తున్నాయి. విచిత్రమేమంటే ఇక్కడ నిర్మిస్తున్న కార్పొరేట్ కంపెనీలకు పర్యావరణ అనుమతులిస్తున్నది కలెక్టర్లు, పర్యావరణ అధికారులు. తరువాత వాళ్లు ఆ కంపెనీకి డైరెక్టర్లుగా ఉంటున్నారు. కంపెనీలో వాటాదారులుగా ఉంటున్నారు. అంటే ఇక్కడ కంచే చేనుమేసినట్టుగా ఉంది.

కాకరాపల్లి పవర్ ప్లాంట్ నిర్మాణాన్ని ప్రజలు వ్యతిరేకించడానికి ప్రధానమైన కారణాలు –

1. కంపెనీ నిర్మాణం వల్ల గతంలో సాగుచేసుకుంటున్న భూమి మొత్తం సాగులోకి రాదు. సాగులోకి వచ్చినా సముద్రం నీరు సాధారణంగా అయితే పంట పొలాల్లోకి వచ్చి రెండు మూడు రోజులు ఉండి మళ్లీ సముద్రంలోకి, తంపరలోకి వెళ్లేది. ఇప్పుడు కంపెనీ తంపర పూడ్చినందు వల్ల, కంపెనీకి వెళ్లడానికి దారి వేసినందువల్ల సముద్రం నీరు పంట పొలాల్లోకి వచ్చి మళ్లీ తిరిగిపోవడానికి దారిలేదు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 6800 ఎకరాల్లో పంట నీటిలో మునిగి మురిగిపోయింది. చుట్టు పక్కల పంట పొలాలకు తంపర నీరే ఆధారం. ఎండ కాలంలో అయితే తంపరలో మోటార్లు పెట్టుకొని 5550 ఎకరాల్లో రెండు పంటలు పండించుకుంటారు. అక్కడి ప్రజలకు ప్రధానంగా తంపరలోని నీరు, భూమి రెండు వాళ్లకు జీవనాధారంగా ఉన్నాయి. అలాంటి తంపర నుండి వచ్చే నీరు ఆగిపోయి, ఉన్న భూముల్లో సముద్రం నీరు వచ్చి చేరుతుండడం వల్ల పంట నీట మునిగిపోతుంది. దీంతో ప్రజల జీవన మనుగడే

ప్రశ్నార్థకమయ్యే పరిస్థితిలోకి అక్కడి ప్రజలు నెట్టబడ్డారు. అక్కడి భూమికి ప్రభుత్వం కానీ, కంపెనీ కానీ కొంత రేటు నిర్ణయించి డబ్బులు ఇవ్వవచ్చు కాని, భవిష్యత్తరాల బతుకుకు ఇవి భరోసానివ్వలేవంటున్నారు.

2. తంపర చుట్టూ ఉన్న 59 గ్రామాల అట్టడుగు వర్గాల ప్రజలు తంపరలో పెరిగే పొలుపు గడ్డిని కోసి అమ్ముకుంటారు. అక్కడి భూముల్లో కూలికి పోయి బతుకుతుంటారు. అలాంటి తంపర పూడ్చారు. పంట పొలాలు కంపెనీ కింద పోయాయి. మిగిలినవి సముద్రం నీరు వచ్చి పంట పొలాలను ముంచేస్తుంది. ఇప్పుడు ఆ భూమి కూడా పోయింది మా బతుకు సాగడమెట్లా అనే ఆందోళన రైతు కూలీల్లో మొదలైంది.

3. తంపర మీద రెండు రకాల మత్స్యకారుల కుటుంబాలు ఆధార పడి జీవిస్తున్నాయి. 2500 స్వదేశీ మత్స్యకారుల కుటుంబాలు తంపర చుట్టూ ఉన్న వడ్డితాండ్ర, పొత్తూరు, సంతబొమ్మాలి గ్రామాల్లో ఉన్నాయి. స్వదేశీ మత్స్యకారులు తంపరను బ్రిటిష్ ప్రభుత్వం నుండి వేలం పాటల ద్వారా లీజుకు తీసుకునే వారు. 1948 నుండి ప్రభుత్వం వద్ద 3470 ఎకరాల తంపరను శ్రీ జగన్నాథ ఫిషర్‌మెన్ సొసైటీ పేర లీజుకు తీసుకుంటున్నారు. సంవత్సరం మొత్తం అందులో దొరికే చేపలు పట్టి అమ్ముకొని బతుకుతుంటారు. రెండో రకం సాగర మత్స్యకారులు తంపర దగ్గరలో ఉన్న పది గ్రామాల్లో సుమారు ఎనిమిది వేల కుటుంబాలున్నాయి. సాగర మత్స్యకారులు సముద్రం మీద చేపలు పడతారు, అట్లాగే తంపరలో సంక్రాంతి నుండి వేసవి వరకు చేపలు పట్టుకొని బతుకుతారు. తంపర స్థలాన్ని కంపెనీ స్వాధీనం చేసుకుని పూడ్చి, మందు వేసి చేపలను, పొలుపు గడ్డిని చంపేశారు. మత్స్యకారుల జీవనాధారం పోయి జీవితం ప్రశ్నార్థకం అయింది. ఇప్పుడు వారు జీవిక కోసం కాకినాడ, విశాఖపట్నం వెళ్లి చేపలు తెచ్చి అమ్ముకొని తమ కుటుంబాలను పోషించుకుంటున్నారు. కంపెనీకి సముద్రం నుండి నీరు తీసుకు రావడం వల్ల మత్స్య సంపద చనిపోతుంది. 500 మెగావాట్ల థర్మల్ ప్లాంట్‌కు వినియోగించే నీటి వల్ల ఒక గంటకి ఒక కోటి చేపగుడ్లు, 50 లక్షల చేప పిల్లలు ఆ నీటి ద్వారా రావడానికి అవకాశముందని కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ పరిశోధనలో తేలిన అంశం. కాకరాపల్లిలో నిర్మిస్తున్నది 2640 మెగావాట్ల ప్లాంట్. దీనికి సేకరించే నీటి వల్ల మత్స్యకారులు నష్టపోయే మత్స్య సంపద ఒక గంటకు గుడ్డు దశలో నష్టపోయేది ఐదు కోట్ల ఇరవై ఎనిమిది లక్షలు, పిల్ల దశలో ఉండే చేప రెండు కోట్ల ఇరవై ఎనిమిది లక్షలు. ప్లాంట్ నుండి వచ్చే వ్యర్థాల వల్ల సముద్రపు నీరు కలుషితమై మొత్తంగానే మత్స్య సంపద తగ్గిపోయే ప్రమాదం ఉంది. దీనివల్ల మత్స్య సంపద ఎగుమతి తగ్గి మత్స్యకారులకు ఉపాధి లేకుండా పోయే ప్రమాదం ఉంది.

4. పవర్ ప్లాంట్ నుండి వచ్చే ధూళి ఉప్పుపై పడి నౌపాడలో తయారవుతున్న ఉప్పు పనికి రాకుండా పోతుంది. దీనివల్ల నౌపాడ ఉప్పు పరిశ్రమ మూతబడే పరిస్థితి ఉంది. ఉప్పు పరిశ్రమ మీద ఆధారపడి బతికే ప్రజలు రోడ్డునపడే పరిస్థితి ఉంది. అక్కడే ఉన్న జీడి తోటలపై కంపెనీ నుండి వచ్చే బూడిద వల్ల పూత నిలువక కాతకాయకుండా ఉండే పరిస్థితి ఉంది. తేలినీలాపురంలో నివసిస్తున్న పక్షులకు తంపరలో దొరికే మత్స్య సంపదే జీవనాధారం. ఇప్పుడు అది లేకుండా పోయింది. పశువులకు నీటి ఆధారం లేకుండా పోయింది. పైన వివరించిన సమస్యలన్నీ కూడా పరవాడలోని పవర్ ప్లాంట్ వల్ల పర్యావరణం ఎట్లా దెబ్బతింటుందో తెలిసినవేనని. పర్యావరణ వేత్తలు చెపుతున్నారు.

కాకరాపల్లి చుట్టుపక్కల గ్రామాల ప్రజలు తంపర భూముల్లోకి రాకుండా కంపెనీ చుట్టుపక్కల ఫెన్సింగ్ వేసినప్పటి నుండి వాళ్ల జీవనాధారాన్ని కోల్పోయారు. అప్పటి నుండి జీవిక కోసం ఆందోళన మొదలైంది. తరతరాల నుంచి నమ్ముకుని బతుకుతున్న తంపర పోయిందని ఇక దాన్ని దక్కించుకోవడం ఒక్కటే తమకు పరిష్కార మార్గమని కంపెనీని అడ్డుకోవడానికి సిద్ధమయ్యారు. తాము పోరాడకుంటే తమ పిల్లలకు భవిష్యత్తు లేదని గ్రహించిన చుట్టుపక్కల గ్రామాల ప్రజలు తమ జీవితాలను అర్పించడానికైనా సిద్ధపడి పోరాడడానికి సిద్ధమయ్యారు. దశల వారీగా వారు తమ నిరసనను వివిధ రూపాల్లో వ్యక్తం చేశారు. ప్రతి సందర్భంలో ప్రజలను ప్యాకేజీల పేరుతో లోబరుచుకోవడానికే ప్రభుత్వం, కంపెనీ యాజమాన్యం ప్రయత్నించాయి కాని ప్రజల మనోవేదనను గ్రహించలేక పోయాయి.

ప్రభుత్వ బాధ్యతా రాహిత్యాన్ని గ్రహించిన ప్రజలు, కంపెనీకి వెళ్లే రహదారిని తవ్వి మెటీరియల్ తీసుకెళుతున్న వాహనాలను అడ్డుకున్నారు. అక్కడ అంటుకున్న నిప్పురవ్వ చుట్టుపక్కల గ్రామాలకు పాకింది. అక్కడి ప్రజలు సైతం కంపెనీకి అక్రమంగా కంపెనీ వేసిన రోడ్డుగుండా వెళ్లే వాహనాలను అడ్డుకునే ప్రయత్నం చేశారు.

ప్రభుత్వం ప్రజల ఆవేదనను అర్థం చేసుకోక పోగా గ్రామాల్లో వేలాది మంది పోలీసులను దింపి 144 సెక్షన్ విధించింది. ఫిబ్రవరి 25 నుండి ప్రజలపై ప్రత్యక్షంగా దాడులు మొదలు పెట్టారు. దీక్షా శిబిరాన్ని ధ్వంసం చేశారు. 28న ఉదయం కాలకృత్యాలు తీర్చుకోవడానికి బయటకు వచ్చిన వడ్డితాండ్ర ప్రజలును లాఠీలతో కొట్టి వ్యాన్‌లలో ఎక్కించారు. ఇళ్లపై దాడి చేసి పొగబాంబులు వేయడంతో 26 ఇళ్లు కాలిపోయాయి. అక్కడే ఉన్న పదకొండు వరి కుప్పలు కాలిపోయాయి. ఇండ్లల్లో ఉన్న బియ్యం, వంట గిన్నెలు, బట్టలు కాలి బూడిదైనాయి. కొందరు భయానికి తలుపులు మూసుకొని ఇంట్లో ఉన్నారు. మూసిన తలుపులపై బాంబులు వేసి పగులగొట్టి ఇంట్లోని ఆడ, మగ అనే తేడా లేకుండా కొట్టుకుంటూ 'మీరు ప్యాకేజికి ఒప్పుకోరా?' అని బూతు మాటలు తిడుతూ వ్యాన్‌లలోకి ఎక్కించారు. ఫిబ్రవరి 28న కంపెనీ నిర్మాణాన్ని నిలిపివేయాలని కోరుతూ ఆకాశలక్కవరం చుట్టుపక్కల గ్రామాల నుంచి వస్తున్న ప్రజలపై పోలీసులు కాల్పులు జరిపితే ఇద్దరు చనిపోయారు. లాఠీచార్జ్, బాష్పవాయు గోళాలు ప్రయోగించి ప్రజలను భయభ్రాంతులకు గురిచేశారు. ఎంతో మంది తీవ్ర గాయాలపాలయ్యారు. వారికి ఎటువంటి వైద్య సహాయం అందలేదు. ఇళ్లు కాలుతుంటే మంటలను ఆర్పడానికి వచ్చిన ఫైర్ ఇంజన్‌ను కూడా పోలీసులు రాకుండా అడ్డుకున్నారు.

ఈ ఘటనలో 1800 మందిపై కేసు నమోదు చేశారు. 130 మందిని అరెస్ట్ చేసి శ్రీకాకుళం సబ్ జైల్లో ఉంచారు. అందులో 40 మంది మహిళలు ఉన్నారు. 92 ఏళ్ల అనంత మాణిక్యమ్మపై అటెంప్ట్ టు మర్డర్ కేసు నమోదు చేసి జైల్లో పెట్టారు. సోంపేట, కాకరాపల్లి ఉద్యమాల్లో మహిళలు ధైర్య సాహసాలను ప్రదర్శించి ముందుభాగాన ఉండి పోరాడారు. ఈ వ్యాసం రాసేనాటికి (మార్చ్ 27) ఇంకా నలుగురు పురుషులు జైల్లోనే ఉన్నారు. దీక్షా శిబిరం 225 రోజులకు చేరుకుంది. కంపెనీ పనులు ఆపాలని ప్రభుత్వం మార్చ్ 1న జారీచేసిన ఆదేశాలు కాగితాలకే పరిమితమయ్యాయి. ఇప్పుడు కంపెనీ చుట్టూ ఫెన్సింగ్ పని కొనసాగుతూనే ఉంది.

అభివృద్ధి పేరుతో ఒక్క శ్రీకాకుళం జిల్లాలోనే 6 థర్మల్ ప్లాంట్‌లు, నౌపాడలో ఒక అణువిద్యుత్ కేంద్రం నిర్మించ తలపెట్టారు. స్థానికంగా ఉండే ప్రజలు ఇవేవి కావాలని కోరలేదు. వచ్చిన కంపెనీల్లో స్థానికులకు ఉపాధి లేదు. అక్కడి ప్రజల సమ్మతిలేదు. పెట్టుబడిని కేంద్రంగా చేసుకొని మాత్రమే అవి వస్తున్నాయి. ఇక్కడ ఉత్పత్తి అయ్యే విద్యుత్ అంతా ఇతర రాష్ట్రాలకు అమ్మి వ్యాపారం చెయ్యడమే దీని ఉద్దేశం. ఇందులో ప్రైవేట్ సంస్థల అభివృద్ధి తప్పించి ప్రజల అభివృద్ధి ఏమీలేదు. ఇవి రావడం వల్ల ప్రజల జీవితాలు ప్రశ్నార్థకంగా మారుతున్నాయి.

**అభివృద్ధి పేరిట పాలకులు తెస్తున్న విధ్వంసాన్ని ఆపమంటూ, థర్మల్ పవర్ ప్రాజెక్టును వ్యతిరేకిస్తూ తమతో సహా తమ నేలనూ, గాలినీ, నీటినీ, పక్షులనూ, ప్రాణులనూ వదిలి పెట్టమనీ, తమ మానాన తమని బతకనీయమనీ అంటూ బాధితులు వ్యక్తం చేసిన అభిప్రాయాలు...**

నా భర్తను చంపి పొగబాంబుల వల్లనే చనిపోయాడని పోలీసులు చెప్పమన్నరు. పొగబాంబులేస్తె ఎట్లా చనిపోతడు. చనిపోయిన నా భర్త రబ్బరు బుల్లెట్ల కారణంగానే చనిపోయిండని చెపితేనే శవాన్ని ఇస్తామని మమ్మల్ని బెదిరించారు. మేము అలాగే చెప్పి శవాన్ని తెచ్చుకున్నం. మాకు సెంటు భూమి లేదు. మేము కూలి చేసుకొని బతుకుతాం. రైతుల దగ్గెర భూమి ఉంటే మాకింత కూలి దొరుకుద్దని నలుగురితోని మేము కంపెనీ వద్దని చెప్పడానికి పోయినం. ఇక్కడ కంపెని వద్దని ఇంతవరకు ధర్నాలు చేశారు. ఆ రిపోర్టు అంత వరకు ఎల్లదా? కంపెనీ వద్దన్నందుకు పోలీసులు మా ఆయనను బాంబులేసి చంపారు. మా ఆయినైతె తిరిగి రాదు నాలాంటి బాద ఇంకొకల్లకు రావద్దు. ఇప్పటికైనా ప్రభుత్వం కంపెనీని ఆపాలె.

***జి. లక్ష్మి*** *(30)*
*జీరు నాగేశ్వర్ రెడ్డి భార్య, ఆకాశలక్కవరం*

ప్యాకటరీ ఆపాలన్నందుకు ఆయిన పాణాలు దీసినారు. ఇప్పటికైనా ప్యాకటరీ ఆపాలె. ఏం చెప్పమంటరు అన్ని తెలిసిన పభుత్వమే ఇట్ల చేస్తే మేం ఏం చెయ్యాలె, ఎవురికి చెప్పాలె?

***సీరపు ధనలక్ష్మి*** *(36)*
*సీరపు ఎర్రయ్య భార్య, సీరపువానిపేట*

ఆ రోజు పోలీసులు బూతు మాటలు తిట్టుకుంట మా ఇండ్ల మీదికొచ్చారు. ఇంట్లకెల్లి బయిటికి ఎళ్లే అని తిట్టారు. తలుపులకేలి పొగబాంబులేసారు. ఆ పొగకు మొసరాక బయిటికస్తే కొట్టుకుంట వ్యాన్లల్ల ఏసుకపోయారు. మా బతుకే భూమి తోటి. చస్తే చస్తం గాని బతికుండగా ఆ భూములు వదులం.

***సావిత్రి*** *(38)*
*మత్స్యకారిణి, వడ్డితాండ్ర*

పోలీసులు ఫిబ్రవరి 28న మా ఇండ్లల్లకొచ్చి కేకలేసి మీరు ఇంటి నుంచి బయటికి వస్తర మీ ఇల్లు తగలబెట్టమంటర అని బాంబులు వేసారు. అవుతల బాంబులు పేలుతున్నాయి. ఇళ్లు కాలుతున్నాయి. బయటికి వద్దామంటే బాంబులు తగిలి చచ్చిపోతామనే భయం. అలాగని ఇంట్లో ఉందామంటె ఇల్లు కాలిపోయి చస్తమని ఆకిరికి పిల్లలు లోపలుంటె చస్తరని బయిటికి వచ్చాము. బయటకు వచ్చేసరికి పోలీసులు. వేరే ఇంట్లకు పోదామంటే ఇళ్లకు తాళాలున్నయి. ఎటుపోలేని పరిస్థితిలో చిక్కుకు పోయాము. ఇప్పటికయినా పవర్ ప్లాంట్ ఆపాలి. ఇప్పటికే ఇద్దరిని చంపారు. 26 ఇళ్లను బాంబులేసి కాల్చారు. మా ఊరంతా కాల్చేసిన మేం పవర్ ప్లాంట్‌ను ఆపదల్చుకున్నాం అది మాత్రం వదిలేది లేదు.

***నాగుల ఉపేంద్ర*** *(30)*
*టైలర్, వడ్డితాండ్ర*

ప్రపంచంలో ఉన్నటువంటి చిత్తడి నేలలను పరిరక్షణ చేసుకోవాలనె ఆలోచన ప్రపంచం పడ్డది. దాన్ని కబ్జా చేయడం కోసం (3600 ఎకరాలు) కంపెనీ మేనేజ్‌మెంట్ వాళ్లు, కలెక్టర్లు, ఆర్.డి.ఒ, గవర్నమెంట్‌వాళ్లు అన్ని ఏర్పాట్లు చేశారు. అమాయకులైన ప్రజలకు మీకు అది చేస్తాం ఇది చేస్తాం అని చెప్పి కాలక్షేపం చేసి అనుమతులు సంపాదించారు. ప్రభుత్వ రికార్డుల ప్రకారం బ్రిటిష్ వాళ్లు చెప్పిన దాని ప్రకారం ఇటువంటి నేలలను చిత్తడి అని అంటారు. అటువంటి భూమిని వీళ్లు వ్యవసాయానికి పనికిరాని భూమి అన్నారు. ప్రపంచంలో ఇది అవసరం అని ప్రపంచం కోరుతుంటే, ఇది వ్యవసాయానికి పనికిరానిదంటె ఇది ఎంత అన్యాయం. మేం ఇక్కడ కంపెనీ వద్దన్నందుకు మా మీద కేసులు పెట్టారు. మేం ఇది తినేసినామని కేసులేదు. ఆందోళన చేసినామని కేసు పెట్టారు. పర్యావరణ నష్టం జరుగుతుంది అని చెప్పే హక్కు మాకు లేదా? దీన్ని పోలీసులు కుట్ర అంటున్నారు. మమ్మల్ని అణిచివేయడమనేది కుట్ర అంతేకాని మాది కుట్ర కాదు. ఫిబ్రవరి 15న ఆర్.డి.ఒ అనుమతి లేకుండా గవర్నమెంట్ జాగలో రోడ్డువేసారు. ప్లాంట్ వాళ్లు ఏమి చెపితే అది చేయడానికే ఆర్.డి.ఒ, కలెక్టర్‌లు ఉన్నారు. ఆర్.డి.ఒ ఎప్పుడొచ్చినా 'ప్యాకేజికి ఒప్పుకోండి, ప్యాకేజికి ఒప్పుకోండి మీరు' అని మా మీద ఒత్తిడి తెచ్చాడు. మాకు ప్యాకేజి వద్దు అని ఇదే గోస, ఈ నెపంతో ఫిబ్రవరి 25న రాత్రి 3000 మంది పోలీసులను, ఒక ఎస్.పి.ని, నలుగురు డి.ఎస్.పి.లను, ఆరుగురు సి.ఐ.లను, పది మంది ఎస్.ఐ.లను, రెండు వేల మంది సైనికులను దించారు. మేము శాంతియుతంగా మీరు చేసిన పని మంచిది కాదు అని ఆందోళన చేస్తున్నాం. ఆందోళన అంటే ఏంటి? నువ్వు చేస్తున్న పని మంచిది కాదు అని పదే పదే చెప్పడం. ఫిబ్రవరి 25న దీక్ష శిబిరాన్ని ధ్వంసం చేశారు. 90 సంవత్సరాల ముసలామెను కొట్టి ఆమె మీద కేసు పెట్టారు. ఈ నిర్భంధానికి ప్రకృతి న్యాయసూత్రమేమంటే ప్రజలను ఎంత అణగదొక్కాలనుకుంటె అంతే తీవ్రంగా ప్రజల నుండి తిరుగుబాటు వస్తది. ఆ కారణంగా ఆ తిరుగుబాటు అణచడానికి ఈ కాల్పులు జరిపారు. కాల్పులు జరపడమే కాకుండా ఇల్లు కాల్చినారు. మా ప్రాంతంలో పోలీసులు నానా భీభత్సం సృష్టిస్తున్నారని మేము ఉదయం పది గంటలకు హై కోర్టు ప్రధాన న్యాయమూర్తికి, గవర్నర్‌కి, ముఖ్యమంత్రికి, డి.జి.పి.కి, కలెక్టర్‌కి, ఎస్.పి.కి, టెలిగ్రామ్ పంపాము. దేనికి పొంతన లేని ప్యాకేజి ఒప్పుకోండ్రని బెదిరిస్తున్నారు. మేం ఇప్పుడు ఏం చేయాలన్నది మాకు ఆలోచనలో ఉన్నది. మేం మాత్రం ఈ ప్యాకేజికి ఒప్పం. ఇక్కడ విదేశీ పక్షుల జీవితాలు పోతున్నాయి. 2500 మంది మత్స్యకారుల జీవితాలు పోతున్నాయి. ఏవి లెక్కచేయరు. 400 రకాల జీవ జాతులు కనుమరుగవనున్నాయి. ఇవేవి వాళ్లకు పట్టడంలేదు. మేం ఎంత అరిచినా పట్టించుకోవడం లేదు. మేం మాత్రం తంపరను వదలం.

***ప్రధాన క్రిష్ణమూర్తి*** *(70)*
*రిటైర్డ్ టీచర్, అడ్వకేట్, వడ్డితాండ్ర*

వడ్డితాండ్రలో ఆగస్టు 15, 2010 నుండి నిరాహార దీక్ష శిబిరాన్ని ప్రారంభించాము. ఫిబ్రవరి 25న పోలీసులు దౌర్జన్యంగా ప్రజల మీద పడి దాడిచేశారు. ఏ చట్టాన్ని పరిరక్షించడానికి పోలీసులున్నారో వాల్లె వాటిని అతిక్రమించారు. వెట్‌ల్యాండ్‌లో, వ్యవసాయ భూముల్లో కంపెనీలు కట్టందంటారు. వీల్లిక్కడ వెట్‌ల్యాండ్‌లో కడతారు. ఇక్కడ ఉన్న నాలుగు గడ్డలు వంశదార, రాళ్లగడ్డ, దేశిగడ్డ, గరీబుల గడ్డల నుండి వచ్చే నీరు బావనపాడు రేవు ద్వారా బంగాళాఖాతంలో కలుస్తుంది. కాకరాపల్లి నుండి కంపెనీకి అక్రమంగా రోడ్డు వేయడం వల్ల చినుకు పడితె నీరు బయటికి వెళ్లే మార్గం లేక 5800 ఎకరాలు నీట మునిగిపోతున్నాయి. ఈ తంపర మీద ఆధారపడి 59 గ్రామాలు బతుకుతున్నాయి. ఇక్కడి ప్రత్యేకతలను పరిగణనలోకి తీసుకోకుండా ఇవి తంపర భూములని ఎవరైతే చెబుతున్నరో వాళ్లే ఇది కాదు అని చెప్పారు. ప్రభుత్వమే కంపెనీతోని కుమ్మక్కయి కంపెనీకి

---

సహజ వనరులను దోపిడి చేయడానికి ప్రపంచీకరణ పేరుతో ఎల్లలు చెరిపేస్తున్నారు. ప్రాంతాలు, దేశాలు ఏవైనా దోపిడీ చేసేవాళ్లంతా ఒక్కటై ఎక్కడ సహజ వనరులు చవకగా దొరుకుతాయో అక్కడ దేగల్లా వాలి వాటిని తరలించుకుపోతున్నారు. సహజ వనరులను నమ్ముకుని బతుకుతున్న అట్టడుగు వర్గాల ప్రజలందరు సోంపేట, కాకరాపల్లి ప్రజలు ఇచ్చిన స్ఫూర్తితో ముందుకు సాగాలి. అభివృద్ధి పేరుతో సాగుతున్న విధ్వంసాన్ని అడ్డుకొని సహజవనరులను సాధారణ ప్రజలకు అందుబాటులోకి తేవాలి. లేదంటే పాలకులు దేశాన్ని ఏడారిగా మార్చే ప్రమాదం ఎంతో దూరంలో లేదు.

*(రచయిత వీక్షణం సర్క్యులేషన్ మేనేజర్/కరస్పాండెంట్)* వీ

వత్తాసు పలుకుతున్న పరిస్థితులు మొన్న జరిగినటువంటి సంఘటనలు. ఫిబ్రవరి 25 నుండి 28 వరకు ప్రజల మీద కాల్పులు జరిపి ఇద్దరి ప్రాణాలను తీసారు. దీన్నుండి బయట పడడానికి పోలీసులు వాళ్ల జీపును వాళ్లే కాల్చుకుని ప్రజలే కాల్చారని చెప్పారు. కాల్చినవి రబ్బరు బుల్లెట్లని పోలీసు అధికారులు అంటున్నారు. అవి రబ్బరు బుల్లెట్లైనా, ఐరన్ బుల్లెట్లైనా ప్రాణాలు పోయాయి. అక్కడికి వచ్చిన ఎస్.పి, కలెక్టర్లు మేము పేద వర్గానికి చెందిన వారమని, అట్టడుగు కులానికి చెందిన రైతు కుటుంబం నుంచి వచ్చామని అంటున్నారు. ఆ రైతుల మీద దాడి జరిగిందంటే వాళ్ల మీద దాడి కాదా? అది. ఏ రైతు బిడ్డలమని చెబుతున్నారో మళ్లీ అదే బలహీన వర్గాల మీద దాడికి వస్తున్నారు. అన్ని కమిటీలు పర్యావరణ కమిటీలు ఇది వెట్ ల్యాండ్ అని చెబుతుంటే వీళ్లు బర్ ల్యాండ్ అని చూపిస్తున్నారు. వాళ్ల తాతల తండ్రులు మాలాంటి సామాజిక స్థితి ఉన్నవారే. అలాంటి సామాజిక స్థితిని మరిచిపోయి ఉన్నది లేనట్టు, లేనిది ఉన్నట్టు అభూతకల్పనలు సృష్టించి ఈ దోపిడీ ప్రభుత్వాలకు కొమ్ముకాస్తున్నారు. మేము మాత్రం ఉన్న చట్టాలనే అమలు పర్చమంటున్నాం. ఇక్కడ ఎవరు చట్టాన్ని అతిక్రమిస్తున్నారు. ప్రజలు ఇక్కడి సామాజిక వనరులను కాపాడుకోవడానికి పోలీసులను అడ్డుకొన్నారే తప్పిస్తే ప్రజలు చట్టాలను అతిక్రమించలేదు. ఇక్కడి 59 గ్రామాల ప్రజలు ఇల్లకు తంపరలో పొలుపు గడ్డి కోసుకొని కప్పుకుంటారు. ఇప్పుడు ఆ సాంపు ఎప్పుడైతే పూడ్చారో అక్కడి ప్రజలకు ఇల్లమీద కప్పుకోవడానికి ఏమీలేదు. ప్రభుత్వాలకు ప్రజల కనీస అవసరాలు తీర్చేశక్తి ఎలాగూలేదు. ఉన్న సహజవనరులనైన మమ్మల్ని వాడుకోకుండా చేశారు. ఆ పొలుపు మా తాతలు వేయలేదు. మా తండ్రులు వేయలేదు. ప్రభుత్వం వేయలేదు. అది అక్కడ సహజ సిద్ధంగా పెరుగుతుంది. అది మేము కోసుకొని మా ఇల్ల మీద కప్పుకుంటున్నాం. సముద్రాలను చెత్తకుండీలుగా మార్చుతున్నందుకు ఈ ప్రైవేటు సంస్థలపై పర్యావరణ విధ్వంసం కేసు పెట్టాలి. బావనపాడు నుంచి వచ్చి ఇక్కడి సాంపులో తాబేళ్లు గుడ్లుపెడతాయి. ఇక్కడ మండ పీతలుంటాయి. ఇటువంటి నేలలు చాల తక్కువ ఉన్నాయి. ఇటువంటి నేలలు ఇక్కడి వాతావరణాన్ని ఎంతో ప్రభావితం చేస్తున్నాయి. ఒకే ఒక మందు వేసి పొలుపు, చాపలు లేకుండా చేశారు. కంపెనీపై సామాజిక వనరుల విధ్వంసం కేసు పెట్టాలి. వెట్ ల్యాండ్ నాశనం చేసినందుకు ఒక కేసు పెట్టాలి. సముద్రం పక్కనున్న నాలుగు గడ్డలకు అడ్డుకట్ట వేసి వాటి సహజ స్వభావాన్ని మార్చినందుకు కేసు పెట్టాలి. కేసులన్నీ కంపెనీపై పెట్టాలి. మాపై కాదు. కొవ్వాడలోని అణువిద్యుత్ కేంద్రం మంచిది మంచిది అంటున్నారు. ఇవ్వాళ జపాన్‌లో జరిగినటువంటి అభివృద్ధి ఎదో మనం ఇవాలా చూస్తే తెలుస్తుంది. అభివృద్ధి అనే మాటను ఏ కోణం నుంచి చూడాలి. ఒక వ్యాపారస్తుడు రాజకీయాల ద్వారా బలపడడాన్ని అభివృద్ధి అనుకోవాలా లేదా ప్రజలకు మౌలిక సదుపాయాలు ఉన్నటువంటి వనరులను రక్షించడాన్ని అభివృద్ధి అనుకోవాలా? సామాజిక వనరులు ఎక్కడివక్కడ ఉంచుతూ ఏమైనా అభివృద్ధి చేస్తే అది అభివృద్ధి అవుతుంది. సామాజిక వనరులను దోపిడి చేసేసి, అక్కడ ప్రకృతిని బీభత్సం సృష్టించేసి ఇది అభివృద్ధని చెప్పుకుంటే అది ప్రజలు నమ్మరు. ఇప్పటికైనా కంపెనీకి ఇచ్చిన జి.ఓను రద్దుచేసేవరకు పోరాటం ఆగదు.

**సూర రాజారావు** *(32)*
మత్స్యకారుడు, సురాడవాణిపేట
*సంప్రదాయ మత్స్యకారుల యూనియన్ జిల్లా ప్రధాన కార్యదర్శి*

మా జీవితాలను పవర్ ప్లాంట్ రోడ్డుకీడ్చింది. అలాంటి కంపెనీ పని ఆగిపోవడానికి సామాగ్రి తీసుకెళ్లే వాహనాలను మా చుట్టూ ఉన్న 59 గ్రామాల ప్రజల సహకారంతో అడ్డుకున్నాం. దానికి జవాబుగా ప్రభుత్వం సొంతబొమ్మాలి, కోటబొమ్మాలి, టెక్కలి మండలాల్లో 144 సెక్షన్‌ను విధించి కంపెనీకి వెళ్లే బల్లు నడుపుకోవడానికి సహకరించింది. టెక్కలి నుండి మా గ్రామానికి రాకుండా పది పోలీసు పోస్టులు పెట్టారు. టెక్కలి నుంచి వచ్చేవాల్లను అడ్డుకొని అరెస్ట్ చేశారు. కాకరాపల్లి చుట్టు పక్కల గ్రామాల్లో వేలాది మంది పోలీసులను దించి ఫిబ్రవరి 25న గ్రామాలపై దాడి చేసి భయోత్పాతం సృష్టించారు. మేము రిలే నిరాహార దీక్షలు చేస్తుంటే 195 రోజున 3 వేల మంది పోలీసులు మేము బహిర్భూమికి, స్నానానికి బయిటికి వెళ్లనీయకుండా వడ్డితాండ్రను దిగ్బంధించారు. మా ఊర్లోని రోడ్డు వద్ద ఉన్న పోలీసులు మా ఇల్ల వద్ద నుండి వెళ్లి పోవాలని ఆడ, మగ కలిసి అడగడానికి వెళ్లాం. మేము వెళుతుండగానే మా మీద బాంబులు వేసారు. పోలీసులు జరిపిన కాల్పుల్లో 11 వరి కుప్పలు, 26 ఇళ్లు కాలిపోయాయి. ఇండ్లల్లో చొరబడి ఈడ్చి కొట్టుకుంటూ మీరు కంపెనీని అడ్డుకుంటారా? మీరు ధర్నా చేస్తారా? మీరు మీ ఇల్లు ఖాలిచేసి వెళ్లకపోతే ఇల్లు కాల్చేస్తాం అని మా మీద దౌర్జన్యం చేశారు. ఆడ, మగ తేడా లేకుండా బలవంతంగా తీసుకెళ్లి శ్రీకాకుళం సబ్ జైల్లో పెట్టారు. ఇద్దరిని కాల్చి చంపిన తరువాత కంపెనీకి తాత్కాలికంగా అనుమతులు రద్దుచేశామని చెప్పారు. కాకరాపల్లి ఘటనపై రాజ్య సభలో పర్యావరణ మంత్రిని ప్రశ్నిస్తే పర్యావరణ అనుమతి ఇవ్వలేదన్నారు. అనుమతి ఇవ్వనపుడు మా ఊరికి వేరే వారు వచ్చి కంపెనీ ఎలాగపెడతారు. అలాగైతే మా ఊరు వాళ్లు ఒప్పుకుంటారా? ఇది మా మీద జరిగిన దారుణ మారణ కాండ. పోలీసుల దగ్గర తుపాకులున్నాయని వాటితో కాలుస్తారని మాకు తెలుసు. మా జీవితాలను విధ్వంసం చేసిన కంపెనీకి అండగా వచ్చిన పోలీసులను అడ్డుకోవడానికి వెళ్లాము. దీన్ని బట్టి మా జీవితాన్ని ఎంత దుర్భర పరిస్థితికి నెట్టారో అర్థం చేసుకోవాలి. పవర్ ప్లాంట్ జి.వోని రద్దు చేస్తేనే మా ఉద్యమం ఆగుతుంది. ఇప్పుడు ఇద్దరిని చంపారు రేపు మేము పది మందిమి చావడానికైనా సిద్ధంగా ఉన్నాము. మాకు బతుకుపోయింది. మా పిల్లలకు ఒంటి మీద బట్టలు కూడ లేవు. తిండి కూడా లేదు. చదువు లేదు. ఇప్పుడు బతుకేలేదు అలాంటప్పుడు చచ్చిపోతేంటి. మా పిల్లలను మేం పోషించలేని స్థితిలో ఉంటే ఆ తల్లి, తండ్రి పరిస్థితి ఏమిటి?

**కారుణ్యకేశవ** *(50)*
మత్స్యకారుడు, వడ్డితాండ్ర

మేము రోడ్డు మీదికి వెళ్లి మాకు పాకటరీ వద్దు బాబు అని నిశబ్దంగా ధర్నా చేశాం. మా మీదికి మగ పోలీసులు వచ్చి కొట్టారు. మీరు ఎంత కొట్టినా ప్యాకటరీ ఆపుతాము. మా పిల్లలు మా తరతరాలు బతకాలి. ప్యాకటరీ వస్తే మేం ఎలా బతకాలి. మా పీక మీదికి కత్తి తెస్తే మేం మాత్రం ఊరుకోం. నా మీద ఐదు కేసులు పెట్టి శ్రీకాకుళం పబ్ జైలుకు పంపారు. మేము మా పాణాలు ఒగ్గయినా పాకటరీని ఆపుతం. నేను చాపలు అమ్ముకొని బతుకుత. మా పరలో చాపలు లేవు. మందులు వేసి చంపేశారు ప్యాకటరీ వాళ్లు. మేం కాకినాడ, విశాఖపట్నం, బరంపురం, బల్లుగాం నుంచి చాపలు తెచ్చుకొని అమ్ముకుంటున్నం. ఒక్కరం చాపలు తెస్తే నలుగురం పంచుకొని అమ్ము కుంటున్నం. ఓపూట గెంజి ఉంటె ఇంకోపూట ఉండదు. మూడు సంవత్సరాల నుంచి మా పంటలు పోయినయి. ఇళ్లు కాలిపోయి బట్టలు కూడ లేవు. బయటి వాళ్లు ఇచ్చినయే మేం కట్టుకుంటున్నం. ఎం.ఎల్.ఎ. కృపారాణి వచ్చి పాకటరీ వస్తే మీ పిల్లలకు ఉద్యోగాలు వస్తయన్నది. చాపలు చెరువులు కట్టిస్తమని మాకు మాయ మాటలు చెప్పి మమ్మల్ని మోసం చేసింది. పాకటరీ వాల్లు మేం తగువులాడుతాం మద్దన పోలీసులు ఎందుకు వస్తున్నారు. శ్రీకాకుళం సబ్ జైలులో 14 రోజులు ఉన్న. ఎన్ని కేసులు పెట్టిన మేం భయపడం. ఎవరిని మేం చంపలేదు. మా కడుపుకోసం మేం పోరాడుతున్నం.

***లింబోతి యాదమ్మ*** (40)
మత్స్యకారురాలు, వడ్డితాండ్ర

మేం ఈ ప్యాక్టరీ వల్ల మూడు సంవత్సరాల నుండి బాధపడుతున్నం. మాకు ఇక్కడ చాప పురుగు దొరుకదు. తిండిలేదు. బల్లుగాం నుంచి చాపలు తెచ్చుకొని అమ్ముకుంటున్నం. పోలీసులు మేం తలుపులేసుకొని ఉంటే ఇంట్లోకి పొగవదిలారు. మొసమల్లక పడిపోతే తీసుకొచ్చి లారీల్లో వేసారు. ఆ జైలు ఈ జైలు తిప్పారు. 13 రోజుల తరువాత వచ్చాను. ఇప్పటికైనా ప్యాక్టరీ ఆపాలె.

**యాదమ్మ** *(35)*
మత్స్యకారురాలు, వడ్డితాండ్ర
*(అభిప్రాయ సేకరణ : వై. రామచంద్రం, వీక్షణం కరస్పాండెంట్)*

*మనం అదుపు చేయలేని సాంకేతికతను ఉపయోగించడంలో ప్రమాదాలను జపాన్ ఉదాహరణతో వివరిస్తున్నారు* **జోనాథన్ షెల్**

# హిరోషిమా నుంచి ఫుకుషిమా దాకా

**జ**పాన్‌లో ఇటీవలి విపత్తులు దారుణమైనవి, హృదయవిదారక మైనవి. జపాన్‌లో ఇంతకు ముందెన్నడూ ఎరగని స్థాయిలో భూమి కంపించింది. ఆ భూకంపం ఒక పెను సునామీకి దారితీసింది. ఈ సునామీ జపాన్ ఈశాన్య తీరాన్ని తాకిన క్రమంలో దాని దారిలో ఎదురైన వాటన్నిటినీ తునాతునకలు చేసి కార్లూ, భవనాలూ, విమానాలూ, మట్టి, చెత్తనంటినీ కలగలిపి పోయింది. భూకంపం వల్ల భూమి రెండడుగుల మేర కుంగడంతో సముద్ర తరంగాలు తీరం నుంచి ఆరు మైళ్ల లోపలి వరకు చొచ్చుకుపోయి వేలాది మంది చనిపోయారు. ఈ భూకంపం శక్తి దిమ్మెరగొలిపేదిగా ఉంది. జపాన్‌లో కొంతమేర భూభాగం తూర్పు వైపుకి 13 అడుగుల మేర జరిగింది. భూమికోణంలో కొద్దిగా మార్పు వచ్చింది. భూమి మీద ఒక రోజు కాలం, చాలా స్వల్పంగానైనా (1.8 మిల్లీసెకండ్లు) తగ్గింది.

ఇది అంతటితో ఆగలేదు. ఆ వెంటనే మరో దారుణం సంభవించింది. భూకంపం, సునామీల దెబ్బలకు జపాన్‌లోని 54 అణు విద్యుత్తు రియాక్టర్లలో 11 మూతపడ్డాయి. ఈ వ్యాసం రాసే సమయానికి మూడింటిలో చల్లబరిచే ప్రక్రియ దెబ్బతినడం వల్ల రియాక్టర్లు కొంతమేర కరిగిపోయాయి. ఈ మూడింటిలోనూ పెద్ద ఎత్తున పేలుళ్లు సంభవించాయి. నాల్గవ అణు రియాక్టర్‌లో వ్యర్థ అణుపదార్థానికి మంటలంటుకున్నాయి. ఇప్పుడు అణుధార్మిక మూలకాలతో కూడిన తరంగాలు వాతావరణాన్ని ముంచెత్తుతున్నాయి. దీంట్లో సిజియం-137, ఐయొడిన్ - 131 ఉన్నాయి. (ఎంత మోతాదులో ఉన్నాయో ఇంకా తెలియలేదు). రెండూ కూడా మానవ ఆరోగ్యానికి ప్రమాదకర మైనవి. అణుకర్మాగారాల చుట్టుపక్కల నుంచి జపాన్ ప్రభుత్వం రెండు లక్షల మందిని తరలించింది. అణుధార్మిక ఐయొడిన్‌ను గ్రహించకుండా చెయ్యడానికి వీళ్లకి పొటాషియం ఐయొడైడ్ మాత్రలు ఇచ్చింది. అణుధార్మిక గాలుల్లోకి అమెరికాకు చెందిన యుద్ధనౌక యు.ఎస్.ఎస్. రొనాల్డ్ రీగన్ ప్రవేశించినప్పుడు దానిని దారి మళ్లించాల్సి వచ్చింది.

మొదటి దెబ్బకీ, రెండవదానికీ మధ్య మౌలిక అంశంలో కనీసం ఒక తేడా ఉంది. మొదటిది ప్రకృతి వేసిన దెబ్బ. సున్నితమైన ఈ గ్రహంలో జీవాన్ని పోషించడంలోనూ, దండించడంలోనూ తన అపారశక్తిని ప్రదర్శించింది. ఇంతకు ముందు చెప్పుకున్నట్టుగా భూమి వంపే ఒకింత మారింది. దీనికి ఎవరినీ తప్పుపట్టలేం. కానీ రెండవ దెబ్బ మానవ చర్యల కారణంగా తగిలింది.

మానవ జాతి అడుగు పెట్టేవరకు భూమిపై అణు విచ్ఛిన్నం, లేదా సంయోగం ద్వారా అణుశక్తి చెప్పుకోదగిన స్థాయిలో జరగలేదు. ఈ పుడమిపై దీనిని ప్రవేశపెట్టడంలో మనుషుల హస్తం ఉంది. అది అరవై రెండు సంవత్సరాల క్రితం, అప్పుడు కూడా జపాన్‌లోని హిరోషిమా, నాగసాకిలపై అమెరికా అణుబాంబులు వేసినప్పుడు జరిగింది. ఆనాడు హారీ ట్రూమన్ అన్న మాటలను ఈనాడు మనం విశ్లేషించుకోవాలి. 'అది అణుబాంబు. అది విశ్వ మౌలికశక్తిని సాధించింది. సౌరశక్తి మూలాన్ని గ్రహించి కయ్యానికి కాలుదువ్విన వారిపై ప్రయోగించాం' అన్నాడు ట్రూమన్. ప్రస్తుతం సంక్షోభంపై వ్యాఖ్యానిస్తూ జపాన్ ప్రధానమంత్రి నౌటోకాన్, అప్పటి అణు బాంబులను సూచిస్తూ 'రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత' అత్యంత దారుణమైనదని పేర్కొన్నాడు.

హిరోషిమా తర్వాత కొన్ని సంవత్సరాల పాటు అణు శక్తి అంటే మానవ నిర్మిత ప్రమాదకర శక్తిగా పరిగణించారు. అది భూకంపాలకంటే ప్రమాదకరమైనది, ఎవరి ఊహలకీ అందనంత ప్రమాదకరమైనది. అయితే 1950లలో అణు విద్యుత్ కర్మాగారాల నిర్మాణంతో అణుశక్తిలోని మరో కోణాన్ని చూడసాగారు. (1956లో వాల్ట్ డిస్నీ 'మన మిత్రుడు పరమాణువు' అని ఒక కార్టూన్ సినిమా కూడా తీశాడు.) 1953లో అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ 'శాంతి కోసం అణువులు' అన్న ప్రతిపాదన ఒక కీలక ఘట్టం. దీని ప్రకారం అణ్వాయుధ వ్యాప్తి నిరోధానికి అంగీకరించే ప్రాతిపదికపై ఇతర దేశాలకు అణుశక్తి సాంకేతిక విజ్ఞానాన్ని అణ్వాయుధ దేశాలు ఇవ్వాలి. ఈ నియమాలనే అణ్వాయుధ వ్యాప్తి నిరోధక ఒప్పందం (ఎన్‌పిటి)లో పొందుపరిచారు. ఇది అణ్వాయుధాలను ప్రోత్సహించదు కానీ, అణు శక్తిని ప్రోత్సహిస్తుంది.

ఆయుధాల నియంత్రణపై ఐసెన్ హోవర్‌కి ఉన్న వ్యతిరేకత కారణంగానే పై ప్రతిపాదన చోటు చేసుకుందన్న విషయాన్ని ఇరా చెర్నస్ 'శాంతి కోసం అణువులు' అన్న తన పుస్తకంలో వెల్లడించాడు. ఐసెన్ హోవర్ పదవి చేపట్టిన నాటికి 1,436 అణు బాంబులు అమెరికా వద్ద ఉన్నాయి. రెండుసార్లు పదవీ కాలాన్ని ముగించేనాటికి ఆ సంఖ్యను 20,464కి చేర్చాలన్నది అతడి లక్ష్యం. ట్రూమన్ అనుసరించిన విధానం మాదిరి కాకుండా అణుబాంబులపై ఆధారపడిన 'పెను మారణ శక్తి'ని నిర్మించాలని ఐసెన్ హోవర్ అనుకున్నాడు. ఆయుధ నియంత్రణ ఈ విధానానికి ఆటంకం కలిగించేదిగా ఉంది. అణ్వాయుధ సమర్థకుడు

అన్న పేరును తొలగించుకోడానికి అతడు మార్గాలు వెతుకుతున్నాడు. 'శాంతికోసం అణువులు' ఇందుకు సరిగ్గా సరిపోయింది. అణు ముప్పుకు పరిష్కారంగా అతడు 'దానిని సైనికుల చేతుల నుంచి తీసేసి శాంతి కోసం వినియోగించే వారి చేతుల్లో పెట్టాలి' అన్నాడు. అంటే అణుశక్తి కర్మాగారాల నిర్మాణాల కోసం అణువిజ్ఞానాన్ని అంద చేయాలన్నాడు. అణు విజ్ఞానాన్ని సైనికుల చేతుల్లోంచి తీసుకోలేదు కానీ అణువిద్యుత్ ఇంజనీర్లు, జపనీస్ ఇంజనీర్ల చేతుల్లోకి కూడా అది వెళ్లింది.

దాంతో అణుశక్తి చరిత్ర మొదలయింది. దాంట్లో ఎన్నో మలుపులు. మొదట్లో అణుశక్తి ప్రయోజనాలు ఎంతగానో ఊరించాయి. కాని వెనువెంటనే సమస్యలు కూడా ముందుకొచ్చాయి. డిస్నీ చూపించిన నవ్వుతున్న అణువు, కోపంగా ఉన్న అణువుల మధ్య అంతరం తగ్గిపోతూ వచ్చింది. అణుశక్తికి సంబంధించిన సాంకేతిక విజ్ఞానం కారణంగా అణ్వాయుధ విజ్ఞానం కూడా వ్యాప్తి చెందుతూ వచ్చింది. అంతేకాదు అణుకర్మాగార వ్యర్థాలు ప్రమాద రహిత స్థాయికి చేరే దాకా కొన్ని వేల సంవత్సరాల పాటు భద్రంగా పాతిపెట్టి ఉంచాలి. అంతా కలిపితే కూడా ఆరువేల సంవత్సరాల చరిత్రలేని మానవజాతి దీనికి పూనుకోవడం హాస్యాస్పదంగా ఉందని అనాలి. అణుశక్తి విజ్ఞానమే ప్రమాదాలకు గురి అవుతూ, ప్రస్తుతం జపాన్‌లో మాదిరి, పెను ముప్పులకు కారణం అవుతోంది.

అదుపుతప్పిన జపాన్ అణు రియాక్టర్లలోని ఘటనలు ఒక మంచి గుణపాఠం కావాలి. మనం నియంత్రించగలమనుకుంటున్న శక్తులకూ, మానవ స్వభావానికీ మధ్య అంతరాన్ని గుర్తించాలి. అణు విద్యుత్తు చాలా సంక్లిష్టమైనది, ఉన్నత సాంకేతిక విజ్ఞానంతో కూడు కున్నది. కానీ పొరపాట్లు, తప్పులు చాలా చిన్న చిన్నవి. అణు శక్తికి చాలా ఎక్కువ ఉష్ణోగ్రతలతో నీటిని మరిగించాలి. దీనికి అణు శృంఖల చర్యల ద్వారా ఉత్పన్నమైన వేడిమి కావాలి. అంత వేడిమి ఉన్నప్పుడు దానిని నిరంతరం చల్లబరిచే ప్రక్రియ ఉండాలి. దీనికి మోటార్లు కావాలి. మోటార్లకు సాంప్రదాయశక్తి వనరులు కావాలి. ఇవే తరచూ పనిచెయ్యకుండా పోతాయి. జపాన్‌లోనూ అదే జరిగింది. బ్యాకప్ జెనరేటర్ మొండికేస్తుంది. బ్యాటరీ పనిచెయ్యదు, మోటారు మొరాయిస్తుంది. ఒక పెద్ద పాత్రలోకి నీటిని పంపు చెయ్యడం చాలా తేలికపని అని అనుకుంటారు. ఇది చాలా సందర్భాల్లో నిజం కూడా. కానీ ఎంతో బాగా రూపొందించిన ప్రణాళికలు కూడా ఒకసారి విఫలమౌతాయి. దీనికి సునామీ కారణం కావచ్చు, లేదా స్విచ్చి దగ్గర నిద్రపోయిన ఆపరేటర్ కావచ్చు. ముందుగా ఊహించగల, ఊహించలేని అనేక ఘటనలు ప్రతి దశను ప్రభావితం చేస్తాయి. భద్రతా నియంత్రణల, ఉల్లంఘన, వీటిని ఇతర సమస్యలను కప్పిపుచ్చడం జపాన్ అణుశక్తి పరిశ్రమలో కోకొల్లలు. పెద్ద పెద్ద బ్యూరోక్రాటిక్ సంస్థల్లో ఇటువంటివి మామూలే. ప్రపంచంలోకెల్లా అత్యంత క్రమశిక్షణగల, సమర్థ దేశమైన జపాన్‌లోనే ఇటువంటివి జరిగితే ఇతర దేశాల గురించి చెప్పుకునేది ఏముంది? ఉల్లంఘనలకు, కప్పిపుచ్చడానికి నిర్వాహకులే, బాధ్యులే పూనుకున్నప్పుడు చిన్న తప్పుల కారణంగా చిన్న ప్రమాదాలు ఎదురవుతాయి. కాని విశ్వ మూలశక్తితో వ్యవహరిస్తున్నప్పుడు ఈ ప్రమాదాలు విశ్వరూపం దాలుస్తాయి.

మరొక బ్యాకప్ జెనరేటర్ లేకపోవడమో, భద్రతా నియమాలు కఠినంగా లేకపోవడమో, అణువ్యర్థాలను పాతి పెట్టేగొయ్యి భౌగోళికంగా సరైన ప్రదేశంలో లేకపోవడమో, అణుశక్తి వ్యాప్తి నియమాలు తేలికగా ఉండడమో సమస్యకాదు. తప్పటడుగులు వేసే మానవ మాత్రులమైన మనం అణువును ఛేదించడం లేదా అణువుల సంయోగం ద్వారా జనితమైన విశ్వశక్తిని ఒడిసిపట్టలేం. ప్రకృతి ప్రకోపించినప్పుడు, దానిని మానవ చర్యల వల్ల మరింత పెద్దదిగా మార్చుకోవాల్సిన అవసరం ఏముంది? ఇప్పటికే భూమిమీద ప్రకృతిపర విధ్వంసకర శక్తులు ఎన్నో ఉన్నాయి. వాటికి మనం అదనంగా చేర్చవలసిన అవసరం ఏముంది? వాటిని ప్రకృతి మాతకే వదిలేద్దాం.

ప్రస్తుత పరిణామాలను దృష్టిలో పెట్టుకుని అణుశక్తిని త్యజించాలని కొందరు సూచిస్తున్నారు. సమస్య స్వభావాన్ని దృష్టిలో పెట్టుకుని నాదొక సలహా. కొంతసేపు విషయాన్ని అధ్యయనం చేద్దాం. ఎంతసేపు? అణువ్యర్థాలలో ఒకటైన ప్లుటోనియం అర్థజీవితం 24,000 సంవత్సరాలు. అంటే ప్లుటోనియంలోని సగభాగం అణుధార్మిక గుణాన్ని పోగొట్టుకోడానికి 24,000 సంవత్సరాలు పడుతుంది. మనం దాంట్లో సగకాలం అంటే 12,000 సంవత్సరాల పాటు అధ్యయనం చేద్దాం. అంతవరకు ఇతర మంచి పనులతో పాటు ప్రమాదరహిత ఇంధన వనరుల కోసం అన్వేషిద్దాం. ఆ తరువాత గానీ అణు విచ్ఛిన్నం గురించి సరైన నిర్ణయం తీసుకోలేం.

*(రచయిత యేల్ విశ్వవిద్యాలయంలో విజిటింగ్ ఫెలో))*

*(స్వేచ్ఛానువాదం : కె. సురేష్, 'మంచి పుస్తకం' నిర్వాహకులు)* ◼

**రాబోయే సంచికలలో...**

- ❖ **పారిస్ కమ్యూన్‌కు 140 ఏళ్లు**
- ❖ **అడవి సంపదపై సామ్రాజ్యవాదుల కన్ను**
- ❖ **ఎస్.టి., ఎస్.సి. అత్యాచార నిరోధక చట్టం**
- ❖ **కొత్త మెడికల్ కోర్స్‌కు ఆహ్వానం**
- ❖ **మైక్రో ఫైనాన్స్ సంస్థల పక్షమా? ప్రజల పక్షమా?**
- ❖ **రికవరీ కేసులు - స్వర్ణకారుల గోసలు**
- ❖ **ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలకు ఎక్స్‌గ్రేషియా?**

*లిబియాపై దాడులు సామ్రాజ్యవాద దేశాల ప్రయోజనాల విస్తరణకేననీ, ఆ దేశాన్ని మరో ఇరాక్ లాగా, అఫ్ఘనిస్తాన్‌లాగా మార్చాలని అమెరికా చూస్తోందనీ అంటున్నారు* **ఎ. నరసింహారెడ్డి**

# లిబియాపై విదేశీ సైనిక చర్య మానవతేనా?

ఇస్లామిక్ ప్రపంచమంతటా కొత్తగాలులు ప్రబలంగా వీస్తున్నాయి. ప్రజా ఉద్యమాల ధాటికి నియంతృత్వాలు నేలమట్టమవుతున్నాయి. స్వేచ్ఛ, అభివృద్ధి, పారదర్శకత కావాలని, అవినీతి, అవినీతిపరులైన నాయకులు పోవాలని ప్రజలు కోరుతున్నారు. మధ్య ప్రాచ్య దేశాల ఆందోళనల్లో ప్రధానంగా మూడు లక్షణాలు కనిపిస్తాయి. ఒకటి, ప్రజాస్వామ్యం పట్ల ప్రజల ఆకాంక్ష. రెండు, ఆర్థిక పరమైన బాధలు. మూడు, సామ్రాజ్యవాద వ్యతిరేక భావనలు. ముఖ్యంగా లిబియాలో ఫిబ్రవరి 17న మొదలైన గడాఫీ వ్యతిరేక ప్రజా ఆందోళన ఒక అడుగు ముందుకు, రెండు అడుగులు వెనక్కి అన్నట్లుగా సాగుతోంది.

స్వతంత్ర లిబియా చరిత్ర 1951లో ఆరంభమయింది. ద్వితీయ ప్రపంచ సంగ్రామం నేపథ్యంలో మిత్ర రాజ్యాల సైన్యం 1943లో ఇటలీ సైన్యాన్ని లిబియా నుండి పారదోలింది. ఇటలీ వలస పాలన నుండి విముక్తి పొందిన లిబియా ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో 1947 నుంచి ఫ్రాన్స్ – బ్రిటన్ దేశాల ఆధీనంలోకి వచ్చింది. లిబియాకు స్వాతంత్ర్యం ఇవ్వాలని 1949 నవంబర్ 21న ఐక్యరాజ్య సమితి తీర్మానించింది. 1951 డిసెంబర్ 24న లిబియా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొంది. ఇద్రిస్ రాజు పాలన మొదలయింది. 'యునైటెడ్ కింగ్‌డమ్ ఆఫ్ లిబియా'గా పేరు మార్చుకుంది. 1953లో అరబ్ లీగ్‌లో చేరింది. రాజు ఇద్రిస్ వైద్య పరీక్షల నిమిత్తం టర్కీకి వెళ్లినపుడు కల్నల్ గడాఫీ నాయకత్వంలో సైన్యం తిరుగుబాటు చేయడంతో ఇద్రిస్ రాచరిక పాలన అంతమయింది. 1969 సెప్టెంబర్ 15న పాతిక సంవత్సరాల పిన్న వయస్సులో గడాఫీ 'నియంతల్లో కెల్ల నియంతగా' గుర్తింపు తెచ్చుకున్నాడు. అధికారం కైవశం చేసుకున్నారు.

గడాఫి ఒక జాతీయవాది, అయినా అరుదైన నియంత, దేశాధినేతగా అత్యధిక కాలం అధికారంలో ఉన్న వ్యక్తిగా, లిబియాను ఎక్కువ కాలం పాలించిన వ్యక్తిగా రికార్డు నెలకొల్పాడు. అధికారంలో ఉంటూ, ఆస్తులు–అంతస్తులు లెక్కకు దొరకనంత మోతాదులో సమకూర్చుకున్నాడు. యుక్త వయస్సులో ఉండగా అప్పటి ఈజిప్టు అధ్యక్షుడు నాజర్ ప్రవచించిన అరబ్ 'సోషలిస్టు – జాతీయ విధానం' అంటే గడాఫీకి విపరీతమైన అభిమానం ఉండేది. 1956 నాటి సూయజ్ కాలువ సంక్షోభంలో ఇజ్రాయిల్ వ్యతిరేక ప్రదర్శనలలో చురుగ్గా పాల్గొన్నాడు. 'లిబియన్ అరబ్ రిపబ్లిక్'ను స్థాపించి తనను తానే మరో చేగువేరాగా పిలుచుకున్నాడు. పాశ్చాత్య దేశాల వ్యతిరేక భావాలకు కేంద్ర స్థావరంగా లిబియాను రూపుదిద్దసాగాడు. అమెరికన్లకు సింహస్వప్నమయ్యాడు. లిబియాను పాలించడానికి గడాఫి తన అధ్యక్షతన 'రివల్యూషనరీ కమాండ్ కౌన్సిల్'ను ఏర్పాటు చేశాడు. లిబియా సమాజం 'ప్రజలచే పాలించబడే' సమాజం అనీ, తను కేవలం వారి ప్రతినిధిని మాత్రమే అనీ పేర్కొనేవాడు.

1972లో గడాఫీ లిబియా ప్రతిపక్ష రాజకీయ పార్టీలను నిషేధించాడు. కార్మిక సంఘాలు లేవు. కార్మికులకు సమ్మె హక్కు లేదు. సోషలిజం, అరబిజమ్ అని ఎన్ని కబుర్లు చెప్పినా ఆచరణలో పెట్టుబడిదారీ విధానాలను అమలు జరిపాడు. రాజరికాన్ని రద్దు చేయడంతో పాటు పాక్షికంగా విదేశీ ఆస్తులు, చమురును జాతీయం చేశాడు. తాను అటు కమ్యూనిస్టులు, ఇటు పెట్టుబడిదారులకు దూరంగా మూడవ మార్గంలో పయనిస్తానని చెప్పుకున్నాడు. విదేశీ ఆస్తులను జాతీయం చేయడం, అమెరికా బ్రిటిష్ సైనిక స్థావరాలను ఎత్తివేయడంతో గడాఫీని హత్య చేయాలని బ్రిటన్ ఒక దశలో ఆలోచన చేసింది. అప్పటినుండి రాజకీయంగా సోవియట్ వైపు మొగ్గాడు. దాని దన్నుతో అప్పటికే ఇజ్రాయిల్‌కు దగ్గరవుతున్న ఈజిప్టుపై దాడి చేశాడు. పాలస్తీనా అరబ్బులకు మద్దతు ఇచ్చిన కారణంగా తలెత్తిన వివాదాల్లో 1973లో చమురు మోరటోరియం ప్రకటించి అమెరికా, తదితర పశ్చిమ దేశాలపై దాన్నొక ఆయుధంగా వినియోగించాడు.

'అరబ్ నేషనలిజం', 'సంక్షేమ రాజ్యం', 'ప్రత్యక్ష జనరంజక ప్రజాస్వామ్యం' అన్న నినాదాల ప్రాతిపదికగా తన ప్రభుత్వ పాలన ఉంటుందన్నాడు గడాఫి. లిబియా 'ఇస్లాం సామ్యవాదం'ను అనుసరిస్తున్నదనీ, చిన్న కంపెనీల అజమాయిషీ ప్రైవేట్ వ్యక్తులకు అప్పచెప్పినప్పటికీ, భారీ సంస్థలను మాత్రం ప్రభుత్వ పరంగానే నడుపుతామని అన్నాడు. సోవియట్‌ను మంచి చేసుకొనేందుకు రాజ్యాంగాన్ని సవరించి 1977లో 'గ్రేట్ సోషలిస్టు పీపుల్స్ లిబియన్ అరబ్ జమాహిరియా' గా దేశం పేరు మార్చాడు. 'స్థానిక ప్రజాదరణ మండళ్ల' ద్వారా 'సహజీవన వ్యవస్థల' ద్వారా నేరుగా ప్రజలచే పాలించబడే 'ప్రత్యక్ష ప్రజాస్వామ్యం' అమలులోకి వచ్చిందని ప్రకటించాడు. గడాఫీ 'సెక్రటరీ జనరల్' గా 'పీపుల్స్ కాంగ్రెస్' ఏర్పాటైంది. అరబ్ దేశాల ఐక్యతకు, 'ఐక్య అరబ్ జాతి' కొరకు పోరాడుతున్నానేవాడు. నాజర్ మరణం తర్వాత అరబ్ జాతి సైద్ధాంతిక నాయకత్వాన్ని గడాఫీ నుంచి ఆశించింది. పాలస్తీనా విమోచన సంస్థకు గట్టి మద్దతు నిచ్చాడు. 1979 ఈజిప్టు – ఇజ్రాయిల్ శాంతి ఒప్పందం దరిమిలా లిబియా – ఈజిప్టు మధ్య సంబంధాలు తెగిపోయాయి. దక్షిణాఫ్రికా, ముస్లిం దేశాల్లో తిరుగుబాటు ఉద్యమాలను, విముక్తి ఉద్యమాలను ప్రోత్సహించే అంతర్జాతీయ రాజకీయ విధానాన్ని గడాఫీ

అనుసరించాడు. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌కు, ఐరిష్ రిపబ్లికన్ ఆర్మీకి ఆర్థిక, సైనిక సహాయం అందించాడు. ఆఫ్రికన్ దేశాలన్నింటిలోకెల్లా లిబియా తలసరి ఆదాయం అధికంగా ఉంది. 1980 దశకం చివరికల్లా అంతర్జాతీయ – సీమాంతర ఉగ్రవాదానికి నిధులిచ్చే ప్రధాన వ్యక్తిగా, పాశ్చాత్య దేశాలు గడాఫీని అనుమానించ సాగాయి. సద్దాం హుస్సేనుకు వ్యతిరేకంగా ఇరాక్‌తో యుద్ధం చేస్తున్న ఇరాన్ దేశానికి మద్దతునివ్వడం అలనాటి అమెరికా అధ్యక్షుడు రొనాల్డ్ రీగన్‌కు ఆగ్రహం కలిగించింది. 'మధ్య ప్రాచ్య ప్రాంతపు పిచ్చి కుక్క' గా రీగన్ ఆయనను అభివర్ణించాడు. అమెరికా, లిబియాల మధ్య దౌత్య సంబంధాలు తెగిపోయాయి.

1986 నుంచి లిబియాను రాడికల్ జాతీయవాదం నుంచి వెనక్కి మళ్లించడం కోసం అమెరికా పాలకులు చేసిన ప్రయత్నాలన్నీ బెడిసి కొట్టడంతో ఒక దుర్మార్గపు కుట్రతో కల్నల్ గడాఫీని ఇరికించే ప్రయత్నంలో భాగంగా 1986లో ఇరానియన్ వాణిజ్య విమానాన్ని అమెరికా డిస్ట్రాయర్ నౌకతో కాల్పులు జరిపి లిబియాలోని లాకర్‌బీ వద్ద పడగొట్టి ఆ నేరాన్ని లిబియాపైకి నెట్టింది. ఇతరత్రా అనేక కుట్రలు చేసి లిబియాను దోషిగా నిలబెట్టింది. కల్నల్ గడాఫీ చాలాకాలం అమెరికా సామ్రాజ్యవాదనికి వ్యతిరేకంగా నిలిచారు. అందువల్ల అమెరికా పలుమార్లు లిబియాపై దాడులకు పాల్పడింది. గడాఫీని చంపడానికి ప్రయత్నించింది. గడాఫీ లక్ష్యంగా రాజధాని ట్రిపోలీలో తన నివాసంపై వైమానిక దాడులు నిర్వహించింది. వీటన్నింటినీ ఎదిరించి నిలిచిన గడాఫీ సోవియట్ పతనానంతరం అమెరికా ఒత్తిళ్లకు లొంగిపోయి రాజీపడ్డాడు. చివరికి 1999 నాటికి గడాఫీ అమెరికా దారికి వచ్చాడు. సెప్టెంబర్ 11న న్యూయార్క్ ప్రపంచ వాణిజ్య కేంద్రంపై జరిగిన దాడిని ఖండించాడు.

అమెరికా, యూరోపియన్ యూనియన్ చమురు కంపెనీలతో గడాఫీ ప్రభుత్వం అనేక ఒప్పందాలు చేసుకోవడంతో లాకర్ బీ కేసులో లిబియాపై విధించిన ఆర్థిక ఆంక్షలు 2004లో రద్దయ్యాయి. చివరికి భద్రతా మండలికి కూడా లిబియా ఎన్నికయింది. అమెరికా ఆదేశిత నయా ఉదారవాద విధానాల బాట పట్టాడు. నాటి బ్రిటిష్ ప్రధాని టోని బ్లెయిర్ లిబియాను సందర్శించడానికి, గడాఫీని ప్రశంసించ డానికి, సీమాంతర ఉగ్రవాదం అణచివేతలో లిబియా పాల్గొనాలని బ్లెయిర్ కోరడానికి ఆయన అనుసరిస్తున్న సామ్రాజ్యవాద అనుకూల విధానాలు తోడ్పడ్డాయి. క్రమేపీ, అమెరికాతో దౌత్య సంబంధాలు మెరుగవడం, ఫ్రాన్స్ అధ్యక్షుడు లిబియాలో పర్యటించడం జరిగింది. 2009లో 53 సభ్య దేశాలు గల 'ఆర్గనైజేషన్ ఆఫ్ ఆఫ్రికన్ యూనియన్' అధినేతగా గడాఫీ ఎన్నికయ్యాడు. దీంతో ఆయనకు ఆఫ్రికా ఖండంలో మంచి గుర్తింపు వచ్చింది. దేశంలోని చమురు వ్యాపారాలు, ప్రధాన పారిశ్రామిక కార్యకలాపాలన్నీ గడాఫీ ఆశ్రితుల చేతుల్లో కేంద్రీకృతమయ్యాయి. దేశంలో పేద, ధనిక వర్గాల మధ్య తారతమ్యాలు అనూహ్యంగా అఘాతంలా పెరిగిపోయాయి. ప్రజాస్వామిక హక్కులు మృగ్యమయ్యాయి. వాక్ స్వాతంత్ర్యం కరువైంది. ఈ నేపథ్యంలో గడాఫీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా గత నెల 17 నుండి ప్రజల నిరసన ప్రదర్శనలు మొదలయ్యాయి. గడాఫీ బెదిరింపులను ఖాతరు చేయకుండా, తుపాకీలకు ఎదురు నిలిచి, ఉద్యమాన్ని ప్రజలు తీవ్రతరం చేశారు ప్రజలు. గడాఫీ తీవ్ర స్థాయిలో ప్రజల అణచివేతకు ఉపక్రమించాడు. తన ప్రాణాలున్నంత వరకు పోరాడుతానని ప్రతిన చేశాడు.

ట్యునీసియా, ఈజిప్టు తరహాలోనే లిబియా నిరసనోద్యమ జ్వాలలు ఉవ్వెత్తున చెలరేగాయి. రక్తపాతం చోటు చేసుకుంటోంది. దేశాధ్యక్షుడు గడాఫీ 42 ఏళ్లుగా సాగిస్తున్న నిరంకుశ పాలనను అంతం చేయాలని ప్రజలు పంతం పట్టడంతో బెంఘాజీ, దెర్నా, బైదా, తుబ్రుక్ తదితర నగరాలు అట్టుడుకుతున్నాయి. బెంఘాజీ యుద్ధ భూమిని తలపిస్తోంది. గడాఫీ 1969లో తిరుగుబాటు లేవనెత్తి అధికారం కైవసం చేసుకొన్న తరువాత లిబియా ఇంత తీవ్ర స్థాయి సంక్షోభాన్ని ఎదుర్కోవడం ఇదే మొదటిసారి. ప్రజల నిరసన జ్వాలలు ఇప్పటికే రాజధాని ట్రిపోలీకి పాకాయి. చైనా, దక్షిణ కొరియా, బంగ్లాదేశ్‌లకు చెందిన కార్మికులు, ఉద్యోగులు ఇప్పటికే దాడులకు గురయ్యారు. ఉద్యమకారులు లిబియాలో అనేక ప్రభుత్వ భవనాలను తగులబెట్టారు. ఆ దేశంలో వేగంగా అంతర్యుద్ధ పరిస్థితులు ఏర్పడుతున్నాయి. లిబియా తూర్పు ప్రాంతంలో గడాఫీ వ్యతిరేక పక్షాలదే ప్రాబల్యం. అక్కడి సైనికుల్లో చాలామంది అటువైపు ఫిరాయించారు. గడాఫీ కాళ్ల కింద నేల కదిలిపోతోంది. కల్నల్ గడాఫీకి సన్నిహిత మిత్రునిగా ఉన్న అంతర్గత వ్యవహారాల మంత్రి అబ్దెల్ యూనెస్ ఫిరాయించడంతో ఉద్యమం కీలక మలుపు తిరిగింది. గడాఫీ ప్రభుత్వంలో విదేశాంగ మంత్రిగా ఉండి రాజీనామా చేసి ఇప్పుడు ప్రతిఘటన ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న మూసా క్విసాకు పశ్చిమ దేశాలతో 2003 నుండి మంచి సంబంధాలున్నాయి.

నాలుగు దశాబ్దాలుగా అప్రతిహతంగా లిబియాను ఏలుతున్న మయమ్మర్ గడాఫీ దేశం వదలి పారిపోయాడని అధికార వార్తలు వెలువడ్డాయి. గడాఫీ వెనిజులా వెళుతున్నాడని బ్రిటన్ విదేశాంగ మంత్రి విలియం హేగ్ స్వయంగా చెప్పడం వదంతులకు ఆజ్యం పోసింది. అయితే, ఆ వార్తలను వెనిజులా ప్రభుత్వం తోసిపుచ్చింది. లిబియా రాజధాని ట్రిపోలీలోని అజ్ఞాతంలోకి రెండు రోజులు వెళ్లిపోయాడు. నిరసనోద్యమాన్ని అణచివేయడానికి గడాఫీ ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిస్తోంది. ప్రజల నెత్తురు కళ్లచూస్తోంది. గడాఫీ కుమారుడు సైల్ అల్–ఇస్లాం జాతీయ టెలివిజన్‌లో ప్రసంగిస్తూ ప్రభుత్వం ప్రస్తుత తిరుగుబాటును అంతర్యుద్ధంగా పరిగణిస్తోందని స్పష్టం చేశారు. తన తండ్రి, సైన్యమూ తనకు మద్దతు ఇస్తున్నట్లు ఆయన చెప్పుకొచ్చారు. లిబియా జాతీయ భద్రతా సలహాదారుగా ఉన్న సైల్ తమ్ముడు మెతాసెమ్ సైన్యం పైనా పూర్తి నియంత్రణ కలిగి ఉన్నారు.

ఉద్యమం తొలిరోజుల్లో దేశ రాజధాని ట్రిపోలీతోపాటు రెండవ అతిపెద్ద నగరమైన బెంఘాజీ, అనేక ఇతర చిన్న పట్టణాలలో ఉవ్వెత్తున ప్రజలు వీధులలోకి వచ్చారు. ట్రిపోలీలో గడాఫీ ప్రభుత్వం కదలి పోతున్నట్లు కనిపించగా బెంఘాజీతో పాటు తూర్పు ప్రాంతంలోని కొన్ని పట్టణాలు చూస్తుండగానే తిరుగుబాటుదారుల వశమయ్యాయి. దానితో ఇక మూడవ అరబ్ నియంత పతనం ఖాయమన్న అభిప్రాయం బయటి ప్రపంచానికి ఏర్పడింది. కాని రెండు వారాలు గడిచేసరికి క్రమంగా మరొక చిత్రం రూపు తీసుకుంది. ఉద్యమాన్ని వైమానిక, ట్యాంకులు, ఫిరంగులు, సైన్యంతో అణచివేసేందుకు గడాఫీ ఆయన కుమారులు పూనుకోవడంతో ప్రతిపక్షాలు కూడా ఆయుధాలు పట్టాయి. అనేక ప్రాంతాలు స్వాధీనం చేసుకున్నట్లు ప్రతిపక్షాలు ప్రకటిస్తుంటే వాటిని తిరిగి స్వాధీనం చేసుకున్నట్లు గడాఫీ మీడియా చెబుతోంది. గడాఫీ త్రివిధ దళాలను వినియోగిస్తున్నందున తమకు మద్దతుగా అంతర్జాతీయ

సమాజం వైమానిక దాడులను ఎదుర్కొనేందుకు ప్రతిదాడులు చేయాలని కోరుతున్నట్లు ఒక తిరుగుబాటు నాయకుడు చెప్పాడని అమెరికా మీడియా వార్తలు పేర్కొన్నాయి. నిజానికి లిబియా విప్లవకారులు 'విదేశీ జోక్యం వద్దు' అని ముక్త కంఠంతో ఘోషిస్తున్నారు. లిబియా ప్రజలు తమంతగా తాముగానే విప్లవాన్ని విజయవంతంగా పూర్తిచేయగలమని, ఎలాంటి విదేశీ జోక్యం అవసరం లేదని బెంఘాజీలోని విప్లవ ప్రభుత్వం స్పష్టం చేసింది. విదేశీ సైనిక జోక్యంతో పరిస్థితి సంక్లిష్టం అవుతుందని హెచ్చరించింది. మరోవైపు గడాఫీ ప్రభుత్వాన్ని కూలదోసి దేశంలో ఇస్లామిక్ ప్రభుత్వాన్ని నెలకొల్పాలని లిబియన్లకు అల్‌కాయిదా పిలుపునిచ్చింది. 2005లో ఆఫ్ఘనిస్తాన్‌లోని అమెరికా ఆధీనంలోని జైలు నుంచి తప్పించుకున్న అల్‌కాయిదా కమాండర్ అబూ యాహియా అల్ లిబి ఈ మేరకు ఓ వెబ్ సైట్‌లో మీడియాను పోస్ట్ చేశారు.

లిబియాలో అనేక తెగలు, ఉప తెగలుంటాయి. వీటిలో సెనుస్సి తెగస్తులు పూర్వం నుండి ఆధిపత్యం చెలాయించారు. ఇద్రిస్‌రాజు సెనుస్సి తెగస్తుడే. ఈ తెగకు చెందిన అధికారులు, సైనికాధికారులు, దౌత్యవేత్తలు హఠాత్తుగా గడాఫీ ప్రభుత్వం నుండి ఫిరాయించారు. తూర్పు ప్రాంతానా సెనుస్సీ తెగల ప్రభావం ఉన్నందున, తూర్పున గల బెంఘాజీ మొదలైన నగరాలు గడాఫీ వ్యతిరేకులకు స్వాధీనమయ్యాయి. ఆ ప్రాంతానగల చమురు పట్టణాల పరిస్థితీ అదే అయింది. ఫిబ్రవరి చివరి నాటికి బెంఘాజీ నుండి ఈజిప్టు సరిహద్దు వరకు గల మధ్యధరా సముద్ర తీరంలోని చమురు శుద్ధి కేంద్రాలు, చమురు ఎగుమతి కేంద్రాలు అన్నీ తిరుగుబాటుదారుల కైవశమయ్యాయి. బెంఘాజీ రాజధానిగా 'తాత్కాలిక పరివర్తనా జాతీయ ప్రభుత్వం' పేరిట ఒక పోటీ ప్రభుత్వాన్ని తిరుగుబాటు దారులు ఏర్పర్చినారు. అయితే ఈ తిరుగుబాటుదారులకు పశ్చిమ దేశాల, కొంతమంది సైనికాధికారుల అండదండలున్నాయి. గడాఫీ ప్రభుత్వంలోని కొంతమంది మంత్రులు, విదేశాల్లోని కొంతమంది రాయబారులు ఏకకాలంలో తిరుగుబాటు వైపు ఫిరాయించారు.

పశ్చిమాన గల ట్రిపోలీ, దాని పరిసర ప్రాతాలలో గడాఫీ తెగ అతి బలమైనది కాగా కొన్ని ఇతర ప్రధానమైన తెగలు కూడా ఉన్నాయి. వాటిలో కొన్ని తిరుగుబాటు మార్గంలో ఉండగా కొన్ని ఇంకా తటస్థతను వీడలేదు. ఇక్కడినుంచి పరిస్థితి నెమ్మదిగా మారడం మొదలైంది. తొలి పరిణామాల ఉధృతికి రెండడుగులు వెనుకకు వేసిన గడాఫీ తనను తాను కూడదీసుకోవడం మొదలుపెట్టాడు. స్వంత ప్రజలపై బల ప్రయోగానికి సందేహించని తత్వం, సైన్యం, మిలీషియా పూర్తిగా తన చెప్పుచేతలలో ఉండడంతో, ఆర్థిక వ్యవస్థకు ఏకైక ఆధారమైన చమురు నిల్వలు తూర్పున ఉన్నందున వాటిని తిరిగి ఆధీనంలోకి తెచ్చుకొని తీరవలసిన అనివార్యమైన అవసరం గడాఫీకి ఏర్పడింది. ఆ విధంగా దేశ రాజధానిపై, ఆ పరిసర పట్టణాలపై మొదటపట్టు సాధించడం, తూర్పు ప్రాంతపు తిరుగుబాటుదారులు ట్రిపోలీపై దాడికి చేస్తుండిన సన్నాహాలను నిలువరించడం గడాఫీ తక్షణ కార్యక్రమం అయింది. వ్యూహాత్మకంగా ట్రిపోలీలో తిరుగుబాటు దార్లను అణచివేసి, పరిసర పట్టణాలను కూడా తిరుగుబాటు దారుల నుంచి మొదటగా తన ఆధీనంలోకి తెచ్చుకున్నారు. తిరుగుబాటు దారులు ఇంకా మిగిలి ఉన్నా అణచివేత వల్ల కొంత బలహీన పడ్డారు. ఈ విధంగా మొదటి 'విజయం' సాధించిన గడాఫీ తిరుగుబాటు దారుల ట్రిపోలీ దండయాత్రను నిలువరించడం రెండవ పనిగా పెట్టుకున్నారు. అందుకోసం బెంఘాజీనుంచి ట్రిపోలీకి మధ్యలోగల తన స్వస్థలంలోని గిరిజన తెగలను సాయుధం చేసి రంగంలోకి దించడం ఒకటికాగా, ట్రిపోలీ నుంచి మిలీషియాను, యుద్ధ విమానాలను వినియోగించడం రెండవ చర్య అయింది. వారం రోజుల కాలంలోనే ఈ లక్ష్యాన్ని కూడా సాధించారు. ప్రస్తుతం మూడవ దశ వ్యూహం అమలవుతున్నది. దాని ప్రకారం తూర్పు ప్రాంతంలోని చమురు క్షేత్రాలను, పట్టణాలను తిరిగి వశపరుచుకు కోవడం లక్ష్యం. లిబియా ఆర్థిక వ్యవస్థకు, తద్వారా గడాఫీ అధికారానికి చమురు అత్యంత కీలకమైంది. ఈ కార్యం సిద్ధిస్తే బెంఘాజీ బలహీనపడి చివరి దశ యుద్ధ క్షేత్రంగా మిగులుతుంది.

సరిగా ఇక్కడే అసలు సమస్య ఉంది. గడాఫీ తెగకు సంప్రదాయికంగా వ్యతిరేకులైన తెగలవారు ఇక్కడే ఉన్నారు. చమురు రూపంలో దేశ సంపదలు ఇక్కడే ఉన్నాయి. తిరుగుబాటు ఇదే ప్రాంతంలో అతిబలంగా ఉంది. పాశ్చాత్య దేశాల దృష్టి కూడా ఇక్కడే కేంద్రీకృతమైంది. అదే సమయంలో పాశ్చాత్య దేశాల చేతిలో కీలుబొమ్మలయేందుకు తూర్పు లిబియన్లు సిద్ధంగా లేరు. గడాఫీ పైచేయి సాధిస్తుండడానికి కారణం తన వైమానిక బలం అయినందున, ఆ ప్రాంతమంతటా వైమానిక బల ప్రయోగాన్ని అరికట్టేందుకు (నో ఫ్లై జోన్) ఐక్యరాజ్యసమితి ద్వారా పాశ్చాత్యుల సహాయాన్ని పాక్షికంగా తీసుకునేందుకు మాత్రం కొందరు సుముఖంగా ఉన్నారు. అయితే, లిబియన్లకు తోడ్పడడం పేరిట చమురు వనరులను వశపరుచుకునే అమెరికా లక్ష్యాన్ని సాగనివ్వకపోవడం మాత్రం అవసరం. అంతిమంగా తమ యుద్ధాన్ని తామే గెలవాలన్న లిబియన్‌ల నిశ్చితాభిప్రాయానికి ప్రపంచం నుంచి నైతిక మద్దతు అవసరం.

మధ్యప్రాచ్యంలో ఒక్కసారిగా మొదలైన ఈ ప్రజా నిరసనలు ఇక్కడి అరబ్బు పాలకుల కంటే ఎక్కువగా అమెరికాకు ఆందోళన కలిగిస్తోంది. మూడు దశాబ్దాల క్రితం క్యాంప్ డేవిడ్ ఒప్పందం ద్వారా అరబ్ ప్రపంచంలో అడుగు పెట్టిన అమెరికా, హోస్నీ ముబారక్ నిష్క్రమణ తర్వాత అయోమయంలో కొట్టుమిట్టాడుతోంది. ఇజ్రాయిల్ కారణంగా అన్ని అరబ్ దేశాల సామాన్య ప్రజానీకంలో సహజంగా అమెరికా పట్ల వ్యతిరేకత ఉంది. కానీ అరబ్ దేశాల పాలకులందరూ అమెరికాకు సన్నిహిత మిత్రులు. అరబ్ దేశాల్లో ప్రజాస్వామ్య వ్యవస్థ నెలకొంటే ప్రజాభిప్రాయమే ప్రభుత్వ విధానం కావాల్సి ఉంటుంది. అప్పుడు చమురు, సైనిక స్థావరాలు, ఇజ్రాయిల్ భద్రత మొదలైన అమెరికా ప్రాధాన్యాలకు చోటుండదు. అందుకే నియంత పాలకుల ద్వారా అమెరికా తన ప్రయోజనాలను సాధించుకుంటుంది.

మధ్యధరా సముద్ర ప్రాంత దేశాలు ప్రపంచ వాణిజ్యానికి కీలకం అయినందున అమెరికా, యూరోపియన్ దేశాలు తమ ఆర్థిక, భౌగోళిక రాజకీయ ప్రయోజనాలను కాపాడే ప్రభుత్వ ఏర్పాటుకు ఉద్యమాన్ని తెలివిగా వాడుకుంటున్నాయి. ఇంతగా దిగివచ్చి అమెరికాకు దాసోహం అన్నప్పటికీ గడాఫీపై జనంలో తలెత్తిన నిరసన కారణంగా లాటిన్ అమెరికాలో ప్రజా కంటకులను చివరి రోజుల్లో వదిలించుకున్నట్లుగా గడాఫీని కూడా వదిలించుకొనేందుకు తనకు వ్యతిరేకమైన శక్తులు అధికారంలోకి రాకుండా చేసుకునేందుకు అమెరికా పావులు కదుపుతోంది.

గత నెల రోజులుగా లిబియాలో జరుగుతున్న ప్రజా తిరుగుబాటులో ఉద్యమకారులు ఎదురు దెబ్బలు తింటున్నారు. రాజధాని ట్రిపోలీపై ఆధిపత్యం కోసం గడాఫీ సేనలతో తిరుగుబాటు దారులు జరుపుతున్న పోరులో సైన్యానిది పైచేయి అవుతోంది. ప్రజా ఉద్యమాన్ని అణచివేసేందుకు గడాఫీ సైన్యానికి చెందిన యుద్ధ విమానాలు అనేక పట్టణాలపై బాంబుల వర్షం కురిపించాయి. వేలాది మంది మరణించారు. వేలాదిమంది క్షతగాత్రులయ్యారు. దేశంలో ఉద్యమకారులు చేజిక్కించుకున్న పలు కీలక పట్టణాలను తిరిగి సైన్యం తన ఆధీనంలోకి తెచ్చుకుంది. లిబియా తూర్పు ప్రాంతంలోని అజ్‌జావియా, మిశ్ర, బిన్‌జా, బ్రెగా, రస్ లనుఫ్ పట్టణాలను సైన్యం తిరిగి తన నియంత్రణలోకి తెచ్చుకుంది. అనేక ప్రాంతాలను తాము స్వాధీనం చేసుకున్నట్లు గడాఫీ మీడియా యంత్రాంగం చెబుతోంది. సైన్యం నుంచి దాడులు పెరుగుతున్నా, ఉద్యమకారులు మాత్రం పట్టు వీడడం లేదు. విప్లవకారులపై గడాఫీ సైన్యం పైచేయి సాధిస్తున్న క్రమంలో విప్లవకారులకు మద్దతుగా 2001లో ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్లను పారదోలడానికి ఆ దేశ సైన్యానికి సహకరించిన రీతిలోనే ఇప్పుడు లిబియాలోని విప్లవకారులకు అండగా నిలవాలని అమెరికా భావిస్తున్నట్లు న్యూయార్క్ టైమ్స్ పత్రిక వెల్లడించింది.

ప్రపంచానికి అమెరికా చాటిచెప్పే ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, మానవ హక్కులు మొదలైన అంశాలన్నీ అరబ్బుల విషయానికి వస్తే వట్టి జోకులే! ఇరాక్‌లో బలవంతంగా చొరబడి సద్దాంకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్యాన్ని సృష్టించిన అమెరికా లిబియాలో అదేరకమైన తొత్తు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకునే ఆలోచనలో ఉంది. అవసరమనుకుంటే ప్రజాస్వామ్యం పరిరక్షణ పేరుతో ఆదేశం పైనా యుద్ధానికి దిగే అవకాశాల కొరకు ఎదురు చూస్తోంది. ప్రస్తుత ప్రపంచ పరిస్థితిలో మధ్యప్రాచ్యం వంటి కీలక ప్రాంతంపై తన పట్టును వదులుకోవడానికి అమెరికా సుముఖంగా లేదు. ఎంత మూల్యాన్నైనా చెల్లించి తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవాలనే అది చూస్తున్నది. తన పెత్తనాన్ని నిలబెట్టుకునేందుకుగాను ఎలాంటి చర్యకైనా అది సిద్ధంగా ఉంది. ఆఫ్ఘనిస్తాన్ దురాక్రమణకు ఉగ్రవాద వ్యతిరేక యుద్ధం అని పేరు పెట్టుకున్నట్లుగా లిబియా దురాక్రమణకు 'మానవతా యుద్ధం' అని పేరు పెట్టుకునే అవకాశాన్ని అమెరికా పరిశీలిస్తుంది. ప్రజాతంత్ర వాదుల్లా కనిపించే కొంతమంది మధ్యేవాదులను నియంతల స్థానంలో నిలబెట్టాలని అది యోచిస్తున్నది. ఇలాంటి ప్రతిపాదనలన్నీ పాలనా స్వరూపాన్ని మార్చేవే గాని వర్గ స్వభావాన్ని మార్చేవి కావు.

గడాఫీ దురాగతాలకు సంబంధించి హెగ్‌లోని అంతర్జాతీయ క్రిమినల్ న్యాయస్థానంలో గడాఫీ, ఆయన సన్నిహితులపై విచారణ చేపట్టాలని ఐక్యరాజ్యసమితి తీర్మానించింది. లిబియాలో గగనతల నిఘాకు నాటో మార్చి 9 నుండి ఉపక్రమించిందని నాటో అధికారి ఒకరు ప్రకటించారు. అమెరికా, జపాన్ దేశాలు గడాఫీ, ఆయన ఆశ్రితుల ఆస్తులను జప్తు చేయనున్నాయి. లిబియా సార్వభౌమాధికారాన్ని, ప్రాదేశిక సమగ్రతను, స్వాతంత్ర్యాన్ని గౌరవించాలని చైనా, రష్యా, జర్మనీ, బ్రెజిల్ దేశాలు ఇతర దేశాలకు సూచించాయి.

నిరసన ప్రదర్శకులపై దాడులు విరమించాల్సిందిగా గడాఫీపై ఒత్తిడి చేసేందుకు ఐరాస మానవ హక్కుల కౌన్సిల్ సభ్యత్వం నుండి తొలగిస్తూ ఐరాస జనరల్ కౌన్సిల్ తీర్మానించింది. కాగా అమెరికన్ బ్యాంకుల్లోని లిబియన్ ఆస్తులు 30 బిలియన్ డాలర్లను స్వాధీనం చేసుకుంటున్నట్లు ఒబామా ప్రభుత్వం ప్రకటించింది. యూరోపియన్ యూనియన్ ఆయుధ సరఫరాలపై నిషేధంతో పాటు మరికొన్ని ఆంక్షలు విధించింది. లిబియాపై గగనతల నిషేధం విధించాలని ఐక్యరాజ్యసమితి భద్రతా మండలికి అరబ్‌లీగ్ విజ్ఞప్తి చేసింది. మార్చి 12 రాత్రి అత్యవసరంగా సమావేశమైన 22 దేశాల అరబ్‌లీగ్ దేశాల ప్రతినిధులు ఈ నిర్ణయం తీసుకున్నారు. లిబియాపై గగనతల నిషేధాన్ని విధించేందుకు అరబ్బులీగ్ అంగీకారానికి ఎదురుచూస్తున్న అమెరికా దాని ఐరోపా మిత్రదేశాలు ప్రకటన రావడంతోనే చర్యలు ప్రారంభించాయి. భద్రతా మండలి మార్చి 18న తీర్మానించింది. తీర్మానం చేసిన వెంటనే లిబియాపై దురాక్రమణ పర్వానికి తెరదీసింది. బాంబుల మోతతో లిబియా దద్దరిల్లుతోంది. 2003 నాటి ఇరాక్ ఆక్రమణ తరువాత అరబ్ ప్రపంచం ఎదుర్కొంటున్న భారీ 'అంతర్జాతీయ సైనికచర్య' గా పేర్కొనవచ్చు. 'ఆపరేషన్ ఒడిస్సీ డాన్'లో మార్చి 19న తొలి దాడులను ఫ్రాన్స్ ప్రారంభించింది. క్షిపణి దాడులతో అమెరికా, బ్రిటన్‌లు ఫ్రాన్స్‌తో జత కలిసాయి. ఫ్రాన్స్ బెంఘాజీ పైనా కేంద్రీకరిస్తే, అమెరికా, బ్రిటన్ దళాలు లిబియా పశ్చిమ ప్రాంతంపైనా ప్రధానంగా కేంద్రీకరించాయి. యుద్ధ నౌకలు, జలాంతర్గాములు నుంచి టమాహక్ క్షిపణులను ప్రయోగిస్తున్నారు. మరోవైపు ఈ యుద్ధం దీర్ఘకాలిక వియత్నామ్ యుద్ధం కానున్నదని, పాశ్చాత్య దాడిని' తిప్పికొట్టడానికి ప్రజలకు ఆయుధాలు ఇస్తానని గడాఫీ ప్రకటించాడు. పాశ్చాత్య దాడిని ఆయన 'వలసదాడి', 'ఇస్లాంపై యుద్ధం' అని అభివర్ణించాడు. లిబియాలో విదేశీ శక్తుల జోక్యం సరికాదని 'ఆఫ్రికన్ యూనియన్' పేర్కొంది. దాడులపై రెడ్‌క్రాస్ సంస్థ ఆందోళన వ్యక్తం చేసింది. లిబియాపై సైనిక చర్యలు భారత్, రష్యా, చైనా, బ్రెజిల్ లాంటి అనేక దేశాలు ఖండించాయి. ఈ చర్య ద్వారా పరిస్థితులు మరింతగా దిగజారుతాయని ఆందోళన వెలిబుచ్చాయి. పరిస్థితులు ఇలాగే కొనసాగితే హింస ప్రజ్వరిల్లి జనజీవనం అస్తవ్యస్తం అవుతుందని ఆ దేశాలు హెచ్చరించాయి.

అమెరికా ఆదేశిత నయా ఉదారవాద విధానాలు అమలు చేయడంతో గడాఫీ పట్ల ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత పెరిగింది. ప్రజాస్వామ్య వ్యవస్థకు బహుదూరంలో ఉంటూ, నిరంకుశ ఉక్కుపాదాల కింద నిద్రావస్థలో ఉన్నట్లుగా ఉన్న లిబియా ప్రజానీకం ఒక్కసారిగా ఉద్యమబాట పట్టడంతో కల్నల్ గడాఫీ చిక్కుల్లో పడ్డాడు. ప్రజా బలం ముందు తలవంచక తప్పడం లేదు. ఈ పరిణామాలు ఎటుదారి తీస్తాయో, ఇతర దేశాలకు ఎటువంటి పాఠాలు అందిస్తాయో వేచిచూడాల్సిందే. వర్గ స్వభావం మారనట్లయితే ప్రజల ఆకాంక్షలు నెరవేరబోవు. వర్గపాలన మారాలంటే కార్మికవర్గ విప్లవ చైతన్యమే పైన పేర్కొన్న లక్ష్యాలకు రక్షణ కవచంగా ఉండాలి. నేటి ఆందోళనల్లో శ్రామిక వర్గం ప్రధానమైన పాత్రను నిర్వహిస్తున్నప్పటికీ అది నాయకత్వ స్థానంలో లేదు, అలానే సామాజిక పరివర్తనకు కావలసిన విప్లవ సిద్ధాంతంతో సాయుధమై లేదు. ఏదియేమైనప్పటికీ స్వేచ్ఛ, స్వాతంత్రం లాంటి ప్రజాతంత్ర ఆకాంక్షలతో, మత ప్రమేయం లేకుండా, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగుతున్న ప్రజా ఉద్యమం అమెరికా, యూరోపియన్ దేశాల భౌగోళిక రాజకీయ వ్యూహంలో చిక్కుకోకుండా, విదేశీ జోక్యం లేకుండా స్వతంత్రంగా సాగక పోయినట్లయితే నిజానికి ప్రజలకు ఒరిగేది ఏమీ ఉండదు. నియంతలు మారుతారు గాని నియంతృత్వం మారదు. దోపిడీ రూపం మారుతుంది గాని దోపిడీ సారం మారదు.

*జాతీయ, విజాతీయ శక్తుల మధ్య తమ తమ ప్రయోజనాల కోసం, చమురు నిల్వలపై ఆధిపత్యాల కోసం జరుగుతున్న ఘర్షణను, లిబియాలో ప్రస్తుతం నెలకొన్న పరిస్థితులను వివరిస్తున్నారు* **పి. ప్రసాద్**

# లిబియాపై యుద్ధోన్మాద దాడుల నేపథ్యం

'ప్రపంచ గమనానికి మలుపు– అరబ్బు ఉద్యమాలు' శీర్షికతో వీక్షణం మార్చి నెల సంచికలో నేనొక వ్యాసం రాసిన విషయం పాఠకులకు తెల్సిందే. అందులో లిబియా, ఇరాన్‌లలో తలెత్తిన తాజా అస్థిరతల గూర్చి కూడా కేవలం నాలుగే నాలుగు వాక్యాలలో ప్రస్తావించాను. వాటిని ఇక్కడ పేర్కొంటున్నాను.

'ధూర్త దేశాల జాబితా నుంచి లిబియాను నేటికీ అమెరికా తొలగించలేదు. తమ దేశ అస్థిరత వెనక అమెరికా హస్తం ఉందని గడాఫీ ప్రభుత్వం ఆరోపించింది. అదే విధంగా అరబ్బేతర మధ్య ప్రాచ్యదేశమైన ఇరాన్‌లో కూడా ఉద్యమం తలెత్తింది. వీటిని మరికొంత లోతుగా అంతర్గత కోణాల నుంచి విడిగా విశ్లేషించాల్సి ఉంది.'

గత వీక్షణం సంచికలో రాసిన వ్యాసంలో పైన పేర్కొన్నట్లు లిబియా గూర్చి మరికొంత లోతైన అంతర్గత విశ్లేషణ చేయాల్సిన సమయం వచ్చింది. అన్ని అరబ్ దేశాల ప్రజాఉద్యమాలు ఒకటి కాదు. మిగిలిన అరబ్ దేశాల ప్రజల ప్రజాతంత్ర ఉద్యమాల నుంచి లిబియా పరిణామాలను వేరు చేసి చూడాల్సి ఉంది. యెమెన్ బహ్రెయిన్‌లలోని తన కీలుబొమ్మ నియంతృత్వ ప్రభుత్వాలు నెత్తుటి దమనకాండకి పాల్పడుతున్నా, అమెరికా బలపరుస్తున్నది. ఒక్క గడాఫీ ప్రభుత్వం మీద మాత్రం ఒంటి కాలిమీద విరుచుకు పడుతున్నది. ఈ వ్యాసం రాస్తున్న సమయానికి లిబియా మీద యుద్ధోన్మాద రాజ్యాల దాడులు కూడా ప్రారంభమయ్యాయి. వీటికి కారణాలు అర్థం చేసుకోవాలంటే, గత లిబియా పరిణామాలను పరిశీలించాలి.

లిబియాలో తాజా అస్థిరత ఫిబ్రవరి 15న ఆరంభమైంది. కేవలం ఈ అస్థిరత కాలంలోని రాజకీయ పరిణామాల మీద ఆధారపడితే లిబియా వర్తమాన సంఘటనల పట్ల స్పష్టమైన అవగాహన ఏర్పడదు. పైగా పాశ్చాత్య మీడియా మీద ఆధారపడితే వాస్తవిక సమాచారాన్ని సేకరించలేం. మొత్తం చారిత్రక గమనంలో వర్తమాన రాజకీయ పరిణామాలకు గల స్థానాన్ని పరిశీలించగలగాలి.

అన్ని ఆఫ్రికా దేశాల వలెనే లిబియా కూడా సుదీర్ఘ వలస పాలనలో మగ్గింది. ముఖ్యంగా ఇటలీ ఫాసిస్టు దమనకాండకు గురైంది. ఉమర్‌ముక్తార్ నాయకత్వంలో సాహసోపేతంగా లిబియా జాతీయ విమోచనోద్యమం సుదీర్ఘంగా సాయుధ పంథాలో కొనసాగింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం పొందిన స్వాతంత్ర్యాన్ని పశ్చిమ సంపన్న రాజ్యాలు నామమాత్రం చేశాయి. నయావలసపాలకుడైన ఇద్రిస్ రాజు నిరంకుశ ప్రభుత్వం మీద తిరిగి ప్రజా ఉద్యమం సాగింది. 1956లో సూయజ్ కాల్వ సంక్షోభం సందర్భంగా నాజర్ నేతృత్వంలో తలెత్తిన అరబ్ జాతీయవాదం లిబియాకు కూడా విస్తరించింది. అది 1969లో సైనిక తిరుగుబాటుకు ప్రేరణ నిచ్చింది. ఆనాటి యువసైనికాధికారి కల్నల్ గడాఫీ నేతృత్వంలోని రహస్య ఫ్రీ ఆఫీసర్స్ సొసైటీ సైనిక తిరుగుబాటుకు నాయకత్వం వహించింది. అది ఇద్రిస్ రాజు ఆధ్వర్యంలోని రాచరిక , ఇస్లామిక్ నిరంకుశ ప్రభుత్వాన్ని కూలదోసింది. లిబియాను 'ఆధునిక లౌకిక ప్రజాతంత్ర జాతీయ వాద మార్గం వైపుకు నడిపించింది. అందుకు గడాఫీ ప్రభుత్వం ఒక రాజకీయ పరివర్తనా సాధనంగా మారింది.

ఆధునిక లిబియా చరిత్రకి 1951లో పునాది పడినా దానికి నిర్మాణాత్మక కొనసాగింపు ప్రక్రియ 1969లోనే ప్రారంభమైంది. నాటి నుంచి నేటివరకూ లిబియా చరిత్ర నాలుగు దశలుగా సాగింది. మరోసారి పాశ్చాత్యదేశాలు దాడులకి దిగడంతో తాజాగా ఐదవ దశ ఆరంభమైనది. ఈ ఐదు దశలలోనూ లిబియా ప్రభుత్వానికి గడాఫీయే సారథ్యం వహిస్తున్నాడు. ఈ ఐదవ దశకి ముందున్న నాలుగు దశలు అర్థమైతే తాజా ఐదవ దశకు నేపథ్య చారిత్రక, రాజకీయ కారణాలు అర్థమవుతాయి. లిబియా చరిత్రతో సంబంధం లేని, లిబియా చమురును కబళించజూస్తున్న పాశ్చాత్య దేశాల దృక్కోణం నుంచి తాజా దాడులను

లిబియాను ఆక్రమించదలచుకున్న అమెరికా, పశ్చిమ దేశాలు 'మానవతా' సాకుతో ఆ దేశంపై సైనిక చర్యకు సిద్ధమయ్యాయి. ఐక్యరాజ్యసమితిలో తమకున్న బలంతో భద్రతా మండలి తీర్మానాన్ని సాధనంగా చేసుకొని లిబియాను మరొక ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్‌గా మార్చేందుకు ప్రయత్నించడం ప్రమాదకరం, గర్హనీయం. లిబియాలో గాని, మరొక దేశంలోగాని ఇలాంటి పరిస్థితులు తలెత్తినపుడు వాటిని ఆ దేశ ప్రజలు పరిష్కరించుకోవాలే తప్ప ఇతర దేశాలు అంటే సామ్రాజ్యవాద దేశాలు సైనికంగా జోక్యం చేసుకోవడం అంటే తమ తొత్తులను ప్రతిష్ఠించేందుకేనన్నది జగమెరిగిన సత్యం. స్వతంత్రంగా, స్వదేశీయమైన ఆర్థిక రాజకీయ సామాజిక విధానాలతో ఉద్యమాలను ముందుకు నడిపించే శక్తులు మాత్రమే అరబ్ దేశాల ప్రజలను సామ్రాజ్యవాద కబంధ హస్తాల నుండి బయట పడవేయగలవు. నిరంకుశ పాలనకు చరమగీతం పాడగలవు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

పరిశీలించడం వల్ల లిబియా చరిత్రకి అపచారం చేసినట్లు అవుతుంది. అందుకే తాజా దాడులకి ముందున్న దశలను లిబియా జాతీయ దృక్కోణం నుంచి అవలోకించుకుందాం!

1969 నుంచి మొదటి దశ సాగింది. లిబియా ప్రభుత్వం తన ఆర్థిక పునర్నిర్మాణంకై సోవియట్ యూనియన్ సాయంతో వివిధ పథకాలను అమలు చేసింది. ముఖ్యంగా చమురు రంగంతో పాటు సైనికాభివృద్ధికై కూడా కృషి చేసింది. ఫలితంగా లిబియా ఆర్థిక వ్యవస్థ బాగా మెరుగుపడింది. సుస్థిరతను కూడా సాధించుకొంది. ఈ దశ ఆఫ్ఘనిస్థాన్ పై సోవియట్ యూనియన్ దురాక్రమణ (1979) సాగే వరకూ కొనసాగింది.

ఆఫ్ఘనిస్థాన్ దురాక్రమణ తర్వాత ఆఫ్రికా, మధ్య ప్రాచ్యాలలోని తన అనుకూల దేశాల ప్రభుత్వాల పట్ల సంరక్షక పాత్రను సోవియట్ యూనియన్ పోషించలేక పోయింది. దీనికి బలైన మొదటి ఉత్తరాఫ్రికా దేశం లిబియాయే. ఈ నేపథ్యంలో స్కాట్లండ్‌లోని లాకర్‌బీ వద్ద విమాన ప్రమాదానికి గడాఫీ ప్రభుత్వమే కారణమంటూ లిబియా మీద అమెరికా తన పంజా విసరసాగింది. ఆంక్షలు విధించింది. వాటి అమలుకు ఏకపక్షంగా బరితెగించింది. గడాఫీ నివాసం మీద బాంబు దాడులకు పాల్పడింది. మధ్యధరా సముద్రం అమెరికాకి పరాయిది. అది లిబియాకి స్వంత ఇంటెనక చెరువువంటిది. అయినా అందులో లిబియా నౌకలను సైతం తిరగనివ్వలేదు. అయినా లిబియాను ఆదుకోవడంలో సోవియట్ రష్యా విఫలమైనది. ఔను మరి, ఆఫ్ఘనిస్థాన్ యుద్ధ ఊబిలో గొంతువరకూ దిగి ఓడిపోయిన రష్యా ఇక లిబియాను ఏం ఆదుకోగలదు? ఇలా ప్రారంభమైన రెండవ దశ 10 ఏండ్లకి పైగా (1980-1991) సాగింది. ఇంత గడ్డు పరిస్థితులు, కఠిన ఆంక్షల మధ్య కూడా లిబియా పౌరసమాజం గడాఫీ ప్రభుత్వం ధిక్కార పంథా వెనక ఏకశిలా ఖండంగా నిలబడింది. ప్రచ్ఛన్నయుద్ధ దశ ముగిసిన తర్వాత కూడా లిబియా తన ధిక్కార పంథాను విడనాడలేదు. అమెరికా రూపొందించిన దుష్ట (ధూర్త) రాజ్యాల జాబితాలో సభ్య దేశంగానే కొనసాగింది. మొదటి గల్ఫ్ యుద్ధ కాలంలో (1991) సద్దామ్ ప్రభుత్వానికి బాసటగా నిలబడి మరింతగా అమెరికా ఆగ్రహానికి గురైంది. ఇలా రెండవ దశ 1991 వరకూ కొనసాగింది.

మొదటి గల్ఫ్ యుద్ధం ద్వారా అమెరికా ఏకధ్రువ అగ్రరాజ్యంగా, మరింత స్థిరపడింది. తదనుగుణ్యంగా లిబియా వైఖరి మారసాగింది. దీనితో మూడవ దశ ఆరంభమైంది. ఒకవైపు అమెరికా మీద నిప్పులు కురిపించే పాత విదేశాంగ విధానాన్ని సడలించుకున్నది. పాలస్తీనా పై కూడా నామమాత్ర ఖండనలకే పరిమితమైంది. అదే సమయంలో అమెరికా, యూరప్ సంపన్న రాజ్యాలతో సర్దుబాటు ఒప్పందాలకు తలవంచలేదు. విదేశాంగ విధానానికి ప్రాధాన్యత తగ్గించింది. ఈ మూడవ దశలో 'చల్లబడ్డ గడాఫీ', 'గడాఫీ ప్రభుత్వ మైతక వైఖరి' వంటి వ్యాఖ్యలు తరచుగా వెలువడ్డాయి. దుష్టులపై ధ్వజమెత్తాల్సిన కర్తవ్యం సడలించుకొని దుష్టులకి దూరంగా ఉండాలన్న వైఖరిని చేపట్టింది. అయినా దుష్టరాజ్యాల జాబితా నుంచి లిబియాను తొలగించలేదు. ఆంక్షలను సడలించలేదు. దానివల్ల గడాఫీ ప్రభుత్వానికి కొన్ని కొత్త ఇబ్బందులెదురయ్యాయి. ఒకవైపు ఆంక్షల మధ్య దేశ ప్రజలకి ఆకలి మంటలుంటాయి. అదే సమయంలో వీర జాతీయవాద ప్రేరణవల్ల దేశభక్తియుత ప్రజలు అష్టకష్టాలను అధిగమిస్తారు. గడాఫీ ప్రభుత్వానికి అదీ లేకుండా పోయింది. ఇంకోవైపు ఆంక్షలు తొలగితే చమురు విక్రయం ద్వారా ఒకింత రాజకీయ, ఆర్థిక స్థిరత్వం పెరుగుతుంది. ఇది కూడా లేకుండా పోయింది. ఈ రెండు రకాల ఇబ్బందుల వల్ల లిబియా పౌర సమాజం ఒకరకం స్తబ్దతకు గురైనది. ఈ మూడో దశ కూడా సుమారు పదేండ్ల పాటు (1991-2001) కొనసాగింది.

2001లో జరిగిన న్యూయార్కు ట్విన్‌టవర్స్ పై దాడితో ప్రపంచ పరిస్థితి మరో ముఖ్యమలుపు తీసుకున్నది. 'ఉగ్రవాదంపై నిరంతర యుద్ధం'తో లిబియా వంటి స్వతంత్ర దేశాల మనుగడ మరింత ప్రమాదంలో పడింది. ఒకవైపు తన పౌర సమాజంలో ఏర్పడ్డ స్తబ్దత లాకర్‌బీ కేసు ముద్దాయిల (హేగ్ కోర్టు) భవితవ్యం, ఆంక్షలు, ఆకలి మంటల వంటి సమస్యలను దీర్ఘకాలంగా ఎదుర్కొంటూ వస్తున్నది. మరోవైపు ఉగ్రవాదంపై నిరంతర యుద్ధ ప్రమాదం ముంచుకొచ్చింది. సరిగ్గా అలాంటి పరిస్థితుల్లో అమెరికా మాజీ విదేశాంగ మంత్రి కిసెంజరు తదితర దూతల తెరవెనక దౌత్య ప్రక్రియ ఆరంభమైంది. వివిధ ప్రభుత్వ వేదికలు, చట్టసభలు రెవల్యూషనరీ కమాండ్ కౌన్సిళ్లలో చర్చించింది. తుదకు లాకర్ బీ విమాన ప్రమాద కేసులో పాశ్చాత్య రాజ్యాలతో గడాఫీ ప్రభుత్వం రాజీకి సిద్ధపడింది. దీంతో నాల్గవదశ (2002) ఆరంభమైంది. ఈ నాల్గవ దశ కూడా సుమారు ఎనిమిదేండ్ల పాటు (2002-2010) కొనసాగింది.

2002లోనే లిబియాతో పాశ్చాత్య రాజ్యాల దౌత్య ప్రక్రియ ప్రారంభమైంది. ఈ క్రమంలో 2003 నుంచి ఆంక్షల సడలింపు క్రమం ప్రారంభమైంది. పాశ్చాత్య దేశాలు విధించిన కొన్ని షరతులకి గడాఫీ ప్రభుత్వం అంగీకరించింది. పాశ్చాత్య దేశాల చమురు కంపెనీల ప్రవేశానికి అనుమతించింది. అయితే సౌదీ, కువైట్, బహ్రాయిన్, కతార్, ఒమన్ వంటి గల్ఫ్ దేశాల ప్రభుత్వాల వలే యథేచ్ఛగా అనుమతించడం నిరాకరించింది. 1969లో ఇద్రిస్ రాజరికాన్ని కూలదోశాక లిబియా చమురు వనరులను గడాఫీ ప్రభుత్వం జాతీయం చేసింది. అలా జాతీయం చేసిన ప్రభుత్వరంగ చమురు కంపెనీ సార్వభౌమాధికారానికి లోబడి విదేశీ చమురు కంపెనీలను అనుమతించింది. దీనివల్ల లిబియా చమురు వనరుల మీద విదేశీ కంపెనీలకి గుత్తాధిపత్యం లభించలేదు. కేవలం పర్సంటేజీలూ, కమిషన్లు మాత్రమే లభిస్తాయి. ఇది పాశ్చాత్య రాజ్యాల దృష్టిలో గుడ్డికంటే మెల్ల వంటి మెరుగైంది. అంతకుముందున్న జీరో స్థితి నుంచి తమ స్థితి మెరుగుపడినందుకు పాశ్చాత్య రాజ్యాలు ఆమోదించాయి. దీనికి పరిహారంగా ఆంక్షల సడలింపు క్రమం దశల వారీగా సాగింది. ఫలితంగా లిబియా ఆర్థిక వ్యవస్థ చాలా మెరుగు పడసాగింది.

ఇరాక్‌లో అమెరికా చావు దెబ్బతినడం వల్ల లిబియాలో గడాఫీ ప్రభుత్వానికి చాలా లాభం చేకూరింది. లిబియా చమురు తవ్వకం, నూనెశుద్ధి వ్యవస్థలపై గుత్తాధిపత్యంకై గడాఫీ ప్రభుత్వాన్ని బ్లాక్‌మెయిల్ చేయలేని స్థితిలో అమెరికా పడింది. అమెరికా బడా చమురు కంపెనీల ప్రధాన కేంద్రీకరణ ఇరాక్ మీద ఉంది. అక్కడ సాయుధ ప్రతిఘటన అనూహ్యంగా తలెత్తింది. ఇది అమెరికా ముందుస్తు అంచనాలను తారుమారు చేసింది. అందుకే గడాఫీ ప్రభుత్వానికి బేరసారాల శక్తి

బాగా పెరిగింది. అది కూడా లిబియా ఆర్థిక రాజకీయ రంగాల అభివృద్ధికి దారితీసింది.

ఈ నాల్గవ దశలో మరో ముఖ్య పరిణామం కూడా చోటు చేసుకుంది. ఇరాకీ జాతీయ విమోచనోద్యమం 2005-06 లలో మహోధృతంగా సాగింది. ఆ కాలంలో సంకీర్ణ సైనిక కూటమిలో అంతః కలహాలు పెరిగాయి. ఇతర అనేక అంతర్జాతీయ కారణాల వల్ల ఇ.యు., నాటోలలో అమెరికా పెద్దన్న పాత్ర పట్ల ఫ్రాన్స్ ధిక్కార వైఖరిని ప్రదర్శించింది. ఇరాక్‌లో తమ చమురు కంపెనీలకి అదనపు వాటాకై డిమాండు చేసింది. బుష్‌కు ఎన్నికల నిధులిచ్చిన అమెరికన్ చమురు కంపెనీలు అందుకు అంగీకరించలేదు. ఇరాక్ అణచివేతలో సంకీర్ణ కూటమి ఐక్యతను నిలబెట్టుకునేందుకు ఫ్రాన్స్‌కు ప్రత్యామ్నాయ చమురు వనరులను అమెరికా చూపించక తప్పలేదు. సరిగ్గా అట్టి స్థితిలో లిబియాలోని చమురు తవ్వకాలలో ఫ్రాన్స్‌కు పెద్దపీటను వేసింది. లిబియాలో ఫ్రాన్స్ స్థానం పెరగసాగింది.

1969లో నయావలస పాలకుడైన ఇద్రిస్ రాజు ప్రభుత్వాన్ని కూల్చిన విషయంపైన పేర్కొన్నాం. ఇద్రిస్ రాజు లిబియాలోని ప్రధాన ఆధిపత్య సెనుస్సి తెగస్తుడు. నిమ్న తెగలకి చెందిన సైనికాధికారులే 1969లో సైనిక తిరుగుబాటుకు దిగారు. అలాంటి నిమ్న తెగలలోని గడాఫా తెగకి చెందిన నాయకుడే గడాఫీ. ఈ ఆధిపత్య తెగ సెనుస్సికి చెందిన ప్రజలు బెంఘాజీ నగరం కేంద్రంగా తూర్పు తీరప్రాంతంలో అధికంగా నివసిస్తారు. భారతదేశంలో బ్రాహ్మణ భావజాలం మనం చూస్తున్నదే. ఇండియా వంటి కులవ్యవస్థ లేకపోయినా, సెనుస్సి తెగ ఆధిపత్య భావజాలం నేటికీ లిబియా పౌర సమాజంలో ఏదో ఒక రూపంలో కొనసాగుతున్నది. సెనుస్సి తెగ నుంచి యూరప్ విశ్వవిద్యాలయాలలో ఉన్నత విద్యాభ్యాసం చేసిన వారెక్కువ. పాశ్చాత్య భావజాలం ఈ మేధావల్లో అధికంగా వుంది. పాశ్చాత్య రాజ్యాలతో అంటకాగే మేధావులు కూడా తూర్పు తీరంలోనే ఎక్కువ. చారిత్రకంగా లిబియా తూర్పుతీరంతో ఫ్రాన్స్ ఇటలీలకి రాజకీయ సంబంధాలు ఎక్కువగా ఉన్నాయి. ఇద్రిస్ రాజరిక హయాంలో బెంఘాజీయే దేశ రాజధాని. అది పాశ్చాత్య రాజ్యాలకు పునాదిగా ఉన్నందున ప్రమాదకర మైనదిగా భావించే గడాఫీ ప్రభుత్వం రాజధానిని నిమ్న తెగల ప్రాంతంలోని ట్రిపోలీకి మార్చింది. అదే బెంఘాజీ కేంద్రంగా ఇద్రిస్ రాజరికం నాటి రాజరిక జెండానే తమ జాతీయ పతాకంగా తాజాగా గడాఫీ వ్యతిరేక పోటీ ప్రభుత్వం ఏర్పడడం గమనార్హం.

ఈ నాల్గవ దశ చివరికల్లా లిబియా ఆర్థిక వ్యవస్థ అనూహ్యంగా అభివృద్ధి చెందింది. 2010లో లిబియా తలసరి ఆదాయం 14,880 అమెరికా డాలర్లు. అంటే మన కరెన్సీలో దాదాపు ఏడున్నర లక్షల రూపాయలకి సమానం. ఇది జి-7 కూటమిలోని ఇటలీ కంటే ఎక్కువ. తనను 50 ఏండ్ల పాటు పాలించిన వలసదేశం (ఇటలీ) కంటే తలసరి ఆదాయం ఎక్కువ కావడం చిన్న విషయం కాదు. ఇండియా తలసరి ఆదాయం కంటే 14 రెట్లు ఎక్కువ. లిబియన్ సెంట్రల్ బ్యాంకులో 110 బిలియన్ డాలర్ల నిల్వలున్నాయి. అది మూడేండ్ల పాటు లిబియా దిగుమతులకి సరిపోతాయి. విదేశీ మారక నిల్వలే 70 బిలియన్ డాలర్లున్నాయి. వార్షిక బడ్జెట్‌లో విద్యకి 15 శాతం కేటాయించడం అసాధారణమైంది. పేద ఆఫ్రికా దేశాల ప్రజల పేదరిక నిర్మూలనకై చాలా డబ్బును ఉదార సాయంగా ఇస్తున్నది. దేశంలో అక్షరాస్యత 85 శాతం ఉంది. ఇవి చిన్న విజయాలు కాదు. అయినా ఇవన్నీ లిబియా నాణానికి ఒకవైపువే.

ఈ అభివృద్ధితో పాటు జాన్ పెర్కిన్స్ చెప్పిన తరహా కుట్రలు కూడా పాశ్చాత్య రాజ్యాల నుంచి సాగాయి. తమ చమురు కంపెనీల ఆధారంతో లిబియా ప్రభుత్వంలో పెద్ద తలకాయల కొనుగోళ్లను అవి సాగించాయి. గడాఫీ ప్రాతినిధ్యం వహిస్తున్న లిబియా రాజ్యంలో అవి పాగా వేశాయి. 2008-09లలో గడాఫీ ప్రభుత్వం చేపట్టిన ప్రభుత్వ ప్రక్షాళనే అందుకు నిదర్శనం. సెన్నుస్సి తెగస్తులకు చెందిన ఉన్నతాధికారుల బదిలీ లేదా బర్తరఫ్‌లకై ప్రయత్నాలు జరిగాయి. అయితే ప్రతిఘటన కూడా బలంగానే ఎదురైంది. ఒకవైపు చమురు వనరుల మీద సంపూర్ణాధిపత్యంకై పశ్చిమ రాజ్యాలు ప్రయత్నిస్తుంటే, మరోవైపు సంపూర్ణ జాతీయ రాజ్యంగా కొనసాగిచేందుకు గడాఫీ ప్రయత్నాలు ముమ్మరంగా సాగాయి. ఈ జాతీయ, విజాతీయ శక్తుల మధ్య పరస్పర వ్యతిరేక సంఘర్షణ నిరంతరం కొనసాగుతున్నది. అది కొన్నిసార్లు ముఖాముఖి వివాదంగా బహిర్గతమౌతూనే ఉంది. అయినా పరస్పర అవసరాలే ఈ ఉభయ శక్తులను సహజీవనం చేయించుతున్నాయి.

తామిచ్చిన చమురు తవ్వకపు అవకాశాలను వినియోగించుకొని తమ దేశ ఆంతరంగిక వ్యవహారాలలో అక్రమ జోక్యం చేసుకుంటున్నా యంటూ పాశ్చాత్య రాజ్యాల మీద గడాఫీ ప్రభుత్వం గత కొంత కాలంగా విమర్శలను సంధిస్తున్నది. తమ అండతో ఆంక్షలు ఎత్తి వేయించుకొని, తమను ఏమాత్రం లెక్క చేయడం లేదంటూ గడాఫీ ప్రభుత్వం మీద పాశ్చాత్య రాజ్యాలు కారాలు మిరియాలు నూరుతున్నాయి. వీటి కొనసాగింపుగా ఇటీవల జరిగిన ఈ కింది మూడు ముఖ్య పరిణామాలు కూడా పాశ్చాత్య రాజ్యాలకూ గడాఫీ ప్రభుత్వానికీ మధ్య దూరాన్ని మరింత పెంచాయి.

2008 అక్టోబరు 31 నుంచి నవంబరు 2 వరకూ గడాఫీ మూడు రోజులు రష్యాలో పర్యటించాడు. 1985 తర్వాత రష్యా పర్యటించడం మొదటిసారి, చమురు, నౌకా వాణిజ్య, సైనిక, సాంకేతిక రంగాల్లో ద్వైపాక్షిక ఒప్పందాలు జరిగాయి. లిబియా చెల్లించాల్సిన 4.6 బిలియన్ డాలర్ల పాత బకాయిని రష్యా ప్రభుత్వం మాఫీ చేసింది. కొత్త ఆయుధ ఒప్పందాలను కుదుర్చుకుంది. ఇది పాశ్చాత్య రాజ్యాలనూ, ముఖ్యంగా అమెరికానూ బాగా రెచ్చగొట్టింది.

లాకర్ బీ విమాన ప్రమాద నష్టపరిహారం చెల్లింపుకు ప్రతిఫలంగా హేగ్ న్యాయస్థానం లిబియన్ ప్రభుత్వాధి నేతలను 2009 ఆగస్ట్‌లో విడుదల చేసింది. వారు విడుదలై లిబియాలో అడుగు పెట్టిన రోజున గడాఫీ ప్రభుత్వం జాతీయ పర్వదినంగా పరిగణించింది. లక్షలాది ప్రజలను ఉత్తేజపరిచింది. పాశ్చాత్య రాజ్యాల మీద నిప్పులు కక్కింది. తాము దయతో క్షమాభిక్ష పెట్టినప్పటికినీ, గడాఫీకి కృతజ్ఞత లేకపోయిందంటూ పాశ్చాత్య రాజ్యాలు మండిపడ్డాయి. ఇదికూడా దూరాన్ని పెంచింది.

ఐక్య రాజ్యసమితి 64వ వార్షికోత్సవ సర్వసభ్య సభ 2009 సెప్టెంబరు 29న న్యూయార్కులో జరిగింది. దీనికి లిబియా తరఫున స్వయంగా గడాఫీయే హాజరయ్యాడు. గడాఫీ అమెరికా సందర్శించడం

ప్రపంచంలో ఇటీవల సాగుతున్న పరిణామాలను విశ్లేషిస్తున్నారు **నోమ్ ఛామ్‌స్కీ**

# నిప్పుల కుంపటిపై అరబ్ ప్రపంచం

**జ**నవరి 27, 2011 నాడు అల్ జజీరా ఒక ప్రకటనలో అరబ్ ప్రపంచం ప్రస్తుతం నిప్పులకుంపటిపై ఉందని, పాశ్చాత్య స్నేహబృందాలు త్వరితంగా తమ ఆధిపత్యాన్ని విడుచుకుంటున్నాయని తెలిపింది.

బాంబులాంటి ఈ వార్త వెలువడుతున్న సందర్భంలోనే ఒకవైపు ట్యునీషియా ప్రజలను నిరాటంకంగా పాలించి నియంతగా మారిన బెన్ అలీ దేశం విడిచి పారిపోయాడు. మరోవైపు పాశ్చాత్య దేశాల అండతో సుదీర్ఘకాలంగా పాలన సాగిస్తున్న ఈజిప్ట్ అధినేత హోస్నీ ముబారక్ తన ప్రజల చేత 'ఛీ' కొట్టించుకుని గద్దె దిగిపోవడం అనివార్యమైంది.

ఈ సంఘటనలను క్షుణ్ణంగా చూస్తున్న పరిశీలకులు వీటిని 1989లో రష్యా దేశాల పతనంతో పోలుస్తున్నారు. కాని గోర్బచెవ్ లాంటి వ్యక్తులు, అరబ్ నియంతలకు మద్దతిచ్చే వారు ఇప్పుడు లేకపోవడం ఓ యథార్థం. కాని అమెరికా, దాని మిత్రబృందం మాత్రం ఆర్థిక, వ్యూహాత్మక అంశాలు తమకు అనుకూలంగా ఉన్నంత కాలం ప్రజాస్వామ్య రక్షణ కోసం మద్దతిస్తామంటున్నాయి. బాగుందనడం తమ తమ దేశాల్లో గాక శత్రుదేశాల సరిహద్దుల్లో అని అర్థం.

1989 పోలికకూడా కొంత విలువుందని భావించాలి. తూర్పు యూరప్ పాలకుల్లో అత్యంత దుర్మార్గుడైన రొమేనియాకు చెందిన నికోలా సెసెక్యూకు కూడా పదవీచ్యుతుడయ్యేంతవరకు మద్దతిచ్చిన అమెరికా – అతడు గద్దె దిగిపోగానే దాన్ని చారిత్రక సంఘటనగా పేర్కొన్నది. గత చరిత్రనంతా తుడిచేసింది.

అదొక పకడ్బందీ విధానం. ఫెర్డినాండ్ మార్కోస్ జీన్‌క్లాడ్ దు వాలియర్, చున్ ద హవాన్, సుహార్తో... మరెందరో గజదొంగలు. ఇదే విధానం ప్రస్తుతం హోస్నీ ముబారక్ విషయంలోనూ జరుగుతూ తదనంతరం అతని వారసుని ఎంపిక కూడా ఓ క్రమ పద్ధతిలో జరిగే అవకాశముంది.

చిరకాలంగా ఇంటెలిజెన్స్ విభాగానికి అధిపతిగా అధికారం చలాయించిన జనరల్ ఒమర్ సులేమాన్ ఇటీవలే ఉపాధ్యక్షునిగా నామినేట్ చేయబడ్డాడు. ఇతడు కూడా ముబారక్‌లాగే ప్రజాగ్రహానికి గురయ్యాడు.

రాజకీయ పరిశీలకుల అంచనా ప్రకారం ఇస్లాం తీవ్రవాద

అదే మొదటిసారి. ఆ సభలో మొత్తం 96 నిమిషాల పాటు సాగించిన గడాఫీ సుదీర్ఘ ప్రసంగం పాశ్చాత్య రాజ్యాల ద్వంద్వ వైఖరిని తూర్పార పట్టింది. యు.ఎన్.కౌన్సిల్ అంటే టెర్రర్ కౌన్సిల్' అని వ్యాఖ్యానించాడు. నేరస్తుల విచారణ పేరిట సాగే అంతర్జాతీయ న్యాయస్థానాన్ని ఆటవికమైందిగా విమర్శించాడు. 'ఉగ్రవాదం అగ్రరాజ్యాలదే' అన్నాడు. అగ్రరాజ్యాల ఉగ్రవాదాల ఫలితంగా పుట్టిన తాలిబన్ల పట్ల తనకు సానుభూతి ఉందన్నాడు. సొమాలియా పైరేట్ల చర్యలను అగ్రరాజ్యాల నుంచి ఆత్మరక్షణ చర్యలుగా అభివర్ణించాడు. ఆనాటి వేదికను వెనుజులా, క్యూబా, ఉత్తర కొరియా వంటి ధిక్కార దేశాల అధినేతలతో సమన్వయాన్ని సాధించుకునేందుకు గడాఫీ ఉపయోగించుకున్నాడు. పై మూడు పరిణామాలు పాశ్చాత్య రాజ్యాల కడుపుమంటను మరింత పెంచాయి. ఈ నేపథ్యం నుంచి తాజా లిబియా పరిణామాలను పరిశీలించాలి.

లిబియా రాజ్యంలో ఒక విచ్ఛిన్నకర చీలికను పాశ్చాత్య రాజ్యాలు సిద్ధం చేసుకున్నాయి. ఇది ఒక్క రోజులో జరిగేది కాదు. ఇదో దీర్ఘ క్రమంగా సాగింది. అయితే అరబ్బు దేశాలలో ప్రజా ఉద్యమాలు వెల్లువెత్తిన సందర్భాన్ని అవి ముహూర్తంగా ఎంచుకున్నాయి. ఈజిప్టు నియంత ముబారక్ గద్దె దిగిన (ఫిబ్రవరి 11) నాలుగో రోజే (ఫిబ్రవరి-15) లిబియా ముఖ్య సైనిక ఉన్నతాధికార్లు కొందరు ఫిరాయించారు. మూడు రోజుల వ్యవధిలో కొందరు క్యాబినేట్ మంత్రులతో సహా చమురు కంపెనీ అధికార్లు, కొందరు విదేశీ రాయబార్లు ఫిరాయించారు. దేశంలోని సగం వైమానిక, నౌకాయుద్ధ, సైనికకేంద్రాలు వారికి కైవసమయ్యాయి. వారిచే బెంఘాజీ నగర కేంద్రంగా పోటీ ప్రభుత్వం ఏర్పడింది. దీన్ని ఫ్రాన్స్ ప్రభుత్వం వెంటనే గుర్తించింది.

మిగిలిన అరబ్బు దేశాలకు భిన్నంగా లిబియాలో రాజ్యమే నిట్ట నిలువుగా చీలిపోయింది. రెండు వైపులా శతఘ్నులు, క్షిపణులు, ట్యాంకులు కలిగి ఉన్న సైన్యాల మధ్యయుద్ధం సాగుతున్నది. తొలుత ఆకస్మిక ఫిరాయింపులతో షాక్ తిన్న గడాఫీ ప్రభుత్వం క్రమంగా పుంజుకున్నది. పోటీ ప్రభుత్వ మనుగడ ప్రమాదంలో పడుతుండడంతో పాశ్చాత్య రాజ్యాలను అగ్ని పరీక్షకు గురిచేసింది. తాము పెంచి పోషించిన పోటీ ప్రభుత్వ రక్షణకై అవి యుద్ధానికి దిగాల్సి వచ్చాయి. లిబియాపై తాజా యుద్ధోన్మాద దాడులకు నేపథ్యమిదే!

*(రచయిత ఐ.ఎఫ్.టి.యు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)* వీ

ప్రమాదం వల్ల ఆచరణలో ప్రజాస్వామ్యానికి వ్యతిరేకత చలామణీ అవుతుంది. అయితే సరియైన పునాది లేకుండా చేసే ఈ వాదన తప్పుదారి పట్టించేదే. అరబ్ దేశాలు ఎక్కడ స్వతంత్రంగా ఉంటాయో ననేదీ అసలు భయం. నిజానికి లౌకిక జాతీయవాదాన్ని అడ్డుకోవడానికి అమెరికా, దాని మిత్రదేశాలు ఇస్లామిక్ తీవ్రవాదులకే మద్దతు ఇస్తూ వచ్చారు.

మనకు తెలిసిన ఓ ఉదాహరణ – ఇస్లాం తీవ్రవాదానికి కేంద్రమైన సౌదీ అరేబియా. ఈ అంశానికి సంబంధించిన పొడవాటి జాబితాలో మరోపేరు జియా ఉల్ హక్. సౌదీ అరేబియా ఆర్థిక మద్దతు పొందినవాడు. అమెరికా అధ్యక్షుడు రీగన్‌కు ప్రియమైనవాడు. క్రూర నియంతల్లో ఒకడు. పాకిస్తాన్‌లో ఇస్లాం తీవ్రవాదానికి గట్టి పునాదులు వేసిన వాడు జియా ఉల్ హక్.

మన ముందుకు తేబడుతున్న సంప్రదాయవాదం మాత్రం 'అరబ్ ఇంటా బయటా బాగుంది. ప్రశాంతంగా ఉంది. ఏ పొరపాటూ లేదని' చెబుతుంది. దీన్ని బలంగా ప్రచారం చేస్తున్న వ్యక్తి, మధ్య ఆసియా కార్నెజ్ పరిశోధనా కేంద్రం డైరెక్టర్, జోర్డాన్ అధికారి అయిన మర్వా మషర్. ఈ వాదాన్ని, ఈ ఆలోచనను ఆధారం చేసుకొని అరబ్ వ్యతిరేకులు, బయటివారు ఇక్కడి పరిస్థితులను అతిశయోక్తులుగా వర్ణిస్తున్నారని బలమైన శక్తులు అనడం గమనార్హం.

కాబట్టే ప్రజలు తిరస్కరించబడ్డారు. ఈ సిద్ధాంతం మరీ వెనక్కు వెళ్లి ప్రపంచవ్యాప్తమనే గాక అమెరికా గడ్డపై కూడా దీన్ని సాధారణ అంశం చేశారు.

అలజడుల సందర్భంగా వ్యూహాత్మక మార్పులు అవసరమవుతుంటాయని, అన్ని రకాల శక్తుల్ని నియంత్రించే దిశలోనే ఆ మార్పులు జరుగుతుంటాయంటారు.

జూలై 2009లో వికీలీక్స్ విడుదల చేసిన కేబుల్లో అమెరికా రాయబారి రాబర్ట్ గాడెక్ అంచనాల ప్రకారం ట్యునీషియాలో జరుగుతున్న అసమాన ప్రజాస్వామ్య ఉద్యమం. ఇది పోలీస్ రాజ్యానికి వ్యతిరేకంగా సాగుతున్నది. ఏ మాత్రం భావ ప్రకటన స్వేచ్ఛలేని అశేష ప్రజావ్యతిరేకత. ఇది పౌరహక్కులకు సంబంధించిన సమస్యపై యుద్ధం. ఇది చిరకాలం ట్యునీషియాను తన కుటుంబ పాలనలో అతి క్రూరంగా పాలన చేసిన నియంత అలీకి వ్యతిరేకంగా ఉప్పొంగిన ప్రజా ఉద్యమం.

వికీలీక్స్ ఈ వార్తా ప్రచారం నిద్రపోతున్న అమెరికన్ అధికారులకు మేలుకొలుపని ఆ దేశ ప్రజలు భావిస్తున్నారు. ఆ విధానాలు అమెరికాకు ఎంత అనుకూలంగా ఉన్నాయంటే ఆ వార్త సందేశాలను స్వయాన అధ్యక్షులు ఒబామానే బహిర్గత పరిచాడా? అన్నట్లున్నాయి. దీన్నే 'ది నేషనల్ ఇంట్రెస్ట్' పత్రికలో జాకబ్ హెల్‌బ్రన్ రాస్తాడు.

మరో అడుగు ముందుకేసి విదేశీ వ్యవహారాల ప్రధాన విశ్లేషకుడైన గొడెన్ రచ్‌మన్ ఫైనాన్షియల్ టైమ్స్‌వో వికీలీక్స్ వ్యవస్థాపకుడు అస్సాంజేకు ఒక పతకాన్ని బహుకరించాలని ప్రధానకర్తగా రాశాడు. ఇంకా అదే పత్రికలో అతడు రాస్తూ అమెరికా విదేశీ విధానం నియమ నిబద్ధతతో ముందుకెళ్తుందని, ప్రజా సమస్యల పట్ల అమెరికా తీసుకునే నిర్ణయం సాధారణంగా ప్రైవేట్ నిర్ణయానికి సరిసమానమే.

ఈ విషయంలో అమెరికా బృహత్తర ఆశయాలను కుట్ర పూరితంగా ప్రశ్నించే సిద్ధాంతకర్తల విధానాల్ని వికీలీక్స్ ఖాతరు చేయడం లేదు.

ఇంకా ముందుకెళ్లి పరిశీలించకుంటే ఈ విషయాలను గొడెర్ కేబుల్ మద్దతునిస్తున్నదనిపిస్తుంది. విదేశీ వ్యవహారాల విశ్లేషకుడైన స్టిఫెన్ జూన్ నివేదిక ప్రకారం ట్యునీషియాకు సైనిక సహాయం కింద అమెరికా పన్నెండు మిలియన్ డాలర్ల సహాయం చేసింది. అమెరికా నుంచి సహాయం పొందే ఐదుగురు లబ్దిదారుల్లో ట్యునీషియా ఒకటి. మరో నాలుగు ఇజ్రాయెల్ (రొటీన్), మధ్య ఆసియా నియంతలు, ఈజిప్ట్, జోర్డాన్, కొలంబియా. ఇవన్నీ చాలాకాలంగా అమెరికా సహాయం పొందుతూ మానవ హక్కులను కాలరాస్తున్న శక్తులే.

ప్రజా బాహుళ్యం ఈ విషయాల్లో ఏమనుకుంటుందో చెప్పకనే మనకు తెలుస్తున్న విషయం. ఆగస్ట్‌లో బ్రుకింగ్ సంస్థ నిర్వహించిన ఎన్నికల్లో అమెరికా, పాశ్చాత్య వ్యాఖ్యాతలు చాలా మందిలో కొన్ని అరబ్ దేశాలు ఏకీభవించే విషయం – ఇరాన్‌తనోరీ ముప్పు (పది శాతం), కాని మిగతా వాటితో పోల్చి చూస్తే, అమెరికా, ఇజ్రాయెల్‌లే ప్రధాన కవ్వింపుదారులు (77 శాతం, 88 శాతం).

ఒకవేళ ఇరాన్ అణ్వాయుధాలను పెంచుకుంటే అమెరికా విధి విధానాలతో భయం లేదనేది మెజారిటీ అరబ్బుల ఆలోచన (57 శాతం). ఇంకా – అంతా బాగుంది. ఏం భయం లేదని చెబుతున్నా మషర్ అభిప్రాయం జరుగుతున్న పరిణామాల్లో ఓ ఊహాజనితమే. వాళ్ల ప్రజలను పట్టించుకోకుండా వాళ్లు వాళ్ల శృంఖలాలను తెంచుకోకుండా ఉండి, విధి విధానాలు సర్దుబాటు అవుతుంటే నియంతలు మాకు మద్దతిస్తారు.

ఇతరేతర వెల్లడైన విషయాలు కూడా అమెరికా ధీరోధాత్తతకు మద్దతు పలుకుతున్నట్లు తెలుస్తున్నది. ఓండురాస్ అధ్యక్షుడు మాన్యుయెల్ యెల్ జెయల గద్దెదిగిపోవడానికి జూన్ 28న సంభవించిన రాజ్యాంగ, న్యాయ విషయాలే కారణమని తమ పరిశీలనలో తేలినట్లు ఆ దేశ రాయబారి హుగో లారెన్స్ తెలుపడం గమనించాలి.

రాయబార కార్యాలయం కూడా, చివరకు జూన్ 28నాడు సంభవించిన చట్టవ్యతిరేక, రాజ్యాంగ వ్యతిరేకతలకు ఆ దేశ సైన్యం, సుప్రీంకోర్టు, జాతీయ కాంగ్రెస్‌లు కలిసి కుట్ర పన్నాయని, లాటిన్ అమెరికా, యూరప్‌లకు వ్యతిరేకమైనా ఫర్వాలేదని ఒబామా – ఈ తిరుగుబాటును సమర్థించాడు. ఆపై జరిగే పరిణామాలను కూడా వ్యతిరేకించాడు.

వాస్తవాంశాలను బయటకు తీసే విషయంలో పాకిస్తాన్ విదేశీ విధానం గురించి విశ్లేషించడం వికీలీక్స్ బయటపెట్టిన విషయాల్లో ప్రధానమైనది.

ఆ వార్తలు బయటపెట్టే నిజాల్లో మరొకటి పాకిస్తాన్, అఫ్ఘనిస్తాన్‌ల లోని అమెరికా యుద్ధ వ్యతిరేక శక్తులపై యుద్ధాన్ని ఉధృతం చేయడం అంటే పాకిస్తాన్ ప్రభుత్వాన్ని అస్థిరపరచడం. ఇస్లాం తీవ్రవాదుల చేతుల్లోకి అణ్వాయుధాలు పోతాయనే భయోత్పాతం కలిగించే వాదన.

మళ్లీ ఈ రహస్యాలను బహిర్గతం చేస్తూనే అధికారులు అప్రమత్తంగానే ఉన్నారని తలంపు కలిగించడం – అమెరికా వినాశనం వైపు నిరాటకంగా పయనిస్తుందని ప్రకటించడం కొసమెరుపు.

*(అనువాదం : ఎనిశెట్టి శంకర్)* వీ

*ఎన్ని ఆటంకాలూ, అవరోధాలూ కల్పించినా, నిర్బంధించినా తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు ఆకాంక్షతో నిర్వహించిన మిలియన్ మార్చ్ విజయవంతమైందని అంటున్నారు* **ఎస్. కిశోర్ కుమార్**

# 'మిలియన్ మార్చ్'కు కోటి వందనాలు...

ఈజిప్ట్‌లోని తెహ్రీర్ స్క్వేర్ వద్ద జరిగిన మిలియన్ మార్చ్‌ను ఆదర్శంగా తీసుకుని తెలంగాణ రాష్ట్రం కోసం పోరాడుతున్న సంస్థలన్నిటికీ నాయకత్వం వహిస్తున్న తెలంగాణ రాజకీయ ఐక్య కార్యాచరణ సమితి (ఐకాస) ఛైర్మన్ ప్రొ. కోదండరాం హైదరాబాద్‌లోని ట్యాంక్‌బండ్ వేదికగా మార్చి 10న 'తెలంగాణ మిలియన్ మార్చ్' నిర్వహించాలని తెలంగాణ ప్రజలకు పిలుపునిచ్చినప్పుడు కొందరు తెలంగాణ వ్యతిరేకులు స్పందిస్తూ, 'ఈజిప్ట్‌లో జరిగిన మిలియన్ మార్చ్‌ను ఎలా ఆదర్శంగా తీసుకుంటారు. అక్కడ ఉన్నది నియంతృత్వ పాలన, ఇక్కడ ఉన్నది ప్రజాస్వామ్య పాలన కదా!' అని వ్యంగ్యోక్తులు విసిరారు.

కేంద్ర, రాష్ట్రాలకు చెందిన వేలమంది సాయుధ పోలీసులు తెలంగాణ వ్యాప్తంగా (కేవలం హైదరాబాద్ నగరంలోనే ముప్పై వేల మంది పోలీసులు) మోహరించి మార్చి 10న ట్యాంక్‌బండ్‌పై జరిగే తెలంగాణ మిలియన్ మార్చ్‌లో పాల్గొనడానికి సన్నద్ధమవుతున్న, తరలివస్తున్న లక్షలాది మంది ప్రజలను అడుగడుగునా అడ్డుకుని, నిర్బంధించిన వైనం, ఈ దేశంలో భారత రాజ్యాంగం పౌరునికి ప్రసాదించిన స్వేచ్ఛ, ప్రాథమిక హక్కులపై అడుగడుగునా విచక్షణారహితంగా లాఠీఛార్జీ జరిగిన వైనం చూస్తే ఈజిప్ట్‌ను మించి ప్రజాస్వామ్యం ముసుగులో దాగున్న నియంతృత్వం తెలంగాణ ప్రాంతంలో బహుశా వారికి కనిపించే ఉంటుంది.

మిలియన్ మార్చ్‌లో పాల్గొనడానికి ట్యాంక్‌బండ్ వద్దకు తరలివస్తున్న తెలంగాణ వాదులను అడ్డుకుని, అదుపులోకి తీసుకుని, నిర్బంధించే క్రమంలో పోలీసులు ఆరేళ్ల బాలుడిని కూడా వదలలేదు. "నేను సైతం..." అంటూ మిలియన్ మార్చ్‌లో భాగస్వామి కావడానికి తన తల్లితో పాటు వచ్చిన ఆరేళ్ల బాలుడిని పోలీసులు తల్లి నుంచి వేరు చేసి అదుపులోకి తీసుకుని తమ వాహనంలోకి పడేశారు. ఒకపక్క భయకంపితుడైన ఆ బాలుడి రోదన, మరోపక్క బిడ్డ కోసం పోలీసులను వేడుకుంటూ ఆ తల్లి కన్నీరుమున్నీరు. ఇంక పోలీసులు బాలుడిని వదిలిపెట్టి తల్లి వద్దకు చేరుస్తారనుకుంటే ఆశాభంగమే ఫలితమైంది. అత్యంత కఠినమైన ఆదేశాల మేరకు తెలంగాణ ఉద్యమ అణచివేత లక్ష్యంగా పనిచేస్తున్న పోలీసులకు పసిబాలుడిని కూడా విడిచిపెట్టేందుకు మనసు ఒప్పలేదు. చివరకు పోలీసులు తల్లిని కూడా అదుపులోకి తీసుకుని బిడ్డ వద్దకు చేర్చారు. ప్రభుత్వాలు తెలంగాణ ఉద్యమంపై అవలంబిస్తున్న నియంతృత్వం ధోరణిలో కడకు ఇదే మనకు కనిపించిన మానవత్వం.

మిలియన్ మార్చ్‌ను విఫలం చేసి తద్వారా తెలంగాణ వాదాన్ని, ఉద్యమాన్ని బలహీనపరిచే ఏకైక లక్ష్యంతో తీవ్రమైన కృషి చేసిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అంతిమంగా ఘోరమైన భంగపాటును మూటగట్టుకున్నాయి. తెలంగాణ మిలియన్ మార్చ్‌కు వేదికగా నిలచిన ట్యాంక్‌బండ్‌ను ప్రభుత్వం ఆనాడు పూర్తిగా తమ అధీనంలోకి తీసుకుంది. అటువైపు వెళ్లే దారులన్నిటినీ పొద్దు పొడవక ముందే మూసేసింది. రాజధాని నగరవ్యాప్తంగా 144 సెక్షన్ విధించింది. తెలంగాణ వ్యాప్తంగా విస్తృతంగా సోదాలు నిర్వహించింది. అయితే దశాబ్దాలుగా న్యాయపోరాటం సాగిస్తున్న తెలంగాణ ఉద్యమకారులకు ఇవేవీ అడ్డుకాలేదు. ప్రజల ఆకాంక్షల ముందు ప్రభుత్వ ఆంక్షలు తలదించుకున్నాయి. ఇంతటి నిర్బంధాన్ని ఎదుర్కొని కూడా ప్రజలు పెద్దఎత్తున ట్యాంక్‌బండ్ పైకి దూసుకువెళ్లారు. అంతేకాదు, ప్రభుత్వాలు ఒక్క వేదికకు అడ్డంపడితే అది ఫలించక పోగా మిలియన్ మార్చ్‌కు తెలంగాణ వ్యాప్తంగా లక్ష వేదికలు తయారయ్యాయి. వాటిలో ప్రభుత్వ కార్యాలయాలు, పోలీసు స్టేషన్లు కూడా భాగమయ్యాయి. ట్యాంక్‌బండ్ వద్దకు తరలివస్తున్న తెలంగాణ ఉద్యమకారులను ఈ ప్రభుత్వం ఎక్కడ అడ్డుకుంటే, ఎక్కడ నిర్బంధిస్తే అక్కడే మిలియన్ మార్చ్‌కు వేదికగా చేసుకుని వారంతా తెలంగాణ సాధన కోసం హృదయపూర్వకంగా ప్రతిజ్ఞ చేశారు. జై తెలంగాణ నినాదాలతో, ఆటపాటలతో తెలంగాణ తల్లికి నీరాజనాలర్పించారు. తెలంగాణ మిలియన్ మార్చ్ కార్యక్రమం ప్రధాన ఉద్దేశానికి పూర్తి న్యాయం చేకూర్చారు. మిలియన్ మార్చ్ కార్యక్రమాన్ని విజయవంతం చేశారు. అందుకే తెలంగాణ మిలియన్ మార్చ్‌కు కోటి వందనాలు.

ట్యాంక్‌బండ్‌పై జరిగిన మిలియన్ మార్చ్ సందర్భంగా అక్కడ ఉన్న కొన్ని విగ్రహాలపై దాడి జరిగింది. 1986లో అప్పటి తెలుగుదేశం పార్టీ ప్రభుత్వం ఆధ్వర్యంలో ట్యాంక్‌బండ్‌పై నెలకొల్పిన 33 విగ్రహాలలో అధికశాతం సీమాంధ్ర ప్రాంతానికి చెందిన వైతాళికులవే ఉన్నవన్న భావన తెలంగాణ ప్రజలలో చాలా కాలంగానే ఉంది. అనేక సందర్భాలలో అది బహిర్గతమైన విషయమే. ప్రభుత్వాలు తెలంగాణ ప్రజల మనోభావాలను గుర్తించి సరియైన సమయంలో ఈ సున్నితమైన అంశంపై స్పందించి సానుకూలంగా, న్యాయబద్ధంగా, నైతికంగా వ్యవహరించి ఉంటే ఈ అనర్థానికి చోటు దక్కేది కాదు. కాని ఆ దిశగా గత రెండున్నర దశాబ్దాలుగా ఏనాడూ అడుగుల సవ్వడి లేదు. రాజకీయ అవసరాల కోసం, ఉనికి ఆధిక్యత కోసం విగ్రహాల విషయంలో ప్రభుత్వాలు ఆది నుంచి వివక్ష చూపించిన తీరునూ, స్వంత గడ్డపై

తెలంగాణ వైతాళికులకు కనీసం సమ ప్రాధాన్యత కూడా లభించలేదనే వాస్తవాన్ని జీర్ణించుకోలేని పాతిక సంవత్సరాల న్యాయమైన భావోద్వేగాల శక్తులు సంఘటితమై మిలియన్ మార్చ్ వేదికగా మానసికంగా సాహసించి విగ్రహాలపై ప్రతీకార చర్యకు పూనుకున్నాయి. అది నిజంగా విధ్వంసమే ఐతే, సీమాంధ్ర ఆధిపత్య ప్రభుత్వాల ఏలుబడిలో తెలంగాణ వైతాళికుల విగ్రహాలకు ఇంతకాలం కలిగిన స్థానరాహిత్యాన్ని మొదటి, అధికారిక విధ్వంసంగా భావించాల్సిందే.

ఆరాధింపబడే మహనీయుల విగ్రహాలకు ఈ దుర్గతి పట్టిందా...! అంటూ ట్యాంక్‌బండ్ ఘటనపై ఆవేదన చెందిన వారు, మనస్తాపానికి గురయిన నిజాయితీపరులు ప్రాంతాలకతీతంగా ఉన్నారు. వారిని మినహాయిస్తే, తెలంగాణ ఉద్యమంపై కక్షగట్టిన కొన్ని శక్తులు ఈ ఘటనను సాకుగా తీసుకుని తమ శక్తిమేరకు గగ్గోలు పెడుతున్నాయి. ప్రసార మాధ్యమాలను, చట్ట సభలను వేదికగా చేసుకుని గుండెలు బాదుకుంటున్నాయి. మొసలి కన్నీరు కారుస్తున్నాయి. శాంతియుతంగా సాగుతున్న తెలంగాణ ఉద్యమానికి పరీక్ష పెడుతున్నాయి. ప్రజలను పక్కదారి పట్టించే ప్రయత్నం చేస్తున్నాయి. ఆ దుష్టశక్తులు మరెవరో కాదు. సాక్షాత్తూ తమ మూల చరిత్రనే భూస్థాపితం చేసిన ఘనులు, అక్టోబర్ 1 వారసులు.

1950 జనవరి 26న భారత రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత భారతదేశంలో రెండు తెలుగు రాష్ట్రాలు ఏర్పడ్డాయి. వాటిలో ఒకటి, ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్న తెలుగు ప్రాంతం 1953 అక్టోబర్ 1న ఆంధ్ర రాష్ట్రంగా అవతరించగా, రెండవది, దేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో భాగంగా, కొంత మంది స్వార్థపరుల నుంచి వచ్చిన తీవ్రమైన ఒత్తిడి మేరకు కేంద్ర ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్రాన్ని, ఆనాటి హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగాణ ప్రాంతాన్ని (సమస్త తెలంగాణ ప్రాంత జనసామాన్యం ఆకాంక్షలకు, మనోభావాలకు పూర్తి విరుద్ధంగా, చట్టబద్ధ సంస్థల నివేదికలకు అతీతంగా) కలుపుతూ 1956 నవంబర్ 1న 'ఆంధ్రప్రదేశ్' పేరుతో రాష్ట్రాన్ని ఏర్పాటు చేసింది. ఆ రోజుతో ఆంధ్ర రాష్ట్రం అంతరించిపోయింది.

1953లో ఏర్పాటైన ఆంధ్ర రాష్ట్రం, 1956లో ఏర్పాటైన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల భౌగోళిక స్వరూపాలు ఒకటి కావు. పైగా ఆంధ్ర రాష్ట్రం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అనేవి పర్యాయపదాలు అంతకన్నా కావు. ఆంధ్ర రాష్ట్రం భౌగోళిక స్వరూపానికి ఆంధ్రప్రదేశ్ అని నామకరణం జరగలేదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటు ఆంధ్రరాష్ట్రం పొడిగింపు లేదా విస్తరణలో భాగం అంతకన్నా కాదు. మరి అలాంటప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఆంధ్ర రాష్ట్రంగా ఉచ్చరించే హక్కు ఎక్కడిది? ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ దినోత్సవం నవంబర్ 1న ఆంధ్ర రాష్ట్ర అవతరణ దినోత్సవం అని పలికే హక్కు ఎవరికైనా ఎక్కడిది? అలా పలుకుతూ సంబరపడే వారి అనైతికతను ఏమనాలి? అది అజ్ఞానమను కోవాలా? మూర్ఖత్వమనుకోవాలా? వారి అతితెలివికి నిదర్శన మనుకోవాలా?

1912-1913 నుంచి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని తెలుగు ప్రాంత ప్రజల ఆకాంక్షలకు, బలమైన ప్రయత్నాలకు తోడుగా సుదీర్ఘకాల ఐక్య ఉద్యమాలకు, ఎంతోమంది జీవితాల త్యాగాలకు ఫలితంగా 1953 అక్టోబర్ 1న ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. అయితే అక్టోబర్ 1 కేవలం ఆంధ్ర రాష్ట్ర అవతరణ దినోత్సవం మాత్రమే కాదు, ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి విడిపోవడానికి అక్కడి తెలుగు ప్రాంత ప్రజలు సుదీర్ఘకాలం పాటు చేసిన ఆత్మగౌరవ పోరాటాలకు విజయం వరించిన రోజు, ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో తమిళుల చేతిలో దశాబ్దాలుగా అవమానాలకు గురయిన తెలుగు ప్రాంత ప్రజలు విముక్తి పొందిన రోజు, స్వేచ్ఛావాయువులు పీల్చుకున్న తొలిరోజు, వారి ఆత్మగౌరవానికి ప్రతీకగా నిలచి, వారికి స్ఫూర్తిని ప్రసాదించిన సుదినం. ఆ "సుదినం" స్మరించుకోవడానికి ఎన్నడూ నోచుకోలేదు. అది ఏనాడో కనుమరుగైపోయింది.

చరిత్రలో ఒక ప్రత్యేక దినంగా నిలచిన అక్టోబర్ 1వ తేదీని కనీసం ఏ రూపేణా స్మరించుకోకుండా కాలగర్భంలో కలిపేసిన వారు, మానవ ప్రపంచ చరిత్రలో ఉద్యమాల స్ఫూర్తికి విఘాతం కలిగించిన వారు, విరుద్ధంగా వ్యవహరించిన వారు, తద్వారా త్యాగధనులను అవమానించిన వారు, సుదీర్ఘకాల పోరాటాలకు గుర్తుగా ఆ ప్రాంతంలో కనీసం ఒక విజయచిహ్నం కూడా నిర్మించుకోని వారు నేడు ట్యాంక్‌బండ్‌పై విగ్రహాలు ధ్వంసమైనాయంటూ గగ్గోలు పెడుతున్నారు. వారి గత చరిత్రను తెరచి తరచి చూస్తే, ఈ గగ్గోలంతా విగ్రహాల మీద అభిమానంతోనా? లేక తెలంగాణ గడ్డమీద తమ ఆధిపత్యం అదుపు తప్పుతోందని ఆక్రోశమా? అనేది అర్థం చేసుకోవచ్చు.

1937లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల మధ్య జరిగిన శ్రీబాగ్ ఒడంబడిక ప్రకారం 1953లో ఆంధ్ర రాష్ట్ర అవతరణ సందర్భంగా కర్నూలును రాజధానిగా చేయడంలో ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల మధ్య సయోధ్య సాధన కోసం మధ్యవర్తిత్వం వహించి టంగుటూరి ప్రకాశం పంతులుకు ఆనాడు ఘనమైన అవమానమే జరిగింది. స్వాతంత్ర్య సమరంలో బ్రిటిష్ వారి తుపాకులకు తన గుండెను ఎదురుంచి 'ఆంధ్రకేసరి' బిరుదాంకితుడైన ప్రకాశం పంతులు గౌరవార్థం ఆయన బతికున్నప్పుడే విజయవాడలో నిర్మించిన విగ్రహాన్ని కాస్తా పగులగొట్టి ఏలూరు కాలువలో పారేసి అవమానించారు. వ్యక్తిగతంగా సంబంధిత హెచ్చరికలు ఆయనకు ముందస్తుగానే జారీ చేసి వ్యూహాత్మకంగా ఈ చర్యకు పాల్పడ్డారు నాటి పెద్దలు. నేడు విగ్రహ సంస్కారం గురించి గొంతు చించుకుంటూ ప్రగల్భాలు పలికే వారి పూర్వ చరిత్రలో ఇది ఒక మచ్చుతునక మాత్రమే.

మిలియన్ మార్చ్‌కు వ్యక్తిగతంగా తమ సంఘీభావం తెలపడానికి ట్యాంక్‌బండ్ వద్దకు విచ్చేసిన కాంగ్రెస్ పార్టీ పార్లమెంట్ సభ్యులు కె. కేశవరావు, మధుయాష్కీలపై తెలంగాణ ఉద్యమకారులు భౌతికదాడికి దిగారు. ఈ దాడి దురదృష్టకరం. తెలంగాణ ఉద్యమాన్ని అడుగడుగునా అణచివేసేందుకు కుట్రలు చేస్తున్న ప్రభుత్వాలలో వారు భాగస్వామ్యులై నందుకు వారు తెలంగాణవాదులైనప్పటికీ ప్రజల ఆగ్రహానికి గురికాక తప్పలేదు. ఎంపీలు తమతమ హోదాల పరిధిలో కనీసం కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలను మిలియన్ మార్చ్‌లో భాగస్వామ్యుల్ని చేసినట్లయితే బాగుండేది. కేవలం చుట్టపుచూపు సందర్శన వారి బాధ్యతారాహిత్యాన్ని, నిస్సహాయతను తెలియపరిచింది. మిలియన్ మార్చ్ సందర్భంగా ట్యాంక్‌బండ్ వద్ద మీడియాపై దాడి జరిగింది. ప్రజలకు – ప్రభుత్వానికి, సమస్యలకు – పరిష్కారాలకు వారధిగా నిలిచే మీడియాపై దాడి నిస్సందేహంగా బాధాకరం. వారి వృత్తిధర్మానికి భంగం కలిగించడం అమానుషం.

త్యాగాల పునాదుల మీద నిస్వార్థంగా, న్యాయబద్ధంగా, శాంతియుతంగా సాగుతున్న తెలంగాణ ఉద్యమంలో తప్పుల కోసం దేగ కళ్లతో వెతుకుతున్న తెలంగాణ వ్యతిరేక దుష్టశక్తులకు అవకాశమివ్వకుండా సంయమనంతో ముందుకు సాగుతూ గమ్యాన్ని చేరాల్సిన బాధ్యత ప్రతి తెలంగాణ పౌరుడిపై ఉంది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

***ఉద్యోగుల సహాయ నిరాకరణ తెలంగాణ ఉద్యమానికి స్ఫూర్తిదాయకమనీ, మరింత దృఢంగా కొత్త పద్ధతులతో ముందుకు సాగాలనీ అంటున్నారు*** **కె. ప్రభాకర్**

# తెలంగాణ ఉద్యోగుల పోరాటస్ఫూర్తి

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకోసం పార్లమెంటులో బిల్లు పెట్టాలని డిమాండ్ చేస్తూ 'ఆంధ్రప్రదేశ్' అవతరణవల్ల తెలంగాణ ఉద్యోగవర్గం కోల్పోయిన ముల్కీరూల్స్, 610 జి.ఒ., గిర్‌గ్లాని కమిషన్ అమలు, రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘన, 'ఫేర్‌షేర్' మేరకు సెక్రటేరియట్‌తో పాటు అన్ని డిపార్ట్‌మెంట్లలో తెలంగాణ ప్రజల వాటా కోసం ఫిబ్రవరి17 నుండి మార్చ్ 4 వరకు జరిపిన తెలంగాణ ఉద్యోగ కార్మికుల సహాయ నిరాకరణ పోరాటం చారిత్రాత్మకంగా నిలిచిపోనుంది.

తమ జీతభత్యాలు, ఇంక్రిమెంట్లు సర్వీస్‌రూల్స్ కోసం కొట్లాడే ఉద్యోగ సంఘాలన్నీ అనూహ్యంగా యాభై నాలుగేళ్లుగా 'రాజకీయపార్టీల నాయకుల విద్రోహాలకు తెలంగాణ ప్రజలు కోల్పోయిన కొలువులు, నిధులు, నీళ్లు, విద్య, విద్యుత్, వైద్యతదితర రంగాలతోపాటు విద్యార్థుల అసెంబ్లీ ముట్టడులు, లాయర్ల రాజ్‌భవన్ ఆందోళనలు మొత్తం తెలంగాణ కోట్లాది ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షను ఆకాశానికెత్తింది.

ఏనాడు తమ సమస్యలే తప్ప ప్రజల సమస్యలగూర్చి తమ ఎజెండాలో పెట్టుకోని సంఘాలు, క్యాడర్లు, హోదాలు పక్కనపెట్టి ఏకైక డిమాండ్ తెలంగాణ కోసం గొంతెత్తడం కార్యాలయాల్ని దిగ్బంధించడం, ఆటపాటలు వంటావార్పులు, సభలు సమావేశాలు, ధూంధాంలతో తెలంగాణ పదిజిల్లాలతో పాటు, తెలంగాణ వ్యతిరేక, సీమాంధ్ర నాయకుల మోసపూరిత విధానాలను ప్రపంచానికి చాటడంలో విజయం సాధించారు.  అటెండర్ నుండిగెజిటెడ్ అధికారి వరకు, గ్రామ సచివాలయం నుంచి రాష్ట్ర సచివాలయం వరకుపాలన స్తంభించిపోవడం ఎన్నడూ చూడలేదు. ఏళ్ల తరబడిగా కార్యాలయాల్లో అధికారి, సబార్డినేట్ లాంటి అంతరాలన్నీ వివిధ కార్యాలయాల్లో యాజమాన్యాల్లో పనిచేస్తున్న వివిధ క్యాడర్లకు, కులాలకు, మతాలకు చెందిన ఉద్యోగులంతా ఒక్కటై పదహారురోజుల పాటు ప్రజల్ని, పార్టీలను, పార్లమెంటులను, అసెంబ్లీలను, అవకాశవాదపార్టీలను స్పందింపచేశారు. నిజమైన ప్రజాందోళన ప్రజాస్వామిక పద్ధతుల్లో ఎట్లా సాగాలో తెలంగాణప్రజల ఆకాంక్ష నెరవేర్చడం కోసం ఉద్యోగుల  పోరాటం స్ఫూర్తినిచ్చింది.

నిజానికి ప్రజలను సహాయ నిరాకరణలో ప్రభుత్వాన్ని ఆర్థిక దిగ్బంధనం చేయడం ద్వారా బస్‌లో టికెట్ తీసుకోకపోవడం, విద్యుత్, నీటి బిల్లులు, పన్నులు చెల్లించొద్దన్న పిలుపు రాజకీయపార్టీలు చిత్తశుద్ధితో ప్రచారం చేయడంలో, ప్రజలను సమాయత్తం చేయడంలో వైఫల్యం వల్ల సాగాల్సినంత ఉధృతంగా సాగకపోవడం, ఉద్యోగుల సహాయ నిరాకరణతో సఫలీకృతం అయ్యింది.

అంత ఉవ్వెత్తున తెలంగాణ ప్రజల ఆకాంక్షను ఎలుగెత్తి చాటిన పోరాటం అనూహ్యంగా ఉద్యోగుల, ప్రజల, ఉద్యమకారుల్ని నీరుగార్చే పద్ధతిలో నిలిపివేయడం ఆవేదనను, ఆందోళనను కలిగించింది.

అన్నిజిల్లాల వివిధ సంఘాల నాయకులు మాకు ఓనెలజీతం రాకపోయినా ఫర్వాలేదు, నెలరోజులు  తెలంగాణ ప్రజా పోరాటానికి విరాళమిచ్చినం అనుకుంటం గానీ ఆందోళన విరమించొద్దని చెప్పడం తెలంగాణ పోరాటానికి ఉద్యోగుల, ప్రజల ఆకాంక్షకు పతాకస్థాయిలో నిలిచింది.

సంఘనాయకులు చెపుతున్న కారణాలేవైనప్పటికీ తెలంగాణ కోసం గొంతెత్తి తెలంగాణ ఉద్యోగుల పోరాటానికి సంఘీభావంగా పార్లమెంటులో, అసెంబ్లీలో, ప్రజల్లో బలమైన ఒత్తిడిని పెంచలేకపోవడం, కేంద్రంఅనుసరించిన సాచివేత వైఖరి, మే వరకు ఎట్లాంటి నిర్ణయం రాదన్న సంకల్పంతో, ఉద్యోగవర్గాన్ని పోరాటాన్ని వెనుకకు నెట్టిన, పార్టీలు, ఉద్యోగుల పోరాటస్ఫూర్తితో ప్రజల్ని ప్రజాపోరాటాల్ని, పార్లమెంటుల్ని కదిలించలేకపోవడం అసలు వైఫల్యం. మరొకవైపు ఎన్నో ప్రయోగాలతోనో, జీతాల నిలుపుదల పేరుతోనో ప్రభుత్వం బెదిరించపూనుకోవడాన్ని కూడా ఉద్యోగవర్గం ఖాతరు చేయలేదు, కానీ నాయకత్వం తొందరపాటు నిర్ణయంతో పాటు నాలుగులక్షల ఉద్యోగుల ఆకాంక్షలకు అనుగుణంగా విరమించక పోవడం వల్ల సహజంగానే అక్కడక్కడా నాయకుల దిష్టిబొమ్మలు తగలబడడం, నాయకత్వానికి వ్యతిరేకంగా నిరసనస్వరాలు వినిపించడం, తెలంగాణ ఆకాంక్ష పట్ల ఉద్యోగుల ఆవేదనగా గుర్తించింది కనుకనే పోరాటానికి, విద్యార్థుల ప్రజల విజ్ఞప్తి మేరకు తాత్కాలిక విరమణ ప్రకటిస్తున్నామని అన్నారు. ఏప్రిల్ చివరి నుండి 'సమ్మె'లోకైనా వెళ్తామని ప్రకటించడం ఆచరణ రూపం దాలిస్తే తప్ప, ఉద్యోగులను సంతృప్తి పరచలేరన్నది నాయకత్వం గుర్తించాల్సి ఉంది.

ఉద్యోగుల పోరాటానికి తాత్కాలిక విరమణ ప్రకటించగానే అసెంబ్లీలో తెలంగాణ ఎమ్మెల్యేలు హాజరై, కాకుండా, తమవైఖరులు ప్రదర్శించడం చూశాం. విద్యార్థులు  తమ ఆకాంక్షల్ని నీరుగార్చే నాయకుల్ని ఎట్లా ఎదిరిస్తారో, ఆదరిస్తారో, నాగం జనార్దన్‌రెడ్డి వైఖరితో స్పష్టం చేశారు.

నైరాశ్యంతో ఆత్మహత్యలకు పాల్పడే విద్యార్థులు ఒకవైపు బలిదానాలతో రాజకీయ పార్టీల అవకాశవాద 'హత్య'లుగా మారిపోతుంటే, మరొకవైపు పోరాటాల ద్వారానే తెలంగాణ సాధిస్తారని హైదరాబాద్‌ను దిగ్బంధం చేసినా 'ఆడపిల్లలు' ఫిబ్రవరి 21న  అసెంబ్లీని ముట్టడించడం వాళ్ల సాహసాన్ని నిరూపిస్తున్నది. మంద అశోక్

*జంజర్ల రమేష్‌బాబు వ్యాసంలో లేవనెత్తిన ప్రశ్నలతో మొదలు పెట్టి ఇవాళ్టి తెలంగాణ ఉద్యమం లోతుగా ఆలోచించాల్సిన విషయాలను చర్చకు పెడుతున్నారు* **ఎం. కృష్ణ ఆదిత్య**

# పీడిత వర్గాల పోరాట ఐక్యత కావాలి

తెల్లవాడు పోయి నల్లవాడి దోపిడీ పాలన వచ్చినట్లుగానే, 'సీమాంధ్ర పోయి రేపటి తెలంగాణలో పిడికెడు మంది పెట్టుబడిదారుల, దళారీ పాలక వర్గాలే అధికారానికి వచ్చేటట్లయితే స్వేచ్ఛ, సమానత్వం, ఆత్మగౌరవంతో కూడిన స్వయంపరిపాలన కోసం పోరాడుతున్న ఉద్యమకారుల కర్తవ్యం ఏమిటి?' అని మౌలికమైన సమస్యను లేవనెత్తిన జంజర్ల రమేష్‌బాబుకి అభినందనలు. (వీక్షణం-జనవరి 2011 లో 'ప్రజల కోసమే ప్రత్యేక తెలంగాణ' వ్యాసం).

'ప్రత్యేక రాష్ట్ర నినాదంతో తన రాజకీయ భవన్ ను నిర్మించుకున్న' కెసిఆర్ ఏ వర్గాల ప్రయోజనాల కోసం నిలబడ్డారో అర్థం కావడం లేదా? అన్న ప్రశ్నను లేవనెత్తారు- ఈ తెలంగాణ విద్యార్థి ఉద్యమ నాయకుడు 'ఒక రాష్ట్రం ఏర్పాటుకు ఇంతటి సుదీర్ఘ తంతు అవసరమా? ఇలా ప్రపంచంలో ఏ ప్రజాస్వామ్య దేశంలోనైనా జరిగిందా? తెలంగాణ ఏమైనా ప్రత్యేక దేశం కావాలంటోందా?' అని ప్రశ్నించారు. తెలంగాణలో కెసిఆర్ కుటుంబం వంటి 'ఠాకరే లను సహించదు' అని చాటిచెపుతూ, సీమాంధ్ర ప్రాంతపు దోపిడిదారులే కాని, సామాన్య ప్రజానీకం మన శత్రువులు కారని, పీడితులంతా ఏకం కావాలని పిలుపునిచ్చారు. ఈ సందర్భంగా ఆయనే కాక మరి కొందరు కూడా పదే పదే లేవనెత్తుతున్న కొన్ని ప్రశ్నలకి సమాధానాలు అన్వేషించాల్సిన అవసరం ఉంది. ఈ ఉద్యమంలోని అనేక వాదనల, ప్రశ్నల, తప్పుడు వాస్తవాల, పెడ ధోరణుల పరిశీలన అవసరం ఉంది.

ఇలాంటి 'సుదీర్ఘ తంతు' ఏ దేశంలోనో ఎందుకు? భారత్‌లో జరిగింది. జార్ఖండ్ ఉద్యమం 1947 కన్నా చాలాముందే ప్రారంభమైంది. ప్రత్యేక విదర్భ, తెలంగాణ ఉద్యమాలు ఒకనాడు పుట్టినవే. కాశ్మీర్, నాగా, మిజో లవి మరో కోవకు చెందిన సుదీర్ఘ ఉద్యమాలు. ఇక్కడున్నది నిజమైన ప్రజాస్వామ్యం కాదని, 'ప్రపంచంలోనే అతి పెద్ద లిఖిత రాజ్యాంగం' ఉన్న నిరంకుశ, పోలీసు-మిలటరీ రాజ్యం అని లక్షల సైన్యాలను (పోలీసులను కాదు) ఐదారు దశాబ్దాలుగా ఎదుర్కొంటున్న ఆయా జాతుల ప్రజల స్వానుభవంలో గ్రహించారు.

1951 అక్టోబర్‌లో రైతాంగ సాయుధ పోరాట విరమణ నాటికి తెలుగు ప్రజానీకానికి కూడ ఇలాంటి అనుభవం వచ్చింది. కానీ ఆ పోరాట చరిత్రను రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల సిలబస్‌లో ఒకటి రెండు పేజీలు కూడా లేకుండా చేశారు. నిజాం వ్యతిరేక దశనే తప్ప, 1948 సెప్టెంబర్ -1951 అక్టోబరు నడుమ సాగిన దశను వారు గుర్తించరు, ప్రస్తావించరు. 1948 'పోలీస్ యాక్షన్' నిజాంపై కాదు, నిజానికి ప్రజానీకం పైనే యుద్ధం అన్న వాస్తవాన్ని గుర్తించాలి. 1948 సెప్టెంబరు 17ని 'విముక్తి దినం'గా

---

అమరత్వం పోరాట రూపాన్ని మార్చింది. 'రైల్‌రోకో'తో ప్రజలు పట్టాల మీదకు రావడం నుంచి ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక వర్గాలన్నీ ప్రజా పోరాట దీక్షలుగా కొనసాగుతూనే ఉన్నాయి.

అయినా తెలంగాణ ఏర్పాటు ప్రక్రియకు సంబంధించి, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు స్పందిస్తున్న తీరు నాలుగు కోట్ల ప్రజానీకపు సహనాన్ని పరీక్షిస్తున్నది.

ఈ పదహారు రోజుల ఉద్యోగుల పోరాటం కారణాలేవైనా ఒకడుగు వెనుకకు వేసి 'రెండడుగులు' ముందుకు దూకే విధంగా కొనసాగించ గల్గిన పోరాట స్ఫూర్తిని లక్షలాది ఉద్యోగుల్లో రగిలించింది. ఉద్యోగుల సమరశీల పోరాట స్ఫూర్తి నీరుగారకుండా, నీరుగార్చకుండా ప్రజలు, పార్టీలు, విద్యార్థులు, ఉద్యమకారులు, కవులు, కళాకారులు, వివిధ సంస్థలు ముందుకు తీసుకపోవడం ద్వారా తెలంగాణ కోసం ముందుకు సాగాల్సి ఉంది.

తెలంగాణకు అడ్డుతగులుతున్న శక్తులను గుర్తించి, సీమాంధ్ర సామాన్య ప్రజానీకపు భయాలను తొలగించడం ద్వారా ఆత్మీయుల్లా 'అన్నదమ్ముల్లా విడిపోదాం - ఆత్మీయుల్లా కలిసుందాం' అంటూ సీమాంధ్ర ప్రజలు, మేధావుల మద్దతు కూడగట్టడంతోపాటు, ఆర్థిక దిగ్బంధనంతో పాటు, సీమాంధ్ర పెట్టుబడిదారుల అవకాశవాద, అసత్య ప్రచారాలను తిప్పికొట్టాల్సిన కర్తవ్యాన్ని చేపట్టాలి. సహాయ నిరాకరణను విస్తృతార్థంలో ప్రజలకు అవగాహన కల్పించడం ద్వారా తెలంగాణ నుండి వనరులు, నిధులు తరలిపోకుండా సహాయ నిరాకరణకు సన్నద్ధం కావాల్సి ఉంది.

అందుకు అప్పుడప్పుడు మరిప్పుడు విస్తృతంగా తెలంగాణ ఉద్యమకారులు 'ఈజిప్ట్' తరహా పోరాటాన్ని రూపొందించడానికి ఈ 'మిలియన్ మార్చ్'ను సిద్ధం చేయడం ఆహ్వానించదగ్గది.

ఈజిప్ట్‌లో 'మాకు స్వేచ్ఛాయుత జీవితం, ఆత్మగౌరవం కావాలి' అని నినదించిన ప్రజల్లా పెద్ద ఎత్తున కదలాల్సిన అవసరం, కదిలించాల్సిన కర్తవ్యాన్ని అన్ని శక్తులు స్వీకరించాల్సి ఉంది.

'తన ప్రజలను తానే నిర్బంధించే వాడు నిలువెల్లా విద్రోహి' అంటూ ఈజిప్ట్ పోరాటంలో 'ఫేస్‌బుక్'లో 'మాకు హక్కులు కావాలి, మానవ హక్కులు కావాలి' అంటూ అస్మా మెహఫౌజ్ పంపిన సందేశం స్ఫూర్తిగా ఇవాళ్టి తెలంగాణ పోరాటం ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక, విద్యార్థి రాజకీయ పక్షాలన్నీ ఏకమై సంఘటిత పోరాటంగా సాగాలి, ఎన్నికల కోసమో, ఎత్తుల కోసమో వాయిదాలు వేస్తూ పార్లమెంట్‌లో అసెంబ్లీల్లో తేల్చడానికి గ్రామ పునాదుల మీద పోరాటం కొత్త పుంతలు తొక్కాల్సి ఉంది. అందుకు ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు మరింత పోరాట స్ఫూర్తితో ముందుకు సాగాలి.

*(రచయిత తెలంగాణ టీచర్స్ ఫోరం కన్వీనర్)* వీ

గుర్తించాలని కోరేవారు అది విద్రోహ దినం కాదని మాయ చేస్తున్నారు. ఈ సమస్యపై ఉస్మానియా, కాకతీయలలో ఎన్ని డాక్టరేట్ థీసీసులు వచ్చాయి? దాదాపు లేవు. దీనికి బాధ్యులు పాలకవర్గాలకు తలొగ్గిన 'యూనివర్సిటీ దొరలే' కనీసం చరిత్ర సిలబస్‌లో లేకుండా చేసింది వారే. ఈపని చేసింది, చేయించింది సీమాంధ్ర పాలకులు కాదు, ఢిల్లీ కనుసన్నల్లో అని గుర్తించాలి.

'సీమాంధ్ర ప్రాంతపు దోపిడి దారులే కాని, సామాన్య ప్రజానీకం మన శత్రువులు కాదని' అంటున్నారు. ఇది పైపైకి బాగానే ఉంటుంది. లోతుగా పరిశీలిస్తే? విలీనంని వ్యతిరేకించారని చెప్పబడే కె.వి.రంగారెడ్డి 'జంటిల్‌మెన్స్ అగ్రిమెంట్'లో ముఖ్యులు దానిలో ఉన్న ఉపముఖ్యమంత్రి పదవి కూడా ఇవ్వక పోయినా 1956లోనే విశాలాంధ్ర మంత్రివర్గంలో చేరిపోయారు. తెలంగాణ పేరిట పార్టీని పెట్టినా, 10 పార్లమెంటు సీట్లు గెలిచినా చెన్నారెడ్డి అన్నీ వదిలి, ఆనాడు కనీసం ముఖ్యమంత్రి పదవి కూడా ఇవ్వకపోయినా ఇందిరాగాంధీకి లొంగిపోయి పదవులు పంచుకున్నారు. ప్రత్యేక తెలంగాణ 'క్లోజ్డ్ ఛాప్టర్' అన్నారు. విశాలాంధ్రకు ముఖ్యమంత్రిగా రెండుసార్లు ఆ తర్వాత పదవి స్వీకరించారు (1978–1989లో). ఇవాళ్టి కెసిఆర్ విశాలాంధ్ర దోపిడి వర్గాల పార్టీ అయిన తెలుగుదేశం పార్టీలో మంత్రిగా, ఉప సభాపతిగా ఏళ్ల తరబడి పదవులు అనుభవించారు. ఉద్యోగాల్లో జోనల్ సిస్టం కూడా అక్కరలేదని ఆనాడు అసెంబ్లీలోనే ప్రకటించినారు. సోనియాను కీర్తించారు వీరంతా ఎందుకిలా చేశారు? అవి వారి వారి వ్యక్తిగత నిర్ణయాలు కాదు. సామ్రాజ్యవాదులకు, బడాదళారీ పెట్టుబడి దారులకు భూస్వాములకు ఊడిగం చేస్తున్న భారత పాలక వర్గాల్లో భాగమే వీరంతా... విడదీయరాని భాగం కూడా అందుకే అలా చేశారు. సీమాంధ్ర ప్రాంతపు దోపిడీదారులు కూడా అంతే. వారు వేరువర్గం కాదు. వారు కూడా ఎం.ఎన్.సిల, టాటా, బిర్లా, అంబానీల సేవచేశారే కానీ, ఆంధ్ర జాతీయ పెట్టుబడిదారులను, వారి పరిశ్రమలను ప్రోత్సహించలేదు. కాలక్రమంలో తెలుగు వారినుంచి కూడ బడా బడా పెట్టుబడిదారులు తయారైనారు (లగడపాటి, రామోజీరావు, జి.ఎం.ఆర్. మొదలైనవారు). తెలుగుదేశం పార్టీ వీరి ప్రత్యేక ఆసక్తుల కోసం, వాటా కోసం అఖిల భారత పాలక వర్గాలతో షరీకై పాలించింది. కనీసం అటానమి కోసం కూడా పట్టు పట్టలేదు.

కెసిఆర్ ఆ తెలుగుదేశం పార్టీలోనే సుదీర్ఘకాలం పాటు ఉండి పదవులు అనుభవించారు. కావల్సిన స్థాయిలో పదవి దక్కక బైటికి వచ్చారు. ఏడెనిమిది రాష్ట్రాలలో పరిశ్రమలు ఉన్న జి.వెంకటస్వామి కాంగ్రెసులో ఉండి ఇదే పని చేశారు. ఆయన, దేవేందర్ గౌడ్ లాంటి వందల వేల కోట్ల ఆస్తులున్న పెట్టుబడిదారులు ఇవాళ తెలంగాణలో కూడా డజన్ల సంఖ్యలో ఉన్నారు. వారెవ్వరు ఎం.ఎన్.సి.లకు, టాటా–బిర్లా అంబానీలకు, అఖిల భారత పాలక వర్గాలకు వ్యతిరేకంగా పోరాడలేదు. అందుకే వారు సీమాంధ్ర ప్రాంతపు దోపిడిదారులతో కలిసి సుదీర్ఘ కాలం అధికారం పంచుకున్నారు. వీరంతా వేరు చేయరాని 'సోదరులు', విడిపోయి ఆస్తులు పంచుకుందాం అంటున్నారు. వీరిలో చాలా మంది అక్కడ దోపిడీదారుల 'వియ్యంకు'లైనారు, (కుటుంబ పరంగానే కాక, రాజకీయంగా కూడ) వీరంతా తమ తమ వాటా కోసం పెనుగులాడు తున్నారు అంతే. ఎవరు స్థానికులు? ఎవరు కారు?

'సెటిలర్ల పిల్లలు సైతం స్థానికులే' అని కెసిఆర్ చెప్పినదాన్ని రచయిత తప్పు బట్టారు. అనేకమంది విద్యార్థి నాయకులు కూడా ఈ కారణంగా (మరోసారి) కెసిఆర్ శవయాత్రలు జరిపారు. చొరబాటు దారులు ముల్కీలైతే, సీమాంధ్రుల పిల్లలు స్థానికులైతే ఇక ఉద్యమం ఎవరి కోసం అని ప్రశ్నించారు. దాదాపు, ఇక్కడి ప్రతినాయకుడు అక్కడి వారిలో పైన చెప్పినట్టు 'వియ్యం' చేశారు, సంతతిని కన్నారు, రక్త బంధువులయ్యారు అని గమనించాలి. మధ్యతరగతిలో కూడా ఇది భారీస్థాయిలో జరిగింది.

పై అభిప్రాయంలో క్లారిఫై చేసుకోవాల్సిన ఇతర అంశాలు కూడా ఉన్నాయి. అమెరికా, ఇంగ్లాండు వంటి అనేక విదేశాల్లో నిర్ణీత కాలం జీవనం తర్వాత వేలాది తెలుగువారు (తెలంగాణ వారు కూడా) పూర్తిస్థాయి పౌరులుగా ఉన్నారు. కొందరు ఎన్.ఆర్.ఐ.లు ఉభయ దేశాల (ద్వంద్వ) పౌరులుగా కూడా హక్కులు పొందుతున్నారు. మరి సీమాంధ్రుల పిల్లలు స్థానికులు కాకుండా ఎలాపోతారు? మనదేశంలో పౌరసత్వానికి కొన్ని నిబంధనలున్నాయి. రాష్ట్రాల వారీగా పౌరసత్వం విడిగా లేదు. అలాంటప్పుడు తెలంగాణలో పుట్టిన వారంతా స్థానికులు కాక మరేమవుతారు? సంస్థానంలో 12–15 ఏళ్ళ నివాసం ఉన్నవారిని 'ముల్కీ'లుగా గుర్తించారు. పెద్దమనుషుల ఒప్పందంలో ముల్కీ రూల్సు ఐదేళ్ల వరకు–కాకపోతే పొడిగించి మరో ఐదేళ్ల వరకు అని మాత్రమే రాసుకున్నారు. ముల్కీ రూల్సు రద్దు కాలేదని భావించి లెక్కించినా వారంతా స్థానికులే అవుతారు. ఏ లెక్కన, ఏ చట్ట ప్రకారం కాదనగలరు? దోపిడి దారులు వ్యతిరేకించినా. పోరాడినా, రాష్ట్రం విడిపోయినా వారి వారి పిల్లల స్థానికతను ఏ చట్టం ప్రకారం కాదనగలం. వారి సంగతి అలా ఉంచి ఇక్కడ సెటిలైన లక్షలాది మంది సామాన్య ప్రజల, వారి పిల్లల స్థానికతని ఏ సూత్రం, ఏ చట్టం, ఏ ధర్మం ప్రకారం కాదనగలం. కెసిఆర్ ని వ్యతిరేకించడం అంటే ఆయన చెప్పిన ప్రతీదీ కాజాలదు. కాబట్టి సెటిలర్లు, వారి పిల్లలు 90 శాతం మంది – ముల్కీ రూల్స్ ప్రకారమైనా స్థానికులే అవుతారు. 'తెలంగాణ ఎమైనా ప్రత్యేక దేశం కావాలంటోందా?' అన్న రచయిత తన్ను తాను ఈ ప్రశ్నను మరోసారి అడిగి, సమాధానం చెప్పుకోవాలి. అనేక దేశాల్లో పది–పదిహేనేళ్ల స్థిర నివాసంతో అక్కడి పౌరులయ్యే అవకాశం ఉంది అని గుర్తించాలి.

వారంతా స్థానికులే అయితే ఈ ఉద్యమం ఎవరికోసం? అన్న ప్రశ్న లేవనెత్తారు. ఆలోచించాల్సిన ప్రశ్నే. ఇప్పుడున్న నిబంధనల ప్రకారం ప్రైవేటు రంగంలో (స్థానికులకు గాని, కులాలవారి గాని) రిజర్వేషన్లే లేవు. ఉపాధి అవకాశాలు అధికభాగం ఈ రంగంలోనే ఉన్నాయి ప్రభుత్వ ఉద్యోగాలు పరిమితమే. ఈనాడు 'సంఘటిత రంగంలో' ఉపాధి పొందుతున్నవారు దేశ/రాష్ట్ర జనాభాలో పది శాతం కూడా లేరు. ఈ ఆర్గనైజ్డ్ సెక్టారులోనే ప్రైవేటు రంగంలోని అత్యధిక భాగం కూడా చేరి ఉంది. ప్రభుత్వ రంగం ఈసెక్టర్లో చిన్న భాగం మాత్రమే, కాబట్టి సెటిలర్లకు వారి పిల్లలకు ఏ ప్రాతిపదిక పై ఉపాధిని కాదనగలం? 1956లో రాష్ట్రం ఏర్పడడానికి ముందు నుంచే ఉన్న మరాఠి, కన్నడ, తమిళ, మార్వాడి, 'బయటి ముస్లింలు' తదితరుల వారసులంతా ముల్కీలే అయ్యారు. అలాంటప్పుడు గత 50 ఏళ్లుగా తమ రాష్ట్రంగా ఉన్న సీమాంధ్ర తెలుగు వారు, వారి సంతతి స్థానికులు కాక మరేమౌతారు? నిజానికి ఇప్పటికే లక్షలాది టీచర్లు, కింది స్థాయి ఉద్యోగులు జిల్లా స్థాయిలోనే (డి.ఎస్.సి.ల ద్వారా) ఎంపిక అవుతున్నారు. మరికొన్ని పోస్టులకు జోనల్ సిస్టం ఉంది. కాబట్టి రాష్ట్ర విభజన జరిగినా ఎవరు స్థానికులు? ఎవరు కారు? అనడానికి ఏవో గీటురాళ్లు ఉండాలి. అవి దేశంలోని చట్టాలకు, నిబంధనలకు లోబడి ఉంటాయి. ప్రైవేటు రంగ ఉపాధికి ఏ నిబంధనలూ వర్తించవు. నేటి రాజ్యాంగ పరిధిలో 'ప్రజా తెలంగాణ' సాధ్యమా?

మన దేశంలో భూస్వాములకు, పెట్టుబడిదారులకు ఎక్కడైనా ఆస్తులు సమకూర్చుకోగల చట్టబద్ధ హక్కులున్నాయి. (కాశ్మీర్, నాగ లాంటి ప్రాంతాల్లో, షెడ్యుల్డ్ ఏరియాల్లో కొన్ని మినహాయింపులకు లోబడి ప్రస్తుత రాజ్యాంగ వ్యవస్థలో ఆ హక్కులని కుదించడం సాధ్యంకాదు. అలా కుదించడం 'ప్రత్యేక తెలంగాణ'లో కూడా అసాధ్యమే. దోపిడీదారులకు దేశమంతటా 'రెడ్ కార్పెట్ వెల్‌కమే'. అదే కెసిఆర్ చెప్పున్నది.

మన దేశ రాజ్యాంగంలో కేంద్రానికే అత్యధిక అధికారాలున్నాయని గుర్తు చేసుకోవాలి. సి.ఆర్.పి.ఎఫ్ వంటి కేంద్ర బలగాల ప్రయోగం రక్షణ, రక్షణ పరిశ్రమలు, రైల్వే, నేషనల్ హైవేస్, రేవులు, షిప్పింగు, పోస్టల్, ఫోన్లు, రేడియో, టివి, పత్రికలు వంటి ప్రసార సాధనాలు, బ్యాంకులు, ఇన్సూరెన్స్; కీలక పరిశ్రమలు, ఖనిజాలు, గనులు, పెట్రోలియం–ఉత్పత్తి–అన్వేషణ – సరఫరా; సినిమా సెన్సార్‌షిప్, కేంద్ర విద్యా సంస్థలు, పోలీసు శిక్షణ సంస్థలు, కేంద్ర సర్వీసులు, సుప్రీంకోర్టు, హై కోర్టు స్థాపన నిర్వహణ, ఆదాయ పన్ను, ఎగుమతి దిగుమతి సుంకాలు మొదలగు, ఇంకా చాలా కేంద్ర జాబితాలో ఉన్నాయి. రాష్ట్ర ప్రభుత్వాలకున్న పరిమిత అధికారాల దృష్ట్యా విశాలాంధ్ర వైఫల్యాన్ని అర్థం చేసుకోవాలి. ఇదే వ్యవస్థకు లోబడిన ప్రత్యేక తెలంగాణ వల్ల ఏం మార్పులు వస్తాయి? అని ప్రశ్న వేసుకోవాలి.

భూస్వాములు బడాపెట్టుబడిదారులు, సామ్రాజ్యవాదులు, మల్టి నేషనల్స్, ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకుల ఆధ్వర్యంలో దేశ స్వాతంత్ర్యం–ప్రజలకు సంబంధించినంత వరకు నామమాత్రంగా బూటకంగా తయారైంది.

1990ల తర్వాత మొదలైన సంస్కరణల యుగంలో ఎల్.పి.జి. విధానాల నేపథ్యంలో దేశ ప్రజలు మరింత నలిగిపోయారు. రాష్ట్రంలో విచ్చలవిడి దోపిడి పెరిగిపోయింది. మానవ అభివృద్ధి సూచిక తాజా ర్యాంకింగ్ ప్రకారం 169 దేశాల్లో భారత్ 119వ స్థానంలో ఉంది. అందులో ఆంధ్రప్రదేశ్ ర్యాంకింగ్ కింది స్థానంలో ఉంది. ప్రాంతాల వారీగా చూస్తే అందులో మళ్లీ ఉత్తరాంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలు తెలంగాణ స్థాయిలోనే ఉన్నాయి. మధ్య కోస్తాలో కూడా వెనుకబడిన మండలాలున్నాయి. సామ్రాజ్యవాదుల, బడా పెట్టుబడి దారుల, భూస్వాముల దోపిడీ, విద్య, వైద్యం తదితర రంగాల్లో ప్రైవేటీకరణ, కొనబోతే కొరివి అమ్మబోతే అడివి అన్న చందాన ఎల్.పి.జి. నేపథ్యంలో వ్యవసాయం/రైతాంగం, సంస్కరణల క్రమంలో దేశంలో/ రాష్ట్రంలో లక్షలాది పరిశ్రమలు మూతపడి, ప్రభుత్వ రంగం రాను రాను కుదింపబడి, నిరుద్యోగం ప్రబలి, ఇవి యావత్ దేశాన్ని, రాష్ట్రాన్ని, మూడు ప్రాంతాలనూ దెబ్బతీశాయి. ఈ పరిణామాలను మేధావులు, జర్నలిస్టులు, రచయితలు, కళాకారులు, ప్రజాతంత్రవాదులు రాష్ట్రమంతటా ఎలుగెత్తి నిరసించారు. వ్యతిరేకించారు. విప్లవ ప్రజాతంత్ర ఉద్యమాలు రాష్ట్రమంతటా విస్తరించనారంభించాయి, ఇవాళ అన్నింటికీ 'విశాలాంధ్ర' కారణం, రాష్ట్ర విభజనే సర్వరోగ నివారిణి అన్న చందంగా మాట్లాడడం వాస్తవ విరుద్ధమౌతుంది. రాష్ట్ర ప్రజల ఐక్య ఉద్యమ స్ఫూర్తిని దెబ్బ తీస్తుంది. ఇది ప్రజల సమస్యల పరిష్కారానికి తోడ్పడదు.

ప్రత్యేక తెలంగాణలో కాంగ్రెసు, టిఆర్ఎస్ ప్రాతినిధ్యం వహిస్తున్న వర్గాలు, శక్తుల ప్రాబల్యం కొనసాగుతుంది. ఆ పార్టీలు దెబ్బతిన్నా, అవే వర్గాలూ, శక్తులూ కెసిఆర్, బిజెపిల రూపం దాలుస్తాయి జగన్ పార్టీ కూడా ఇలాంటిదే. ఇలాంటి శక్తుల నేతృత్వంలో వచ్చేది 'ప్రజా తెలంగాణ' కాజాలదు. నేటి రాజ్యాంగ వ్యవస్థలో 'ప్రజా తెలంగాణ' అసాధ్యం. ఈ దోపిడీ వ్యవస్థలో ఒక భాగమే. అగ్రవర్గాల, అగ్రవర్ణాల ప్రాబల్యం కూడా రాష్ట్ర విభజనతో అది దెబ్బ తినదు. వారి స్థానంలో అణగారిన శక్తుల (సామాజిక) తెలంగాణ ఎలా సాధ్యమవో అనూహ్యం. కెసిఆర్ దళితుడిని ముఖ్యమంత్రి చేస్తానంటున్నారు. విశాలాంధ్ర తొలి ముఖ్యమంత్రుల్లో ఒకరైన సంజీవయ్య దళితుడే. మహారాష్ట్రలో షిండే వంటి దళితులు, బీహార్–యు.పి.లలోని 'యాదవ్'లు, జార్ఖండ్‌లో గిరిజన ముఖ్యమంత్రులు వచ్చినా దోపిడి వ్యవస్థలో మార్పు లేదు. థాకరేలు, మోడీలు అగ్రకులాల ప్రతినిధులు కారు. అయిన ఫాసిస్టుల్లో భాగమే. మాయావతి నేతృత్వంలో బి.ఎస్.పి.–కాంగ్రెస్, బిజెపి, అగ్రవర్ణాలతో కూటములు కట్టి – తాను మౌలికంగా అదే వర్గాల కొత్త ముఖంగా బయట పడింది. ఎ.రాజా, వెంకటస్వామి, వివేక్, పాశ్వాన్, దళిత ఉన్నత అధికారులు, జడ్జీలు తాము ఏమి భిన్న వారం కాదని చాటి చెప్పారు. నేడు టిఆర్ఎస్‌లో, ప్రత్యేకవాదుల్లో ఉన్న నాయకులు పాత వ్యవస్థలో భాగమేనన్నది గుర్తించాలి. దేశంలోని పోలీసు మిలటరీ రాజ్యం, ఎల్.పి.జి. విధానాల కొనసాగింపులో అన్ని పార్టీల ప్రభుత్వాలూ, నాయకత్వాలూ, స్థూలంగా ఒకే రీతిలో పాలించాయి. పీడించాయి. ఆ వర్గాల శక్తుల ప్రాబల్యంలో ఉండే ప్రత్యేక తెలంగాణ వస్తే ఏం సాధిస్తుంది?

'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అన్న సుందరయ్య గారి నినాదం అర్థరహితం అని రుజువైంది. విశాలాంధ్ర ఏర్పడినా అది ప్రజారాజ్యం కాలేకపోయింది. అది అసాధ్యం కూడా. నేటి రాజ్యవ్యవస్థలో నేటి వర్గాల పొందిక లో 'ప్రజా తెలంగాణ' కూడా అంతే. అంత మాత్రాన కోస్తాంధ్ర పాలకుల కుట్ర కారణంగానే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిందంటే, అది చారిత్రక వక్రీకరణే. 1940 నుంచి ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాల్లో కమ్యూనిస్టు విప్లవకారులు ఐక్యంగా ఉద్యమాలు నిర్మించారు. తెలంగాణ సాయుధ పోరాటం (1946–51) దాని పరాకాష్ట అందులో ఆ కాలంలో ఇరు ప్రాంతాల ప్రజలు, కార్యకర్తలు, నాయకులు, భుజం భుజం కలిపి పోరాడారు. వేలాదిగా ప్రాణ త్యాగాలు చేశారు, ఆస్తుల త్యాగాలూ చేశారు. ఆ క్రమంలో ఇరు ప్రాంతాల మధ్య పోరాట ఐక్యత ఏర్పడింది. విశాలాంధ్ర ఉద్యమంలో ఈ శక్తులు ఒక ప్రబల శక్తి. తెలంగాణ కాంగ్రెసులోని జాతీయ వాదులు, ఆంధ్ర మహాసభ లోని శక్తులు కాళోజీ, దాశరథి, వట్టికోట ఆళ్వారుస్వామి, వానమమలై, సినారెల వంటి కవులూ, రచయితలూ ఆనాడు విశాలాంధ్రను ఆహ్వానించినవారే. అవగాహన ఆచరణలో కొన్ని లోపాలున్నా 'జాతుల స్వయం నిర్ణయాధికారం' అన్న ప్రజాతంత్ర సూత్ర ఒరవడిలోనే విశాలాంధ్ర నినాదం 1946లోనే వచ్చింది. అది ఒక అడుగు ముందుకే, అయితే 'ప్రజారాజ్యం' విశాలాంధ్ర తోనే సాధ్యం కాదని అనుభవం రుజువు చేసింది. ఆ గుర్తింపు క్రమంలోనే నక్సల్బరీ, శ్రీకాకుళం, ఉత్తర తెలంగాణల్లో విప్లవోద్యమాలు మళ్లీ 1970–1980 ల తర్వాత రగిలినాయి. ఈ దశలో కూడా పాణిగ్రాహీ, నాజర్, గద్దర్, వంగపండు వంటి కళాకారులు శ్రీశ్రీ, రాచకొండ, కొడవటిగంటి వంటి పాతతరం వారితో తెలంగాణలోని కొత్తవారు చేరి ఐక్య ఉద్యమాలు నిర్మించారు. రెండు ప్రాంతాలకు చెందిన నాయకుల ఆధ్వర్యంలో పౌర / ప్రజాస్వామిక హక్కుల ఉద్యమాలు రాష్ట్ర వ్యాప్తమైనాయి. మొత్తంగా విప్లవోద్యమాలే దెబ్బతిన్నాయి. పుంజుకున్నాయి. ఇరుప్రాంతాల జర్నలిస్టులూ కలిసి ఈ పరిణామాలకు అద్దం పట్టారు. మీడియాలో కూడా విప్లవ ప్రజాతంత్ర శక్తులు బలపడినాయి. 1969, 72 ల నాటి రాష్ట్ర విభజన ఉద్యమాల తర్వాతి దశలో కూడా రాష్ట్రవ్యాప్తంగా, ఇలా అనేక రంగాల్లో (రైతాంగ, కార్మిక, విద్యార్థి, ఉపాధ్యాయ, ఉద్యోగి, మహిళ, దళిత మొదలగువారు) ఐక్య పోరాట ఉద్యమాలు పెంపొందాయి. ఇరు ప్రాంతాల నుంచీ ప్రజలు, కార్యకర్తలు, నాయకులు, పోరాట మార్గంలో ముందుకు సాగారు. త్యాగాలు చేశారు. యావత్ దేశ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు, వహిస్తున్నారు. ఆ విధంగా తెలుగు ప్రజల మధ్య పోరాట ఐక్యత కొద్ది ఏళ్ల క్రితం వరకూ కొనసాగింది. ఇరు ప్రాంతాల్లో ఐక్యంగా తిష్టవేసిన దోపిడి వర్గాలకు వ్యతిరేకంగా పోరాట ఐక్యత కొనసాగింది. 'జెండాలు, ఎజెండా'లు పక్కన పెట్టి తెలంగాణ కోసం ఐక్యత పేరిట ప్రజల ఐక్యతకు ముప్పు ఏర్పడింది.

'విశాలాంధ్ర' నినాదాన్ని జాతుల స్వయం నిర్ణయాధికార నేపథ్యంలో 1946లోనే కమ్యూనిస్టులు ముందుకి తెచ్చారు. యావత్ దేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుని బలపరిచారు. 1946 ప్రొవిజనల్ పార్లమెంటు, తర్వాత 1952 ఎన్నికల్లోనూ కమ్యూనిస్టులు ఈ నినాదాన్ని తమ మ్యానిఫెస్టోలో చేర్చారు. తెలంగాణలోను, సీమాంధ్రల్లో కూడా బలమైన శక్తిగా ముందుకు వచ్చారు. (పోరాట మార్గం ఫలితంగా) తెలంగాణ జిల్లాల్లో 1952 ఎన్నికల్లో కాంగ్రెస్ ఓడిపోయింది. 36 శాతం ఓట్లతో కమ్యూనిస్టులదీ, వారి మిత్రులదే పై చేయి (మిత్రులతో కలిపి 47శాతం) అయింది. 1955 ఎన్నికల్లో సీమాంధ్రలో కమ్యూనిస్టులు 31.3శాతం ఓట్లు (1952లో కన్నా ఎక్కువ) సాధించారు. విశాలాంధ్ర ఇవ్వకపోతే, ఆ నినాదంతో రాజీనామా చేసి, మళ్లీ పోటీ చేస్తాం అని సవాలు విసిరారు. 1957 ఎన్నికలలో కూడా విశాలాంధ్ర స్ఫూర్తిని కొనసాగించారు; సీట్ల రీత్యా ఓడిపోయినా, ఓట్లు ఓట్ల శాతం పెరిగాయే కానీ దెబ్బతినలేదు, విశాలాంధ్ర నినాదం ఇచ్చిన కమ్యూనిస్టులు 1952, 57ల్లో తెలంగాణ లో ప్రబల శక్తిగానే కొనసాగారు. వారు ఆనాడు పీడిత ప్రజలకే ప్రతినిధులని గుర్తించాలి. తెలంగాణలో కాంగ్రెసుకి చెందిన మెజారిటీ వర్గాలు, శక్తులూ కూడా విశాలాంధ్రని బలపర చారని గమనించాలి. పై దృష్ట్యా చూసినప్పుడు 1956లో విశాలాంధ్ర ఏర్పాటు తెలంగాణ ప్రజల, నాయకుల అభిమతానికి వ్యతిరేకంగా జరిగిందనడం వాస్తవ విరుద్ధం. విశాలాంధ్ర లో మరికొన్ని కోణాలున్నాయి చూద్దాం.

అందులో ఒకటి దేశీయ కోణం. 1956లో అగ్రిమెంటు చేసుకున్న 'జంటిల్‌మెన్' అంతా కాంగ్రెస్ వారే. అందులో కమ్యూనిస్టులు లేరు. (ఆ రోజుల్లో ఇంకా కమ్యూనిస్టులను 'జంటిల్‌మెన్'గా పూర్తిగా గుర్తించలేదు (ఎన్నికైన కమ్యూనిస్టు కేరళ (ఇఎంఎస్) ప్రభుత్వాన్ని 1959లో రద్దు చేశారు). కాంగ్రెస్ ముఠాల మధ్య తగాదాలకు, రాజీలకు సంబంధించిన అంశం కూడా ఉంది. అందులో 1947కి ముందు కాంగ్రెసు పార్టీ అధికారికంగా భాషా ప్రయుక్త రాష్ట్రాల సూత్రాన్ని ఆమోదించింది. తొలిగా దాన్ని ఆంధ్ర కమిటీ ఏర్పాటు రూపంలో అమలు పరిచింది. అనేక ఇతర విషయాల్లోలాగే

1947 తర్వాత నెహ్రూ ప్రభుత్వం రంగులు మార్చింది. మాట తప్పింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల విషయంలో కూడా తాత్సారం చేసింది. నీళ్లు నమిలింది. భారత బడా పెట్టుబడిదారుల 'ఏక జాతి సిద్ధాంతం'తో భాషా జాతుల సమగ్ర వికాసాన్ని, స్వయంనిర్ణయాధికార సూత్రాన్ని వ్యతిరేకించింది. దాని స్థానంలో భాషని ఒక (ముఖ్యమైన) గీటురాయిగా మాత్రమే స్వీకరించే భాషా రాష్ట్రాల సూత్రాన్ని కాదనలేక అంగీకరించింది. అలా ఏర్పడిందే ఆంధ్రప్రదేశ్. ఇది కేంద్ర స్థాయి నిర్ణయం. సీమాంధ్రుల మోసం ఫలితం అనుకోవడం అమాయకత్వం, చరిత్ర దృష్టి లోపం అవుతుంది. 'కల్లు తాగిన వాడు ఒకందుకు తాగితే, పోసిన వాడు మరొకందుకు పోశాడని' సామెత ఉంది. జాతుల సమస్య తెలుగు ప్రజల పోరాట ఐక్యతలో భాగంగా కమ్యూనిస్టులు విశాలాంధ్ర నినాదం తెచ్చారు. కాంగ్రెసులో కూడా జాతీయ వాదుల్లో అధికభాగం దీన్ని బలపరిచారు. అయితే కేంద్రం దీన్ని అంగీకరించడానికి ప్రత్యేక కారణాలున్నాయి. అందులో ఒకటి భాషా రాష్ట్రం మాటున కమ్యూనిస్టులపై పైచేయి సాధించడం, ఇంకొకటి ఇరు ప్రాంతాల ప్రజలు కలిసి సాగించిన తెలంగాణ సాయుధ పోరాటాన్ని మరిపించి, భాషా రాష్ట్రం పేరిట కమ్యూనిస్టుల్లో మితవాద, సంస్కరణవాదాల్ని పెంపొందించడం.

మరొకటి అంతర్జాతీయ కోణం పోలీసు యాక్షన్ తో లొంగిపోయిన నిజాం అంతకు ముందే కేంద్రం యథాతథ ఒప్పందం చేసుకున్నదని గమనించాలి. 1950లో భారత రిపబ్లిక్ ఏర్పడిన తర్వాత నిజాంను 'రాజ ప్రముఖ్'గా నియమించింది. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడే దాకా ఆ పదవిలో నిజాం కొనసాగాడు. 'అయినా చాలాకాలం వరకు ఈ సమస్య ఐరాసలో మగ్గుతూనే వచ్చింది. ఈ సంస్థానాన్ని రద్దుచేసి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత అది లేకుండా పోయింది. కేంద్ర ప్రభుత్వం ఈ సంస్థానాన్ని రద్దు చేయడానికి అంగీకరించడానికి గల కారణాల్లో ఇదొకటి. ఐరాస ముందు ఈ సమస్య ఉండి ఎప్పటికీ తలనొప్పిగా ఉండడంతో ఈ బెడదను వదిలించుకోవడానికి కూడా యూనియన్ ప్రభుత్వం సంస్థానాన్ని రద్దు చేసి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు చేసింది. అంతే కానీ భాషా రాష్ట్రాల మీద అభిమానం ఉండడం వల్ల జరగలేదు. ఇతర అనేక కారణాలవలన ఈచర్య తీసుకోవడం జరిగింది' అని వివరించారు తెలంగాణ విప్లవ పోరాట నాయకుడు దేవులపల్లి వెంకటేశ్వరరావు (తెలంగాణ ప్రజల సాయుధ పోరాట చరిత్ర.... 1946-51,పేజీ 622-633) అనేక సంస్థానాలలాగే హైదరాబాదు విలీనం జరిగినా, కమ్యూనిస్టుల సాయుధ పోరాటం వల్ల దీనికి ప్రత్యేకతలున్నాయి. 1947తర్వాత కూడా బ్రిటిష్ గవర్నర్, బ్రిటన్ సైనికాధికారులూ కొనసాగారు. తెలంగాణలో చైనా విప్లవం ఛాయలు చూసిన బ్రిటన్, దేశీ పెట్టుబడిదారులు ఈ విలీనంలో రాజీ బేరాలను సాగించి, సఫలం చేయటంలో పాత్రపోషించారు. తెలంగాణ 'విముక్తి దినం' పేరిట కొందరు గుర్తు చేసుకొనే పటేలు కూడా, కమ్యూనిస్టుల భయంతో ఈ ప్రక్రియకు దోహదం చేశాడు. వీటి ఫలితంగానే నెహ్రూ హైదరాబాద్‌ను విడిగా ఉంచాలన్న అభిలాషను వదులుకున్నాడు. మౌలానా ఆజాద్‌ను కూడా ఒప్పించాడు.

పై రెండు (దేశీయ, అంతర్జాతీయ) కోణాలకు తోడు మరొక చారిత్రక అనివార్యత కూడా తోడైంది. 1953 అక్టోబర్‌లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత విశాలాంధ్ర ఉద్యమం మళ్లీ వేగం పుంజుకున్నది, భాషా రాష్ట్రాల డిమాండ్ దేశమంతా-ముఖ్యంగా దక్షిణాదిలో పాకింది. ఫలితంగా 1953 డిసెంబర్‌లోనే ఎస్.ఆర్.సి. (ఫజల్ ఆలిఖాన్) నియమించారు. పైన నెహ్రూ, మద్రాసులో రాజాజీ (గవర్నరు జనరలుగా కూడా పని చేసిన నాయకుడు) 'ఇద్దరికీ ఇష్టం లేకపోయినా' విశాలాంధ్ర ఏర్పడింది. హైదరాబాద్‌ని 'ముక్కలు చేయాలనే' ఫజల్ అలీ కమిషన్ సూచించింది. భాషా రాష్ట్ర సూత్రాన్ని 'ఏకైక గీటురాయి'గా ఉండరాదని భావించినా ఒక ముఖ్య సూత్రంగా అంగీకరించక తప్పలేదు. హైదరబాద్‌ని కన్నడ, మరాఠి జిల్లాలవారు నాటి మైసూరు, బొంబాయి రాష్ట్రాల్లో కలిసి పోతామని పట్టుపట్టారు. (భాషా రాష్ట్ర ఉద్యమాలు అక్కడ అప్పటికే మొదలై సాగుతున్నాయి. మరోవైపున తెలంగాణ వేరు రాష్ట్రంగా ఉండడాన్ని తెలంగాణ నాయకత్వమే వ్యతిరేకించింది. కమ్యూనిస్టులు విశాలాంధ్ర కోరారన్నది తెలిసిందే. కాంగ్రెస్ జిల్లా కమిటీలు పదింటిలో ఏడు విశాలాంధ్రను బలపరుస్తూ ఆనాడు తీర్మానాలు చేశాయి. హైదరాబాదు అసెంబ్లీలో ఈ సమస్య పై చర్చ, నిర్ణయం జరిగాయి. మొత్తం 174 మంది శాసన సభ్యుల్లో 147 మంది మాట్లాడారు. ఓటింగ్ జరిగింది. 103 మంది విశాలాంధ్రని బలపరిచారు. 29 మంది తెలంగాణ విడిగా ఉండాలన్నారు. 15 మంది తటస్థం. (ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 5-12-1955 వార్తని కె.వి.నారాయణరావు 'ఎమర్జెన్స్ ఆఫ్ ఏపి' ప్రామాణిక ప్రసిద్ధ పుస్తకంలో పేర్కొన్నారు.) నాయకులే కాక ప్రజల్లో కూడా మెజారిటీ విశాలాంధ్రని బలపరిచారు. (కమ్యూనిస్టులు, కాంగ్రెసులోని జాతీయ వాదులు, మేధావులు ప్రజల్లో విశాలాంధ్ర భావనని ప్రోదిచేశారు. తెలుగు ప్రజలందరి పోరాటంగా 'తెలంగాణ సాయుధ పోరాటం' ఆ ఒరవడిలో వచ్చిన విప్లవ, ప్రజాతంత్ర, సాహిత్య, సాంస్కృతిక దానికి కావల్సిన భూమికను సమకూర్చి పెట్టాయి. అందువల్ల అప్రజాస్వామికంగా తెలంగాణ ప్రజల అభిమతానికి విరుద్ధంగా విశాలాంధ్ర ఏర్పడిందనడం వాస్తవ విరుద్ధం.

ఇక్కడే నెహ్రూ గూర్చి చెప్పుకోవాలి.'ఇష్టం లేకపోతే విడాకులు' అన్నారని కోట్ చేసి చెప్తుంటారు. జెంటిల్‌మెన్స్ అగ్రిమెంటుని ఉదహరిస్తుంటారు. కానీ దీని వెనుక ఉన్న రాజకీయాలను చాలా మంది విస్మరిస్తుంటారు. తెలిసీ, తెలియక కూడా. అవి కేవలం స్థానిక / రాష్ట్ర స్థాయి రాజకీయాలే కాదని గమనించాలి.

నెహ్రూకి ఇష్టం లేకపోయినా 'పెళ్లి' ఆపలేక పోయారనే (అందుకే 'అవసరమైతే విడాకులు' ప్రస్తావన) అది చూపుతూ. జెంటిల్‌మన్ 'తాంబూలాలు ఇచ్చేసుకున్నారు. ఢిల్లీ కాంగ్రెసు హైకమాండ్ ఆధ్వర్యంలో 1956 ఫిబ్రవరి 20 నాడు ఈ 'జెంటిల్మెన్' కలిసి అగ్రిమెంటు చేసుకున్నారని గమనించాలి. హైదరాబాద్ అసెంబ్లీలో పై ఓటింగ్ తర్వాత ఇది జరిగిందని గుర్తించాలి. ఓటింగ్ ని వ్యతిరేకించిన మంత్రులు కె.వి.రంగారెడ్డి, చెన్నారెడ్డిలతో పాటు హైదరాబాద్ పిసిసి అధ్యక్షుడు జె.వి. నర్సింగరావు తెలంగాణ 'జెంటిల్మెన్'. ముఖ్యమంత్రి బూర్గుల వారి ప్రతినిధి వర్గానికి నాయకుడైన నాలుగో జెంటిల్మెన్. 'సీమాంధ్ర పాలకులమోసం' అంటూ - వారంతా కలిసి తెలంగాణని మోసంతో విలీనం చేసుకున్నారు- అని మరొక వాదన ఉన్నది. అదీ అవాస్తవమే. అక్కడ అలాంటి ఐక్యత లేదు. శ్రీబాగ్ ఒప్పందం (1937) ద్వారా అక్కడి జెంటిల్మన్ మొదట సీమ, ఆంధ్ర ఐక్యతకు ఒప్పుకున్నారు. కానీ పదవుల పంపకం తగాదాల్లో ఆ ఐక్యత కొనసాగలేదు. ఒక దశలో 23 మంది ఎం.ఎల్.ఎ. సంతకాలతో మద్రాసు నుంచి విడిపోవడాన్నే వ్యతిరేకించాడు నీలం సంజీవ రెడ్డి. మరొక దశలో ఎం.జి. రంగా కూడా విశాలాంధ్రని వ్యతిరేకించారు. అందువల్ల రెడ్డి, కమ్మ భూస్వాములు ఏకమై మోసం చేశారనడం వాస్తవ విరుద్ధం. వారు ఏకమై అక్కడ ప్రకాశం మంత్రివర్గాన్ని పడగొట్టారు. ఇక్కడ 'బూర్గుల' చే త్యాగం చేయించారు. ఉప ముఖ్యమంత్రి కాకపోయినా తమకు ఏఏ శాఖలు కావాలో కోరి సంపాదించుకున్నారు. 'జెంటిల్‌మెన్'. రెండు ప్రాంతాల్లో ప్రజల్లో కమ్యూనిస్టులు ప్రబల శక్తిగా ఉన్నా వారెవ్వరు, ఈ 'జెంటిల్మన్ అగ్రిమెంట్'లో భాగం కాదని గమనించాలి. (బెజవాడ గోపాల రెడ్డి ముఖ్యమంత్రి), నీలం సంజీవ రెడ్డి, గౌతు లచ్చన్న, అల్లూరి సత్యనారాయణ రాజు సీమాంధ్ర జెంటిల్‌మెన్. వీరిలో కమ్యూనిస్టులూ, కమ్మవారు కృష్ణా, గుంటూరు జిల్లాల వారు లేకపోవడం గమనార్హం. ఈ అగ్రిమెంటు జరిగిన రెండు వారాలకి నెహ్రూ నిజామాబాద్ వచ్చి మార్చి 5న భారీ బహిరంగ సభలో ఉపన్యసించారు. నాకు హైదరాబాద్ విభజన సుతరామూ ఇష్టం లేదు... కానీ ప్రజలంతా హైదరాబాద్‌ని విడగొట్టాల్సిందే అన్న కమిషన్ సిఫార్సులతో ఏకీభవిస్తున్నారని తెల్సినపుడు వారి నెత్తిన నా అభిప్రాయాలు రుద్దడానికి నేను ఎవరిని? (అంతకు మూడు నెలల ముందే అసెంబ్లీ ఓటింగ్ జరిగింది.) అందుకే నా దృఢమైన అభిప్రాయమే అయినా దాన్ని నేను వదిలేసుకున్నాను - అని నెహ్రూ ప్రకటించారు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ నివేదిక ఆమేరకు సూచించిందని చెప్పారు. ఆంధ్ర-తెలంగాణ అన్న రెండు వేర్వేరు రాష్ట్రాలు ఉండటం అసమంజసం అనిపించింది. సుదీర్ఘ సంప్రదింపుల తర్వాతే ఈ నిర్ణయం జరిగింది. అని పెళ్లి పెద్దగా చెప్పారు నెహ్రూ. ప్రజల కరతాళ ధ్వనుల మధ్య కొద్ది మైనారిటీ వ్యతిరేకతను సర్దిచెప్పటం కోసం 'ఇష్టం లేకపోతే విడాకులు' అన్న సాధరణ సూత్రాన్ని వల్లించారు. ఇందులో పెళ్లి నిర్దిష్ట

వాస్తవం, అవసరమైతే విడాకుల హామి అని గమనించాలి. 'మియా బీవీ ఏక్ హుయే తో కరేగా క్యా కాజీ?' అని హైదరాబాద్ సామెత ఉంది. జరిగింది అదే. (నెహ్రూ ఉపన్యాసాన్ని సభలో బూర్గుల అనువదించారు. తెలుగు పాఠాన్ని ఈనాడు దినపత్రిక 7 మార్చ్ 2010న ప్రచురించింది.) ఇష్టం లేకపోయినా ఆయన విశాలాంధ్రని ఒప్పుకోవాల్సి వచ్చింది. దానికి గల దేశీ, అంతర్జాతీయ కారణాలను, కొన్నింటిని పైన గమనించాం. ఈ విధంగా హైదరాబాద్ సంస్థానం రద్దు, భాషా రాష్ట్రాలుగా విభజన ఆంధ్రప్రదేశ్ ఏర్పాటూ వెనుక అనేక అంతర్జాతీయ, జాతీయ కారణాలు ఉన్నాయి. దీనిని సీమాంధ్ర దోపిడీదారుల కుట్రగా చూడడం అవివేకం అవుతుంది. అవాస్తవం, చారిత్రక దృష్టిలోపం ఇది. కాంగ్రెస్ ముఠాలకు ఆనాడు ఈనాడు తమతమ స్వప్రయోజనాలే ముఖ్యం విశాలాంధ్రను అంగీకరించినా, వ్యతిరేకించినా, ఊసరవెల్లిగా వ్యవహరించినా, తెలంగాణలోని, సీమాంధ్రలోని కాంగ్రెసు నాయకులు ఈ స్వప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొనే ఉండిరి. ఇక్కడ బూర్గులను, అక్కడ ప్రకాశంను త్యాగం చేయించిన సంజీవరెడ్డి విశాలాంధ్ర సంగతి అలా ఉంచి ఆంధ్ర కోసం నిలబడ్డ వాడేమి కాదు. తనకు పదవిదక్కదేమోనన్న భయంతో ఒక దశలో మద్రాసు నుంచి విభజనను కూడా వ్యతిరేకించాడు. కేంద్రంలోనూ మద్రాసులోను కొన్ని లాబీలతో చేతులు కలిపి 23 మందితో సంతకాలు చేయించి ఆంధ్ర జిల్లాల విభజనను వ్యతిరేకించాడు. కాబట్టి తొలినుంచి ఒక వైపు తెలుగు జాతి ప్రజల పోరాట ఐక్యత కాంక్ష, మరొక వైపు ప్రయోజనాలతో రంగులు మార్చే నాయకుల పదవీకాంక్ష దానికై ఎత్తుగడలు రెండూ ఉన్నాయి. ఇవాల్టి రాజకీయాలతో గత చరిత్ర వాస్తవాల్ని గుర్తించ  నిరాకరించకూడదు. తెలుగుజాతి పోరాట ఐక్యత నేటికీ కావల్సిందే.

సీమాంధ్ర నుంచి వచ్చినవారు 'పేదతెలంగాణ రైతుల భూములను ఆక్రమించుకుంటారని' గోలకొండ పత్రిక (25-7-1954) రాసింది, అక్షర సత్యమైనట్టు కోట్ చేస్తూ, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు వల్ల 'హద్దులు లేని దోపిడికి రాచ బాట దొరికింది' అని రాశారు రమేశ్‌బాబు ఇది ఎంత నిజమో ఎలాంటి నిజమో పరిశీలించాలి. తెలంగాణ దొరలు నిజాం పాలన నీడలో లక్షల ఎకరాలు ఆక్రమించుకొని, ఎలా దోచుకున్నారో, దానికి వ్యతిరేకంగా రైతాంగ సాయుధ పోరాటం ఎలా సాగిందో తెలిసిందే. అక్కడి ప్రాంతంలో తెలంగాణలో వలే వ్యవసాయ విప్లవం లేకపోయినా, జమీందారి వ్యతిరేక పోరాటాలు సాగిన సంగతి గమనించాలి. దానికై భుజం భుజం కలిపి పోరాడింది, త్యాగాలు చేసింది ఇరు ప్రాంతాల ప్రజలూ, కమ్యూనిస్టు కార్యకర్తలు, నాయకులు తెలంగాణలోను, అక్కడ కేంద్ర బలగాలతో నాలుగు వేల మందిని కాల్చి చంపి ఆ పోరాటాన్ని అణిచి వేశారు. పోరాటం ద్వారా పేదలకు పంచిపెట్టిన పది లక్షల ఎకరాల భూములను తిరిగి స్వాధీనం చేసుకోవడానికి, భూస్వాములను తిరిగి ప్రతిష్ఠించడానికి తెలంగాణ దొరలు, నిజాం వారసులు, కాంగ్రెస్ టోపీలు పెట్టుకొని స్వైర విహారం చేశారు. 1954లో ఇంకా ఆ వేట ముగియలేదని గమనించాలి అప్పటికీ ఇంకా వందలాది మంది కమ్యూనిస్టు కార్యకర్తలు ముఖ్యంగా తెలంగాణలో రహస్యంగా ఉండి, కేసులలో ఇరుక్కొని ఉండిరి, దాన్ని విస్మరించి తెలంగాణ భూస్వాముల గొంతును ప్రతిధ్వనించింది, ఆనాటి గోలకొండ పత్రిక రిపోర్టు విశాలాంధ్ర ఏర్పాటు తర్వాత, ఏర్పాటు వల్ల తెలంగాణ భూములు పరాధీనం అయినాయనుకోవడం మరో భ్రమ. పాపులర్ మిథ్ ఇది నాటికి 20 ఏళ్ల ముందు స్థితి పై అదే గోలకొండ పత్రిక 20-01-1936 సంచికలో ఏమి రాసిందో  చూడండి. 'వరంగల్ జిల్లాలో సుమారు 2 లక్షల ఎకరాల భూమి, జిల్లాలన్నింటిలో కలిపి 10 లక్షల ఎకరాల భూమి వలసలకు సిద్ధంగా ఉందని ప్రభుత్వం 1930 నాటికే లెక్కలు తయారు చేసి ప్లానులను సిద్ధం చేసింది. ఇదే విధంగా అప్పటికే సుమారు 20 లక్షల మంది వలస వచ్చారని, 'శ్రీరంగా' పేర్కొన్నారు. (ఈ రిపోర్టు ని దేవులపల్లి 'తెలంగాణ ప్రజల సాయుధ పోరాట చరిత్ర' గ్రంథంలో ఉదహరించారు పేజీ నెం.26) ఈ స్థితి ఎందుకు ఏర్పడిందో కూడా దేవులపల్లి వివరించారు. 'తెలంగాణలో పడావా ఉన్న పట్టా భూమి 41 లక్షల 37 వేల ఎకరాలు ఉన్నట్టు ప్రభుత్వపు లెక్కలే చెబుతున్నాయి'. దీనిలో సుమారు 40 లక్షల ఎకరాలు భూస్వాములు పడావా పెట్టినదే. ఈ భూములు వరి పచ్చిక బయళ్లు రైతుల పశువులను మేపుకు వచ్చి వారి నుంచి డబ్బు వసూలు చేసి ఆ భూమిని సాగు చేస్తే వచ్చే పంట కన్నా హెచ్చు ఆదాయాన్ని సంపాదించేవారు. లక్షల ఎకరాల పడావు భూమి భూ వికేంద్రీకరణకు మరొక ఉదాహరణ' (పై పుస్తకం పేజీ నెం 20). 1952 తర్వాత హద్దుల్లేని దోపిడికి రాచబాట దొరికింది అని రాశారు. అంతకు ముందున్న దోపిడి గురించి స్పృహ లేకుండా లేదా వాస్తవాలు తెలియక ఇలా రాశారని భావించాలి. 'కొన్ని గ్రామాలలో ప్రజలు 40 రకాల పన్నులు చెల్లించవలసి వచ్చేది. తెలంగాణలో ఉన్న సుమారు పది వేల గ్రామాల్లో 2600 వరకు జాగీరు గ్రామాలు ఉండేవి' (పేజీ నెం.11). ఇవి కాక వందలాది మక్తాలు, అగ్రహారాలు ఉండేవి. ఇంకా నిజాం నవాబు ఆయన సామంతుల వశంలో ఉన్నవి 646 సర్ఫేఖాసు గ్రామాలు. వాటిలో అపారమైన ఆదాయాన్నిచ్చే భూములన్నింటిని నిజాం స్వంత ఆస్తిగా కేంద్రం గుర్తించింది. సర్ఫెఖాస్ జాగీరు, మక్తాలు, పోగా మిగిలిన భూమిని 'ఖాల్స' ప్రాంతం అనేవారు అందులో నాలుగింట మూడు వంతుల భుమిపై (75 శాతం) భూస్వాములు యజమానులైనారు' (పేజీ నెం.13) చిట్టడవులతో నిండిన నాటి తెలంగాణలో తన ఆదాయాన్ని పెంచు కోవడానికి ప్రభుత్వం బంజర్లను, ఇజారా (కాంట్రాక్టు) ద్వారా సాగుచేసే పద్ధతిని ప్రవేశపెట్టింది.

'500, 1000 ఎకరాలకు వర్తించే ఈ కాంట్రాక్ట్ 25, 50  ఏళ్ల వరకు ఉండేది. నిర్ణీత కాలం తర్వాత భూస్వాములకు నాలుగవ భాగం వరకు భూమిపై శిస్తు లేకుండా యాజమాన్యం ఇచ్చేవారు. తక్కువ భూమిపై మామూలు శిస్తు రేట్లను విధించేవారు. ఈభూములన్నీ, రైతులు సాగు చేసినప్పటికి యాజమాన్యం భూస్వాములకే చెందేది.....ఇలాంటి గ్రామాలు సుమారు 400 ఉండేవి' (పేజీ 18). 'గ్రామాల్లో తరుచుగా 50 నుంచి 75 శాతం వరకు భూమిపై భూస్వాములే యజమానులుగా ఉండేవారు'. (పేజీ 19) చైనా విప్లవం 1949లో పూర్తయింది. 1966-76 మధ్య సాంస్కృతిక విప్లవంలో పాల్గొన్న యువతరానికి 1949 విప్లవానికి ముందు ఏ స్థితి ఉండేదో అంత లోతైన అవగాహన ఉండేది కాదు. దాంతో సాంస్కృతిక విప్లవం పేరిట మొదలై అరాచకంగా మారింది. ఆ వాస్తవాన్ని గమనించిన మావో స్వయంగా 1972లో, డెంగ్ పియావొ సింగ్‌ని పార్టీ నాయకత్వంలోకి తిరిగి ఆహ్వానించి ప్రభుత్వ బాధ్యతలు అప్పగించారు. ఇప్పుడు తెలంగాణ యువతరం ఒక రకంగా ఇలాంటి స్థితిలోనే ఉంది. గతం తెలియక, కొంత తెల్సింది మర్చిపోయి, కొంత తప్పుదారిలో తిరుగుబాటు చేస్తున్నది.' ఫ్యూడల్ లక్షణాలున్న కాంగ్రెస్‌ను బలోపేతం చేయబూనడం దొరతనపు గడీలను తిరిగి తెరిపించే కుటిల పన్నాగాల గురించి రమేష్‌బాబు హెచ్చరికలు సహేతుకమైనవే. ఆ అవగాహనను లోతుగా కొనసాగించాలి. పైన పేర్కొన్న చారిత్రక పూర్వరంగాన్ని విస్మరిస్తే తిరుగుబాటు తప్పుదారిలో సాగుతుంది. ప్రస్తుతం తెలంగాణలోని పాలకవర్గాలు చేస్తున్న పని ఇదే. కాబట్టి యువతరం 'ఆగి ఆలోచించి ముందుకుసాగాలి'. ఇరు ప్రాంతాల్లోని ప్రజలు ముఖ్యంగా పీడితవర్గాల పోరాట ఐక్యత దెబ్బతినకుండా జాగ్రత్తగా వహించాలి. తెలంగాణలోని విప్లవ ప్రజాతంత్ర మేధావులు, కళాకారులు, ఇతర శక్తులు ఈ కర్తవ్యంలో ఇప్పటికైతే స్పృహ, చైతన్యం కోల్పోయి వ్యవహరిస్తున్నారని చెప్పాల్సివస్తుంది. వారు తమ వైఖరిని సింహావలోకనం చేసుకోవలసిన గుర్తు చేస్తున్నది రమేశ్‌బాబు వ్యాసం. 'మూడు ప్రాంతాలలోను ప్రజా ఉద్యమాలు తప్పుడు రూపాలలోకి ప్రవేశించాయి. రెండు ప్రాంతాల ప్రజల మధ్య అనవసరమైన, అవాంఛనీయ మైన విద్వేషాలు, వైమనస్యం పెరిగి పోయాయి. వందల సంవత్సరాలుగా వీరోచితమైన, అభివృద్ధి నిరోధకమైన ప్రజా పోరాటాలు సాగించిన తెలుగు జాతి ఇన్ని అబద్ధాల మీద ఆధారపడిన, అన్యాయమైన ఆందోళనలకు సిద్ధపడుతున్నారా అని ఆందోళన కలుగుతున్నది. తమ నాయకుల దగాకోరు అబద్ధాల మీద రెచ్చిపోయే స్థితికి తెలుగు ప్రజలు చేరారా అని అనుమానం కలుగుతున్నది. మొత్తం మీద రాజకీయ నాయకులు ప్రజలకు నిజాలు చెప్పరని తేలిపోయింది అని రాశారు - వీక్షణం సంపాదకీయం (జనవరి 2010లో) ఈ స్థితిని నిలవరించే రీతిలో, చర్చను ప్రోత్సహించే విధంగా పత్రికను నిర్వహిస్తారని ఆశిద్దాం.

*(రచయిత పాత్రికేయులు)* వీ

పాలకులు ముందుకు తెస్తున్న అభివృద్ధి నమూనాలో ప్రజల సంక్షేమానికి ఉండే అవకాశాలను, పరిమితులను బడ్జెట్ నేపథ్యంలో వివరిస్తున్నారు **ఆర్.వి. రమణమూర్తి**

# 2011-12 బడ్జెట్ పరిశీలన

**తొ**మ్మిది శాతం ఆర్థికాభివృద్ధి సాధించే దిశలో కేంద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ కేంద్ర వార్షిక బడ్జెట్ 2011-12 ను ప్రవేశ పెట్టారు. రు. 12.57 లక్షల వ్యయ అంచనాలతో, రు. 9.32 లక్షల కోట్లు పన్నుల రూపేణా, రు. 1.25 కోట్లు పన్నేతర ఆదాయం గానూ, ఓ రెండు లక్షల కోట్ల రూపాయలు అప్పు రూపేణా (ద్రవ్యలోటు) డబ్బును సమకూర్చుకుంటామని వారు చెప్పారు. ఈ ద్రవ్యలోటును గత సంవత్సరంలో అయిన 5.1 శాతం (జి.డి.పి.లో) నుంచి ఈ సారి 4.6 శాతంకు కుదించగలుగుతామని, 2013-14 కల్లా (అది ఎలక్షన్ల సంవత్సరం!) దాన్ని 3.5 శాతానికి ఎఫ్.ఆర్.బి.ఎం. చట్టంకు లోబడే దాని టార్గెట్‌కు కుదిస్తామని వారు చెప్పారు. మొత్తానికి ఈ సంవత్సరం బడ్జెట్ లక్ష్యం ప్రభుత్వ జమాబందీ స్థిరీకరణే (ఫిస్కల్ కన్సాలిడేషన్) వారు సూచించారు. ఈ గణాంకాల మతలబు చాలా మంది సాధారణ ప్రజల దృష్టికి పెద్దగా రాకపోవచ్చు. దేశానికి స్వాతంత్రం ఒస్తే, కానిస్టేబుల్ లంచం అడగడం మానేస్తాడా అని అమాయకంగా అడిగే జట్కా బండీ వాడిలా దారిద్ర్యం తగ్గుతుందా, ఆహార ధరలు అదుపులో కొస్తాయా, మన పిల్లలందరికీ ఉపాధి దొరుకుతుందా లాంటి ప్రశ్నలు వేసుకుంటే సమాధానం దొరకడం ఈ కాలంలో చాలా కష్టం. అసలు ఈ విషయాలు మచ్చుకైనా ఈసారి బడ్జెట్‌లో ప్రస్తావించబడలేదు. సాధారణ ప్రజలేమనుకుంటున్నారన్నది ప్రభుత్వాలకు అనవసరం. సర్‌చార్జ్ ఓ 2.5 శాతం తగ్గించడం, డివిడెండ్లపై టాక్స్ తగ్గింపు వల్ల వెంటనే పెరిగిన స్టాక్ మార్కెట్ల స్పందనే వారికి ముఖ్యమని ఏలిన వారి అభిప్రాయం.

దేశంలో దారిద్ర్య రేఖకు కింద ఉన్న వారి శాతం 36 ఉందని టెండూల్కర్ కమిటీ చెప్పింది. అంటే రెండు పూటలా తిండి కూడా తినలేని వారు 48 కోట్ల మంది ఉన్నారు. రోజుకు 20 రూపాయలు కూడా సంపాయించలేని వారు దేశంలో 70 శాతం మంది ఉన్నారని అర్జున్ సేన్ గుప్తా కమిటీ అభిప్రాయపడింది. గత నలభై యేళ్లలో ఆహార ధాన్యాల తలసరి అందుబాటు రోజుకు 173 గ్రాములనుండి 134 గ్రాములకు పడి పోయిందని ప్రభుత్వ గణాంకాలు సూచిస్తున్నాయి. ఆహార ధాన్యాల ధరలు 18 శాతం చొప్పున గత రెండు సంవత్సరాల నుండే పెరుగుతున్నాయి. పెట్రోల్ ధరలు 22 శాతం పెంచారు. ధరల పెరుగుదలలో సాధారణ మధ్యతరగతి నుండి పేద వాళ్ళదాకా జీవితాలు అతలాకుతలం అవుతున్నాయి. కానీ ఇదే సమయంలో దేశంలో ఆర్థికాభివృద్ధి 8శాతం పైనే ఉంటుందన్న గణాంకం ఎలాంటి ధైర్యాన్ని ప్రజలకు కలగజేయలేక పోవడం ఒక ఎత్తైతే దేశంలో ధనికులు ప్రపంచ ధనికుల జాబితాల్లో చేరుతున్నది మరొక పార్శ్వం. అభివృద్ధి సాధించడానికి మార్గాలు అనేకం. అత్యధిక శాతం ప్రజలకు మేలు చేకూరే మార్గాలు కొన్నయితే, కొంత మందికే ఐశ్వర్యాలు ఒనగూర్చే మార్గాలు మరికొన్ని. భారతదేశం ఎంచుకున్న మార్గం ఈ రెండవ కోవకు చెందినది. ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెట్ కూడా ఈ అవగాహనా చట్రంలో ఇమిడేదే.

## నయా ఉదారవాద సిద్ధాంత చట్రం

బడ్జెట్‌లో సాధారణంగా మనం చూడగలిగే విషయాలు నాలుగు. 1. ప్రభుత్వం ఆర్థిక రంగానికి, అత్యధిక ప్రజలు ఆధార పడే రంగానికి ఏ రకమైనా ప్రోత్సాహం ఇచ్చింది అని; 2.ప్రభుత్వం దీనికి గానూ కావాల్సిన ఆదాయ వనరులను ఏ విధంగా అమర్చుకుంటోంది అని అంటే పన్నుల ద్వారా, పన్నేతర ఆదాయం ద్వారా (తన సేవలపై వసూలు చేసే రుసుం ద్వారా) ఇంకా ఎంత అప్పు ద్వారా సమకూర్చుకుంటోంది అని; 3. ఈ ఆదాయం ఖర్చు వ్యూహంతో దేశ ఆర్థికరంగ అభివృద్ధి అత్యంత అధిక స్థాయికి చేర్చి, ధరలను వీలైనంత అదుపులో ఉండేలా చర్యలు చేపట్టడం; 4. సమాజంలో అత్యంత బలహీన వర్గాలకు సంక్షేమం అందించే మార్గాలు చూడడం. అంటే ప్రభుత్వం తనకుతాను ఎంచుకున్న పాత్ర బడ్జెట్‌లో తెలుస్తుంది. బడ్జెట్ అనేది దేశానికి కావల్సిన అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాల కోసం రాబోయే సంవత్సరంలో ప్రభుత్వం సిద్ధం చేసుకున్న ఆదాయ ఖర్చు ప్రణాళిక. ప్రతి ప్రణాళిక వెనక ఒక వ్యూహం ఉంటుంది. ప్రతి వ్యూహం వెనక ఒక అంచనా ఉంటుంది. ఒక విలువ ఉంటుంది. ప్రతి విలువకు ఒక రాజకీయ నైతిక కారణం ఉంటుంది. బడ్జెటును అర్థం చేసుకోవడానికి, విశ్లేషించుకోవడానికి ఈ పార్శ్వాలన్నీ చూడాల్సి ఉంటుంది. ఆర్థిక శాస్త్రంలో ఇంత వరకు అన్ని దేశాలకు అన్ని స్థలకాల పరిస్థితులకు ఒకటే వ్యూహం ఉంటుందన్న అంగీకారమేమీ లేదు. ఏ రాజకీయ వర్గం ఆధిపత్యంలో ఉంటే, ఆ వర్గ ప్రయోజనాలు సరైనవనే భావజాలం ప్రచారం సాధారణంగా ఉంటోంది. అందువల్ల అన్ని వాదనలను నిశితంగా చూడాల్సిన అవసరం ఉంటుంది. ఈ మధ్య మనం వింటున్న కొన్ని వాదనలను ముఖ్యంగా అవగాహన చేసుకోవల్సి ఉంది. ఉదాహరణకు ప్రభుత్వం అభివృద్ధి కోసం ఒక పాత్ర ఎంచుకుని వాడబడింది. దానిక్కావల్సిన వనరులను పన్నుల రూపేణా

రాబట్టుకుంటుంది. కానీ పేద దేశంలో ముందు పన్ను వడ్డిస్తే కష్టమవుతుంది కాబట్టి ప్రభుత్వాలు అప్పు ద్వారా ఈ పాత్ర పోషించుకుంటూ వచ్చాయి. కాని ప్రభుత్వం వారు చెప్పిందేంటంటే అప్పుచేసి తన ఖర్చును పెంచుకోకూడదని, ప్రభుత్వ రుణం ప్రమాద స్థాయికి చేరుకుందని ఒక వాదన బలంగా ఉంది. కాని వాస్తవానికి ప్రభుత్వం అనేది వ్యక్తిలాకాక మరణంలేని వ్యవస్థ కాబట్టి రుణం విషయంలో దానికొవాల్సింది ఒక్కటే. అది దాని జాతీయ ఆదాయం (డబ్బు రూపంలో) దాని వడ్డీ రేటు కంటే ఎక్కువ శాతంగా పెరుగుతూ ఉండాలి. ఉదాహరణకు జాతీయ ఆదాయం 14 శాతం చొప్పున పెరుగుతుంది. కానీ వడ్డీ రేటు 10 శాతం మాత్రమే. కాబట్టి వడ్డీకోసం రాబట్టుకునే ఆదాయం వ్యవస్థలో ఉంది. కాబట్టి వ్యవస్థ దివాళాతీసే పరిస్థితి లేదు. చేయాల్సిందల్లా ప్రభుత్వం ఉచితంగా తన ఆదాయం పన్ను రూపేణా ఇతరత్రా రాబట్టుకోవడం. భారతదేశంలో ప్రభుత్వ రుణం జాతీయ ఆదాయంతో పోలిస్తే 45శాతం కానీ అమెరికాలో ఇది 112 శాతం, యూరపులో 98 శాతం కానీ భారతదేశానికొచ్చే సరికి గగ్గోలు పెట్టే వర్గాలున్నాయి. ముఖ్యంగా ప్రైవేటు కార్పోరేటు వర్గం, ఇంకా బిజినెస్ మీడియా, ఇంకా వారి కథలను సిద్ధాంతాలుగా ప్రచారం చేయగల ఆర్థిక వేత్తలు ఉన్నారు. వీరి వాదనల వెనక వారికి కావల్సినవి ప్రభుత్వం వీలైనన్ని రంగాల్లో ఖాళీ వీరికి వదిలి ఖర్చు తగ్గించు కోవాలని, ఆ ఖాళీ వారు భర్తీ చేసుకోవాలని.

ఇక ముఖ్యమైన రెండవ వాదన, ప్రభుత్వం ద్రవ్యలోటు వల్ల ద్రవ్యోల్బణం పెరుగుతుంది. ఈ వాదానికి భూమిక ఏమిటంటే, ద్రవ్యలోటు (అంటే నిజానికి అప్పు) వల్ల ప్రభుత్వం పన్నులు పెంచుకోలేక, డబ్బును ముద్రించి పంచుతుందని, ధరలు దరిమిలా పెరుగుతాయని. కానీ 9 శాతం లోటులో కూడా ముద్రించే నోట్ల వాటా ఒక శాతానికి దాటలేదు. నిజానికి అప్పు కంటే దాన్ని ఎలా ఖర్చు పెడతాయన్నది ప్రధానమైన ప్రశ్న. సద్వినియోగం చేసుకుంటే, దానిలోంచి ఇంకా ఎక్కువ ఆదాయం సృష్టించి, అప్పు తీర్చవచ్చు. కానీ దుర్వినియోగం చేసుకుంటే నాశనం అయి పోతాయాఖర్చు. కానీ ప్రభుత్వం అప్పును పెట్టుబడి కోసం వాడి అధిక ఆదాయం సమకూర్చుకోవడంలో తప్పు లేదని మిహిర్ రక్షిత్ లాంటి ప్రముఖ ఆర్థికవేత్తలెప్పటినుంచో చెపుతున్నారు. కానీ ద్రవ్యలోటుకు ధరల పెరుగుదలకు వారు చూపిన ఉదాహరణలే ప్రమాణంగా తీసుకొని నయా ఉదారవాద ఆర్థిక వేత్తలు, కార్పోరేటు వాదిస్తాయి. భారతదేశంలో 2000-04 మధ్య ద్రవ్యోల్బణం తక్కువగా ఉండడాన్ని ద్రవ్యలోటు అదుపులోకి తేవడమే కారణం అని వారు వాదిస్తున్నారు. కానీ నిజానికి పరిస్థితి అంత సింపుల్ కాదు. 2002-04 నాటి క్షామ పరిస్థితితుల కారణంగా ధరలు పెరిగి, 2005-07 మధ్య విపరీతంగా పెరిగాయి. మరి అప్పుడు ద్రవ్యలోటు అత్యంత తక్కువైన 2శాతం మాత్రమే ఉంది. ఓ పక్క ఆహార ధరలు మరొక పక్క పెట్రోలు ధరలు పెరగడం వల్ల ఉత్పన్నమైన ద్రవ్యోల్బణం, ద్రవ్యలోటు నియంత్రణ ద్వారా కంట్రోలు చేయలేం. చేసినా దాని ప్రభావం పరిమితం, నష్టం అపరిమితం.

## సంస్కరణల దిశ అభివృద్ధి నమూనా

ప్రస్తుత భారత ఆర్థిక రంగ దశ-దిశలు 1991 సంస్కరణలు నిర్ణయించిన దిశలోనే వెళుతున్నాయనడానికి సందేహం లేదు. ఇందులో ముఖ్యమైనవి ద్రవ్యలోటును 10 నుండి 3 శాతంకు కుదించడం. అందుకు జిడిపి లో ప్రభుత్వ ఖర్చును గణనీయంగా తగ్గించడం. ఇందుకుగానూ కాపిటల్ ఎక్స్‌పెండిచర్‌ను 6.5శాతం నుండి 1.8శాతానికి కుదించారు. ఇక ప్రభుత్వ పన్నులకు, సుంకాలను తగ్గించడం. పన్నుల రేట్లను 1990కి పూర్వం అధిక శాతం ఉన్నది వాస్తవం. కానీ వారు చెప్పిందాని ప్రకారం పన్నురేట్లు, సుంకాలు తగ్గించడం వల్ల పన్ను చెల్లింపులు పెరిగి, జాతీయాదాయంలో పన్ను చెల్లింపుల వాటా పెరగాలి. కానీ దీనికి విరుద్ధంగా అది 1991లో 20 శాతం నుండి 2010లో 10 శాతానికి పడిపోయింది. అలాగే జిడిపిలో పన్నేతర ఆదాయం శాతం కూడా ప్రైవేటీకరణ పుణ్యంగా 2శాతం దగ్గరే ఆగిపోయింది. కార్పోరేటు టాక్స్ 30 శాతానికి, ఇన్‌కమ్ టాక్స్ 10-20-30 శాతానికి, సుంకాలు 10-20 శాతానికి ఎప్పుడు కుదించేశారు. కాబట్టి ఇంక బడ్జెట్‌లో ఇంకా కుదించడానికి సర్‌చార్జ్‌లు తప్ప ఇంకేమీ మిగల లేదు. ఇంతకంటే పన్నులు తగ్గిస్తే ఇక ప్రభుత్వం పడడానికి కూడా ఖర్చు ఉండదు. మొత్తం దేశంలో అభివృద్ధికి మూలమైన పెట్టుబడిలో ప్రభుత్వం వాటాను 12.5శాతం నుండి 6.5శాతానికి కుదించేశారు. ప్రభుత్వరంగ సంస్థలకు బడ్జెట్‌నుంచి వచ్చే సహాయం 86 శాతం నుండి 15 శాతానికి కుదించారు. పెట్రోలు కూడా ఇంక ప్రపంచ ధరలకనుగుణంగా పెంచే విధానానికి తెరతీయడం మనం చూశాం. కాబట్టి ప్రభుత్వ దేశీ ప్రగతిని పూర్తిగా ప్రైవేటు, కార్పోరేటు రంగానికి వదిలేసి, తన పాత్ర నామమాత్రం చేసుకోవడం ఈ ఆర్థిక నమూనాలో భాగం కాబట్టి ఇక మనం బడ్జెట్‌లో ఈ వ్యూహానికి విరుద్ధంగా ఏమైనా ఉంటాయని ఊహించడం అవసరం లేదు.

కానీ ఏలినవారి దీర్ఘకాలిక వ్యూహాలను చూస్తే బాధకలగక మానదు. ప్రైవేటీకరణ, కుదింపుల కారణంగా ప్రభుత్వరంగంలో సంఘటిత ఉపాధి అవకాశాలు 1999 నుండి 2010 వరకు18లక్షలు తగ్గాయి. ఈ పోయిన ఉద్యోగాలు ప్రైవేటురంగంలో వచ్చాయా అంటే, ఎకనామిక్ సర్వే ప్రకారం అక్కడ వచ్చిన ఉద్యోగాల సంఖ్య 14లక్షలు. అంటే గత 15ఏళ్లుగా సంఘటిత రంగంలో 4 లక్షల ఉద్యోగాలు పోయాయి. దేశ ఆదాయం అత్యంత వేగవంతంగా పెరుగుతున్న కాలంలో సంఘటితరంగ ఉద్యోగాలు పతనమవుతున్నాయి. పెరిగిన ఉపాధి అల్లా కనీస వేతనాలు, ఎలాంటి భద్రతాలేని అసంఘటిత రంగంలో. ఒక్క ఐటిరంగం తప్ప, కాస్త భద్రత, గౌరవప్రదమైన వేతనం ఉన్న ఉద్యోగాల సంఖ్య చాలా పరిమితం. చదువుకున్న యువకులకు విదేశాలకు పోవడం తప్ప ఈ దేశంలో పెద్దమనుగడ లేని పరిస్థితి కల్పించారన్నది కళ్లకు కనపడుతున్న వాస్తవం.

దేశంలో కింది 40 శాతం ప్రజలు తినవలసిన 2100 కాలరీల కంటే తక్కువగా 1700 కాలరీల ఆహారం మాత్రమే తీసుకుంటున్నారని గణాంకాలు చెపుతున్నాయి. అంటే వీరికి 500 కాలరీలు అదనంగా అందాలంటే దేశంలో ఉత్పత్తి 30-50 మిలియన్ టన్నులు అధికంగా లభ్యం కావాలి. కానీ ఈపరిస్థితి లేదు. 50 శాతం పిల్లలు ఉండాల్సిన బరువుకంటే తక్కువగా ఉన్నారని, 70శాతం స్త్రీలు రక్తహీనతతో బాధపడుతున్నారని ఎన్.ఎఫ్.ఎచ్.ఎస్. గణాంకాలు చెపుతున్నాయి. ఆహారభద్రత కరువైందనే సత్యం నిరూపించడానికి ఇంతకంటే ఆధారాలు అవసరం లేదు. ప్రభుత్వ విధానాల ఫలితంగా దేశంలో ప్రజలు

*సంక్షేమ పథకాలూ, రాయితీలలోని డొల్లతనాన్ని వివరిస్తూ జనాభాలో అత్యధికంగా ఉన్న బహుజనులు దామాషా పద్ధతిన అన్నిటా తమకు రావాల్సిన వాటా కోసం పోరాడాలని అంటున్నారు* **పాపని నాగరాజు**

# ఎవరెంతో వారికంత రాని బడ్జెట్

మన పాలకులు ప్రతిసంవత్సరం ప్రవేశపెడుతున్న బడ్జెట్‌లో రోజురోజుకు కోతలే ఎక్కువవుతున్నాయి. ఇది ప్రస్తుత ఆర్థిక ఒత్తిడి మూలంగా తాత్కాలికంగా వచ్చిన తగ్గింపు కాదు. ఇది ముందుగానే చేసుకున్న ఒడంబడిక వల్లవచ్చిందేనని అర్థం అవుతుంది. భావి సంవత్సరాల్లో ఈ పనుల కోసం ప్రత్యేకించిన గ్రాంటులను తగ్గించడం జరుగుతుందేమో గాని పెంచడం జరగలేదు. జరగదు కూడా. బడ్జెట్‌లో ఆర్థికంను ఏఏ రంగాలకు ఎంతెంత కేటాయించారో, ఎంత అవసరం వచ్చిందో, ఎందుకు వచ్చిందో సభలో చర్చ జరిగి అనంతరం సెక్షనుల వారిగా ఓటింగ్‌కు పెట్టాలి. అంతేకాదు కేటాయించిన రంగం తాలుకు వివరాల ప్రతిని కూడా జతచేయాలి. అనగా ప్రజల మనోభీష్టాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. ప్రజల అమోదం ఈ సందర్భంలో అత్యంత అవసరం అవుతుంది. ఆర్థిక వ్యవస్థ ఏర్పాటు విషయంలో ప్రజల అభిప్రాయాలకు కూడా ప్రాధన్యం ఉండాలని స్వాతంత్ర్యానికి పూర్వమే మహానియుడు డా. బి.ఆర్. అంబేద్కర్ సూచించారు. కాని మనం ఆ సూచనలను పరిగణనలోకి తీసుకోని అమలు జరపడం లేదు.

పైగా మన ప్రభుత్వాలు సంపన్న కులాల సంపన్నతనం ఉండగా, వెనుకబడిన కులాల ప్రజల సంక్షేమం కష్టంగా ఉంటే కేంద్రం లేదా రాష్ట్రం అభివృద్ధి చెందిన కులాలకు నిధులను తగ్గించాలి. అభివృద్ధి చెందని కులాల ఆ బడ్జెట్లను పెంచాలి. కేంద్ర, రాష్ట్ర సుంకాలు తగ్గించి సవరించాలి. ఒక్కమాటలో పథకాల ఫలితాల పట్ల ప్రజల ఆమోదం అనేదానిని ప్రగతికి అత్యవసరమైన విషయంగా గ్రహించాలి. కాని మన పాలకులు అలా చేయకుండా దొడ్డి దారిని ఎంచుకోని వారి అవసరాలను ప్రజలపై రుద్దడం జరుగుతోంది. ప్రజల ఆమోదంతో రాష్ట్రం గాని, దేశంగాని ప్రగతి పథంలో ప్రయాణించడం జరిగిన, జరగకపోయినా

తీసుకోవాల్సిన ఆహారంలో కూడా సమతుల్యం లోపించింది. కానీ ఈ విషయాలు బడ్జెట్‌లో ప్రాధాన్యత సంతరించుకోవు. ఆహారభద్రత చట్టం అని అట్టహాసంగా చెప్పుకుంటున్న ఈచట్టం ఫలితంగా ఇప్పుడున్న 25 కిలోలపై అదనంగా ఓ 10 కిలోలు ధాన్యం ఇవ్వడానికి ఈ బడ్జెట్‌లో ఒప్పుకున్నారు. కానీ ఇచ్చే బియ్యం, గోధుమల వల్లే ఆహారభద్రత, ఆరోగ్యం చేకూరడం జరగదు. పప్పుదినుసుల లభ్యత దేశంలో 71 గ్రాముల నుండి 34 గ్రాములకు పడిపోయింది. దీని ఉత్పత్తిని ప్రోత్సహించాలని పలువురు సూచిస్తుంటే, ప్రణబ్ ముఖర్జీ దానికి రు. 300 కోట్లు కేటాయించారు. దేశం మొత్తం మీద ఈ రు. 300 కోట్లు ఏమూలకొస్తాయో మనం ఊహించుకోవచ్చు. వ్యవసాయరంగానికి బ్యాంకులు ఇచ్చే రు. 20 లక్షల కోట్లు రుణంలో కేవలం రు. 3.75 లక్షల కోట్లు 56 శాతం ఆధారపడే రంగానికి కేటాయింపు 10.8 శాతం! ఇంక ఆహారధాన్యాల ఉత్పత్తి, నాలుగు సంవత్సరాల నుండి పెరగలేదంటే ఎందుకో మనం అర్థం చేసుకోవచ్చు.

రెండు దశాబ్దాలుగా వ్యవసాయరంగం వివక్షకు గురై సరైన పెరుగుదలకు నోచుకోలేదు. దరిమిలా వ్యవసాయంలో ఉపాధి తగ్గింది. ఉత్పత్తి పెరగకపోవడం వల్ల ధరలు పెరుగుతున్నాయి. కానీ ఖర్చులు పెరగడంవల్ల రైతులు ఈ ధరలతో పెద్దగా లాభపడడం లేదన్నది వాస్తవం. ఆహారధాన్యాల ఉత్పత్తి పెంచడానికి ప్రభుత్వం పెద్దఎత్తున పెట్టుబడి పెట్టి, మౌలిక సదుపాయాలతో పాటు మార్కెట్ సపోర్ట్ పెంచి ఈ రంగానికి చేయూతనివ్వాలి. కానీ ప్రభుత్వం తన పాత్రను వెనక్కి తీసుకున్న ఈ వైనంతో వెసులుబాటు లేకుండా చేసుకుంది. ఈ సమస్యకు పరిష్కారం కార్పోరేటు పెట్టుబడులను, రిటైల్ రంగాన్ని దించడంలో వెతుకుతోంది. కానీ సప్లైచైన్ స్థిరీకరణ కాదు, ఉత్పత్తి–ఉత్పాదకతను పెంచేచర్యలు అవసరం.

రెండవ అంశం అవినీతి లేని పాలన అందించడం. కార్పోరేటు కల్చరును ఎగదోసిన ఈ కాలంలో అవినీతిని కాంగ్రెసుపార్టీ సంస్థాగతం చేసింది. విద్య, వైద్యం, గనులు, ఖనిజాలు వీటన్నిటిలో విపరీతమైన లంచాలు పొందే అవకాశం పెరిగింది. ఆర్థిక పెరుగుదల సాధించే దిశలో పబ్లిక్ – ప్రైవేట్ మార్గంలో కార్పోరేట్ రంగానికి మౌలిక రంగంలో విపరీతమైన అవకాశాలు కల్పిస్తున్నారు. విద్యుత్ ఉత్పత్తి, రోడ్లు, పోర్టులు రంగంలో ప్రైవేట్ సంస్థలు ఉత్పత్తిని, పోటీలేని కాంట్రాక్ట్‌ద్వారా ప్రభుత్వానికి అమ్మే ప్రక్రియ సాగుతోంది. ఈ రకమైన అభివృద్ధి నమూనాను ప్రజలు తిరస్కరించడం అప్పుడే మొదలైంది. సోంపేట, కాకరాపల్లి ప్రజలు, మహారాష్ట్రలో జైతాపూర్‌కి వ్యతిరేకంగా, బెంగాల్‌లో నందిగ్రామ్, సింగూర్‌లలో, ఒడిశాలో పోస్కోకి వ్యతిరేకంగా సాగుతున్న పోరాటాలు ఈ వ్యతిరేకతకు చిహ్నాలే. ద్రవ్యలోటు స్థిరీకరించే లక్ష్యంగా ఎంచుకున్న ప్రణబ్ బడ్జెట్ మెజారిటీ ప్రజల సంక్షేమానికి ఒనగూర్చింది తక్కువ. కానీ కిందిస్థాయి ప్రజలు తిరగబడకుండా మాత్రం కొంత రిజర్వ్ సంక్షేమం పాటిస్తున్నారు. ప్రభుత్వపాత్రను ఇంతకుమించి వాడడానికి వీరి నమూనా ఒప్పుకోదు.

*(రచయిత అర్థశాస్త్ర అధ్యాపకులు, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ)* వీ

తమకేం పట్టింపులేదని వ్యవహారిస్తున్నారు. అందుకు 2011-12 ఆర్థిక బడ్జెట్‌యే నిదర్శనం.

ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి ప్రభుత్వంలోని ఆర్థిక మంత్రి ఆనం రాంనారాయణరెడ్డి తేది 23 ఫిబ్రవరి 2011 బుధవారం రోజున లక్షా 28 వేల 542.02 కోట్ల రూపాయల బడ్జెట్‌ను ప్రవేశపెట్టారు. ప్రణాళిక వ్యయం రు. 47,558.85 కోట్లు. మూలధనవసూల్లు రు. 17,854.54 కోట్లు. రెవెన్యూ మిగులు రు. 3,825.64 కోట్లు కాగా ద్రవ్యలోటు రు. 17,601.94 కోట్లు. అయితే మన పాలకులు కేటాయించిన బడ్జెట్ గత 2008-09లో లక్షా 436 కోట్ల 55వేల రూపాయల బడ్జెట్‌ను ప్రతిపాదించగా ఖర్చు చేసింది మాత్రం రు. 86,467 కోట్లు (24.81 శాతమే). 2009-10లో రు. 1,03,485 కోట్ల 33 బడ్జెట్‌ను కేటాయించితే ఖర్చు చేసింది రు. 85,107 కోట్ల 78 లక్షలు (21.59 శాతం). 2010-11లో రు. 1,11,056 కోట్లు కేటాయిస్తే 85 వేల కోట్ల రూపాయలకు మించి ఖర్చు చేసింది లేదు. కానీ కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చిన 2004 నుండి నేటి వరకు అప్పు తెచ్చి ప్రజలపై భారాన్నిమోపిందని చెప్పొచ్చు. వాటి వివరాలను పరిశీలిద్దాం. 2004-05లో రు. 66,393 కోట్లు, 2005-06లో రు. 70,407 కోట్లు, 2006-07లో రు. 75,399 కోట్లు, 2007-08లో రు. 82,478 కోట్లు, 2008-09లో రు. 93,568 కోట్లు, 2009-10లో రు. 1,09,342 కోట్లు, 2010-11లో రు. 1,23,226 కోట్లు, 2011-12లో రు. 1,41,150 కోట్లు. ఈ అప్పులు కేవలం కాంగ్రెస్ పార్టీయే విదేశీ అప్పులను తెచ్చి మన రాష్ట్ర బడుగులపై మోపింది.

ప్రభుత్వం కేటాయించిన బడ్జెట్‌లో మెజార్టీగా ఖర్చుకంటే కోతలనే హెచ్చించింది. ఈ బడ్జెట్‌లో విద్యకు రు. 4,461 కోట్లు, పాఠశాల విద్యకు రు. 14,025 కోట్లు, వైద్యం-ఆరోగ్యం రు. 2,117 కోట్లు, వ్యవసాయరంగం రు. 2,148 కోట్లు, గ్రామిణాభివృద్ధి రు. 4,953 కోట్లు, నీటిసౌకర్యం రు. 606 కోట్లు, విద్యుత్ రు. 625 కోట్లు తదితర వాటిలో కేటాయించిన పద్ధతి చూస్తే ప్రజా అవసారాలకు ఏమాత్రం సరిపోవు. ఇక సంక్షేమ రంగాలకు సంబంధించి సాంఘిక సంక్షేమ శాఖకు రు. 1,549 కోట్లు, గిరిజన సంక్షేమ శాఖకు రు. 692 కోట్లు, వెనుకబడిన సంక్షేమ శాఖకు రు. 1,502 కోట్లు, మైనార్టీ సంక్షేమ శాఖకు రు. 295 కోట్లు, మధ్యాహ్న భోజన పథకం రు. 372 కోట్లు, రు. 1,948 కోట్లు, చేనేతకు రు. 322 కోట్లు, పోషకాహార పథకం రు. 465 కోట్లు, పశు సంవర్ధన, మత్స్య పరిశ్రమలకు రు. 370 కోట్లు, యువజన వ్యవహారాలు రు. 168 కోట్లు, ఉపాధి హామి పథకంకు రాష్ట్ర వాటా రు. 600 కోట్లు. ఫీజు రీయింబర్స్‌మెంట్‌ల, ఉచిత విద్యుత్ ప్రస్తావనే లేకుండా ఈ కేటాయింపులను ప్రభుత్వం చేసింది. నిజానికి ఈ కేటాయింపులవల్ల ప్రజల సంక్షేమం జరుగుతుందా అంటే జరగదని చెప్పొచ్చు. మొత్తం బడ్జెట్‌లో 10 శాతంకు మించడం లేదు. పైగా ప్రజలు అనేక ఇబ్బందుల పాలవ్వడం తప్ప మరేమీ కాదు. బడ్జెట్ కేటాయింపులు ప్రభుత్వ భాగస్వామ్యంతో నిర్వహించే విధంగా కాక ప్రైవేటు భాగస్వామ్యంతో నడిచేవిధంగా ఉన్నాయి. ప్రజల సంక్షేమ రంగాలకు ప్రభుత్వం తగిన స్థాయిలో నిధులు ఇవ్వదని చెప్పకనే చెబుతుందనడానికి ఈ తగ్గింపులే కారణం. పాలకులు ప్రజల అభివృద్ధికి పెద్దపీట వేయాల్సిన స్థాయిలో వేయకుండా ఆ నిధులను దారి మల్లిస్తున్నారనడానికి ఈ అసమానతల కేటాయింపులే తెలియజేస్తాయి. మన పాలకులు బ్రిటిష్ వారి నుండి ఏఏరంగాలకు వివక్షతలను ఎలా ప్రదర్శించాలో నేర్చుకున్నారనడానికి పై కేటాయింపులే నిదర్శనం. అంతే కాదు నాడు బ్రిటిష్ సర్కార్ పోలీసు రక్షణకే అధిక బడ్జెట్‌ను కేటాయించి పూర్తిస్థాయిలో ఖర్చు చేసింది. పోలీసు, రక్షణ రంగాలకు నాటి నుండి నేటికి అదే విధానాన్ని అనుసరిస్తున్నారు. ఉదాహరణకు గత (2010-11) సంవత్సరంలో 3 వేల 343 కోట్ల రూపాయలు కేటాయించి రు. 3,317 కోట్లు ఖర్చు చేయడమే. పోలీసు శాఖకు కేటాయించినట్లు మరే ఇతర శాఖలకు నిధులను కేటాయించి ఖర్చు చేసిన ధాఖలాలు లేనేలేవు.

గత ఎన్నికల ముందు విద్యార్థులు ప్రత్యామ్నాయంవైపు వెళ్లకుండా ఉండేందుకు ఎస్.సి., ఎసి.టి., బి.సి., మైనార్టీ, ఇబిసిలకు ప్రాథమిక స్థాయి విద్య నుండి శాస్త్ర, సాంకేతిక విద్యలైనా ఇంజనీరింగ్, మెడికల్, బిఇడి, ఫార్మసీ, ఎంఇడి, ఎంబిఎ, ఎంసిఎ, లా, వ్యవసాయ, ఎంటెక్, ఎంఫార్మసి, పిజి, వరకు ఉచితంగా చదివించే బాధ్యత తమ ప్రభుత్వానిదేనని వాగ్దానం చేశారు. ఈ వాగ్దానం అమలు చేయడానికి తగిన స్థాయిలో నిధులను కేటాయించి బడుగుల విద్యాభివృద్ధికి తోడ్పాటు అందిస్తామని ప్రకటించింది. కానీ ఈ వాగ్దానం అమలుకు తగిన చర్యలు తీసుకోలేదు. ఈ ఏడాదికి బడ్జెట్‌లో లక్షలాది మంది విద్యార్థుల విద్యా భవిష్యత్తును కాపాడే ఫీజు రీయింబర్స్‌మెంట్, స్కాలర్‌షిప్స్ విషయం ప్రస్తావన లేకుండానే పాలకులు చేసారు. ఈ యేడు 25 లక్షల మందికి పైగా విద్యార్థులు స్కాలర్‌షిప్‌ల, రీయింబర్స్‌మెంట్‌లకు అర్హులైనారు. వీరిలో బిసిలే అధికంగా 14 లక్షల మంది విద్యార్థులు ఉన్నారు. గత సంవత్సరం నుండి ఫీజు రీయింబర్స్‌మెంట్‌లు అందించడంలో కష్టంగా ఉందని, మధ్యలో చదువు అగిపోయే ప్రమాదం ఉంటుందని బిసి విద్యార్థులు వృత్తి విద్యా కోర్సులలో అడ్మిషన్‌లు తీసుకోలేదు. గత ఏడాది 1.14 లక్షలు మంది విద్యార్థులను, ఈ విద్యా సంవత్సరంలో 1.40 లక్షల విద్యార్థుల దరఖాస్తులను ప్రభుత్వం తిరస్కరించింది. తిరస్కరించిందనడం కంటే బడుగువర్గ పేదలు చదువుకు నిరాకరియులని లేద చదువుకోవద్దని హెచ్చరించిందని అనడం మంచిది. ఇదే విధానం క్రమక్రమంగా ముందుకే సాగుతుంది. సిఫార్సుల, సమీక్షల పేరుతో బడుగుల అభివృద్ధి కోసం ఏర్పాటు చేసిన సంక్షేమ శాఖలకు క్రమక్రమంగా కోతలను విధించి అగ్రకుల ఉన్నత వర్గాలకు లాభ ధాయకమైన సెజ్జులకు, కుంభకోణాలను పాలకులు ప్రోత్సహిస్తున్నారు.

అయితే రాష్ట్రంలో దళారీ అగ్రకుల ఉన్నత వర్గ ప్రభుత్వాలు ప్రజల్ని దారిద్రరేఖ నుండి అభివృద్ధి వైపుకు తీసుకెళ్లడంలో చూపించని ప్రత్యేక శ్రద్ధను దారిద్రరేఖకు దిగువకు నెట్టడంలో చూపుతున్నారు. అలా లేదంటే కేంద్ర పన్నుల వాటా, ఆదాయ వ్యయాలపై పన్ను, ఆస్తిపన్ను, సరుకుల పన్ను, పన్నేతర ఆదాయం, గ్రాంట్స్‌ఇన్ ఎయిడ్, కంట్రిబ్యూషన్లు ఇలా రాష్ట్ర ఆదాయంకు సంబంధించిన బడ్జెట్ వనరులు ఎక్కడికెళుతున్నాయో ప్రభుత్వాలే తెలియ జేయాలి. ఇంతటి రాబడి వస్తుండగా కేంద్ర ప్రభుత్వం నుండి, విదేశాల నుండి అప్పులను తేవడమెందుకు అన్నదే అసలు ప్రశ్న. ఈ ప్రజల ధనం నల్లధనంగా

ప్రజల పేరిట తెచ్చిన అప్పులతో సహా బడ్జెట్ నిధులను కార్పొరేట్‌లకు దోచిపెడుతున్నారనీ, మౌలికంగా జరగాల్సిన అభివృద్ధిని విడిచిపెట్టి జనాకర్షక పథకాలపై నిధులు దుర్వినియోగం చేస్తున్నారనీ అంటున్నారు **వి. హనుమంతరావు**

# ఈ బడ్జెట్ ఎవరి అభివృద్ధికి?

ప్రస్తుతం మనం బడ్జెట్ల సీజన్‌లో ఉన్నాం. కొన్ని సంవత్సరాల క్రితం కేంద్రం బడ్జెట్ ప్రవేశపెడుతున్నదంటే సిగరెట్ల మీద పన్ను పెంచడం ఆర్థిక మంత్రి ఎజెండాలో మొట్టమొదటి అంశంగా ఉండేది. పన్నులు విధించడానికి ప్రభుత్వ వాదన ఒక్కటే. దేశం అభివృద్ధి చెందాలంటే ప్రజలు పన్నుల భారం భరించాల్సిందేననీ, వర్ధమాన దేశాల్లో ఇది తప్పదనీ, కాని దేశంలో ప్రపంచ బ్యాంక్ పాలన 1991లో ప్రారంభమైనప్పటి నుంచి ఎజెండా పూర్తిగా మారిపోయింది. అప్పు ఎక్కడ పుడుతుంది, ఎక్కడ నుంచి ఎంత తెచ్చుకుందాం, విదేశీ పెట్టుబడులు ఏయే రంగాల్లోకి అనుమతిద్దాం, కార్పొరేట్ రంగాన్ని ఎలా ఉద్ధరిద్దాం – ఇవే ప్రతీ బడ్జెట్‌లో కనబడుతూ వస్తున్నాయి. ఈ చర్యలు తీసుకొంటే తప్ప దేశం అభివృద్ధి చెందడం సాధ్యం కాదంటూ నాయకులు చెబుతున్నారు. దేశాభివృద్ధి అవసరమే. కాని పైన పేర్కొన్న కార్యక్రమాలు అభివృద్ధికి తోడ్పడుతాయా అనేదే ప్రశ్న. దేశం అంటే ప్రజలు కదా. దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్ అన్న గురజాడ సూక్తి ఈ ప్రపంచం ఉన్నంత కాలం, అన్ని దేశాలకూ వర్తించే సూక్తి. కాని మన దేశ పాలకుల విధానాలు చూస్తుంటే అభివృద్ధి మీద కేంద్రీకరించి ప్రజలను మరచిపోతున్నారనిపిస్తోంది.

### అభివృద్ధి – పెరుగుదల

2011-12 బడ్జెట్‌ను చూస్తే, నడుస్తున్న సంవత్సరంలో అభివృద్ధి సాధించాం, వచ్చే సంవత్సరం కూడా అభివృద్ధి కొనసాగుతుందని ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ ఆశాభావాన్ని వ్యక్తం చేస్తున్నారు. దీనికి రుజువుగా స్థూల జాతీయాదాయం పెరిగిన విషయాన్ని ఉదహరిస్తున్నారు. పెరిగిన మాట వాస్తవమే అయినా ఆ పెరుగుదల ధరల పెరుగుదల వల్ల ఏర్పడిందనే విషయాన్ని దాటవేస్తోంది ప్రభుత్వం. అయితే అది పెరుగుదలే కాని అభివృద్ధి కాదు. జాతీయాదాయం పెరిగిందంటున్నాం కాని అభివృద్ధి చెందిందని అనం కదా? పెరుగుదల వేరు, అభివృద్ధి వేరు. మనం పెరుగుదలను సాధిస్తున్నాం కాని అభివృద్ధిని సాధించడం లేదు. మనం సాధిస్తున్న పెరుగుదల అభివృద్ధికి దారితీయడం లేదనడానికి మనం సృష్టిస్తున్న సంపద అతి కొద్దిమంది చేతుల్లోకి పోవడమే తిరుగులేని వాస్తవం. ప్రభుత్వం పాఠశాలలను ఏర్పాటు

మారి సిస్‌బ్యాంకుల్లో జమవుతుందనే అక్క పోగుపడుతున్న కోట్ల రూపాయల నుండి అర్థం చేసుకోవచ్చు, ఊహించవచ్చు. ఓ వైపు నల్లధనంపై జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో చర్చ జరుగుతుండడం దృష్ట్యా విదేశాల్లో ఉన్న నల్లధనంను తిరిగి దేశానికి తెప్పిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఈ అనుమానం బలపడడానికి ఇదే కారణం అవుతుంది.

దళిత, గిరిజన, మైనార్టీ, మహిళల అభివృద్ధికి తగిన స్థాయిలో నిధుల్ని కేటాయించడం లేదు. అనేక వివక్షతలు, దోపిడీలు, దౌర్జన్యాలు, అసమానతలు వీరిపై విరివిరిగా పెచ్చరిల్లుతున్నాయి. వీరిలో విద్య, ఉద్యోగ, రాజకీయ తదితర రంగాలలో జనాభా దామాషా నిష్పత్తి ప్రకారం అందడంలేదు. దళిత, గిరిజన, మైనార్టీ, మహిళలతో పాటు మరి ముఖ్యంగా కుమ్మరి, కమ్మరి, గౌడ, చాకలి, మంగలి, వడ్రంగి, పద్మశాలిలతో పాటు వందకుపైగా ఉన్న బిసికులాల చేతివృత్తులను నాశనం చేస్తూ వాటి స్థానంలో బహుళజాతి సంస్థల, స్వదేశి అగ్రకుల వలస పెట్టుబడారుల కంపెనీలు వెలుస్తున్నాయి. వీటికి అగ్రకుల దోపిడీ పాలకులు ఆహ్వానం పలుకుతున్నారు. అంటే ప్రభుత్వం బడుగువర్గ పేదల కోసం పనిచేస్తుందని చెప్పడం వట్టి బూటకం మాత్రమే. ప్రభుత్వం ఇచ్చే అభివృద్ధి ఫలాలు, వాటాలు, నిధులు, అధికారాలు బిసిల అభివృద్ధికి దోహదపడేవిగా లేవు. అందుకు కారణం బిసిల జనాభా లెక్కలు అగ్రకుల పాలకుల లెక్కించకపోవడంలో ఈ వివక్షత జరుగుతుంది. దళారీ అగ్రకుల పాలకులు బిసిల జనాభా లెక్కిస్తే అగ్రకులాలకు అందుతున్న రాజ్యం అభివృద్ధి ఫలాలు దక్కకుండా పోతాయనే లెక్కించడంలేదని అర్థం చేసుకోవాల్సింది. ఇదే అసలు మర్మం.

ఈ స్థితిలో బడుగు జనులు, ఇందులో ముఖ్యంగా బిసిలు సమాజాభివృద్ధికి సింహభాగాన్ని ఆవలింపు చేసుకోని తోడ్పడుతున్నారు. కావునా బిసిలకు రాజ్యం అభివృద్ధి ఫలాలను జనాభా ప్రకారం అందివ్వాలని పోరాడాల్సిన అవసరం ఉంది. సంక్షేమ, రాయితీలకే పరిమితం కాకుండా జనాభా దామాషా ప్రకారం బిసిలు అన్నికులాల, మతాల, తెగల, జాతుల, మహిళలతో పాటు పోరాడాల్సిన అవసరం ఉంది. పాలకులు సంక్షేమ పరిధిలోకి బిసిలను నెట్టి, వీరి ఫలాలను భుజిస్తున్నారు. ఇదే స్థితిని సోదర పీడిత కులాల, తెగల, మైనార్టీ ఇతర సామాజిక వర్గాల ప్రజలది. సంక్షేమం, రాయితీల పొందే ఈవిధానాన్ని మనం అనుసరించడం సరైందికాదు. దీని ఫలితంగా దాదాపు వందల సంవత్సరాలుగా బడుగులంగానే అడుగు స్థాయిలోనే ఉండాల్సిన స్థితి దాపురించింది. ' రాయితీలు మాకా రాజ్యాధికారం మీకా ఇకపై చెల్లదు' అని నినదించి ఎవరి జనాభా ఎంతో వారి జనాభా దామాషా ప్రకారం అన్నిరంగాలలో వాటా, కోటాలకై పోరాడాలి. ఇదే ప్రస్తుత పరిస్థితిలో బడుగువర్గ ప్రజలపై ఉంది.

*(రచయిత బిసి మహాజన సమితి నాయకులు)* వీ

చేస్తుంది కాని ఉపాధ్యాయులుండరు, భవనాలుండవు, పిల్లలు పూర్తి హాజరు ఉండదు. కూర్చోవడానికి బల్లలుండవు. దీనర్థం పాఠశాలల సంఖ్య పెరుగుతుంది కాని విద్యాభివృద్ధి జరగడం లేదనే కదా. ఇలా అభివృద్ధి సాధించాం అని మంత్రులు ఉపన్యాసాలిచ్చినప్పుడు ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలి. ప్రభుత్వం మన వద్ద నుంచి పన్నులు వసూలు చేసేది ప్రజలకు కనీస సౌకర్యాలు కలిగించడానికే. అలాంటప్పుడు మేమేదో సాధించాం అని డబ్బా కొట్టడం ప్రజలను మోసం చేయడమే అవుతుంది. ప్రణబ్ ముఖర్జీ సాధించానని చెబుతున్న అభివృద్ధి ఈ కోవలోనిదే.

స్థూల జాతీయాదాయం పెరిగిందే కాని అదే సమయంలో పేదరికం పెరిగింది; నిరుద్యోగం పెరిగింది; రైతుల ఆత్మహత్యలు పెరిగాయి; మంచినీటికి కొరత. ఈ సమస్యలీనాటివి కావు. సంవత్సరాలుగా అపరిష్కృతంగానే ఉండిపోతున్నాయి. స్థూల జాతీయాదాయం పెరుగుదల ప్రజల సమస్యను పరిష్కరించలేనపుడు పెరిగితే ఎంత, పెరక్కపోతే ఎంత? స్థూల జాతీయాదాయం అంటే పంట పొలాల్లో, పరిశ్రమల్లో, సేవా రంగంలో జరిగిన ఉత్పత్తి విలువ. ఉదాహరణకు మన రాష్ట్రం ఏర్పడిన నాటికి ఆహార ధాన్యాల ఉత్పత్తి కేవలం యాభై లక్షల టన్నులు మాత్రమే. కాగా ఇపుడు 200 లక్షల టన్నులు దాటింది. సహజంగానే ఉత్పత్తి విలువ పెరుగుతుంది. స్థూల రాష్ట్రాదాయం పెరుగుతుంది. పిల్లలు పెరిగి పెద్దవాళ్లుగా ఎదగడమంత సహజమైన విషయం. ఇంత సహజమైన స్థూల రాష్ట్రీయాదాయం పెరగడం తమ కృషి వల్ల, తమ ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకాల వల్ల పెరిగిందంటారేమిటి? నిజమే, ప్రాజెక్టులు నిర్మించారు, కాలువలు తవ్వారు, బోర్లు వేశారు. అయితే ఈ పనులన్నీ వాళ్ల జేబుల్లోంచి డబ్బు తీసి ఖర్చు చేయడం లేదు. మనం పన్నులు చెల్లిస్తున్నాం; ఆ డబ్బుతో ఈ పనులన్నీ చేస్తున్నారు; చెయ్యాలి. కష్టపడి పండించింది రైతులు; పనిచేసింది కార్మికులు. అందువల్ల స్థూల రాష్ట్రాదాయం పెరిగింది గాని అందులో మంత్రుల మెహర్బానీ ఏమీలేదు. ప్రణబ్ ముఖర్జీ గాని, మన్మోహన్‌సింగ్ గాని కాడిపట్టుకొని, పొలం దున్ని పంట పండిస్తే, అపుడు వాళ్లని రైతాంగం నెత్తిన పెట్టుకొని పూజిస్తారు.

## ఆదాయం – వ్యయం

బడ్జెట్‌లో రెండో ముఖ్య విషయం ఆదాయ – వ్యయాలు. బడ్జెట్ లోటు అంటే ఆదాయం కన్నా ఖర్చు ఎక్కువ చేయడం. అంటే ఆదాయం కన్నా ఖర్చు తక్కువ చేయడం అనేది అందరికీ తెలిసిన విషయమే. ఇది ప్రతీ కుటుంబంలో ప్రతి నెలా జరిగేదే. ఆదాయ – వ్యయాల గురించి గణాంకాలు బడ్జెట్‌లో ఉంటాయి. అయితే అవి అంచనాలు మాత్రమే. గత సంవత్సరం ఆదాయ వ్యయాల లెక్కలు వేసి, వచ్చే సంవత్సరంలో కొత్తగా ఏం పనులు చేపడతారో దాని ఆదాయ వ్యయాలు కలిపి, బడ్జెట్‌ను రూపొందిస్తారు. ప్రతి ఏడాది బడ్జెట్‌కు 31 మార్చ్ లోగా పార్లమెంట్ ఆమోద ముద్ర పడాలి. ఈ అంచనాలకు, వాస్తవానికి మధ్య తేడా పది శాతం మించకూడదని ఆర్థిక శాస్త్రం చెబుతుంది. ఇలా బడ్జెట్ రూపొందించారా లేదా అనేది రెండేళ్ల తర్వాత గాని తెలియదు. ఉదాహరణకు 2009–10 బడ్జెట్లో చేసిన కేటాయింపులు వాస్తవంలో ఖర్చు అయ్యాయా లేదా అనేది 2011–12 బడ్జెట్ ప్రవేశపెట్టినపుడు గాని తెలియదు. కాగ్ సంస్థ కూడా ఈ గణాంకాలను ప్రచురిస్తుంది. కాని 2011–12 బడ్జెట్ ప్రవేశపెట్టినపుడు, అందరి చూపు, ఉపన్యాసాలు, విమర్శలు ఆ సంవత్సరం బడ్జెట్ మీదే ఉంటాయి గాని, 2009–10లో చేసిన కేటాయింపులు పూర్తిగా ఖర్చు చేశారా లేదా అనేది చాలా కొద్దిమంది పార్లమెంట్ సభ్యులకే, లోతుగా అధ్యయనం చేసినవారికి, పత్రికల్లో ప్రచురించే విశ్లేషణ వల్ల తెలుస్తుంది. లోటు బడ్జెట్లు సర్వసాధారణమైపోయాయి. ఈ గణాంకాల విశ్లేషణ జోలికి పోకుండా నూటికి 70 మంది నివసించే గ్రామీణ ప్రజల కోసం – వీరిలో అత్యధికులు పేదలే – ఎంత ఖర్చు చేస్తున్నారు, పట్టణ, నగర ప్రజల కోసం ఎంత ఖర్చు చేస్తున్నారనేది చూడాలి. గ్రామీణ జీవితంలో వ్యవసాయం అంతర్భాగం కాబట్టి వ్యవసాయాభివృద్ధి కోసం ఎంత కేటాయించారనేది గమనించాలి. అలా చూసినపుడు వాటి కోసం చేస్తున్న ఖర్చు మొత్తం బడ్జెట్‌తో పోలిస్తే అత్యల్పం అని చెప్పడానికి గణాంకాలు ఉదహరించాల్సిన పనిలేదు. బడ్జెట్‌ను సామాజికార్థిక కోణం నుంచి విశ్లేషించుకోవాలి కాని, కేవలం గణాంకాల ఆధారంగా కాదు. కాని ఆర్థిక మంత్రి దానికింత కేటాయించాం, ఫలానా పద్దుకు ఇంత కేటాయించాం అనేది చెప్పరు. ముఖ్యంగా గ్రామీణుల జీవితాల బాగోగుల గురించి అసలే ఉండదు. కొన్ని పాప్యులిస్టు పథకాలు వారి వారినుద్దేశించి ప్రకటిస్తారు కాని, వాటికోసం చేసే ఖర్చులో 15 శాతం మాత్రమే వారికి చేరుతున్నాయని మాజీ ప్రధాని రాజీవ్‌గాంధీ అన్న విషయం గమనంలో ఉంచుకొంటే, అలాగే నూటికి 78 శాతం శ్రామికులకు లభిస్తున్నది రోజుకు ఇరవై రూపాయలు మాత్రమేనని ప్రకటించిన తర్వాత ఈ పథకాలు పాలక పార్టీ నాయకులను, ఆ పార్టీ కార్యకర్తలనుద్దేశించినవని ఎవరినడిగినా చెబుతారు. దీనికి గణాంకాలను ఉదహరించనక్కర్లేదు. ముఖ్యంగా గమనించాల్సిన విషయమేమంటే ఈ పాప్యులిస్టు పథకాల ఫలితంగా శాశ్వతంగా ఉండే ఆస్తులు సృష్టించ బడడం లేదు. ఈ ఖర్చు అంతా ఓటు బ్యాంకు సృష్టికి, కొనసాగింపుకు మాత్రమే వినియోగపడతాయి. ఇక్కడే మధ్యతరగతి, వృద్ధులపై ఆదాయపు పన్ను మినహాయింపు పెరుగుదల గురించి ప్రస్తావించాలి. 80 సంవత్సరాల పైబడిన వారికి అయిదు లక్షల వరకూ మినహాయింపు ఉంటుందని, మధ్యతరగతి ప్రజలకు మినహాయింపు 1.5 లక్షల నుంచి 1.8 లక్షల వరకూ ఉంటుందనే ప్రకటింపు ఏదో ఒరగబెట్టామని ప్రచారం చేసుకోవడానికి తప్ప ఎంత తక్కువ మందికి వర్తిస్తుందో మీ ఊహకు వదిలేస్తున్నా. 80 ఏళ్లు దాటిన వారిలో సంవత్సరానికి అయిదు లక్షల రూపాయల ఆదాయం వచ్చేవారెవరుంటారు, ఎంత మంది ఉంటారు?

## సంక్షేమం

విద్య, ఆరోగ్యం లాంటి సామాజిక సంక్షేమ పథకాలకు కేటాయింపులు పెంచినట్లు ఆర్థిక మంత్రి చెప్పుకొన్నారు. ఈ కేటాయింపులు కొన్ని మంత్రిత్వ శాఖలు గత సంవత్సరం సవరించిన అంచనాల కన్నా తక్కువగానో, ధరల పెరుగుదల వల్లనో జరిగాయి తప్ప మరొకటి కాదు. విద్యకు స్థూల జాతీయాదాయంలో ఆరు శాతం, ఆరోగ్యానికి మూడు శాతం పెంచాలనే లక్ష్యం లక్ష్యంగానే మిగిలి పోయాయి. విద్యారంగంలో ప్రాథమిక విద్యకివ్వాల్సిన ప్రాముఖ్యతను పక్కనపెట్టి ఉన్నత విద్యపై కేంద్రీకరణ జరుగుతోంది. విదేశీ విశ్వవిద్యాలయాలను ఆహ్వానిస్తున్నారు. సాంకేతిక విద్యను మినహాయిస్తే, మిగతా పాఠ్యాంశాలు ఆయా దేశాల సామాజికార్థిక సంస్కృతుల కనుగుణంగా ఉంటాయి. విదేశాలకు, ముఖ్యంగా అమెరికాకు వెళ్లే విద్యార్థులు అక్కడి సంస్కృతిని, అలవాట్లను అలవర్చుకొని అక్కడే స్థిరంగా ఉండిపోవడం జరుగుతోంది. మనమంతా చెల్లించే పన్నులతో దేశంలో ఉన్నత విద్యనభ్యసించి, ఇంకా పై చదువుల కోసం విదేశాలకు వెళ్లి అక్కడే స్థిరపడిపోవడమా? అలా విదేశాలకు విద్యకోసం వెళ్లేవారు ఎక్కువలో ఎక్కువగా సంపన్నవర్గాల నుంచి వచ్చినవారై ఉంటారు. అదీకాక సెకండరీ విద్యపూర్తిచేసి కాలేజీలకు వెళ్లేవారి సంఖ్య తొమ్మిది – పది శాతం మించడం లేదు. అంత అల్ప సంఖ్యాకుల్లో కొంతమంది

విదేశాలకు వెళ్లిపోతుంటే, వారికోసం విద్యపై బడ్జెట్‌లో కేటాయింపులు పెంచడమా? ప్రాథమిక విద్యస్థాయిలోనే డ్రాపవుట్ల సంఖ్య తగ్గుతూంది కాని ఇంకా గణనీయంగానే ఉంది. బడ్జెట్‌లో కేటాయింపులు చూస్తే ప్రతీ ఉన్నత విద్యనభ్యసించే విద్యార్థి ప్రభుత్వం చేసే ఖర్చుతో పోలిస్తే సెకండరీ విద్య స్థాయి వరకు చదివే విద్యార్థిపై ఖర్చు సోదిలోకి కూడా రాదు. 1940వ దశకంలో ప్రారంభించే ప్రభుత్వం విద్యా విధానాన్ని సంస్కరించడానికి ఎన్నో కమిటీలు వేశారు; అవి సిఫార్సులెన్నో చేశాయి. విద్యారంగానికి చేసే కేటాయింపుల్లో, వివిధ స్థాయిల విద్యలకు చేసే కేటాయింపుల గురించి కొత్తగా ఆలోచించాలి.

వైద్య రంగం మరీ అధ్వాన్నంగా ఉంది. పేదరికానికి చాలా కారణాలున్నాయి గాని వైద్య రంగం పేదరికాన్ని పెంచుతుందని విన్నారా? ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఎంత అధ్వాన్నంగా పని చేస్తున్నాయో మనందరికీ తెలుసు. అరవై రెండు సంవత్సరాల తర్వాత కూడా అవసరమైనన్ని కేంద్రాలు లేవు. డాక్టర్లు, మందులు అన్నీ కరువే. పేదవాడని రోగాలు కనుకరించవు కదా. గ్రామాల్లో పారిశుధ్య లోపం, స్వచ్ఛమైన తాగునీరు లభించడం దుర్లభం. సగం రోగాలకు ఈ రెండే ప్రధాన కారణాలు. ఈ పరిస్థితుల దృష్ట్యా ప్రైవేట్ డాక్టర్ల వద్దకు, పెద్ద ఆసుపత్రులకు వెళ్లాల్సి రావడంతో ఖర్చు తడిసి మోపెడవుతుంది. రోగం రాకూడదే కాని, వస్తే పేదవాడి ఇల్లు గుల్లై మరింత పేదరికానికి లోను చేస్తుంది. నోబెల్ గ్రహీత అమర్త్యసేన్ ఐక్యరాజ్య సమితీ మానవాభివృద్ధి నివేదికలను ఉదహరిస్తూ చైనాలో సగటు జీవిత కాలం 73.5 సంవత్సరాలైతే, భారతదేశంలో 64.4 సంవత్సరాలని అన్నారు. ఆయన సేకరించిన లెక్కల ప్రకారం (పట్టిక)..

| | చైనా | భారతదేశం |
|---|---|---|
| 5 ఏళ్లలోపు పిల్లల మరణాలు ప్రతి వెయ్యి మందికి | 19 | 66 |
| అడల్ట్ లిటరసీ | 94 | 65 |
| మీన్ ఇయర్స్ ఆఫ్ స్కూలింగ్ | 7.5 | 4.4 |
| 15-24 సంవత్సరాల మధ్య చదువుకొన్న మహిళలు | 99 | 80 లోపు |
| పోషకాహార లోపంతో పిల్లలు | చాలా తక్కువ | సగం మంది |
| ట్రిపుల్ వాక్సిన్ | 97 | 60 |

ఇంకా అనేక సూచికల్లో మనం బంగ్లాదేశ్ కన్నా తక్కువ స్థాయిలో ఉన్నామని ఆయన పేర్కొన్నారు. కమ్యూనిస్టు నాయకుడు సీతారాం ఏచూరి రాజ్యసభలో బడ్జెట్‌పై చర్చలో పాల్గొంటూ మూడవ జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే ప్రకారం దేశంలో 38.4 శాతం మంది మూడేళ్ల లోపు పిల్లల్లో ఎదుగుదల లేక పోతోందని, 46 శాతం మంది పిల్లలు మరీ పీలగా ఉంటున్నారని, 79.2 శాతం మంది రక్తహీనతతో ఉన్నారని, ఇది భారతదేశం సిగ్గుతో తలవంచుకోవాల్సిన పరిస్థితి కాదా అని నిలదీశారు.

విద్య, ఆరోగ్యం తర్వాత గృహవసతి అతి ముఖ్యమైనది. దేశంలో వచ్చే ఆర్థిక సంవత్సరం ఆఖరు నాటికి 260 లక్షల ఇళ్ల కొరత ఉంటుందని అంచనా. రాజీవ్ గాంధీ పేరుతోగాని, ఇతర పథకాల పేరుతోగాని గృహనిర్మాణం ఎంత సొంపుగా కొనసాగుతుందో తెలుసుకోవడానికి మన రాష్ట్రమే ఉదాహరణ. ప్రణబ్ ముఖర్జీ తన ఉపన్యాసంలో ప్రధానంగా 25 లక్షల ఇళ్లు కొనగలిగిన వారు (ఇందులో పది లక్షలు కొనుగోలు దారుడే సమీకరించుకోవాలి) గురించి, రియల్ ఎస్టేట్ దారులు ఇలాంటి గృహాలు నిర్మిస్తే వారికి వడ్డీరేటు తగ్గింపు గురించే మాట్లాడారు. పేదలు అంతా అమలుకాని ప్రభుత్వ గృహ నిర్మాణ పథకాల మీద ఆధారపడాలన్న మాట. 2009లో రాజీవ్ ఆవాస్ యోజన పథకాన్ని ప్రకటించారే కాని, దాని రూపురేఖలు నిర్ణయించే దశలోనే ఉంది. ప్రణబ్ పథకం రాష్ట్ర ప్రభుత్వాలను ప్రోత్సహించేలా లేవు.

### సబ్సిడీ

సబ్సిడీ బదులు నగదు బదిలీ పథకం అమలు పరుస్తారని ప్రకటించడం రేషన్ షాపుల విధానం వైఫల్యం చెందిందని అంగీకరించడమే. ఈ నూతన విధానం వల్ల మధ్య దళారీల బెడద వదలిపోతుందని ప్రభుత్వం అంటోంది. ఇది పేదలనుద్దేశించిన పథకం. పేదలంటే ఎవరు? ప్రతీ ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా నిర్వచిస్తున్నారు. చిదంబరం ఆర్థికమంత్రిగా ఉన్నపుడు టెండుల్కర్ కమిటీ 37 శాతం మంది ఉన్నారన్న నిర్వచనాన్ని అంగీకరిస్తున్నానన్నారు. తాజాగా సోనియాగాంధీ అధ్యక్షత వహించిన జాతీయ సలహా మండలి 80 కోట్ల మందిని ప్రాధాన్యతా తరగతిగా, సాధాన్య తరగతిగా విభజించాలని నిర్ణయించగా ప్రధాని ఆర్థిక సలహా సంఘం అధ్యక్షుడు రంగరాజన్ దీనిని వ్యతిరేకిస్తున్నారు. వీరిద్దరి మధ్య కీచులాటను ప్రధాని ఏ విధంగా పరిష్కరిస్తారో గాని, మధ్యన కోట్లాది ప్రజలు నలిగిపోతారు. ఎవరెన్ని నిర్వచనాలిచ్చినా, అవన్నీ శుద్ధ తప్పుడు నిర్వచనాలే. ఇన్ని కేలరీల శక్తినిచ్చే ఆహారం ప్రతి మనిషి తినాలి అంటే, ఇన్ని ఆహార ధాన్యాలు తినాలి అని జాతీయ పోషకాహార సంస్థ నిర్ణయించింది. అయితే అది కేవలం తిండి గింజల కొలత మాత్రమే. తిండి గింజలతోపాటు గృహవసతి, విద్య, వైద్యం అందించినపుడే పేదరికం నుంచి ప్రజలు బయటపడతారని ప్రపంచ బ్యాంకుతో సహా అనేక జాతీయ, అంతర్జాతీయ సంస్థలు నిర్వచించాయి. సమస్య ఏమిటో స్పష్టంగా నిర్ధారించకుండా పరిష్కారాన్ని నిర్ణయించే ఆర్థిక మంత్రిని ఎక్కడైనా విన్నారా, కన్నారా? వీళ్లందరికీ నగదు బదిలీ చేస్తారనే అనుకొందాం. ఎలా? బ్యాంకుల ద్వారానా? దేశంలో ఆరు లక్షల గ్రామాల్లో సుమారు ముప్పై వేల గ్రామల్లోనే బ్యాంకులున్నాయి. బ్యాంకు శాఖలు లేని గ్రామాల్లో కరస్పాండెట్ల ద్వారా బ్యాంకు కార్యకలాపాలు కొనసాగిస్తారని, గ్రామంలోని పచారీ దుకాణదారును కూడా అ పనికి నియమించవచ్చునని రిజర్వ్ బ్యాంక్ అంటోంది. ఇవన్నీ లీకేజికి అవకాశం లేని వ్యవస్థలా? నగదు రూపంలో ఇస్తే, వారి అవసరాలకు మార్కెటింగ్ మీద ఆధార పడాలి. ఇప్పటికే మొత్తం దేశాన్ని మార్కెట్ ఎకానమీగా మార్చేసినా, అది పట్టణాలకు, నగరాలకు మాత్రమే పరిమితమైంది. ఇపుడీ విధానం గ్రామాలక్కూడా విస్తరిస్తుందన్న మాట. మరో మాటల్లో చెప్పాలంటే ప్రపంచీకరణ గ్రామాలను కూడా చుట్టుముట్టుంది. ఇప్పటికే సారా దుకాణాలు గ్రామగ్రామాన విస్తరించి ఉన్నాయి. గ్రామంలో మంచినీటి సదుపాయం ఉండకపోవచ్చు గాని సారా దుకాణం మాత్రం తప్పకుండా ఉండి తీరుతుంది. ఈ నగదులో సింహభాగం ఈ దుకాణాలకు చేరుతుందనడంలో సందేహం లేదు. పేదలు పేదలుగానే ఉండిపోతారు. ప్రభుత్వ నాయకులకు కావాల్సింది అదే. అపుడే వాళ్ల ఓట్లు ఖాయంగా పాలకపార్టీకి వేయించుకో గలుగుతారు. ఆహార సంక్షోభం, ధరల పెరుగుదల లాంటి సమస్యలకు పరిష్కారం కళ్లల్లో కలికం పెట్టుకొని చూసినా పరిష్కారం దొరకదు.

### కార్పొరేట్లకు విందు

కార్పొరేట్ సంస్థల యజమానులకు ఈ బడ్జెట్ బహు పసందుగా ఉంది. ప్రణబ్ బడ్జెట్ ఉపన్యాసం చదవడం పూర్తికానే కాలేదు, స్టాక్ మార్కెట్ సెన్సెక్స్ పైకి దూసుకుపోయింది. పారిశ్రామికవేత్తల అఖిల

కార్పొరేట్ ఆదాయం పన్ను, ఎక్సయిజ్, కస్టమ్స్ సుంకాల పద్దు కింద
ప్రభుత్వం కోల్పోయిన రెవెన్యూ (రు. కోట్లలో)

| | 2005-2006 | 2006-2007 | 2007-2008 | 2008-2009 | 2009-2010 | 2010-2011 | కోల్పోయిన మొత్తం ఆదాయం 2005-06 నుంచి 2010-11 | పెరుగుదల శాతంలో 2010-11 ను 2005-06తో పోల్చి చూస్తూ |
|---|---|---|---|---|---|---|---|---|
| కార్పొరేట్ ఆదాయ పన్ను | 34618 | 50075 | 62199 | 66901 | 72881 | 88263 | 374937 | 155.0 |
| ఎక్సైజ్ సుంకం | 66760 | 99690 | 87468 | 128293 | 169121 | 198291 | 749623 | 197.0 |
| కస్టమ్స్ సుంకం | 127730 | 123682 | 153593 | 225752 | 195288 | 174418 | 1000463 | 36.6 |
| **మొత్తం** | **229108** | **273447** | **303260** | **420946** | **437290** | **460972** | **2125023** | **101.2** |

మూలం : కేంద్ర ప్రభుత్వ బడ్జెట్‌ల ఆధారంగా

భారత సంస్థలు శభాష్ అన్నాయి. 2008లో ప్రపంచ ఆర్థిక సంక్షోభ సమయంలో పారిశ్రామికవేత్తలను ఆదుకోవడానికి మూడు లక్షల కోట్ల రూపాయల మేరకు ఉద్దీపన పథకాల పేరుతో సహాయం చేసింది. ఆ తర్వాత పరిశ్రమలు బాగా పుంజుకొన్నాయి. రెండు చేతులా లాభాలు పిండుకొన్నాయని ప్రభుత్వ గణాంకాలే చెబుతున్నాయి. అయినా ఉద్దీపన పథకాలను ఉపసంహరించుకోలేదు. అంటే ప్రతి సంవత్సరం అవి కొనసాగుతున్నట్లే; ఆ మేరకు కార్పొరేట్ల జేబులు నిండుతున్నట్లే కదా. ఇది మొదటి విషయం. ప్రస్తుత బడ్జెట్ పుస్తకాల ప్రకారం కార్పొరేట్ ఎక్సయిజ్, కస్టమ్స్ సుంకాల్లో ప్రోత్సాహకాలు, మినహాయింపులు మాఫీలు (ఇవి సబ్సిడీకి పెట్టిన ముద్దు పేర్లు) ఇవ్వడం మూలంగా ప్రభుత్వానికి రాకుండా పోయిన ఆదాయం 2005-06 నుంచి గడిచిన ఆరు సంవత్సరాల్లో 21 లక్షల కోట్ల రూపాయలని ప్రముఖ జర్నలిస్ట్ పి.సాయినాథ్ అన్నారు. ఇవేమీ ఆయన సొంత లెక్కలు కావని, యూనియన్ బడ్జెట్ పుస్తకాలు, రెవెన్యూ నష్టం గురించి ప్రభుత్వమే ఇచ్చిన గణాంకాలని స్పష్టం చేశారు.

ఇలా కార్పొరేట్ సంస్థలకు దోచిపెట్టడం గురించి గత సంవత్సరం బడ్జెట్‌లోనే ప్రభుత్వం ఇలా వ్యాఖ్యానించింది. 'ప్రభుత్వం ఇలా రెవెన్యూ నష్టపోవడం సంవత్సరం తర్వాత సంవత్సరం జరుగుతూనే వస్తూంది. మొత్తం పన్ను వసూళ్లలో ఇలా రెవెన్యూ పోగొట్టుకోవడం పెరుగుతూనే ఉంది. ముఖ్యంగా కార్పొరేట్ పన్ను 2008-09లో పోగొట్టుకోవడం మరీ ఎక్కువగా ఉంది.' ముంజేతి కంకణానికి అద్దమెందుకు? ఇలా పోగుపడిన సంపదను విదేశాల్లో పరిశ్రమలను, ఖనిజ సంపదను, భూములను కొనేసి తమ సంస్థానాలను (స్వతంత్రం రాక ముందు దేశంలో ఉండిన 550 సంస్థానాల మొత్తం ఆస్తుల విలువ ఇంత కూడా ఉండేది కాదేమో) విస్తరించుకొంటున్నారు. ఇది కాక విదేశీ బ్యాంకులకు తరలించిన నల్లధనం ఉండనే ఉంది. ఇదంతా ప్రభుత్వానికి తెలిసే జరుగుతోంది, కాదు కాదు ప్రోత్సాహంతో, అనుమతితో జరుగుతోంది. దేశం రుణభారం ఏటేటా పెరుగుతూనే ఉంది. అంటే రుణం తెచ్చి కార్పొరేట్లకు ధారపోస్తున్నారా? ఇది ఎవరి దేశం?

*(రచయిత వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

## వీక్షణం రచయితలకు సూచనలు

ఎనిమిది సంవత్సరాలలో, నూట పదమూడు సంచికలలో వీక్షణం దాదాపు పద్దెనిమిది వందల వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతి లోనూ, సుబోధకత లోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

❖ రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (ఐదు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పెజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు-నాలుగు పేజీల రచన (1800 - 2500 పదాలు) వీక్షణం కు సరిగ్గా సరిపోతుంది. ❖ చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్ లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్ లో గాని, పేజ్ మేకర్ లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది. ❖ రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫోటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి. ❖ రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి. ❖ వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు-మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు. ❖ మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. ❖ దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు. ❖ రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి. ❖ తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు.

*ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా ఛత్తీస్‌ఘఢ్ దంతెవాడ జిల్లాలో ఆదివాసి గ్రామాలపై ప్రభుత్వ బలగాల దాడిని వివరిస్తున్నారు* **వరవరరావు**

# మానసిక యుద్ధం - భౌతిక విధ్వంసం

'ఎస్. ఎస్.పి. కల్లూరి బాధిత గ్రామాలకు కలెక్టర్ పంపిస్తున్న సహాయాన్ని తీసుకుపోతున్న ట్రక్కర్లను చితకబాదాడు. సర్పంచ్‌లను కలెక్టర్‌కు సహకరించవద్దన్నాడు. డోర్నపాల్‌లో క్యాంపు పెట్టి ఆ గ్రామాలకు ఎవరూ, ఏ సహాయమూ పోకుండా అడ్డుకుంటున్నాడు'. నా వలెనే చాలమందికి మార్చ్ 24న హిమాంశు కుమార్ నుంచి వచ్చిన ఈ ఎస్.ఎం.ఎస్.ను తాజా వార్త కదా అన్నట్లుగా ఢిల్లీ నుంచి వచ్చిన ఒక ఇంగ్లిష్ పత్రిక రిపోర్టర్‌కు వచ్చీ రాగానే చెప్పాను.

'ఇదంతా ఎట్లా మొదలయింది? చింతల్నార్ ఎన్‌కౌంటర్‌లో మొదట ముగ్గురు కోయ కమాండోలు చనిపోయి, తొమ్మిది మంది గాయపడినందు వల్లనే కదా' అన్నదామె.

'కోయ కమాండోలు అంటే సాల్వాజుడుం కదా. సుప్రీంకోర్టుకు సాల్వాజుడుం రద్దు చేసుకున్నామని చెప్పారు కదా' అన్నాను నేను. అన్నాను గానీ ఆదివాసుల మీదికి ఆదివాసులనే దాడికి పురికొల్పే ఈ కుటిల రాజనీతి ఎక్కడ ప్రారంభమైంది?

ఆదివాసుల చరిత్ర దగ్గరో, ఆదివాసుల జీవితాల్లో బయటి వారి జోక్యం చరిత్ర దగ్గరో కాకపోయినా మార్చ్ 11న ఈ దాడి ఎట్లా మొదలయిందోననయినా మనం పట్టించుకోవాలి కదా. మార్చ్ 11 ఉదయం దంతేవాడ అడవుల్లోకి మూడు వందల యాభై మంది పారా మిలిటరీ బలగాలు అత్యంత అధునాతన ఆయుధాలతో ప్రవేశించారు. చేయవలసిన విధ్వంసం, హత్యలు, అత్యాచారాలు, గృహదహనాలు ఐదు రోజుల పాటు చేసి గానీ 16న తిరిగి తమ బ్యారక్స్‌కు చేరుకోలేదు.

మూడు వందల ఇళ్లు, ధాన్యాగారాలు తగులబడిపోయాయి. ముగ్గురు గ్రామస్తులు చనిపోయారు. ఇద్దరు అదృశ్యమయ్యారు. ఐదుగురు స్త్రీలపై సామూహిక లైంగిక అత్యాచారం జరిగింది. వారిలో ఒకరిని చాకుతో పొడిచి చంపారు.

మార్చ్ మొదటివారంలో పోలీసులు ఒక దాడికి పథకం వేసారు. ఆకురాలు కాలం మొదలయి ఎండాకాలంలో ప్రవేశిస్తున్నది. అడవి పలచనవుతున్నది. జలాశయాలు ఇంకి పోతున్నాయి. గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో ఇది రెండో ఎండాకాలం. 2009 నవంబర్‌లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరుతో తన ప్రజల మీద తానే యుద్ధం ప్రారంభించిన తర్వాత ఇది రెండో ఎండోకాలం. మొదటి ఎండాకాలం అనుభవాలన్నీ పారా మిలిటరీ బలగాలకు చేదుగానే ఉన్నాయి. ముఖ్యంగా 76 మంది సి.ఆర్.పి.ఎఫ్. జవాన్లు గాలింపు చర్యలకు వచ్చి ప్రాణాలు పోగొట్టుకున్న దగ్గర్నించి ఇప్పటిదాకా పోలీసుల నైతిక స్థైర్యం కోలుకోలేదు.

మరొకవైపు 2004లోను, 2009లోను కేంద్రంలో, ఛత్తీస్‌ఘఢ్‌లో అవే మన్మోహన్‌సింగ్, రమణసింగ్ ప్రభుత్వాలు వచ్చాయి. 2004లో బహుళజాతి కంపెనీలు, బడా కంపెనీలతో చేసుకున్న ఒప్పందాలు ఒక్క అంగుళం కూడా ముందుకు జరగలేదు. ఏడు సంవత్సరాలు గడచి పోయాయి. టాటా, ఎస్సార్, పోస్కో, వేదాంతల గనుల తవ్వకాలు, ఫ్యాక్టరీల నిర్మాణాలు ప్రారంభం కాకపోవడమే కాకుండా పోస్కో కంపెనీకి బైలదిల్లా నుంచి ఇనుపరజం ఎగుమతిని కిరండుల్ మార్గంలో మావోయిస్టు నాయకత్వంలో ఆదివాసులు అడుగడుగున ప్రతిఘటిస్తున్నారు. ఎస్సార్ కంపెనీ పైప్‌లైన్ మొదలు గెస్ట్‌హౌస్ వరకూ పలుమార్లు దాడులకు గురవుతున్నాయి. ఛత్తీస్‌ఘఢ్ ఖనిజ సంపద మీద కన్నేసిన కంపెనీలకు సందు పుట్టడంలేదు. మరోవైపు దేశంలో గ్రీన్‌హంట్ ఆపరేషన్ అటవీ సంపదలను దోచుకునే వారి ప్రయోజనాల కోసమేనని మావోయిస్టులు మాత్రమే కాదు, ప్రజాస్వామ్యవాదులు, పర్యావరణవాదులందరూ గుర్తిస్తున్నారు. ఎలుగెత్తి ఖండిస్తున్నారు. వ్యతిరేక ఉద్యమాలు నిర్మిస్తున్నారు. ఈ సైనిక చర్యకు, ఆదివాసుల జల్-జంగల్-జమీన్ కొల్లగొట్టే ప్రభుత్వ రాజకీయార్థిక విధానానికి ప్రత్యక్ష సంబంధం ఉందని ప్రజలందరు స్పష్టంగా అర్థం చేసుకున్నారు. ప్రభుత్వాలేమో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనాను కాకుండా, స్వావలంబన అభివృద్ధి నమూనాను అమలు చేయడానికి కాదుగదా ఆమోదించడానికి కూడా సిద్ధంగా లేవు. ఇటీవలి వికీలీక్స్ బయట పెడుతున్న రహస్య వాస్తవాలను గమనిస్తే మన ప్రభుత్వాలు, ప్రభుత్వాలలో ప్రధాని, ఆర్థిక మంత్రి మొదలు పరిశ్రమల మంత్రి వరకు అమెరికా, యూరప్‌ల ప్రయోజనాల కొరకే ఏర్పడుతున్నాయని బయట పడుతున్నది.

ఐదేళ్లకొకసారి జరిగే ఎన్నికలొక్కటే ప్రజాస్వామ్యానికి సంకేతం అనుకుంటే ఆ ఓట్ల కొనుగోలు బండారం కూడ బయటపడుతున్నది. పైగా 1991లో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ కోసం నూతన ఆర్థిక విధానాన్ని రచించిన నాటి ఆర్థిక మంత్రి, ప్రపంచ బ్యాంక్ మాజీ గవర్నర్, ప్రస్తుత ప్రధాని మన్మోహన్‌సింగ్ ఎన్నడూ ఎన్నికయిన ప్రజా ప్రతినిధి కాదు. ఆర్థిక, పరిశ్రమ శాఖలు చేసి గ్రీన్‌హంట్ ఆపరేషన్ పథకం రచించిన ప్రస్తుతం హోంమంత్రి చిదంబరం స్వయంగా వేదాంత కంపెనీ సలహాదారు, కుఖ్యాత ఎన్‌రాన్ కంపెనీ కోసం కేసు వాదించిన వాడు.

1994లో కేంద్రంలో, 2004 నుంచి ఛత్తీస్‌ఘఢ్ రాష్ట్రంలో ప్రభుత్వంలో ఉన్న బి.జె.పి. పార్టీ కూడా 91 నుంచీ సామ్రాజ్యవాద ప్రపంచీకరణను బలపరుస్తున్న పార్టీయే. కర్ణాటకలో బళ్లారి మొదలు బ్రహ్మణి వరకు గనులను కొల్లగొట్టి ఉక్కు కర్మాగారాలు నిర్మించి భూ ఆక్రమణ చేసుకున్న గాలి జనార్ధనరెడ్డి - వై.ఎస్. కుటుంబాల అపవిత్ర రాజకీయాలకు కర్ణాటక బి.జె.పి. ప్రభుత్వమే అండగా నిలబడింది.

కనుక ప్రభుత్వాల దగ్గర మిగిలి ఉన్న మార్గం గతంలో లాటిన్ అమెరికా దేశాల్లో వలె అణచివేతయే. ప్రజల మీద యుద్ధమే. అడవి నుంచి ఆదివాసులను నిర్వాసితులను చేసి, వారికి రక్షాకవచంగా ఉన్న

మావోయిస్టులను తుడిచిపెట్టి అటవీ సంపదలను, ఖనిజాలను కంపెనీలకు కట్టబెట్టడానికే కేంద్ర ప్రభుత్వమైనా, బెంగాల్, జార్ఖండ్, ఒడిశా, ఛత్తీస్‌ఘడ్, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు ప్రభుత్వాలయినా అవి – ఏ పార్టీలైనా కావచ్చు, కంకణం కట్టుకున్నాయి. ఆ విషయంలో యు.పి.ఎ., ఎన్.డి.ఎ. లయినా, లెఫ్ట్ ఫ్రంట్ అయినా, ప్రాంతీయ పార్టీలయినా మినహాయింపు కాదు.

ఖాళీ చేయించడం, ఆక్రమించడం, అభివృద్ధి చేయడం (క్లియర్, హోల్డ్, డెవలప్) అనే అమెరికన్ విధానమే చిదంబరం విధానం.

రెండు విధాల ఆదివాసులను నిర్వాసితులను చేయాలి. అంటే అడవి నుంచి ఖాళీ చేయాలి. ఆదివాసుల్లో మావోయిస్టులు నీటిలో చేపల్లా మసలుకుంటున్నారు కనుక నీళ్లను తోడేస్తే తప్ప చేపలు బయట పడవు. నీళ్లు తోడేయడానికి ఎండాకాలం అనువైన కాలం. అట్లాగే ఆదివాసులను ప్రభుత్వం ఏర్పాటు చేసిన బేస్ క్యాంపుల్లో పెట్టడమో, నిర్వాసితుల్ని చేయడమో చేస్తే తప్ప అడవిలో కంపెనీల ప్రవేశం సాధ్యం కాదు. అపుడు మావోయిస్టులతో ప్రత్యక్షంగా తలపడవచ్చు. అయినా ఆదివాసుల మధ్యన, ఆదివాసుల కొరకు అక్కడ మావోయిస్టులున్నారు గానీ అక్కడ మావోయిస్టులకున్న వేరే ప్రయోజనం ఏముంది. అక్కడి భూమి, అటవీ సంపద, వనర్లపై అధికారం, హక్కు ఆదివాసులకు దక్కాలని ప్రజా అభివృద్ధి నమూనాను వాళ్లక్కడ అమలు చేస్తున్నారు.

ఒక్క సైన్యాన్ని ప్రత్యక్షంగా యుద్ధానికి దించే పథకం తప్ప కేంద్ర ప్రభుత్వం ప్రజల మీద మొత్తంగా సైనికపరమైన చర్యకే పూనుకున్నది. ఛత్తీస్‌ఘడ్‌లో సైనిక శిక్షణ కేంద్రాలు ఏర్పాటు చేసి ప్రత్యక్షంగా సైన్యమే పారా మిలిటరీ బలగాలకు శిక్షణ ఇస్తున్నది. ఎయిర్‌క్రాఫ్ట్, హెలికాప్టర్‌లు, అసాల్ట్ ఆయుధాలు, మిషిన్‌గన్‌లు, మారణాస్త్రాలన్నీ సైన్యాలవే ఉపయోగిస్తున్నారు. రాయ్‌పూర్, దంతెవాడ, బీజాపూర్, నారాయణ పూర్‌లలో సైనిక క్యాంపుల నిర్మాణం చేసి సైనిక వాహనాలు మోహరించారు. సి.ఆర్.పి.ఎఫ్., బి.ఎస్.ఎఫ్. మొదలు రకరకాల పారా మిలిటరీ బలగాలతోపాటు ఆదివాసీ తెగలతో ఏర్పాటు చేసిన నాగా మిజో బెటాలియన్‌ను దించారు. 2004 నుంచి కాంగ్రెస్ ప్రతిపక్ష నాయకుడు మహేంద్రకర్మ బి.జె.పి. ప్రభుత్వానికి రచించి ఇచ్చిన సాల్వాజుడుం రాజ్యాంగేతర సాయుధ శ్రేణులు ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలో ఆరేడేళ్లుగా అమలు చేస్తున్న దమనకాండ ఇప్పటికే ప్రజాస్వామ్యవాదులే కాదు సుప్రీంకోర్టు కూడా ఎన్నోసార్లు ఎత్తిచూపింది. ఛత్తీస్‌ఘడ్‌లో బడులు, ఆసుపత్రులు సాయుధ సైనిక శిబిరాలుగా మారినవి.

సాల్వాజుడుం చేతుల్లో అదృశ్యమైన ఆదివాసులు, లైంగిక అత్యాచారానికి గురైన స్త్రీల గురించి సుప్రీంకోర్టులో ఎన్నో పిటిషన్లు విచారణకున్నాయి. గృహదహనాలు, గ్రామాల విధ్వంసం కూడా కొత్తకాదు. బహుశా ఇది బ్రిటిష్ వలస కాలం నుంచి కూడ చట్టాలతో మాత్రమే కాకుండా సైన్యంతో అడవిలో జోక్యం చేసుకునే పద్ధతిలో ప్రభుత్వాలు అనుసరించే ఒక సైనిక వ్యూహం అనుకుంటాను. గ్రామాలకు గ్రామాలే తగలబెడితే తప్ప ఆదివాసులు ఆ గ్రామాలు వదిలిపోరు. ఆదివాసులు నక్సలైట్లకు ఆశ్రయమిస్తున్నారని వాళ్ల ఆవాసాలు తగులబెడుతారు. వాళ్ల స్త్రీలపై అత్యాచారాలు చేస్తారు. మన వాకపల్లి, భల్లుగూడలలో కూడా అదే చేశారు. వాళ్లు స్వయంగా ఎక్కడయినా తలదాచుకోవడానికి పోతే అక్కడ వాళ్ల ఆవాసాలు తగులబెడతారు. 87లో చింతపల్లిలో గుత్తికోయల ఇళ్లు అట్లాగే తగులబెట్టారు. అపుడు కంపెనీల ప్రవేశం వీలవుతుంది. మొదలు సైనిక కంపెనీలు దిగుతాయి. తర్వాత దోపిడీ కంపెనీలు దిగుతాయి. గతంలో అడవిలో ప్రవేశించిన పెట్టుబడి అంతా అట్లా ప్రవేశించిందే.

ఈ బహుళజాతి, బడా కంపెనీల పెట్టుబడిని ప్రతిఘటించి పారదోలడానికి, ప్రవేశించకుండా చేయడానికి, ప్రవేశించిన దానిని ప్రతిఘటించి పారదోలడానికి దేశవ్యాప్తంగా అనేక రూపాల్లో ప్రజా పోరాటాలు జరుగుతున్నాయి. ప్రజాస్వామ్యవాదులు, జాతులు, విప్లవ పార్టీలు తమతమ పోరాట పద్ధతుల ద్వారా పోరాడుతున్నారు. ముఖ్యంగా దండకారణ్యాన్ని కేంద్రంగా చేసుకొని మావోయిస్టు పార్టీ సాయుధ ప్రతిఘటనకు పూనుకున్నది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సైనికీకరణకు, ఆయుధీకరణకు చట్టాల సమర్థన ఉంటుంది. ఆ చట్టాలు ప్రజాస్వామికమైనవా, కాదా అన్న చర్చ అలా ఉంచి ప్రభుత్వాలు ఎన్నికైనవనే సాకుతో వాటికి చట్టబద్ధత లభిస్తుంది. ప్రతిఘటనకు ప్రజాబలం ఎంత ఉన్నా అది సాయుధ మైనపుడు చట్టబద్ధత లేకపోవడమనేదొక్కటే ప్రభుత్వాల దమననీతికి చెల్లుబాటునిస్తున్నది.

ప్రస్తుత సందర్భమే తీసుకుంటే ఛత్తీస్‌ఘడ్‌లో ఎన్నో ఆయుధాగారాలు, సైనిక శిక్షణ కేంద్రాలు ఏర్పాటు చేసిన ప్రభుత్వం ఇప్పుడు చింతల్నార్ ప్రాంతంలోకి అక్కడ మావోయిస్టులు రహస్య ఆయుధాగారం నడుపుతున్నారనే సాకుతో ప్రవేశించింది.

ఆనవాయితీగా జరిగే గాలింపు చర్యల్లో మావోయిస్టులు మాటుకాసి ముగ్గురు కోయకమాండోలను చంపారని, పోలీసు క్యాంపుకు పదిహేను కిలోమీటర్ల ఆవరణలో చింతల్నార్‌లో ఈ దాడికి పోలీసులు పూనుకున్నారు. ఈ దాడిలో సి.ఆర్.పి.ఎఫ్., కోబ్రా బెటాలియన్, కోయ కమాండోలు, లొంగిపోయి సాల్వాజుడుంలో చేరిన ఆదివాసీ యువకులు పాల్గొన్నారు. గెరిల్లాలు మోర్పల్లిలో ఆయుధాల ఫ్యాక్టరీ నడుపుతున్నారనే సమాచారం ఒక లొంగిపోయిన మావోయిస్టు ఇచ్చాడని, అందుకే ఈ గాలింపు చర్య అని చెప్పారు. నిజానికి ఈ అయిదు రోజుల్లోనూ అక్కడ ఏ ఆయుధాగారం బయటపడలేదు గానీ మూడు గ్రామాలు తగులబడినాక అక్కడికి వెళ్లిన పత్రికల వాళ్లకు గృహదహనాలు పోలీసులు చేసినవి కాదు, ఆయుధాగారం కూలి, ఆయుధ సామాగ్రి పేలి ఇళ్లు తగులబడిపోయి ఉంటాయని చెప్పిన పోలీసు అధికారులు కూడా ఉన్నారు.

తాడిమెట్ల, మోర్‌పల్లి, తిమ్మాపురం గ్రామాల్లో మావోయిస్టులు ప్రతి ఇంట్లో కూడా భారీ పేలుడు సామాగ్రి నిల్వ ఉంచారని అది పొరపాటున పేలి ఇళ్లు కాలిపోయి ఉండవచ్చని పోలీసులు పేర్కొంటున్నారని రాసిన ఒక తెలుగు దినపత్రిక ఈ పొరపాటు మార్చ్ 11–16ల మధ్యన మావోయిస్టుల ఆయుధాగారం కనుగొనడానికి గాలింపు చర్యల దాడి జరిగినపుడే ఎందుకు జరిగిందని ప్రశ్నించలేదు. ఐదుగురు మహిళలపై పోలీసులు సామూహిక లైంగిక అత్యాచారాన్ని ఈ 'పొరపాటు'తో ఎట్లా వివరిస్తారో కూడా అడుగలేదు. ఆరు రోజుల పాటు అష్ట దిక్కులా దిగ్బంధం చేసి కల్లూరి వలసవాద కాలపు విధ్వంసం అమలు చేసిన తర్వాత అక్కడికి మొదటిసారి వెళ్లగలిగిన అమన్‌సేథీ (ది హిందూ) కి, ఒక స్థానిక పత్రికా విలేకరికి, చివరకు 'సాక్షి' పత్రికకు కూడా చెప్పని విషయాలు అక్కడి ఆదివాసుసు ఈ దినపత్రికకు చెప్పినట్లున్నారు. 'మేం పాపం చేశామని' వాళ్లన్నట్లు, మావోయిస్టులపై కోపానికి వాళ్లు సమిధలైనట్లు చాలాకాలం క్రితం (90లో) 'ఈనాడు' ప్రారంభించిన ఇద్దరి మధ్యన ప్రజలు నలుగుతున్న సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చింది.

పదిహేను రోజులుగా వస్తున్న మీడియా రిపోర్టులలో ఆంధ్రజ్యోతి ఆన్‌లైన్ చింతూరు నుంచి చేసిన రిపోర్టు భిన్నంగా ఉంది గనుక నిర్దిష్టంగా ప్రస్తావించవలసి వస్తున్నది. గాలింపు చర్యలకు, దాడికి పోలీసులు కల్లూరి నాయకత్వంలో వెళ్లారు. ఎన్‌కౌంటర్ తర్వాత మళ్లీ దాడి ప్రారంభించారు. అది 16 దాకా కొనసాగింది. అయినా 'మావోయిస్టుల, పోలీసు బలగాల దాడులు, ప్రతిదాడులుతో నలిగిపోతున్న ఈ గిరిజనులు మేం ఏమి పాపం

చేశాం? ఏం ద్రోహం చేశాం? ఎందుకు మా బతుకులను ఛిద్రం చేస్తున్నరంటూ బోరున విలపించారు' అని చాల నిష్పక్షపాతంగా, వస్తుగతంగా రిపోర్టు చేసినట్లు రాసింది.

మావోయిస్టులు ఈ మూడు గ్రామాల్లో దంతెవాడ జిల్లాలో మాత్రమే కాదు బీజాపూర్, నారాయణపూర్ దక్షిణ బస్తర్ ప్రాంతమంతా జనతన సర్కార్ నాయకత్వంలో ఒక ప్రత్యామ్నాయ ప్రజా అభివృద్ధి నమూనాను స్వావలంబన అభివృద్ధి నమూనాను అమలు చేస్తున్నారు. ఇంత దాడిలో విధ్వంసంలో కూడా వాళ్లు కాలువలు, చెరువులు తవ్వుకుంటున్నారు. చేపలు, కోళ్లు, మేకలు పెంచుతున్నారు. వ్యవసాయం చేస్తున్నారు. కూరగాయలు పండిస్తున్నారు. అబూజ్‌మాడ్‌లో పండ్ల తోటల గురించి, ఆపిల్ పండ్ల కన్నా పెద్దవీ తియ్యనివీ అయిన జామ పండ్ల గురించి 'చలో ఛత్తీస్‌ఘడ్' పుస్తకంలో అప్పటి టివి5 విలేకరి రహ్మాన్ రాసే ఉన్నాడు. ఇటీవలే పెంగ్విన్ వాళ్లు ప్రచురించిన సత్నామ్ రచించిన 'జంగల్ నామా' యాత్రా గ్రంథంలో దండకారణ్యంలో గెరిల్లాల దైనందిన జీవితం, ఆదివాసుల స్వావలంబన అభివృద్ధి పథం గురించి చాలా వివరంగానే రాసి ఉన్నాడు. వాళ్లు చలన వైద్యశాలలు, ప్రజా చైతన్యాన్ని పెంచే బడులు నడుపుకుంటున్నారు. నీళ్లలో మెరుస్తూ కనిపించే అల్యూమినియం ఖనిజం – తినే కంచాలు కాదు, విధ్వంస క్షిపణులకు కూడా ఉపయోగించవచ్చు గనుకనే తమ అడవిపై యుద్ధ పరిశ్రమల కన్ను పడిందని గ్రహించారు. ఒక్క అబూజ్‌మాడ్ కొండ కిందనే భారత ప్రభుత్వ బడ్జెట్‌ను మించిన ఆదాయాన్ని యుద్ధ పరిశ్రమలకు తెచ్చే ఖనిజాలు ఉన్నాయని ఇటీవలే అరుంధతీ రాయ్ రాసింది. కనుక ఇవ్వాళ లాల్‌ఘడ్, జార్ఖండ్ మొదలుకొని ఛత్తీస్‌ఘడ్, ఒడిషాల వరకు ఆదివాసులు తమ బతుకులను ఎవరు ఛిద్రం చేస్తున్నారో స్పష్టంగా తెలుసుకొనే ఉన్నారు.

ఒడిషాలో మల్కన్‌గిరి జిల్లా కలెక్టర్ వినీల్ కృష్ణను కిడ్నాప్ చేసినపుడు ఆంధ్రా ఒడిషా సరిహద్దు స్పెషల్ జోనల్ కమిటీ పెట్టిన డిమాండ్‌లు చూస్తే ఆదివాసుల పట్ల, అభివృద్ధి నమూనా పట్ల మావోయిస్టు పార్టీ వైఖరి ఏమిటో దేశానికి, ప్రపంచానికి స్పష్టంగా అర్థమైంది.

మధ్యతరగతి, బుద్ధిజీవులు యువ ఐ.ఎ.ఎస్. అధికారి ప్రాణాలకు ఏమవుతుందోనని రెండో రోజు నుంచే ఆందోళన చెందుతుంటే వాళ్లు పెట్టిన మొదటి డిమాండ్‌లో 2010 నవంబర్‌లో నారాయణపట్నంలో బి.ఎస్.ఎఫ్. కిడ్నాప్ చేసిన ఆదివాసీ సీతన్నను ఏం చేసారో చెప్పమన్నారు. ఆయన కుటుంబ సభ్యులను కూడా ఆయన అతీ గతీ తెలియదని, బి.ఎస్.ఎఫ్. అతన్నేం చేసారో చెప్పాలని డిమాండ్ చేసారు.

జైలు అధికారులు, ప్రభుత్వ నిర్లక్ష్యానికి గురయి కోరాపుట్ జైల్లో మరణించిన ఇద్దరు ఆదివాసీ కుటుంబాలకు నష్టపరిహారాలివ్వాలని, ఆ మరణానికి బాధ్యత వహించాల్సిన అధికారులను శిక్షించాలని అడిగారు. నారాయణపట్నంలో ఆదివాసుల భూములు ఆక్రమించుకున్న ఆదివాసేతరుల (ముఖ్యంగా కోస్తా, ఆంధ్ర ప్రాంతం నుంచి వెళ్లిన వడ్డీ వ్యాపారులు, భూస్వాములు) నుంచి తమ భూములు తాము స్వాధీనం చేసుకున్న 2500 ఎకరాల అటవీ భూమిపై 1956 భూ క్రమబద్ధీకరణ చట్టం (ఒడిషా ప్రభుత్వ ల్యాండ్ రెగ్యులేషన్ ఆక్ట్ 1956) కింద పట్టాలివ్వాలని అడిగారు. అట్లా పట్టాలివ్వడానికి బదులు 160 మంది ఆదివాసులను, మహిళలు, వృద్ధులు, పిల్లలు అని చూడకుండా కోరాపుట్, మల్కన్‌గిరి జైళ్లలో పెట్టి వాళ్లపై దేశద్రోహం, కుట్ర, యుద్ధ ప్రకటన వంటి కేసులు యు.ఎ.పి.ఎ. కింద పెట్టడాన్ని ప్రశ్నించి వాళ్లను వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేసారు. బలమెల రిజర్వాయర్ నిర్మాణంలో, ఆ తర్వాత ప్రతి సంవత్సరం వచ్చే వరద నీటిలో ముంపునకు గురవుతున్న ఆదివాసులకు ప్రత్యామ్నాయ పునరావాసం, భూమి, నష్ట పరిహారం ఇవ్వాలని డిమాండ్ చేశారు. కలిమెల ప్రాంతానికి చిన్న నీటి వనర్ల (కాలువలు తవ్వడం) ద్వారా నీటి వసతి కల్పించాలన్నారు. దేవమాలి, విశాఖపట్నం ప్రాంతాల్లో ఆదివాసులు స్వాధీనం చేసుకున్న భూములపై పట్టాలివ్వాలన్నారు. నాల్కో నిర్మాణంలో విధ్వంసమైన ఆదివాసీ జీవితాలకు ప్రత్యామ్నాయ పునరావాసం, నష్టపరిహారం ఇవ్వాలన్నారు. ఈ విధానాలకే కారణమైన కంపెనీల ఒప్పందాలు రద్దు చేసుకోవాలని, గ్రీన్‌హంట్ ఆపరేషన్ వెంటనే ఆపేయాలని డిమాండ్ చేశారు.

2007లో అరెస్టు కన్నా ముందు ఆంధ్రా ఒరిస్సా సరిహద్దు కమిటీ రాష్ట్ర నాయకత్వంలో పనిచేసి ప్రస్తుతం మల్కన్‌గిరి జైల్లో ఉన్న శ్రీరాములు శ్రీనివాసులును, రామకృష్ణను కలవడానికి వెళ్తున్నారనే నెపంతో అరెస్టు చేసిన ఆయన సహచరి శిరీష, ఈశ్వరి, పున్నీ, ట్రక్కు డ్రైవర్లను – పంపించారనే ఆరోపణతో అరెస్టు చేసిన గంటి ప్రసాదాన్ని – వాళ్ల పై పెట్టిన కేసులు ఉపసంహరించుకొని విడుదల చేయాలని డిమాండ్ చేశారు.

ఫిబ్రవరి 14 నుంచి 24 వరకు సాగిన ఈ సంచలనాత్మక ఉదంతం స్పష్టంగా రెండు విషయాలను ప్రపంచం దృష్టికి తెచ్చింది – ఒడిషాలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల రాజకీయార్థిక విధానాల వల్ల జరుగుతున్న విధ్వంసం – గనుల తవ్వకాలు, ఉక్కు ఫ్యాక్టరీల నిర్మాణాలు – ఛిద్రం అవుతున్న ఆదివాసుల జీవితాలు, వేదాంత, టాటా, జిందాల్ వంటి బహుళజాతి, బడా కంపెనీల ప్రయోజనాల కోసం ప్రభుత్వం అనుసరిస్తున్న సైనిక దాడి విధానం (గ్రీన్‌హంట్ ఆపరేషన్). ఈ విధ్వంసాన్ని, దాడిని ప్రతిఘటిస్తున్న ఆదివాసుల పక్షం ఏ ఒక్క ఎన్నికల పార్టీ కూడా నిలబడలేదు. వాళ్లల్లో, వాళ్ల మధ్యన – అది నారాయణపట్నం కావచ్చు, మల్కన్‌గిరి కావచ్చు, కోరాపుట్ కావచ్చు – ఆంధ్ర, ఒడిషా సరిహద్దు ఎనిమిది జిల్లాలు కావచ్చు – మొత్తం ఒడిషా – ముఖ్యంగా ఆదివాసీ జనావాసాలు ఉన్న ప్రాంతం కావచ్చు – ఉండి పనిచేస్తున్న, పోరాడుతున్న వాళ్లు, ప్రాణాలు ఒడ్డుతున్న వాళ్లు, చిత్రహింసలు, లైంగిక అత్యాచారాలు, గృహదహనాలు సహిస్తూ, వందలాదిగా అరెస్టవుతూ, జైళ్లలో ఆదివాసులతో పాటు ఏళ్ల తరబడి అన్ని త్యాగాలు చేస్తున్న వాళ్లు మావోయిస్టులు. ఎందుకంటే వాళ్లు ఆదివాసుల జీవనశైలిని, సంస్కృతిని గౌరవిస్తున్నారు. అది కాపాడే స్వావలంబన అభివృద్ధి నమూనాను రచించి అమలు చేస్తున్నారు. అది బహుళ ప్రచారం పొందిన జల్–జంగల్–జమీన్ పై ఆదివాసుల హక్కు, అధికారం. ఆశ్చర్యమే మిటంటే రాజ్యాంగంలోని ఐదవ, ఆరవ షెడ్యూల్ మొదలు ఆంధ్రప్రదేశ్ 1/70, ఒడిషాలో 1956 భూ క్రమబద్ధీకరణ చట్టం నుంచి పెసా వరకు – రాజ్యాంగం చట్టాలు కూడ గుర్తించిన న్యాయమిది. జల్–జంగల్–జమీన్‌లపై ఆదివాసుల హక్కూ, అధికారం – జనతన సర్కార్ ద్వారా మాత్రమే సాధ్యం – అది నిలబెట్టుకోవడం నూతన ప్రజాస్వామిక విప్లవంతోనే సాధ్యం అని చెప్తున్న, పన్నుల నిరాకరణ, ఎన్నికల బహిష్కరణ ద్వారా, సాయుధ పోరాటం ద్వారా ఆచరించి చూపుతున్న మావోయిస్టు పార్టీ కూడ తక్షణ డిమాండుల ద్వారా ఈ రాజ్యాంగంలోని ఐదవ, ఆరవ షెడ్యూలు అమలు చేయాలని, ఆయా కాలాల్లో వచ్చిన ఆదివాసుల అనుకూల చట్టాలను అమలు చేయాలని డిమాండు చేస్తున్నది. అప్రజాస్వామిక, అణచివేత చట్టాలను రద్దు చేయాలని డిమాండు చేస్తున్నది. దేశభక్తులు, ప్రజల సార్వభౌమాధికారం చెల్లాలని ఆకాంక్షించే ప్రజాస్వామ్యవాదులైనా సమర్థించే డిమాండు చేస్తున్నది. ఈ డిమాండుల కోసం రాజ్యాంగాన్ని, చట్టాలను కాకుండా (పోనీ అవే అమలు చేస్తున్న ఆదర్శ అధికారి అనుకుందామన్నా) గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను అమలు చేస్తున్న కలెక్టర్‌ను కిడ్నాప్ చేయాల్సిన స్థితి అరవయ్యేళ్ల రిపబ్లిక్‌లో ఎందుకు వచ్చిందో ఇవ్వాళ దేశవ్యాప్తంగా బుద్ధిజీవులు చర్చించాల్సి ఉంది.

ఈ చర్చను ఈ ఉదంతం ఎజెండా మీదికి తెచ్చింది. ఆదివాసుల పక్షం, ప్రజల సార్వభౌమాధికారం పక్షం, దేశంలో భూమి, జలాలు, వనర్లు

– దేశ ప్రజలకే దక్కాలనే అభివృద్ధి అవగాహనతో మావోయిస్టు పార్టీ మాత్రమే రాజకీయాచరణతో ఉన్నదనే అంశం – పార్టీ పోరాట పంథాతో ఏకీభావం లేని వాళ్లు కూడా గ్రహించే, అంగీకరించే స్థితిని ఈ ఉదంతం మరో మారు ఎజెండా మీదికి తెచ్చింది. ఇది పాలక పక్షాలు కక్కలేక మింగలేక పోతున్న చేదు నిజం.

రెండవ తక్షణ తాత్కాలిక ఉపశమనం – మల్కన్‌గిరి జిల్లాలో పదిరోజుల పాటు గ్రీన్‌హంట్ ఆపరేషన్ ఆగిపోయింది. పారా మిలిటరీ బలగాలు వెనక్కి వెళ్లి తమ బ్యారక్స్‌లకు పరిమితమయ్యాయి.

ఆ కక్ష ఒడిషా ప్రభుత్వం శ్రీరాములు శ్రీనివాసులుపై 2006 నాటి కొత్త కేసు పెట్టి తీర్చుకోవడానికి ప్రయత్నిస్తే పొరుగు రాష్ట్రం సెగతాకిన ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వం సరిహద్దు జిల్లాల (దంతెవాడ, నారాయణపూర్, బీజాపూర్) పైన దాడి ద్వారా తీర్చుకున్నది.

శిరీష, ఈశ్వరి మొదలైన వాళ్లు అరెస్టయిన నవంబర్ నెల నుంచీ ఎఒబి కార్యదర్శి రామకృష్ణ నారాయణపట్నంలో ఉన్నాడని ధృవ పరచుకొని గాలింపు చర్యలు ఉధృతం చేసిన ఒడిషా ప్రభుత్వం కలెక్టర్ కిడ్నాపుతో ఖంగుతిన్నది. ఇపుడు కేంద్ర ప్రభుత్వంతో సహా రాష్ట్ర ప్రభుత్వాలకు ఫిబ్రవరి నెలలో మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ సమావేశం విజయవంతంగా జరిగిన ఉప్పంది ఉక్రోషం పెరిగింది. కనుక రామకృష్ణ నారాయణపట్నం అడవుల నుంచి దంతెవాడ అడవుల్లోకి ప్రవేశించాడని, ఒడిషా నుంచి తప్పుకున్నాడని ప్రచారంలో పెట్టారు. దేశంలోనే మొదటిసారిగా ఆరు వందల మందితో పి.ఎల్.జి.ఎ. బెటాలియన్ ఏర్పడిందని దాని ఆవిష్కరణ రామకృష్ణ సమక్షంలో జరిగిందని ప్రచారంలో పెట్టారు. కనుక రామకృష్ణ కొరకు గాలింపు చర్యలు ఛత్తీస్‌ఘడ్‌కు మారినట్లు అభిప్రాయం కలిగించారు. ఇప్పుడు మార్చ్ 11 నుంచి మీడియాలో జరుగుతున్న ప్రచారం, వస్తున్న వార్తలు చూస్తే ఈ ఎన్‌కౌంటర్‌లో రామకృష్ణ ఉన్నాడని, గాయపడినాడని, కేంద్ర కమిటీ ప్రముఖ నాయకుడున్నాడని ప్రచారంలో పెట్టారు. 35 మంది మావోయిస్టులు మరణించారని, అక్కడ నెత్తుటి ధారల మరకలు చూస్తే మావోయిస్టులకు భారీ నష్టం జరిగిందని ఐజి లాంక్ కుమార్, మూడు జిల్లాల బాధ్యుడు కల్లూరి ప్రచారంలో పెట్టారు.

మావోయిస్టులు 35 మంది మావోయిస్టుల శవాలను ఖననం చేసిన ప్రాంతాన్ని కూడా పోలీసులు గుర్తించారని ప్రచారం చేసారు.

మార్చ్ 14 నుంచి 23న 'ది హిందూ'లో అమన్ సేథీ వాస్తవాలేమిటో రాసే దాకా పదిరోజుల పాటు నేను ఢిల్లీ వెళ్లినా, అలీఘడ్ వెళ్లినా, హైదరాబాద్ తిరిగొచ్చినా మీడియా వాళ్లు అడిగిన 35 మంది మావోయిస్టుల మృతి, రామకృష్ణకు గాయాలు, ఈ వార్తల ఆధారంగా ప్రజలు ఆందోళనల ఫోన్‌లు ఒక మానసిక యుద్ధాన్ని చవిచూడాల్సే వచ్చింది.

మార్చ్ 22న ఛత్తీస్‌ఘడ్‌లో చాలా ప్రచారంలో ఉన్న రాష్ట్రీయ సహారా అనే టి.వి. ఛానల్ (వీళ్లకు ప్రింట్ మీడియా కూడా ఉంది) వాళ్లు ఫోన్ చేసి ఎఒబి కార్యదర్శి రామకృష్ణ 'ఎన్‌కౌంటర్' అయ్యాడట. మీరేమైనా స్పందిస్తారా? అని అడిగారు. 35 మంది మావోయిస్టుల శవాలు ఖననం చేసిన స్థలాన్ని కల్లూరి చూపుతానంటున్నాడట. మీరేమైనా స్పందిస్తారా? అని దైనిక్ భాస్కర్ (హిందీ మాట్లాడే ప్రాంతాల్లో చాలా ప్రచారంలో ఉన్న పత్రిక) పత్రిక వాళ్లు అడిగారు.

'మీడియా సమాచారమే తప్ప నాకేమీ తెలియద'ని చెప్పడం కన్నా నా దగ్గర సమాధానం లేదు.

వాస్తవానికి ఈ పదిహేను రోజుల్లో ఇటీవలి వస్తున్న హిమాంశు కుమార్ ఎస్.ఎం.ఎస్.లు, 23న హిందూలో వచ్చిన అమన్ సేథీ సుదీర్ఘమైన వార్త కథనం తప్ప ఇప్పటికీ ఈ 'ఎన్‌కౌంటర్' గురించి మావోయిస్టు పార్టీ నుంచి ప్రకటన ఏమీ లేదు. అమన్ సేథీ మాత్రం మావోయిస్టు పార్టీ నాయకుడు రామన్న నుంచి అందిన సమాచారం అని పేర్కొన్నాడు. 16న ఒక ఆపరేషన్ ముగిసి పారా మిలిటరీ బలగాలు బ్యారక్స్‌కు తిరిగి వచ్చాయని రాసాడు.

ఇప్పుడు తగలబడిన గ్రామాలకు మీడియావాళ్లు వెళ్లగలుగు తున్నారు. హక్కుల సంఘం, అగ్నివేశ్ వెళ్తున్నట్లు తెలుస్తున్నది. తగులబడిన గ్రామాల ఫోటోలు వస్తున్నాయి. దగ్ధమయిన వందలాది ఇళ్లు, ధాన్యాగారాలు, చెట్ల కింద మారిన ఆశ్రయం మిగిలిన వందలాది ఆదివాసులు కనిపిస్తున్నారు. విధ్వంసమైనవి మూడు గ్రామాలే కానీ, 20 గ్రామాలు భయభీతావహమైనవి. ఐదుగురు స్త్రీలు సామూహిక అత్యాచారాలకు గురయ్యారు. వారిలో ఒకర్ని చంపేసారు. ఆదివాసీ మహిళలందరూ అభద్రతాభావానికి గురయ్యారు. మోర్‌పెల్లిలో చంపేసిన ఒక ఆదివాసీ శవాన్ని చెట్టుకు వేల్లాడదీసారు. 1987లో వరంగల్ జిల్లా మడికొండ పోలీసు స్టేషన్‌లో మొహం చెక్కి, చిత్రహింసలు పెట్టి చంపిన మేఘ్య శవాన్ని హనుమకొండ చౌరస్తాలో ఎలక్ట్రికల్ ట్రాన్స్‌ఫార్మర్‌కు వేళ్లాడదీసినట్లు చేసి ఆదివాసులను భయభ్రాంతులకు గురి చేయాలన్నది దురుద్దేశం.

ఈ విధ్వంసం, ఈ మారణకాండ, ఈ లైంగిక అత్యాచారాలు ఇవన్నీ నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల కాలం నుంచి ఆంధ్ర పోలీసు అధికారులు – వెంగళరావు, చెన్నారెడ్డి, జనార్ధనరెడ్డి, ఎన్.టి.ఆర్., చంద్రబాబు, వై.ఎస్.ఆర్.ల వంటి రాజకీయ నాయకత్వ ప్రోత్సాహంతో చేపట్టిన అణచివేత విధానాలే. వీటికి కేంద్రంలో అద్వానీ, చిదంబరం వంటి కేంద్ర హోం మంత్రుల నుంచి ఇరవయ్యేళ్లుగా లభిస్తున్న అండదండలు ఇవ్వాళ ఇది దేశవ్యాప్త అణచివేత విధానమే కాదు, 2009 నుంచి ప్రజల మీద యుద్ధంగా కూడా మారింది. దేశంలో మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యులు, ముఖ్యులు ఎక్కడ అరెస్టయినా ఆంధ్ర ఎస్.ఐ.బి., గ్రేహౌండ్స్ అరెస్టు చేసి 'ఎన్‌కౌంటర్' చేయడం (అది కూడా ఎక్కువగా ఇక్కడ పోరాట ప్రాంతాలకు తెచ్చి చేయడం) ముఖ్యంగా ఛత్తీస్‌ఘడ్‌లో అణచివేత, దాడి, నిఘా వ్యూహానికి ఆంధ్ర ప్రాంతం నుంచి ఛత్తీస్‌ఘడ్ సర్వీసులోకి తీసుకున్న పోలీసు అధికారులను నియమించడం కూడా ఈ వ్యూహంలో భాగమే. కేంద్ర, రాష్ట్ర నక్సలైటు అణచివేత విధానానికి వ్యూహకర్త నాగపూర్‌లో ఆంధ్ర పోలీసు అధికారియే.

అట్లే ఇవ్వాళ మార్చ్ 11 నుంచి 16 వరకు గ్రీన్‌హంట్ ఆపరేషన్ రెండో దశకు స్వయంగా నాయకత్వం వహించిన కల్లూరి కూడా ఆంధ్ర పోలీసు అధికారియే. ఇతడు మూడు జిల్లాల ఆపరేషన్‌కు బాధ్యుడు.

ఈ తప్పుడు సమాచారపు మానసిక యుద్ధం (మిస్ ఇన్‌ఫర్మేషన్ సైకలాజికల్ వార్) కు సంబంధించి ఈ కల్లూరితోనే తటస్థించిన ఒక స్వానుభవంతో ఈ వ్యాసం ముగిస్తాను.

కొన్నాళ్ల క్రితం – ఛత్తీస్‌ఘడ్‌లో మావోయిస్టు పార్టీ నాయకుడు గణేశ్ ఉయికె మలేరియాతో మరణించాడని వార్త వచ్చింది. తీవ్రంగా మలేరియా సోకి చికిత్సకు సంబంధించి వస్తున్న సందర్భంలో ఆయన మరణించాడని మళ్లీ మళ్లీ మీడియాలో వార్తలు వచ్చాయి. కుంట సమీపంలో ఒక గ్రామంలో ఆయన అంత్యక్రియలు జరిగినట్లు కేంద్ర కమిటీ నాయకులు చాలా మంది హాజరయినట్లు కూడ వార్తలు వచ్చాయి. గణేశ్ ఉయికె తలిదండ్రులు, బంధువులు వరుసగా ఈ వార్తలు చూసి చాలా ఆందోళన చెంది నా వద్దకు వచ్చారు. తామక్కడకి వెళ్లి ఖననం చేస్తే కనీసం మట్టి, దహనం చేస్తే అస్థికలు, బూడిద తెచ్చుకుంటామన్నారు.

పార్టీ ప్రకటన రాలేదు కదా, నిజం కాకపోవచ్చునన్నాను. అయినా ఒకసారి వెళ్లివస్తామని కన్నీటి పర్యంతమయ్యారు. వాళ్ల ఆందోళన, ఆవేదన చూడలేక కల్లూరికి ఫోన్ చేసాను. ఆయన గణేశ్ మలేరియా చికిత్స

*సత్యాలపై ఆధార పడకుండా, శాస్త్రీయ దృష్టి లేకుండా పాలకుల స్వార్థ ప్రయోజనాలతో కృష్ణా జలాలపై కొనసాగుతున్న వివాదాలను విశ్లేషిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# కృష్ణా జలాల పంపిణీ వివాదం ఎందుకు?

మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ అనే మూడు కృష్ణా నదీ పరీవాహక రాష్ట్రాలు ఆ నదీజలాలను ఏ నిష్పత్తిలో పంచుకోవడం ఉచితమో నిర్ధారించడానికి ఏర్పడిన జస్టిస్ బ్రిజేశ్ కుమార్ ట్రిబ్యునల్ నివేదిక 2010 డిసెంబర్ 30న వెలువడింది. ఈ పంపిణీలో ఆంధ్రప్రదేశ్‌కు అన్యాయం జరిగిందనీ, మహారాష్ట్ర, కర్నాటక లాభపడ్డాయనీ ఆంధ్రప్రదేశ్‌కు చెందిన రాజకీయ నాయకులు, కొందరు విశ్లేషకులు విమర్శిస్తున్నారు. ఇప్పటికే ప్రభుత్వ ఆధ్వర్యంలో జరిగిన అఖిలపక్ష సమావేశాలలోనూ, రాష్ట్ర ప్రభుత్వం తరఫున సుప్రీంకోర్టులో దాఖలు చేస్తున్న వ్యాజ్యంలోనూ ఈ వాదనలు ఉన్నాయి. మరొకపక్క మహారాష్ట్రకూ, కర్నాటకకూ కూడ కోరినంత, తగినంత వాటా రాలేదని, తమకు కూడ అన్యాయం జరిగినట్టేనని ఆయా రాష్ట్రాలవారు వాదిస్తున్నారు.

తమకే, తమ ప్రాంతానికే అన్నీ చెందాలని, మిగిలినవారు మట్టికొట్టుకుపోయినా ఫరవాలేదని, తమ వాదనే సరయినదని, ఇతరుల వాదనలన్నీ అబద్ధమని అనుకోవడం, అనడం ప్రస్తుతం కొనసాగుతున్న రాజకీయాలలో బాగానే ఉంటుంది. భారత దేశం పేరుకే ఒక్క దేశం అనీ, ఇంకా ఇక్కడ కలిసిపోయిన విభిన్న జాతులు తమ అస్తిత్వాన్ని, తమ సొంత ఆకాంక్షలను పదిలంగానే ఉంచుకుంటున్నాయని ఈ ఉదంతం రుజువు చేస్తోంది. కాని, అన్ని చోట్లా ఉన్నది ప్రజలేననీ, పాలకుల దుర్మార్గ విధానాలను ఖండిస్తూనే, అన్ని ప్రాంతాల ప్రజల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుందనీ గుర్తించాలి. ఉమ్మడి నదుల విషయంలో వేరు వేరు దేశాల మధ్యనే సామరస్యపూర్వకమైన ఒప్పందాలు కుదిరినప్పుడు, ఒకే దేశంలోని వేరు వేరు రాష్ట్రాలు ఇటువంటి ఘర్షణ వైఖరిని తీసుకోనక్కరలేదు.

మరీ ముఖ్యంగా అంతర్రాష్ట్ర నదీ జల వివాదాలలో ఆ నదీ జలాలు మొత్తం తమకే దక్కాలని ఏ ఒక్క రాష్ట్ర నాయకులు కోరినా అది అసంగతమూ అప్రజాస్వామికమూ ప్రజావ్యతిరేకమూ అవుతుంది. దురదృష్టవశాత్తూ కృష్ణాజలాల వివాదంలో మూడు రాష్ట్రాల రాజకీయ నాయకత్వాలూ, అధికారగణాలూ, కొందరు విశ్లేషకులూ అలాగే ప్రవర్తిస్తున్నారు. అసత్యాలూ, అర్ధ సత్యాలూ ప్రచారం చేస్తున్నారు. ప్రజలకు చెప్పవలసిన విషయాలన్నీ వాస్తవికంగా చెప్పి మెరుగైన వైఖరి తీసుకునే అవకాశం కల్పించడం లేదు. కొన్ని విషయాలు చెప్పి, కొన్ని విషయాలు దాచి, కొన్ని సగం సగం చెప్పి పరిస్థితిని తమ వాదనలకు అనుకూలంగానూ, అనవసరమైన ఉద్రేకాలు పెరిగిపోయేట్టుగానూ మారుస్తున్నారు. నీరు ప్రజల జీవనాధారం గనుక ప్రజలను రెచ్చగొట్టి తమ అబద్ధ, అసంబద్ధ వాదనల వెనుక సమీకరించుకోగలుగుతున్నారు.

నిజంగానే కృష్ణాజలాల పంపిణీలో అన్యాయాలు, అక్రమాలు జరిగాయి. జరుగుతున్నాయి. మూడు రాష్ట్రాల పాలకవర్గాలకూ, కేంద్ర పాలకవర్గాలకూ, నీటిపారుదల రంగ నిపుణులమనే పేరుతో ప్రజలను, ప్రజాసమస్యలను, ప్రజా ఆకాంక్షలను పట్టించుకోని అధికార యంత్రాంగానికీ ఈ జలాల పంపిణీ ఒక వివాదంగా, తగాదాగానే కనబడింది తప్ప, ప్రజల అవసరంగా, ఆ ప్రజల మధ్య ఐక్యతతో, సామరస్యంతో, చర్చతో పరిష్కరించవలసిన సమస్యగా కనబడలేదు. అంటే ఈ పాలకవర్గ దృక్పథంలోనే మౌలిక సమస్య ఉంది. అంకెలమీద మితిమీరిన శ్రద్ధ, అంకెల గారడీ ద్వారా పాలకవర్గ ప్రయోజనాలను తీర్చే నైపుణ్యం, ప్రజల మధ్య ఘర్షణ చల్లారకుండా చూడాలనే పాలకనీతి, చరిత్రతో, వాస్తవికతతో సంబంధం లేని కుహనా మేధావిత్వం ఇటువంటి ట్రిబ్యునళ్ల, కమిషన్ల, కమిటీల నివేదికలలో రాజ్యం చేస్తాయి. ప్రస్తుత

---

కోసం అడవి నుంచి బయటికి వస్తూ చనిపోయాడని, పార్టీకి చాలా బలం ఉన్న గ్రామంలో అంత్యక్రియలు చేసి కేంద్ర నాయకత్వం హాజరయిందని తనకు విశ్వసనీయ సమాచారం ఉందని, తలిదండ్రులు, బంధువులు వస్తే తాను స్వయంగా వెంట ఉండి వాళ్లనక్కడికి తీసుక వెళ్తానని, తనను పోలీసు అధికారిగా చూడవద్దని, మృతుని తలిదండ్రుల పట్ల కన్‌సర్న్‌గా ఉన్నవానిగా భావించి పంపించమని చెప్పాడు. ఎంత నమ్మదగినట్లుగా, వినయంగా చెప్పాడో చెప్పలేను. మన భాషే, అంటే తెలుగు భాషే మాట్లాడిన ఆంధ్రుడే అయిన పోలీసు అధికారి గనుక, అందులోనూ వర్తమాన యుద్ధంలో అటు మోహరించి నిలబడి ఉన్నవాడు కనుక – చూద్దాంలే – వెళ్లి మాత్రం మట్టియో, అస్థికలో, బూడిదో తెచ్చుకోవడమే కదా – ఏదో విషయం పార్టీ ప్రకటన వచ్చినాక వెళ్దురు గానీ అని నచ్చచెప్పాను.

ఆ తర్వాత ఒకటి రెండు రోజుల్లోనే దండకారణ్య అధికార ప్రతినిధి గుడ్సె ఉసెండీ – మలేరియా జ్వరం నుంచి తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి ఆదివాసులకు, పార్టీ శ్రేణులకు చెప్పిన విషయాలు, గణేశ్ ఉయికె, మలేరియా బారిన పడి కోలుకున్న విషయం ఎక్కడో సమాచారం వచ్చింది.

ఇంత జరిగి కూడా కీడెంచి మేలెంచకుండా ఉండలేం గదా. అతి స్నేహం ఎప్పుడూ కీడును శంకిస్తుంది. మనుషులకుండే ఈ స్నేహ బలహీనతను, మంచి మనగలగాలనే ఆకాంక్షను ఇవ్వాళ సామ్రాజ్యవాద, భూస్వామ్య దళారీ ప్రభుత్వాలు గ్రీన్‌హంట్ ఆపరేషన్ రెండవ దశలో మానసిక యుద్ధానికి, భౌతిక విధ్వంసానికి వ్యూహాత్మకంగా వాడుకుంటున్నాయి. తస్మాత్ జాగ్రత్త!

*(రచయిత విప్లవ రచయితల సంఘం సభ్యులు)* వీ

రెండవ కృష్ణాజలాల వివాద ట్రిబ్యునల్ తీర్పులో కూడ ఈ లక్షణాలన్నీ ఉన్నాయి. అందువల్లనే ఈ నివేదికను చూపి ప్రజలను రెచ్చగొట్టడానికి, సంబంధిత రాష్ట్రాల ప్రజల మధ్య ఘర్షణ మరింత పెంచడానికి రాజకీయ నాయకులకు వీలు కలుగుతోంది.

ఈ నివేదిక బాగోగులను చర్చించే ముందు అసలు సమస్య గురించి తెలుసుకోవాలి.

కృష్ణా నది పడమటి కనుమలలో మహారాష్ట్రలోని మహాబలేశ్వర్ దగ్గర పుట్టి 1400 కి.మీ. ప్రవహించి ఆంధ్రప్రదేశ్ లోని హంసలదీవి దగ్గర బంగాళాఖాతంలో కలుస్తుంది. ప్రధానంగా పడమటి కనుమల వర్షపాతంతో ప్రారంభమయ్యే ఈ నది దారి పొడవునా వెన్న, కోయ్నా, పాంచ్ గంగ, దూద్ గంగ, ఘటప్రభ, మలప్రభ, తుంగభద్ర, భీమ, డిండి, పెద్దవాగు, హాలియా, మూసీ, పాలేరు, మునేరు వంటి చిన్ననదులు, సెలయేళ్లు, వాగులలో ప్రవహించే నీటితో నిండుతుంది.

ఈ ప్రయాణమార్గం మహారాష్ట్రలో 299 కి.మీ., కర్నాటకలో 483 కి.మీ., ఆంధ్రప్రదేశ్‌లో 576 కి.మీ సాగగా, ఏడు కి.మీ. మహారాష్ట్ర కర్నాటక సరిహద్దులో, 35 కి.మీ. కర్నాటక ఆంధ్రప్రదేశ్ సరిహద్దులో సాగుతుంది. ఈ లెక్కన నది మహారాష్ట్రలో 21.3 శాతం, కర్నాటకలో 34.5 శాతం, ఆంధ్రప్రదేశ్‌లో 41.1 శాతం, సరిహద్దులలో మూడు శాతం ప్రవహిస్తుందన్నమాట.

అయితే నదీజలాలలో రాష్ట్రాల వాటా గురించి మాట్లాడుకునేటప్పుడు కేవలం రాష్ట్రంలో ఆ నది నిడివి మాత్రమే కాక నది పరీవాహక ప్రాంతం (బేసిన్) అనేది కూడ మరొక ముఖ్యమైన సూచిక అవుతుంది. ఎందుకంటే నది నిడివి ఎక్కువ ఉన్నప్పటికీ ఆ ప్రాంతంలో ఆ నదిలో చేరే ప్రవాహాలు లేకపోవచ్చు. అలా చూసినప్పుడు మొత్తం కృష్ణా బేసిన్‌ను పన్నెండు సబ్ బేసిన్‌లుగా విభజించారు. ఆ లెక్కప్రకారం కృష్ణానది పరీవాహక ప్రాంత విస్తీర్ణంలో మహారాష్ట్రకు 26.8 శాతం, కర్నాటకకు 43.7 శాతం, ఆంధ్రప్రదేశ్‌కు 29.4 శాతం వాటాలున్నాయి. (ఆంధ్రప్రదేశ్‌లో నది నిడివి 41.1 శాతం ఉన్నప్పటికీ పరీవాహక ప్రాంతం చాల తక్కువగా 29.4 శాతం ఉండడం అనేక నైసర్గిక కారణాలవల్ల సంభవించింది. చిత్రపటం చూస్తే ఆంధ్రప్రదేశ్‌లో తుంగభద్ర సంగమం తర్వాత కుడివైపు కృష్ణానది బేసిన్ దాదాపు లేదని చెప్పవలసినంత తక్కువగా కనబడుతుంది).

నిజానికి ఈ రెండు గణాంకాలు మాత్రమే కాక, ఆ ప్రాంతంలో జనసంఖ్య, ఆ ప్రజల సాగునీటి, తాగునీటి అవసరాలు, ఆ ప్రాంతంలోని జంతు, జీవజాతుల అవసరాలు, పారిశ్రామిక అవసరాలు వంటి వాటిని కూడ లెక్కవేసి ఆ నదీజలాలను ఆయా ప్రాంతాలకు న్యాయబద్ధంగా, హేతుబద్ధంగా పంపిణీ చేయవలసి ఉంటుంది.

కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో ఇప్పుడైతే మూడు రాష్ట్రాలు ఉన్నాయి గాని, చరిత్రలోకి వెళ్లిచూస్తే అంతకన్న ఎక్కువో తక్కువో పాలనా ప్రాంతాలు కనబడతాయి. మొత్తానికి ఈ పరీవాహక ప్రాంతమంతా ఒకే పాలన కింద ఉన్న సమయం ఏదీ లేదు. అందువల్ల ఈ నదీ జలాల పంపిణీ ఎలా జరగాలనేది ఆయా ప్రజల అవసరాలనుబట్టి కాక, మరే ఇతర ప్రాతిపదికలనుబట్టి కాక, ఆయా ప్రాంతాల పాలకుల మధ్య సంబంధాలను బట్టి నిర్ణయమయింది.

1850కి ముందు ఈ జలాల వినియోగంలో ఆధునిక ఆనకట్టలు లేవు గనుక వివాదానికి ఆస్కారం లేకుండింది. ఆతర్వాత కూడ, కృష్ణా జలాల మీద కాకపోయినా, కృష్ణకు ఉపనది అయిన తుంగభద్ర జలాల వినియోగంలో మైసూరు పాలకులకు, హైదరాబాదు పాలకులకు మధ్య 1892లో, 1933లో, మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం కూడ చేరి 1944లో ఒప్పందాలు కుదిరాయి.

వలస పాలన ముగిసిపోయి భారత రాజ్యాంగం అమలులోకి వచ్చిన తర్వాత కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో బొంబాయి, మైసూరు, హైదరాబాదు, మద్రాసు రాష్ట్రాలు ఏర్పడ్డాయి. ఈ నాలుగు రాష్ట్రాల మధ్య కృష్ణా జలాలను పంపిణీ చేస్తూ కేంద్ర ప్రభుత్వం 1951 లో రూపొందించిన ప్రతిపాదనను మైసూరు రాష్ట్ర ప్రభుత్వం తిరస్కరించడంతో కృష్ణా జలాల పంపిణీ రాష్ట్రాల మధ్య వివాదాస్పదం కానున్నదని మొదటిసారిగా బయటపడింది. అయినా 1951 ప్రతిపాదన ప్రకారమే రాష్ట్రాలు పథకాలు తయారు చేయడం, కేంద్రం అనుమతులు ఇవ్వడం మొదలయింది.

ఈలోగా ఈ నాలుగు రాష్ట్రాల సరిహద్దులు మారిపోయేలా 1956లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగింది. కృష్ణా నదీపరీవాహక ప్రాంతంలో మూడు రాష్ట్రాలే (మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్) మిగిలాయి. అంతకు ముందు ప్రతిపాదించిన పథకాలు మారిపోయాయి. కేంద్రప్రభుత్వం ఎన్.డి. గుల్హాతీ అధ్యక్షతన నియమించిన కృష్ణా గోదావరి కమిషన్ 1962లో ఇచ్చిన నివేదికలోనే కృష్ణానదిలో ఎంత నీరు లభ్యమవుతుందో కచ్చితంగా చెప్పలేమనీ, రాష్ట్రాలు కోరుతున్న పరిమాణంలోనైతే నీరు లభ్యం కాదనీ ప్రకటించింది. ఈ పునాది పై కేంద్రప్రభుత్వం 1951 ఒప్పందం ఇక చెల్లదని ప్రకటించి, అప్పటికి నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులు మాత్రం కొనసాగించాలనీ, నీటి పంపిణీకి శాశ్వత ప్రాతిపదికలు నిర్ణయించే వరకూ మహారాష్ట్ర 400 టిఎంసి, కర్నాటక 600 టిఎంసి, ఆంధ్ర ప్రదేశ్ 800 టిఎంసి మాత్రం వాడుకోవాలని ఆదేశించింది. (టిఎంసి అంటే థౌజండ్ మిలియన్ క్యూబిక్ ఫీట్ వందకోట్ల ఘనపుటడుగులు. మరో మాటల్లో చెప్పాలంటే ఒక అడుగు పొడవు, ఒక అడుగు వెడల్పు, ఒక అడుగు లోతు ఉండే నీటి పరిమాణం వందకోట్ల రెట్లు ఈ నీరు మూడు వేల ఎకరాల నుంచి పది వేల ఎకరాల వరకు పంటలకు సరిపోతుందని వేరు వేరు అంచనాలు ఉన్నాయి).

ఈ పంపిణీకి మూడు రాష్ట్రాల ప్రభుత్వాలూ అభ్యంతరం తెలిపాయి. ఈ అభ్యంతరాల వల్ల కేంద్ర ప్రభుత్వం 1969లో జస్టిస్ ఆర్.ఎస్. బచావత్ అధ్యక్షతన కృష్ణానదీ జలాల వివాద ట్రిబ్యునల్ ఏర్పాటు చేసింది. ఈ ట్రిబ్యునల్ ముందు మూడు రాష్ట్రాల ప్రభుత్వాలు చేసిన వాదనల సంక్లిష్టమైన సాంకేతిక విషయాలలోకి ఇక్కడ పోనవసరం లేదుగాని, కృష్ణాజలాలలో తమకు 828 టిఎంసి దక్కాలని మహారాష్ట్ర, 1430 టిఎంసి దక్కాలని కర్నాటక, 1888 టిఎంసి దక్కాలని ఆంధ్రప్రదేశ్ వాదించాయి. అంటే ఈ మూడు అంకెలు కలిపితే కృష్ణానదిలో సాలీనా 4146 టిఎంసి నీరు ప్రవహించవలసి ఉంటుంది.

నీటి కేటాయింపుకు అనుసరించవలసిన ప్రమాణాలు ఏమిటనే విషయంలో మూడు రాష్ట్ర ప్రభుత్వాలూ మూడు రకాల ప్రాతిపదికలను సూచించాయి. మహారాష్ట్ర దృష్టిలో 1. పరీవాహక ప్రాంతంలోని ఉపనదుల ద్వారా వచ్చే నీటి పరిమాణం, 2. ఆ ప్రాంతంలోని కరువు పీడిత ప్రాంతాలు, 3. ఆ ప్రాంతంలో వ్యవసాయ యోగ్యమైన భూమి, 4. ఆ ప్రాంతంలోని జనసంఖ్య; కర్నాటక దృష్టిలో 1. పరీవాహక ప్రాంత విస్తీర్ణం, 2. వ్యవసాయ యోగ్యమైన భూమి విస్తీర్ణం, 3. పంటభూమి విస్తీర్ణం, 4. జనసంఖ్య కాగా ఆంధ్రప్రదేశ్ దృష్టిలో 1.

1951 వరకు వినియోగించుకున్న నీరు 2. 1951 నుంచి 1960 వరకు వినియోగించుకున్న నీరు. 3. భవిష్యత్తులో వినియోగించుకోవడానికి ప్రతిపాదిస్తున్న నీరు ప్రాతిపదికలుగా ఉండాలని సూచించాయి.

బచావత్ ట్రిబ్యునల్ సుదీర్ఘమైన విచారణ జరిపి, 1973లో తొలి నివేదికను, 1976లో తుది నివేదికను సమర్పించినప్పుడు కృష్ణానదిలో ప్రవహించే నికరజలాలు 2060 టిఎంసి మాత్రమే అని తేల్చింది. అంటే మూడు రాష్ట్రాలు కలిపి కోరినది బచావత్ వేసిన అంచనాకన్న రెట్టింపు అన్నమాట. ఈ 2060 టిఎంసి అనే లెక్క కూడ అపసవ్యమైనదేనని, కృష్ణానదిలో అంత నీరు లభ్యమయ్యే అవకాశం లేదని అప్పుడే విమర్శించిన నిపుణులు ఉన్నారు. ఈ 2060 టిఎంసి నికర జలాలలో బచావత్ ట్రిబ్యునల్ మహారాష్ట్రకు 560 టిఎంసి, కర్నాటకకు 700 టిఎంసి, ఆంధ్రప్రదేశ్ కు 800 టిఎంసి నీటిని కేటాయించింది.

అప్పుడు బచావత్ ట్రిబ్యునల్ అయినా, ఇప్పుడు బ్రిజేశ్ కుమార్ ట్రిబ్యునల్ అయినా కృష్ణానదిలో లభ్యమయ్యే నీరు ఎంత అని లెక్క వేసిన పద్ధతిలోనే చాల అవకతవకలు ఉన్నాయి. ఇవాళ మాట్లాడుతున్న వాళ్లెవరూ ఆ అవకతవకల గురించి మాట్లాడకుండా, తేల్చిన మొత్తం నీటిలో తమకు తక్కువ వాటా వచ్చిందని ఆరోపిస్తున్నారు. అసలు మొత్తం నీటి లెక్కే తప్పయినప్పుడు, వాటా గురించి వివాదం అర్థరహితమవుతుంది.

ఉదాహరణకు బచావత్ ట్రిబ్యునల్ 1894 నుంచి 1972 వరకు 78 సంవత్సరాలలో కృష్ణానదిలో ప్రవహించిన నీటి పరిమాణంలో 75 శాతం విశ్వసనీయతను బట్టి సాలీనా నీటి లభ్యత 2060 టిఎంసి అని తేల్చింది. ఈ నిర్ధారణలో మూడు పొరపాట్లు ఉన్నాయి. ఒకటి, ఇది 78 సంవత్సరాల సగటు నీటి లభ్యత కూడ కాదు. విజయవాడ బ్యారేజి దగ్గర నీటి ప్రవాహాన్ని కొలిచే సాధనాలు ఉన్నందువల్ల, ఆ గణాంకాలు 1894 నుంచి లభ్యమవుతున్నందువల్ల ఈ ప్రమాణాన్ని తీసుకున్నారు. ఆ లెక్కలలో అత్యధికంగా 4165 టిఎంసి నీరు ప్రవహించిన సంవత్సరమూ (1956-57) ఉంది, అతి స్వల్పంగా 1007 టిఎంసి నీరు ప్రవహించిన సంవత్సరమూ (1918-19) ఉంది. మరి ఈ 2060 అనే అంకెకు ఎలా వచ్చారంటే ఒక సంక్లిష్టమైన లెక్క ఉంది ఈ 78 సంవత్సరాలనూ వాటి ప్రవాహాన్ని బట్టి అవరోహణ క్రమంలో రాస్తూ పోయారు. ఆ వరుసలో 75 శాతం విశ్వసనీయత అంటే 58, 59 సంవత్సరాలలోని ప్రవాహ పరిమాణం తేలింది. అది 2063, 2057 టిఎంసిలుగా ఉంది గనుక ట్రిబ్యునల్ 2060ని నిర్ధారించింది. ఇక్కడ వేరువేరు రాష్ట్రాలు వేరువేరు విశ్వసనీయతా శాతం ఉండాలని వాదించాయి గాని, బచావత్ 75 శాతానికి కట్టుబడింది.

రెండు, నిజానికి ఈ 78 సంవత్సరాలలో 1952లో విజయవాడ దగ్గర పాత ఆనకట్టకు పగుళ్లు రావడం వల్ల కొత్త ఆనకట్ట నిర్మించారు. ఈ నిర్మాణ క్రమంలో 1953 నుంచి 1962 వరకు నమోదయిన లెక్కలు సరైనవి కావని అప్పుడే అభ్యంతరాలు వచ్చాయి. అయినా ట్రిబ్యునల్ ఈ వివాదాన్ని పట్టించుకోలేదు.

మూడు, నిజానికి 1400 కి. మీ. ప్రవహించే నదిలో, వేరువేరు చోట్ల వేరువేరు ఉపనదుల ద్వారా నీరు చేరే నదిలో ఎంత నీరు ప్రవహిస్తుందని తేల్చవలసింది చివరి వంద కి.మీ. దగ్గర ఉన్న సాధనాలను బట్టి కాదు, అక్కడ తప్పనిసరిగా నీరు ఎక్కువగానే ఉండవచ్చు, దాన్నంతా ఎగువకు తీసుకుపోవడం సాధ్యం కాదు. కాని ఈ తప్పులతడక లెక్కే ఇన్నాళ్లుగా పనిచేస్తూ వస్తోంది. ఇప్పుడు కృష్ణాజలాల పంపిణీ గురించి గొంతెత్తి వాదిస్తున్నవారెవరూ ఈ అసలు విషయాన్ని ప్రస్తావించడమే లేదు.

బచావత్ ట్రిబ్యునల్ తీర్పులో మరొక కీలకాంశం ప్రస్తుత వివాదాలకు కారణమవుతోంది. ఆ తీర్పులో రెండు పథకాలు ప్రకటించారు. పథకం ఎ కింద నికర జలాల వాటాల పంపిణీ గురించి చెప్పి, పథకం బి లో మిగులు జలాల గురించి తేల్చడానికి ఒక నదీజల వివాదాల పరిష్కార వేదికను పార్లమెంటు చట్టం ద్వారా శాశ్వత ప్రాతిపదిక మీద ఏర్పరచాలని, అది తమ పరిధిలోని విషయం కాదని అన్నారు. ఈ పథకం బి ప్రకారం మిగులు జలాలు 2060 కన్న ఎక్కువగా 2130 వరకూ ఉన్నప్పుడు మహారాష్ట్ర 35 శాతం, కర్నాటక 50 శాతం, ఆంధ్రప్రదేశ్ 15 శాతం వాడుకోవాలని, 2130 కన్న ఎక్కువ ఉన్నప్పుడు మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ లు చెరి 25 శాతం, కర్నాటక 50 శాతం వాడుకోవాలని అన్నారు. ఈ పథకం బి ని ఆంధ్రప్రదేశ్ అంగీకరించలేదు గనుక, కేంద్ర ప్రభుత్వం చట్టం చేసి నదీ జల వివాదాల శాశ్వత పరిష్కార వేదికను ఏర్పాటు చేయలేదు గనుక అది అలాగే ఉండి పోయింది.

ఈ లోగా, పునఃస్సమీక్ష జరిగేవరకూ మిగులు జలాలను వాడుకునే స్వేచ్ఛ ఆంధ్రప్రదేశ్‌కు ఉంటుందనీ, కాని అది హక్కు కాదనీ బచావత్ చెప్పిన మాటను వక్రీకరిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తన హక్కుగా వ్యాఖ్యానిస్తూ వచ్చింది. ఆ మిగులు జలాలు వాడుకోవడానికి వీలుగా ప్రాజెక్టులు నిర్మిస్తూ వచ్చింది. ఒకసారి ప్రాజెక్టులు నిర్మాణమయితే, ఆ నీటి మీద హక్కు స్థిరపడుతుందనే అభిప్రాయంతో తగిన అనుమతులు లేకుండానే ప్రాజెక్టుల నిర్మాణ పనులు మొదలుపెట్టింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒకవైపు ఇలా మిగులును ఆక్రమించడానికి ప్రయత్నిస్తూనే, మహారాష్ట్ర, కర్నాటకలు తమ కేటాయింపులకు లోబడిన నిర్మించుకునే ప్రాజెక్టులకు అభ్యంతరం చెప్పడం మొదలుపెట్టింది. ప్రతిగా ఆ రెండు రాష్ట్ర ప్రభుత్వాలు కూడ ఆంధ్రప్రదేశ్ నిర్మాణాల మీద అభ్యంతరాలు చెప్పాయి. అలా మూడు రాష్ట్ర ప్రభుత్వాలూ ఒకదానిమీద మరొకటి సుప్రీంకోర్టుకూ, కేంద్ర జల సంఘానికీ, కేంద్ర ప్రభుత్వానికీ, ప్రణాళికా సంఘానికీ ఫిర్యాదులు చేసుకుంటూ వచ్చాయి.

ఈ నేపథ్యంలో బ్రిజేశ్ కుమార్ ట్రిబ్యునల్ ఏర్పడింది. బచావత్ ట్రిబ్యునల్ మీద ఇరవై ఐదు సంవత్సరాల తర్వాత సమీక్ష జరిపి కేటాయింపులను సవరించవచ్చునని ఆ నివేదికలోనే సూచించారు. దాని ప్రకారం 31 మే 2000 తర్వాత సమీక్ష కోసం నియమించ వలసిన రెండవ కృష్ణానదీ జలాల వివాద పరిష్కార ట్రిబ్యునల్‌గా బ్రిజేశ్ కుమార్ అధ్యక్షుడుగా ఏప్రిల్ 2004లో కొత్త ట్రిబ్యునల్ ఏర్పాటయింది. మూడు రాష్ట్ర ప్రభుత్వాల న్యాయవాదుల వాదనలు విని, సుదీర్ఘ విచారణ చేసిన తర్వాత ఈ ట్రిబ్యునల్ తన తీర్పును 2010 డిసెంబర్ 30న ప్రకటించింది.

మొదటి ట్రిబ్యునల్‌కు, రెండవ ట్రిబ్యునల్‌కు కొట్టవచ్చినట్టు కనిపించే పోలికలు, తేడాలు కొన్ని ఉన్నాయి. మొదటి ట్రిబ్యునల్ లాగే రెండో ట్రిబ్యునల్ కూడ కృష్ణా నదిలో నీటి లభ్యతను గురించి కాకిలెక్కలు వేసింది. మొదటి ట్రిబ్యునల్ 78 సంవత్సరాల నీటి ప్రవాహాన్ని పరిగణనలోకి తీసుకుని, దానిలో 75 శాతం విశ్వసనీయతను పునాదిగా తీసుకుంటే, రెండో ట్రిబ్యునల్ 47 సంవత్సరాల ప్రవాహాన్ని

పరిగణనలోకి తీసుకుని, దానిలో 65 శాతం విశ్వసనీయతను పునాదిగా తీసుకుంది. అందువల్ల మొదటి ట్రిబ్యునల్ కృష్ణానదిలో 2060 టిఎంసి నీరు లభ్యమవుతుందని చెప్పగా, రెండో ట్రిబ్యునల్ 2578 టిఎంసి నీరు లభ్యమవుతుందని చెప్పింది. ఈ కొత్త లెక్క ప్రకారం నికర జలాలలో 666 టిఎంసి మహారాష్ట్రకు, 911 టిఎంసి కర్నాటకకు, 1001 టిఎంసి ఆంధ్రప్రదేశ్‌కు కేటాయించింది. మిగులు జలాల వాటా నిర్ణయించడం తన పరిధిలోని విషయం కాదని, దానికోసం పార్లమెంటులో చట్టం ద్వారా ఒక శాశ్వత సంస్థను ఏర్పాటు చేయాలని మొదటి ట్రిబ్యునల్ అనగా, రెండో ట్రిబ్యునల్ మిగులు జలాలను 285 టిఎంసిగా లెక్కకట్టి, వాటిని ఆంధ్రప్రదేశ్ కు 135 టిఎంసి, కర్నాటకకు 112 టిఎంసి, మహారాష్ట్రకు 38 టిఎంసి కేటాయించింది. నిజానికి ఈ మిగులు జలాల కేటాయింపులో బచావత్ చెప్పిన సూత్రాన్ని (మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌లకు చెరి 25 శాతం, కర్నాటకకు 50 శాతం) బ్రిజేశ్ కుమార్ పాటించలేదు.

బ్రిజేశ్ కుమార్ ట్రిబ్యునల్ తీర్పు వెలువడిననాటి నుంచీ ఆంధ్రప్రదేశ్‌లో అన్ని గడపలలోన మా గడప మేలు అనే వాదనలూ, అన్నీ మాకే రావాలి, ఇతరులకు ఏమీ వద్దు అనే వాదనలూ చెలరేగుతున్నాయి. చర్చ న్యాయాన్యాయాల పునాదిపై, హేతుబద్ధంగా కాక, కేవలం ఉద్వేగాలను రెచ్చగొట్టడం మీద ఆధారపడి జరుగుతున్నది. ఆంధ్రప్రదేశ్ రాజకీయ నాయకులు, కొందరు నీటిపారుదల రంగ నిపుణులు, సాధారణంగా తెలుగు ప్రచార సాధనాలు లేవనెత్తుతున్న వాదనలలో ముఖ్యమైనవి:

1. నీటి పరిమాణాన్ని అశాస్త్రీయంగా, తప్పుగా లెక్కగట్టి ఎక్కువ నికర జలాలు చూపించారు. అలా ఎక్కువగా చూపిన నికరజలాల్లో కూడ రాష్ట్రానికి తక్కువ వాటా ఇచ్చారు.
2. మిగులు జలాలు పూర్తిగా దిగువ రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌కే కేటాయించవలసి ఉండగా, దానిలో వాటాలు వేశారు. తద్వారా ఆంధ్రప్రదేశ్ 150 టిఎంసి ల నీరు నష్టపోయింది.
3. ఇప్పటిదాకా ఆంధ్రప్రదేశ్ వాడుకుంటున్న జలాలలో దాదాపు 270 టిఎంసి జలాలను (వీటిలో 118 టిఎంసి నికరజలాలు, 150 టిఎంసి మిగులు జలాలు) బ్రిజేశ్ కుమార్ ఆంధ్రప్రదేశ్‌కు దక్కకుండా చేశారు.
4. మిగులు జలాలను ఎగువరాష్ట్రాలకు పంచగూడదని బచావత్ ట్రిబ్యునల్ చెప్పింది. ఇప్పుడు రెండో ట్రిబ్యునల్ ఆ సూచనను మార్చివేసింది.
5. కర్నాటక నిర్మిస్తున్న ఆల్మట్టి ఆనకట్ట ఎత్తు పెంచడానికి ఈ ట్రిబ్యునల్ అనుమతించింది. తద్వారా దిగువకు నీటి ప్రవాహాన్ని అడ్డుకోవడం జరుగుతుంది. కర్నాటకకు బచావత్ కేటాయించిన దానికన్న ఎక్కువగా 177 టిఎంసిలను బ్రిజేశ్ కుమార్ కేటాయించారు. వీటిలో 105 మిగులు జలాలు కాగా, 72 నికర జలాలలోనే. అంటే ఆల్మట్టిలో ఎక్కువ నిలువకు అవకాశం కల్పించినట్టే.

ఈ వాదనలన్నీ పూర్తిగా అసత్యాలు కాకపోయినా అర్ధసత్యాలు. ఈ అన్ని వాదనలకూ ఆ రెండు రాష్ట్రాల వైపునుంచీ జవాబులున్నాయి. అసలు ఏ రాష్ట్ర ప్రభుత్వ పక్షమూ తీసుకోకుండా హేతుబద్ధంగా చెప్పగలిగిన జవాబులున్నాయి.

ఏకకాలంలో నికర జలాల లెక్క తప్పు అనీ, ఆ తప్పుడు లెక్కలో తమకు ఎక్కువ వాటా కావాలనీ వాదించడం అసమంజసం. లెక్కే తప్పు అనయినా వాదించవచ్చు, అప్పుడు వాటా ఎక్కువ తక్కువల ప్రసక్తి రాదు. లేదా ఆ లెక్కను అంగీకరించి, అందులో మా వాటా తక్కువయిందని వాదించవచ్చు.

మిగులు జలాలు పూర్తిగా దిగువ రాష్ట్రానికే చెందాలనడం తప్పు. మిగులు జలాలను ఎగువ రాష్ట్రాలు ముందే ఆపగూడదని గాని, మిగులు జలాల వాడకాన్ని పర్యవేక్షించే ఉమ్మడి వ్యవస్థలు ఉండాలని గాని వాదించవచ్చు.

ఇప్పటిదాకా వాడుకుంటున్నాను గనుక, నాకే హక్కు ఉండాలి అని వాదించడం ఉమ్మడి ఆస్తుల విషయంలో సహజ న్యాయసూత్రాలకు విరుద్ధం. ఉమ్మడి ఆస్తులపై అందరికీ హక్కు ఉంటుంది గాని, ఎక్కువ కాలం వాడుకున్నారు గనుకనో, ముందే వాడుకున్నారు గనుకనో హక్కు ఉండదు. బచావత్ ట్రిబ్యునల్ కూడ ఇది స్వేచ్ఛే తప్ప హక్కు కాదని స్పష్టం చేసి ఉంది.

ఆల్మట్టి ఆనకట్టను అనవసర వివాదంగా మార్చే బదులు, ఆ ఆనకట్టను ఆ రాష్ట్రానికి కేటాయించిన పరిమాణం లోపలనే కట్టుకుంటున్నట్టయితే ఆమోదించడం, అలా పరిమితం చేసేట్టు చూడడం, ఆ ఆనకట్ట కాలువలను దిగువకు, అంటే కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలకు కూడ వ్యాపించేలా చర్చలు జరపడం సామరస్యపూర్వకమైన పరిష్కారం అవుతుంది.

అసలు నికర జలాలే బచావత్ లెక్కించినట్టుగా 2060 టిఎంసి ఉన్నాయా అనే వివాదం ఉండగా వాటిని 2578కి పెంచడం, మిగులు జలాలను 285గా లెక్కించడం ఆ నీటి మీద ఆధారపడిన ప్రజలను, రైతులను మాయ చేయడమే తప్ప మరొకటి కాదు. మరొకవైపు ఈ ట్రిబ్యునల్ విచారణలో భాగంగా ఆంధ్రప్రదేశ్ ఏటా 1300 టిఎంసి పైచిలుకు నీరు వాడుకోవడానికి తగిన నిర్మాణాలను, కాలువలను, పంట విస్తీర్ణాన్ని కలిగి ఉన్నదని స్వయంగా రాష్ట్ర న్యాయవాదులే అంగీకరించారు. మరొకవైపు మిగిలిన రెండు రాష్ట్రాలూ తమ కేటాయింపులకు తగిన నిర్మాణాలను ఇప్పటికీ కట్టుకోలేదు. కనుక మనం నష్టపోయాం అని ఆంధ్రప్రదేశ్ రాజకీయ నాయకులు చేస్తున్న వాదనలకు అర్థం లేదు. ఇది కేవలం సంకుచిత ప్రాంతీయ వాదాన్ని రెచ్చగొట్టడానికి మాత్రమే. కాగా, మరొకవైపు ఈ నాయకులే ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానదిపై ఉన్న అన్ని ప్రాజెక్టులకూ, కృష్ణానది ప్రవహించే అన్ని ప్రాంతాలకూ సమన్యాయం జరగడం లేదని గుర్తించడం లేదు. ఆంధ్రప్రదేశ్‌కు తగిన వాటా రాలేదని అంటున్నవాళ్లు తెలంగాణ వాటా గురించి మాత్రం మాట్లాడడం లేదు. కృష్ణా డెల్టాలో మూడో పంటకు నీరు అందదేమోనని గగ్గోలు పెడుతున్నవారు ఎగువన కృష్ణానదికి అటూ ఇటూ తాగడానికి గుక్కెడు నీళ్లు, పంటలకు న్యాయమైన వాటా నీళ్లు అందని కర్నూలు, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాలు ఉన్నాయని మరచిపోతున్నారు.

అటూ ఇటూ కూడ పాలకవర్గ రాజకీయాలు ఒక నిజమైన ప్రజాసమస్యను ఎలా మసిపూసి మారేడుకాయ చేయగలవో, ప్రజలకు వాస్తవాలు చెప్పకుండా, అబద్ధాల మీద ఆధారపడి రెచ్చగొట్టగలవో చూపడానికి మంచి ఉదాహరణ ఈ కృష్ణాజలాల వివాదం. ఇటువంటి వివాదాలలో జోక్యం చేసుకుని, తగిన సాంకేతిక, ప్రజానుకూల, హేతుబద్ధ వాదనలను ముందుకు తెచ్చి, ప్రజల ఐక్యతనూ, ప్రజా ప్రయోజనాలనూ కాపాడవలసిన బాధ్యత ప్రగతిశీలశక్తుల పైనే ఉంటుంది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

*సూక్ష్మ రుణ వడ్డీ వ్యాపారం ఈ వ్యవస్థ స్వభావానికి ఒకానొక ప్రతీక మాత్రమేనంటూ రకరకాల రూపాలలో సాగుతున్న దోపిడీని వివరిస్తున్నారు* **కె. విజయకుమార్**

# సూక్ష్మ రుణ వడ్డీ వ్యాపారం - ప్రజాస్వామ్య విద్రోహం

ప్రైవేట్ రుణ వ్యవస్థ ఈ దేశంలో ఈనాడు వచ్చింది కాదు. దళారీ వ్యాపారం మొదలయిన దగ్గర్నుండీ ఉన్నదే. బహుశా దీనికి కొన్ని శతాబ్దాల చరిత్ర ఉంది. అయితే అప్పటి నుండి కూడా రుణ గ్రహీతలకి మేలు జరిగిన దాఖలాలేమీ లేవు గాని రుణ వ్యాపారులు మాత్రం అధికంగా లాభపడ్డారు. లాభపడుతున్నారు. గ్రామాల్లో ఈ వ్యవస్థ చాలా ఎక్కువగా వేళ్లూనుకుంది. సుమతీ శతక కారుడే రాశాదు గదా, అప్పిచ్చు వాడు లేని ఊళ్లో ఉండకూడదని. అందువల్ల అనాదిగా అది మన సమాజంలో వేళ్లూనుకున్నట్లు తెలుస్తూనే ఉంది. రాచరిక వ్యవస్థలో ఇది 'లాసెజ్‌ఫైర్ కాపిటలిజం' పద్ధతిలో నడిచింది. మనకి చాలా గాథల్లో రుణ గ్రహీతల ఇక్కట్లు కనబడుతుంటాయి. ప్రధానంగా మనం ఇప్పుడు ఆలోచించవలసింది స్వతంత్ర ప్రజాస్వామ్య దేశంగా మనం ప్రకటించుకున్న తర్వాత ఏం జరిగింది? ఏం జరుగలేదు? అవే వ్యవస్థలు కొనసాగాయి. మైదాన ప్రాంతాల్లో ఇది తక్కువ మోతాదులో ఉంటే, గిరిజన ప్రాంతాల్లో విచ్చలవిడి అయింది. వడ్డీలు, వడ్డీ పై వడ్డీలు చెల్లించలేక ఎంతోమంది రైతులు తమ పొలాలు పోగొట్టుకున్నారు. నిజానికి పొలాలు లాక్కోబడ్డాయి. కారాగారి అప్పల నాయుడి ప్రశ్నలు గుర్తున్నాయి కదా. ఏది న్యాయం? ఏది అన్యాయం? అయ్యా! బాబూ! నన్ను కూడా మీతో బతకనివ్వండి అంటూ కట్టుబట్టలతో వచ్చి బడుగు వ్యాపారిగా మొదలై, తనే షావుకారయి వీళ్ల భూమిల్ని లాక్కుని అప్పలనాయుడు లాంటి నిరంతర శ్రమచేసే రైతుల్ని నిరుపేదల్ని చేసిన వైనం ఎవరి తప్పు? అటువంటి వ్యవస్థ ప్రజాస్వామ్యంలో ఎలా సృష్టించ బడింది? తెలంగాణ దొరలు, నక్సల్బరీ భూస్వాముల ఉదంతం ఇదే గదా. అప్పుల పేరు మీద ప్రజల్ని కూటికి లేని వాళ్లుగా చేసి బానిసల్ని చేసుకోవడం. తెలంగాణ పాట ఉంది కదా! 'ఏటి కేతా మెత్తి వెయి పుట్లు పండించి, గంజిలో మెతుకెరుగనన్నా' అని ఆరుగాలం కష్టించి పనిచేసి ఉత్పత్తి చేసే వాళ్ల అవసరాలు తీరకపోవడమేమిటి? మరి ఏ రూపంలోనైనాగాని వాళ్ల శ్రమతో ఉద్భవించిన ఉత్పత్తి కాజేసే పద్ధతులున్న వ్యవస్థ, ఆ పద్ధతులు న్యాయం, చట్టపరం అని చెప్పే వ్యవస్థ, ప్రజాస్వామ్య వ్యవస్థ అవుతుందా? కాదు. బ్రిటిష్, అమెరికా వ్యాపారులు గగనానికెత్తే వ్యవస్థ, పెట్టుబడిదారీ వ్యవస్థ.

నిజానికి పెట్టుబడిదారీ అనేది తప్పు మాట. ఎందుకంటే పెట్టుబడి అంతా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజల నుండే వస్తుంది. కాని ఇది ప్రజావ్యవస్థ కాదు. ఇది ధనదాహం వ్యవస్థ, ధనదాహపరుల వ్యవస్థ. వాళ్ల కాళ్లకి మడుగులొత్తే వ్యవస్థ. వాళ్ల ప్రయోజనాలు కాపాడడమే ప్రభుత్వ కర్తవ్యమయిన వ్యవస్థ. ఈ వ్యవస్థ గురించి మరోసారి చర్చించుకుందాం. అయితే ఇక్కడ ప్రస్తావించేది ఈ వ్యవస్థ దోపిడీ పద్ధతుల్లో ఒకటిగా ఉన్న సూక్ష్మ రుణాలు.

గ్రామాలలో వడ్డీ వ్యాపారులేం చేసేవాళ్లు? అవసరాలకి కొద్ది డబ్బు అప్పు ఇచ్చి, పత్రాల మీద వేలు ముద్రలు వేయించుకునేవారు. అప్పు తీసుకున్న రైతు పండించిన ధాన్యం, అపరాలు వగైరా మార్కెట్ ధర కంటే తక్కువ ధరకి వెలకట్టి జమ చేసుకోవడం. ఇవి ఎప్పటికీ తీరని అప్పులుగా ఉండేవి. తర్వాత అప్పు కింద పొలాన్ని లాక్కోవడం, రైతుల చేత, వాళ్ల పిల్లల చేత గాడిద చాకిరీ చేయించుకోవడం చేసేవారు. చాలా దారుణమైన ఈ దోపిడీ అప్రతిహతంగా, అడిగేవాడు లేకుండా కొనసాగేది. నక్సల్బరీ ఉద్యమం ముందే కాదు, ఆ తర్వాత కూడా బెంగాల్ గ్రామాల్ని చూడాలి. ఒకే పెద్ద భవంతి – జమీందారుది, మిగిలినవన్నీ పూరిల్లు. భూమి అంతా జమీందార్‌దే. మిగిలిన వాళ్లంతా కౌలుదార్లు. సంవత్సరానికొకసారి జమీందారు కలకత్తా నుండి తన మనుషులతో వచ్చి కౌలు తను చెప్పినంత తీసుకెళ్లేవాడు. సిపిఎం నాయకత్వంలో ఉన్న ప్రభుత్వం నక్సల్బరీ ఉద్యమాల తర్వాత కౌలుదారీ చట్టాన్ని, భూసంస్కరణల్ని అమలు చేసింది. అందువల్లే ఇంకా బెంగాల్‌ని పాలిస్తోంది. అయితే ఇతరత్రా అవసరమయిన మార్పులేమీ తీసుకు రాలేదు. కొందరు గ్రామస్తులు కాంట్రాక్టర్లుగా, దళారీ వ్యాపారులుగా మారడం వల్ల గ్రామాల స్వరూపం కొద్దిగా మారుతున్నది.

శ్రీకాకుళ ఉద్యమం రోజుల్లో వడ్డీ వ్యాపారుల మీద దాడికి పిలుపిస్తే ప్రజలు వందల సంఖ్యలో కొడవలో, కత్తో, ఏది ఉంటే అది తీసుకువచ్చేవారట. వ్యాపారులపై ఎంత కసి ఉండేదంటే, వ్యాపారి చచ్చేవరకూ దాడిచేసేవారట. వడ్డీ వ్యాపారులపై ఏ మాత్రమూ చర్య తీసుకోని ప్రభుత్వం అనేకమంది నక్సలైట్లని, ప్రజల్ని పోలీసులతో చంపించింది. ఆ బీభత్సం చేసే జలగం వెంగళరావు నరహంతకుడుగా పేరు పొందాడు.

ఇప్పటి సూక్ష్మ రుణ వ్యాపారులు నాలుగాకులెక్కువే చదివారు. పేరుకి 26 శాతం వడ్డీ అంటున్నా వారం వారం చక్రవడ్డీ ఎంత ఉందో చూడండి. ఉన్న వాళ్లకి కార్లలోన్లు, ఇళ్లలోన్లు, 8, 10 శాతం ఇచ్చేటప్పుడు, పేదరిక నిర్మూలన పేరు మీద 26 శాతం వడ్డీ సబబేనని రిజర్వ్ బ్యాంక్ ప్రకటించడమేమిటి? ఏజెంట్లు, సబ్ ఏజెంట్లకి ఖర్చవుతుంది కాబట్టి అదంతా రుణ గ్రహీతలే ఇవ్వాలంటున్నారు. అటువంటి వ్యవస్థని ఎందుకు పెట్టుకుంటున్నారు? కొన్ని సూక్ష్మ రుణ సంస్థలకి ఎన్.ఆర్.ఐ.లు యజమానులు. వాళ్లకి అమెరికాలో ఆరు శాతం వడ్డీ కూడా రాదు. అందుకే మన గ్రామాల మీదపడి 26 శాతం వడ్డీకి (ఈ మధ్య ఒక ఛానల్‌లో దయతలచి 24 శాతంకి ఒప్పుకున్నారని వచ్చింది) అప్పులివ్వడానికి సిద్ధపడుతున్నారు. పైగా ఇక్కడ రుణ గ్రహీతలు పెద్దగా చదువుకున్న వాళ్లు కాదు. కంపెనీకి మంత్రుల అధికారుల అండ ఉంటుంది. ఏం చేసినా పెద్దగా అడిగేవాడుండడు.

అందుకే వాళ్ల తెలివినంతా ఉపయోగించి కొత్త పద్ధతిలో, పేదలకి మేలు చేస్తున్నామనే నినాదంతో ఈ వడ్డీ వ్యాపారం మొదలెట్టారు.

ప్రపంచబ్యాంక్ మన దేశానికి అప్పు ఇస్తూ, తమకి నచ్చిన విదేశీ కంపెనీనే సలహాదారుగా పెట్టుకోమని వత్తిడి చేస్తుంది. దాని ద్వారా దాదాపు 25 శాతం అప్పు అమెరికా వ్యాపారుల చేతుల్లోకి వెళ్తుంది. అంటే ఈ చేతితో ఇచ్చి ఆ చేతితో తీసుకోవడమన్న మాట. మిగిలిన 75 శాతంలో మన రాజకీయ నాయకులు, అధికారులు, కాంట్రాక్టర్లు, వ్యాపారులు కలిసి 50 శాతం పైగా లొల్లుకుంటారు. మిగిలిన 25 శాతం ఖర్చు చేసి, 100 శాతం అప్పు ప్రజల నెత్తిన పెడుతున్నారు. ఇప్పుడీ సూక్ష్మ రుణ సంస్థలు తమ నుండి సెల్‌ఫోన్‌లు, ఇతర పరికరాలని కొంటేనే అప్పు ఇస్తామని షరతు పెడుతూ బలవంతంగా, చాలా చోట్ల అధిక ధరలకి అంటగడుతున్నారు. మరల ఆ డబ్బంతా అప్పు రూపంలో రుణ గ్రహీత చెల్లించాల్సిందే. ఆర్యులు మొదలుకొని (ప్రేమ్‌చంద్ 'సవా సేరు గోధుమలు' కథ గుర్తుంది కదా), ఈ సూక్ష్మ రుణ సంస్థల వరకు ప్రజల నుండి వాళ్ల శ్రమని కాజేయడానికి రకరకాల వేషాలు, ఎత్తులు వేస్తూనే ఉన్నారు. వేస్తూనే ఉంటారు. ఇది గొంగట్లో అన్నం పెట్టే వ్యవస్థ. ఎంత బొచ్చుని తీస్తారు? ఈ మోసాలు కూడా అటువంటివే. ఈ సూక్ష్మ రుణ సంస్థల యజమానులు, డైరెక్టర్లు ఎంత విచ్చలవిడిగా ఖర్చు చేస్తుంటారో చూస్తేనేగాని నమ్మశక్యం కాదు. వాళ్ల విచ్చల విడి జల్సాలకి పోగా ఇంకా ఎన్నో రెట్లు మిగిలే డబ్బు ఎక్కడ నుండి వస్తున్నది? వీళ్ల పేదరిక నిర్మూలన పథకంలో ఇరుక్కున్న పేదల నుండే. మనం ఒకటి గుర్తుంచుకోవాలి. ప్రపంచంలో పేదలంటూ ఎవరూ లేరు. పేదవాళ్లుగా చేయబడ్డ వాళ్లు మాత్రమే ఉన్నారు.

పట్టణాలలో కూడా ఈ సూక్ష్మ రుణ పద్ధతి అనధికారికంగా ఎప్పటి నుండో ఉంది. వెయ్యి రూపాయలు అప్పులు ఇచ్చి సాయంత్రం వంద రూపాయల వరకు వడ్డీతో సహా వసూలు చేస్తుంటారు. నిజానికి ఉదయం రు. 900 ఇచ్చి, సాయంత్రం రు. 1000 వసూలు చేసుకుంటారు. అంటే సంవత్సరానికి వడ్డీ దాదాపు 4000 శాతం. షాపు పెట్టుకుని నడిపే వడ్డీ వ్యాపారులు (పాన్ బ్రోకర్స్) 60 శాతానికి తక్కువ వడ్డీ తీసుకున్న దాఖలాలేమీలేవు.

ఇది ప్రజాస్వామ్య వ్యవస్థ కాదు అంటానికి ఇటువంటి సంస్థలే నిదర్శనాలు. ప్రజాస్వామ్యం అనేది ప్రజలందరూ కలిసి ఏర్పరుచుకునే వ్యవస్థ. ఇది ఒక సహకార సంస్థ లాంటిది. సహకార సంస్థలో అధ్యక్షుడు, కార్యదర్శి లాంటి వ్యక్తుల్ని ఎన్నుకుని, సభ్యులు తలా కొంత చందా వేసుకుని ఇచ్చి సభ్యులందరి బాగుకోసం ఖర్చు చేయమంటారు. ఏమేం చేయాలో రాసుకుంటారు. పదవి తీసుకుని, నేను చేయలేనంటే దిగి పొమ్మంటారు. అలాగే ఈ ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రతినిధుల్ని (ఎం.ఎల్.ఎ., ఎం.పి.) ఎన్నుకుని ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి లాంటి పదవులిచ్చి, అందరికీ కనీస అవసరాలు తీరేటట్లుగా చేయమని లక్షల కోట్ల రూపాయలు వాళ్ల చేతులకిస్తున్నాం. ప్రజోపయోగమైన చట్టాల్ని కూడా చేయమని అధికారాన్నిచ్చాం. ఈ ఎం.ఎల్.ఎ., ఎం.పి. లని, మంత్రుల్ని పోషించడానికి కోట్లాది రూపాయలు ఖర్చు పెడుతున్నాం. వీళ్లేం చేస్తున్నారు? అదీ ప్రశ్న. వ్యాపారులకి, దళారులకి, రుణ సంస్థలకి మద్దతిస్తున్నారు. కోట్లాది రూపాయల్ని, ఆస్తుల్ని వాళ్లకి అప్పనంగా ఇస్తున్నారు. అది అధికారంలో ఉన్న వాళ్ల విఫలత కాదు. కావాలని చేస్తున్నదే. అంటే ఈ వ్యవస్థ విఫలం కాదు, దాని స్వభావమే, లక్షణమే. ఒక్కొక్కరు విపరీతంగా వ్యక్తిగత ఆస్తులు సంపాదించుకుంటున్నారు. అది వాళ్లే చెపుతున్నారు. కాంగ్రెస్ వాళ్లు అక్రమంగా ఎంత సంపాయించారో తెలుగుదేశం చెబుతుంటే, తెలుగుదేశం నాయకులు ఎంత సంపాయించారో కాంగ్రెస్ వాళ్లు చెపుతున్నారు. ఇతర పార్టీలు దీనికి మినహాయింపేమీ కాదు. అందువలన ఈ వ్యవస్థ కొనసాగినంత కాలం, ఏదో రూపంలో ఈ దోపిడీ కొనసాగుతూనే ఉంటుంది. కావలసింది ప్రజాస్వామ్యాన్ని ప్రతిష్ఠించడం. ధనదాహవ్యవస్థకి అనుకూలమైన ఈ చట్టాల్ని, పద్ధతుల్ని సమూలంగా మార్చడం. అది జరగనంత కాలం ఈ రుగ్మతలు కొనసాగుతూనే ఉంటాయి. బడా స్వదేశీ, విదేశీ వ్యాపార సంస్థలకి సబ్సిడీల పేరు మీద, స్థలాల పేరు మీద అమితంగా దోచిపెట్టే ప్రభుత్వం, పేదల, రైతుల దగ్గరకొచ్చేటప్పటికి మొండి చేయి చూపడమే గాక వాళ్లని భిక్షగాళ్ల కింద జమకడుతున్నది. ఈ పద్ధతులు మారాలి. ప్రజాసంఘాలు ఈ మార్పుకై ప్రయత్నించాలి. ప్రభుత్వం విద్య, వసతి, ఆరోగ్యానికి పూర్తి బాధ్యత వహించాలి.

నిజమైన ప్రజాస్వామ్యమయితే సహకార పద్ధతిలో ఉత్పత్తి జరగాలి. ఉత్పత్తి సంస్థల్ని, పరిశ్రమల్ని సహకార పద్ధతిలో ప్రభుత్వమే ఏర్పాటు చేయాలి. వాటికి కావలసిన ముడి సరుకుల్ని అందించాలి. ఆ సంస్థలు తయారు చేసే వస్తువుల్ని పంపిణీ సంస్థలకి అందజేయాలి. పరిశ్రమల్లోనూ, వ్యవసాయంలోనూ జరిగిన ఉత్పత్తిని అవసరం మేరకు అందరికీ పంపిణీ చేయాలి. డబ్బుని మారకంగా అవసరమయితే పెట్టుకోవచ్చు. నిజమైన ప్రజాస్వామ్యంలో దాని అవసరం అంతగా రాదు. ప్రజలంతా ఇలా ఉత్పత్తి, పంపిణీ, లేక సేవా సంస్థల్లో (విద్య, ఆరోగ్యం వగైరా) పనిచేస్తుంటారు. వాళ్లు చేసే పనికి సంబంధించిన జ్ఞానం అందేలా విద్యా సంస్థల్ని తీర్చిదిద్దుతారు. అటువంటి వ్యవస్థని మనం ఏర్పాటు చేసుకోవాలి. అదే నూతన ప్రజాస్వామ్య వ్యవస్థ. అయితే అది వెంటనే ఏర్పాటు కావడానికి అవకాశం లేదు. ఇప్పుడున్న ధనదాహ వ్యవస్థ, దానిని నడుపుతున్న వాళ్లు దానికి అంగీకరించరు. ప్రజలంతా సమీకృతమై కృషి చేసి ఆ మార్పు సాధించుకోవాలి. అయితే అప్పటివరకూ ఎలా? ప్రత్యామ్నాయం ఏమిటి? ప్రభుత్వ సంస్థలూ, ప్రభుత్వేతర సంస్థలు కలిసి స్వయం సేవక సంఘాలు ఉమ్మడిగా కుటీర / చిన్న తరహా పరిశ్రమల్ని ఏర్పాటు చేసుకోవడానికి సహకరించాలి. దీని కోసమై స్వయం ఉపాధి నిధిని ఏర్పాటు చేసి, దాని నుండి అవసరమైన డబ్బు అందించాలి. ప్రభుత్వ సంస్థలు, అధికారులే అవసరమయిన అన్ని లైసెన్సులూ తెప్పించాలి. ఉత్పత్తి చేసిన సరుకుని అమ్మడానికి అవసరమయిన వ్యవస్థని కూడా ఏర్పాటు చేయాలి. ఇందులో భాగస్వాములైన వాళ్లకి, వాళ్ల పిల్లలకి ఉచిత విద్య, ఆరోగ్య సేవలు అందించాలి. వ్యక్తిగత ఖర్చులకై రుణం కావాలంటే బ్యాంకుల నుండి తక్కువ వడ్డీకి ఇప్పించి వచ్చే ఆదాయం నుండి వాయిదాల పద్ధతిలో చెల్లించేలా చేయాలి. ఇవి ఏర్పాటు చేస్తే, ప్రైవేట్ రుణ సంస్థల్ని రద్దు చేయవచ్చు.

ఈ పద్ధతిలో కొంతవరకైనా ఆప్కో ఒక ఉదాహరణగా ఉంది. రాజకీయ నాయకులు, అధికారులు చేరి దానిని ఎంత భ్రష్టుపట్టించారో, అది చేనేత కార్మికులకి ఎంత నిరుపయోగంగా ఉందో మనకి తెలుసు. అందుకే కుటీర పరిశ్రమల్ని ఉత్పత్తి దారులతోనే ఏర్పరచాలి. వారికి సలహాలనందించేందుకు, దుర్వినియోగం కాకుండా చూసేందుకు పర్యవేక్షణ కమిటీని వేయవచ్చు.

ఇప్పుడు ప్రభుత్వం తీసుకుంటున్నవి కంటితుడుపు చర్యలనేకంటే, మసిబూసి మారేడు కాయ చేయడం అనవచ్చు. ఏదో చేస్తున్నట్లు ప్రకటించడం, ఆచరణలో ఏమీ ఉండదు. ప్రజా సంఘాలన్నీ కలిసి ఈ దిశగా ప్రయత్నించి ప్రైవేట్ రుణ సంస్థల రద్దుకై కృషి చేయాలి.

*(రచయిత భౌతిక శాస్త్ర అధ్యాపకులు)* వీ

*గోధ్రా ఘటనలోని వాస్తవాలు ఒకలా ఉంటే సెషన్స్ కోర్టు తీర్పు మరోలా ఉందనీ, నిష్పాక్షికత, హేతుబద్ధత లోపించాయనీ అంటున్నారు* **రాం పునియాని**

# గోధ్రా తీర్పు - న్యాయం ఎటువైపు?

గోధ్రాలో సబర్మతి ఎక్స్‌ప్రెస్ రైలు తగులబెట్టబడిన ఘటనలో సెషన్స్ కోర్టు 22 ఫిబ్రవరి 2011న తీర్పు వెలువరించింది. సబర్మతి ఎక్స్‌ప్రెస్‌లో ఎస్-6 బోగీని తగులబెట్టడంలో స్థానిక ముస్లింల కుట్ర ఉందంటున్న గుజరాత్ ప్రభుత్వ సిద్ధాంతాన్ని సెషన్స్ కోర్టు అంగీకరించింది. విచారించిన 94 మందిలో 63 మందిని నిర్దోషులుగా ప్రకటించగా, 31 మందిని కరసేవకులను తగులబెట్టాలన్న కుట్రలో దోషులుగా గుర్తించింది. గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్రమోడి గోధ్రా ఘటన సంభవించిన అరగంటలో ఈ కుట్ర సిద్ధాంతాన్ని తీర్మానించారు. ఆ ఘటనకు అంతర్జాతీయ తీవ్రవాదంతో సంబంధం ఉందని, పాకిస్తాన్ ప్రేరేపిత ఐ.ఎస్.ఐ. అండదండలతో స్థానిక ముస్లింలు ఈ కుట్రకు పాల్పడ్డారని ఆయన పేర్కొన్నారు. ఈ కుట్ర సిద్ధాంతాన్ని అప్పటి గోధ్రా కలెక్టర్ జయంతి రవి తోసిపుచ్చారు.

అటువంటి ఘోర రైలు ప్రమాదాలు సంభవించినపుడు తప్పని సరిగా విచారణ చేపట్టవలసి ఉంటుంది. కాని అప్పటి రైల్వే మంత్రిత్వ శాఖ నిమ్మకు నీరెత్తినట్లు ఊరుకుంది. అప్పటి బి.జె.పి. ఆధ్వర్యంలోని ఎన్.డి.ఎ. కూటమిలోని భాగస్వామి, రైల్వే శాఖ మంత్రి నితీష్‌కుమార్ ఆ ఘటనపై మౌనం వహించారు. గోధ్రా ఘటనల తదనంతర పరిణామాలలో ముస్లింల ఊచకోతను సమర్థించుకోవడానికి, తగిన న్యాయంగా పేర్కొనడానికి, సామూహిక ఆమోదం పొందడానికి ఈ కుట్ర సిద్ధాంతాన్ని చెలామణి చేసారు. ఎన్.డి.ఎ. కూటమి తరపున అప్పటి ప్రధానమంత్రి అటల్ బిహారి వాజ్‌పేయి స్వయంగా 'గోధ్రా జరిగింది కాబట్టే గుజరాత్ పరిణామాలు సంభవించాయ'ని పదే పదే చెప్పారు. బి.జె.పి. కూటమితో పొత్తులో ఉన్న అప్పటి యు.పి. ముఖ్యమంత్రి మాయవతి నరేంద్రమోడి కోసం ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నప్పుడు, గుజరాత్ మారణకాండపై ఆమెను ప్రశ్నించిన సందర్భంలో 'గోధ్రా కూడా జరిగింద'ని ఆమె పేర్కొన్నారు.

ఆ తరువాత అధికారం చేపట్టిన యు.పి.ఎ. ప్రభుత్వంలోని రైల్వే మంత్రి లాలూ ప్రసాద్ యాదవ్ ఘోర రైలు ప్రమాదాల విషయంలో చేపట్టాల్సిన విచారణను మొదలుపెట్టారు. అప్పటికే చాలా ఆలస్యమై పోయిన, అనివార్యమైన విచారణను ప్రారంభించారు. ఆ నేపథ్యంలో బెనర్జీ కమిషన్‌ను ఏర్పాటు చేసారు. ఈ కమిషన్ గోధ్రా ఘటనలో స్థానిక ముస్లింల కుట్ర ఉన్నట్లు ఎటువంటి ఆధారాలు లేవని అభిప్రాయపడింది.

గోధ్రా ఘటనను కుట్రగా నిరూపించడానికి గుజరాత్ పోలీసులు కేసు విచారణను ఒక పథకం ప్రకారం నడిపారు. 144 లీటర్ల పెట్రోలు కొనుగోలు చేసినట్టు, ఆ పెట్రోలు తీసుకొని, తరువాత ఎస్-6, ఎస్-7 బోగీల మధ్య నుంచి తెగ్గొట్టి ఎస్-6 బోగీలోకి వెళ్లి పెట్రోలు చల్లి, ఆ తరువాత మండుతున్న అగ్నిగోళాలను బోగీలోకి విసరడం ద్వారా ఎస్-6 బోగీ తగులబడినట్లు సాక్ష్యులు ఒప్పుకునేలా చేశారు. ప్రస్తుత తీర్పులో కుట్రను సెషన్స్ కోర్టు అంగీకరిస్తూనే ముఖ్య దోషి విషయంలో ఆధారాలు లేకపోవడంతో, ముఖ్య నిందితుడు హాజీ ఉమర్‌జీ ఇంకా ఇతర నిందితుల విషయంలో గుజరాత్ ప్రభుత్వం తగిన ఆధారాలు చూపలేకపోవడంతో తీర్పు బలహీనమైపోయింది.

కుట్ర సిద్ధాంతానికి ముఖ్య ఆధారం పెట్రోల్ అమ్మడం, మండుతున్న గోళాలను బోగీలోకి విసరడం, అయితే వీటన్నిటికీ ఎటువంటి సాక్ష్యాధారాలు లేవు. తొలుత పెట్రోల్ అమ్మినట్లు సాక్ష్యమిచ్చిన వారు అంతిమ పరిశీలనలో నిలబడలేదు సరికదా, వారిలో ఒకరు అలా చెప్పడానికి తమకు యాభై వేల రూపాయలు చెల్లించినట్లు తెలిపారు. అలా పెట్రోల్ అమ్మినట్లు చెపుతున్న వారిలో ముఖ్య పరిశోధనా అధికారి నోయిల్ పర్మార్ ఒకరు. ఆ రకంగా ఈ కుట్ర సిద్ధాంతంలో చాలా బలహీనతలు ఉన్నాయి. కరసేవకులను తగలబెట్టి, ముస్లింలు కక్ష్య తీర్చుకోవాలనుకున్నారనే విషయం చాలా కారణాల వలన పరిశోధనా తర్కానికి నిలవడం లేదు. అసలు విషయం మాట్లాడుకుంటే, అటు ముస్లింలకు గానీ, ఇటు రాష్ట్ర అధికారులకు గానీ కరసేవకులు సబర్మతి ఎక్స్‌ప్రెస్‌లో వెళుతున్నట్లు సమాచారం ఏమీలేదు. కేవలం విశ్వహిందూ పరిషత్‌కు చెందినవారికే కరసేవకులు రైలులో ప్రయాణిస్తున్నట్లు తెలుసు. ఇక రెండో విషయం, ఆ రోజు సబర్మతి ఎక్స్‌ప్రెస్ దాదాపు ఐదు గంటలు ఆలస్యంగా నడిచింది. సాధారణంగా సబర్మతి ఎక్స్‌ప్రెస్ గోధ్రా స్టేషన్‌కు అర్ధరాత్రి సమయానికి చేరుకుంటుంది. ఒకవేళ కుట్రకు ఎవరైనా ప్రణాళికాబద్ధంగా పాల్పడ్డారనుకున్నా, అలాంటి ప్రత్యేక పరిస్థితులలో కష్టసాధ్యం అవుతుంది. మూడవది, రైల్వే ప్రొటెక్షన్ బలగాలు గతంలో చేసినట్లు(?) రెండు బోగీల నడుమ ప్రాంతంలో తెగ్గొట్టి తెరవడం అంత సులభమైన పని కాదు. ఇక నాలుగు - తలుపులూ, కిటికీలూ వేసి ఉన్నప్పుడు మండుతున్న గోళాలు రైలు పెట్టెలోకి ఎలా వస్తాయి? ముస్లింలు బండి ఆపారని మొదట ప్రచారం జరిగింది. కానీ, చైన్ లాగి మొదటిసారి కరసేవకులు బండిని ఆపితే, రెండవసారి సాంకేతిక వైఫల్యంతో బండి ఆగింది. ఇంకొక అభిప్రాయం కూడా ఉంది. అదేమంటే, రైలు పెట్టెకు

బైటి నుండి తాళం వేశారు. చాలా సాధారణమైన వాస్తవం ఏమంటే బండికి బైటి నుంచి తాళం వేయడం సాధ్యం కాదు. ఇలాంటి తప్పుడు విషయాలు ప్రచారంలో పెట్టినవారు మరిచిపోయి ఉంటారు.

కాబట్టి, ముస్లింల వల్ల ఈ ఘటన జరిగిందనే కుట్ర సిద్ధాంతాన్ని తిరస్కరించడానికి కావాల్సినన్ని ఆధారాలు ఉన్నాయి. 5 మార్చ్ 2011 తెహల్కా పత్రికలో ఈ సంఘటనకు సంబంధించి మరొక కొత్త కోణం వచ్చి చేరింది. ఆశీష్ ఖేతాన్ తన పరిశోధనలో ముస్లింలకు ఈ కుట్రతో ఎటువంటి సంబంధం లేదనే విషయాన్ని నిగ్గుతేల్చారు. ఆయన తన సూక్ష్మ పరిశీలనతో కూడిన వాదనతో ఈ కుట్ర సిద్ధాంతం కుతర్కపూరితం మాత్రమే కాదు, ఇది జరుగుతున్న, నడుస్తున్న మరో కుట్రను కప్పి పుచ్చడానికి, దాన్నుంచి దృష్టి మరల్చడానికే అని తేల్చాడు. అతను చెబుతున్న దాన్ని బట్టి అది కుట్రే. కానీ, ముస్లింల వల్ల మాత్రం కాదు. ఆయన కొన్ని అంశాలను మన దృష్టికి తీసుకువస్తున్నారు.

– ఒక ముఖ్యమైన విషయాన్ని గుర్తు చేసుకుంటే, తెహల్కా 2007లో బయటపెట్టిన రహస్య పరిశోధనలో (ది ట్రూత్ అబౌట్ గుజరాత్ 2002) బి.జె.పి.కి చెందిన తొమ్మిది మంది సాక్ష్యులూ అసలు ఆ నేరం జరిగిన స్థలంలో లేనే లేరన్నది. మోడి ప్రభుత్వ మతోన్మాద రాజకీయ ఎజెండాను ముందుకు తీసుకెళ్లడంలో భాగంగా వారిని అవసరమైన తప్పుడు పత్రాలను, సాక్ష్యాధారాలను ఇవ్వమని పోలీసులు కోరారు. వాళ్లు 'హిందుత్వ లక్ష్యసాధన'లో భాగంగా ఆ పని చేశారు.

– ఈ కథనంలోకి అజయ్‌బారియా అనే ఒక హిందూ చిల్లర వ్యాపారిని లాక్కొచ్చారు. న్యాయమూర్తి పటేల్ బారియా చెప్పిన విషయాల మీద ఎక్కువగా ఆధారపడ్డారు. కానీ, ముస్లిం కుట్రదారులు ఒక హిందువును చివరి నిమిషంలో పెట్రోల్ చల్లడానికి, బోగీని తగుల బెట్టడానికి ఎందుకు ఎంపిక చేసుకున్నట్లు? అజయ్ బారియాను తెహల్కా కలవడానికి ప్రయత్నించినా సాధ్యం కాలేదు. పోలీసుల సాక్ష్యంగా మారడానికి అతన్ని బలవంతపెట్టినట్లు, అనుక్షణం అతడు పోలీసుల నిఘాలో జీవిస్తున్నట్లు బారియా తల్లి చెప్పింది.

– 26 ఫిబ్రవరి 2002న రంజిత్ సింగ్, ప్రతాప్ సింగ్ పటేల్‌లకు 140 లీటర్ల పెట్రోలు అమ్మినట్లు తొలుత పోలీసులకు చెప్పిన ఇద్దరు పెట్రోల్ బంక్‌లో పనిచేసేవారూ తరువాత ఆ రాత్రి తాము ఎవరికీ పెట్రోల్ అమ్మలేదని చెప్పారు. ఆరు నెలల తరువాత ఊహించని విధంగా వాళ్లు మళ్లీ తమ వైఖరిని మార్చుకున్నారు. అయితే తెహల్కా కెమెరా ముందు రంజిత్‌సింగ్ తనకూ, ప్రతాప్‌కూ ఆ విధంగా చేయడానికి పోలీసులు అధికారి నోయిల్ పర్మార్ యాభై వేల రూపాయలు ఇచ్చినట్లు, వారిని ఆ విధంగా చేయమని అడిగినట్లు వెల్లడించారు. ఆ అధికారి పెట్రోల్ కొనుగోలు చేసినవారుగా ప్రత్యేకంగా కొద్దిమంది ముస్లింలను కోర్టులో గుర్తించడానికి తర్ఫీదు కూడా ఇచ్చినట్లు అతను చెప్పాడు.

– ఈ కుట్ర వెనుక ప్రధాన సూత్రధారి మౌల్వీ ఉమర్‌జీ అని మొదట పేర్కొన్నారు. జబీర్ బెహరా అనే ఒక చిన్నస్థాయి నేరస్థుడు ఉమర్‌జీనే ఎస్–6 బోగీని లక్ష్యానికి ఎంపిక చేసినట్లు చెపుతూనే ఈ కుట్రకు సంబంధించిన ఎటువంటి సమావేశాలలో అతను హాజరు కాలేదని అన్నాడు. తరువాత తాను చెప్పిన విషయాలన్నిటిని ఉపసంహరించుకున్నాడు.

– సికిందర్ సిద్ధిఖీ అనే ఇంకో చిల్లర నేరగాడు మౌల్వీ పంజాబీ మూకను ప్రేరేపించాడని పేర్కొన్నాడు. కానీ, పంజాబీ ఆ రోజు అసలు దేశంలోనే లేడు.

ఈ కుట్ర ముస్లింల వైపు నుంచి జరగలేదని మార్గ ఛేదన చేసిన తన పరిశోధనలో ఖేతాన్ నిరూపించాడు. సత్యం కొన్నిసార్లు కల్పన కన్నా కూడా సంక్లిష్టంగా, నమ్మలేనిదిగా కూడా ఉంటుంది.

మాలేగాంవ్, సంఝౌతా, అజ్మీర్ ఇంకా అలాంటి అనేక పేలుళ్లకు ముస్లింలే బాధ్యులని మనల్ని గత కొన్నేళ్లుగా నమ్మేలా చేశారు. అయితే కొంతమంది రచయితలూ, సామాజిక ఉద్యమకారులూ ఈ ఉగ్రవాదానికి పోలీసు – హిందుత్వ చెప్పిన కారణాలపై అనేక అనుమానాలు వ్యక్తం చేసినా, నేర పరిశోధక అధికారులు గానీ, పెద్ద పెద్ద ప్రసార మాధ్యమాలు గానీ అసలు పట్టించుకోలేదు. వాళ్ల పరిశోధనలలో కూడా హిందుత్వ శక్తుల పాత్ర ఉన్నట్లు తేలింది. అనుమానాలు వ్యక్తం చేసిన రచయితలు, సామాజిక కార్యకర్తలను హిందూ వ్యతిరేకులుగా, దేశ వ్యతిరేకులుగా విమర్శలు చేశారు. భయపెట్టారు. ఇవాళ విషయాలు చూస్తే హేమంత్ కర్కరే పరిశోధనలకు, తరువాత స్వామి అసిమానంద బయటపెట్టిన వాస్తవాలకు కృతజ్ఞతలు చెప్పాలి. ఈ తీవ్రవాద చర్యలు అన్నిటి వెనుక హిందుత్వ శక్తులే ఉన్నాయనే విషయం తేలిపోయింది. మొత్తంగా ముక్కముక్కలుగా ఉన్న ఈ విషయాలను, పరిశీలనలను, గోధ్రా కలెక్టర్ జయంతిరవి స్టింగ్ ఆపరేషన్‌లో చెప్పిన విషయాలను ఒక దగ్గర పెట్టి చూస్తూ 'అనుమానాలకు తావు లేకుండా గుజరాత్‌లో ఆ సంవత్సరాలలో కుట్ర నడిచిందనీ, ఈ కథనమంతా చూపించినట్లు అది చాలా భిన్నమైన కుట్ర అనీ, ఈ కుట్రకు దేశమనే అల్లికను అరువు ఇవ్వడానికి, ఒక మత విశ్వాసాలు కలిగినవారిపై బురద జల్లడానికి, రాజ్య యంత్రాంగంచే నడపబడిన కుట్ర అని, ఒకవర్గం వారిని శత్రువులుగా ప్రకటించడానికి జరిగిన కుట్ర' అని తెహల్కా ఖేతాన్ పేర్కొన్నారు.

ఈ కేసులో పోలీసులు చాలా చవకబారు, పక్షపాత ధోరణితో కూడిన విచారణ చేశారు. ఈ కేసు విషయంలో నిష్పాక్షికమైన విచారణ జరగాల్సిన అవసరం ఉంది. కేంద్ర నేర పరిశోధక విభాగంతో విచారణ జరిపించాలి. మనమంతా అసాధారణమైన కాలంలో జీవిస్తున్నాం. మురాతత్వం, మతతత్వ రాజకీయాలు మనలోని మంచిని మించిపోయి ఆధిపత్యం వహిస్తున్నాయి. సత్యదూరమైన ఆవేశాలను మనలో నాటుతున్నారు. మతం పేరుతో చెలామణీ అవుతున్న రాజకీయ ఉన్మాద రొదలో సత్యాన్ని మూసివేస్తున్నారు. మతాలతో సంబంధం లేకుండా మనలోని మానవతను, హేతుబద్ధ దృష్టిని, నిజాయితీని, నిబద్ధతను మేల్కొలిపి మన పాక్షిక దృష్టిని సరిచేసుకొని సమాజంలో జరుగుతున్న నేరాలను సరైన విధంగా పరిశోధించి, నిందితులకు సరైన శిక్షలు పడేటట్లు చేసి, మనమంతా తీవ్రవాదాలను, మతోన్మాద హింసను ఎదుర్కోవాలి. 59 మంది కరసేవకులు, 2000 మందికి పైగా ముస్లింలు ఇలా అనేక మంది అమాయక ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. మనమంతా మతోన్మాద రాజకీయాలను తిరస్కరించాలి. గుజరాతీ–భారతీయుడైన మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ చూపిన దారిలో న్యాయం, శాంతి, మత సహనం, స్నేహాలతో మనం ముందుకు సాగాలి.

*(రచయిత ముంబై ఐఐటి నుంచి రిటైరయిన ప్రొఫెసర్. మతసామరస్య అంశాలపై విస్తృతంగా రచించారు. (తెలుగు అనువాదం డి.వి. రామకృష్ణారావు)*

వీ

***బహుళజాతి కంపెనీలకు అనుకూలంగా వ్యవసాయంలోకి వచ్చిన విధానాలు ఆ కంపెనీలకు లాభాలు చేకూర్చవచ్చేమో గాని మనల్ని, మన జీవావరణాన్ని పిప్పిచేస్తాయని అంటున్నారు డా. వందనాశివ***

# ఈ ఆకలి పాలక విధానాల సృష్టే

ఎందుకని భారతీయులు ప్రతీ నలుగురిలో ఒకరు నకనకలాడే ఆకలితో అలమటిస్తున్నారు? ఎందుకని భారతీయ మహిళలు ప్రతీ ముగ్గురిలో ఒకరు రక్తహీనతతో, పోషకాహార లోపంతో ఎముకల గూళ్లను తలపిస్తున్నారు? ఎందుకని భారతీయ బాలబాలికలు ఉండాల్సిన బరువుకంటే తక్కువబరువు తోను, ఉండాల్సిన ఎత్తుకంటే తక్కువ ఎత్తుతోను చిక్కి శల్యమై ఉంటున్నారు? భారతదేశం 9 శాతం వృద్ధిరేటుతో 'పురోగమిస్తుండగా' ఆకలి, పోషకాహారలోపం పెరుగుతున్నదెందుకని? 'వెలిగిపోతున్న' భారతదేశం 'ఆకలితో అలమటిస్తున్న' భారతదేశంగా ఉంటున్నదెందుకని?

నాదృష్టిలో ఇవ్వాళ 'ఆకలి' అనేది పారిశ్రామికీకరించబడిన, ప్రపంచీకరించ బడిన 'ఆహారవ్యవస్థ' వ్యవస్థానుగత నిర్మాణంలో ఒక విడదీయరాని భాగం. నా దృష్టిలో ఇవ్వాళ 'ఆకలి' అనేది హరిత విప్లవంగా చెప్పబడ్తున్న అధిక పెట్టుబడులు కుమ్మరించి, అధిక రసాయనిక ఎరువులు, క్రిమిసంహారక మందులు కుమ్మరించి వైవిధ్యానికి తావులేని పారిశ్రామికీకరించబడిన మూసవ్యవసాయ విధానంలో ఒక విడదీయరాని అంతర్భాగం. 1940ల నుండి 1970ల దాకా భారత దేశంలో అమలు చేయబడిన హరిత విప్లవం అది 'హరిత'మూ కాదు, అది 'విప్లవాత్మకం' అంతకన్నా కాదు. అది కేవలం యుద్ధంలో వాడే ప్రమాదకర రసాయనాలను వ్యవసాయంలో వాడే రసాయనాలుగా మార్చిడి చేసి, ప్రమాదకర రసాయనిక ఉపకరణాల వినియోగం ద్వారా మాత్రమే పండే పంటల్ని పండించి బహుళజాతి కార్పొరేట్ వ్యాపార సంస్థలకు 'మార్కెట్'ను సమకూర్చిపెట్టింది. అది పప్పు ధాన్యాలు, నూనెగింజలు, కూరగాయలు, పండ్లు, ఇతర ధాన్యాల ఉత్పత్తిని ధ్వంసం చేసి వాటన్నింటి స్థానంలో వరి, గోధుమ లాంటి ఒకటి, రెండు రకాల పంటల ఉత్పత్తిని మాత్రమే పెంచగలిగింది. అది కేవలం పంజాబ్ లాంటి ఒక ప్రాంతం మీద మాత్రమే కేంద్రీకరించి ఇతర అన్ని ప్రాంతాలనూ నిర్లక్ష్యం చేసింది.

కొరత కొరకే ఈ వ్యవసాయ విధాన నమూనా ఉద్దేశించ బడింది. పండించిన పంటల ధరలకంటే ఉత్పాదక వ్యవసాయం ఎక్కువగా ఉండేటటు వంటి సుస్థిరం కాని వ్యవసాయ విధానం వల్లనే ఉద్దేశ పూర్వకంగా 'ఆకలి' సృష్టించబడింది. ఈ విధానాల ఫలితంగానే రైతులు పీకల్లోతు నష్టాల్లో కూరుకుపోయి, అప్పుల చక్ర బంధంలో ఇరుక్కుపోయి ఆత్మహత్యలు తప్ప గత్యంతరం లేని విషమ పరిస్థితుల్లోకి నెట్టబడుతున్నారు. 1997 నుండి ఇప్పటి దాకా దాదాపు 2లక్షల మంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడింది ఈ అధిక వ్యయంతో కూడిన కార్పోరేటీకరణ దిశగా సాగుతున్న దారుణమైన జాతిహనన వ్యవసాయ విధానాల ఫలితంగానే. సరిగ్గా మళ్లీ ఈ సమయంలో రెండో హరిత విప్లవం గురించి మాట్లాడడం జరుగుతున్నది. ఇది ఈసారి జన్యు సాంకేతికత (జెనెటిక్ ఇంజనీరింగ్) మీద ఆధారపడినటువంటిది. వ్యవసాయంలో ఈ విధానం విత్తనాల మీద కార్పొరేట్ వ్యాపార సంస్థలకు పెత్తనాన్ని కట్టబెట్టేందుకు (పేటెంట్‌రైట్స్), అలాగే మేధోపర ఆస్తిహక్కులు (ఇంటలెక్చువల్ ప్రాపర్టీరైట్స్) కట్టబెట్టేందుకు ప్రవేశపెట్ట బడుతున్నది. ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ) 'వాణిజ్య సంబంధిత మేధోహక్కుల ఒప్పందం(టిఆర్ఐపిఎస్) ప్రకారం కార్పోరేట్ వ్యాపార సంస్థలు విత్తనాల మీద పేటెంట్లు పొందడానికి గేట్లు బార్లా తెరువ బడినాయి. విత్తనం అనేది ఒక 'జీవ వనరు' అనే దాన్నుంచి దాన్నొక 'మేధోపర వాణిజ్య హక్కు'గా మార్చడం మూలాన కార్పొరేట్ వ్యాపార సంస్థలకు అత్యధిక లాభాలు చేకూరడమే కాకుండా 'జీవ వైవిధ్యం' నశించి చిన్నరైతులు దివాళా తీయడానికి, అంతర్ధానమయ్యేందుకు దారితీస్తుంది. ఇప్పటికే బిటి రకం పత్తి విషయంలో మనం ఇదంతా చూసి, అనుభవించి ఉన్నాం.

కార్గిల్, ఇతర వ్యవసాయ సంబంధ కార్పొరేట్ వ్యాపార సంస్థలకు ప్రపంచ మార్కెట్లను అందుబాటులో ఉంచే ఉద్దేశాని కనుగుణంగానే 'ప్రపంచ వాణిజ్యసంస్థ' 'వ్యవసాయ ఒప్పందం' (ఎఒఎ) రూపొందించ బడింది. ఇందుకోసం వివిధ దేశాల మీద ప్రత్యేకించి వెనుకబడిన మూడవ ప్రపంచ దేశాల మీద ఒత్తిడి తెచ్చి ఆయా దేశాల్లో దిగుమతి నిబంధనల్ని సామ్రాజ్యవాద అగ్రరాజ్యాలకు, బహుళజాతి కార్పొరేట్ వ్యాపార సంస్థలకు అనుకూలంగా సడలింప చేసి సామ్రాజ్యవాద అగ్రరాజ్యాలు తమదేశాల్లో 400 బిలియన్‌డాలర్ల సబ్సిడీలనిచ్చి ఉత్పత్తి చేసిన కృత్రిమ ఆహార పదార్థాలను తక్కువ ధరలకు మూడవ ప్రపంచదేశాల మీద కుమ్మరిస్తున్నారు. తద్వారా ఆయా దేశాల్లో స్థానిక వ్యవసాయాన్ని, రైతుల జీవనాధారాల్ని దెబ్బతీస్తున్నారు. 'ప్రపంచ వాణిజ్య సంస్థ'ను అడ్డం పెట్టుకొని వివిధ రకాల అసమాన ఒప్పందాల ద్వారా, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల ద్వారా వెనుకబడిన ఇండియా లాంటి మూడవ ప్రపంచదేశాల్లో స్థానిక వ్యవసాయాన్ని, పంటల ఉత్పత్తిని ఏ రకంగా దెబ్బతీస్తాయో, ఆయాదేశాల రైతుల్ని, ప్రజల్ని ఎలా ఆకలిపాలు చేస్తాయో భారత దేశంలో వంటనూనెల విషయంలో జరిగిన

నిర్వాకమే నగ్నమైన ఒక పెద్ద ఉదాహరణ. బహుళజాతి కార్పోరేట్ వ్యాపారసంస్థలు భారతదేశంలో సోయానూనెను కుమ్మరించడం ద్వారా వంటనూనెల ధరల్ని తగ్గించి వేయడం ద్వారా రైతుల్ని దెబ్బతీసి, వారి జీవనాధారాల్ని ధ్వంసం చేసి, భారతదేశంలో స్థానిక వంటనూనెల ఉత్పత్తి విధానాన్ని స్థానిక వ్యవసాయాన్ని ధ్వంసంచేసి రైతుల్ని ఆకలిమంటల్లోకి నెట్టివేశారు. ఈరకంగా రైతులు తమ ఉత్పత్తులను అమ్మే సమయంలో ధరలు పడిపోయి, గిట్టుబాటు ధరలు లభించక ఏటా 25 బిలియన్ల డాలర్లు నష్టపోతున్నారు. అదే రైతులు తమ వినియోగం కొరకు మార్కెట్లో కొనబోయినప్పుడు ధరలు మండి పోతున్నాయి. రైతుల పరిస్థితి 'అమ్మబోతే అడవి – కొనబోతే కొరివి' అన్నచందాన తయారై గ్రామీణ రైతాంగం, ఇతర గ్రామీణ ప్రజాసమూహాల మీద 'ఆకలి'భారం రెట్టింపై 'గోడదెబ్బ – చెంపదెబ్బ' లాగా పరిస్థితి తయారైంది. అందువల్లనే భారతదేశంలోనూ, ప్రపంచవ్యాపితంగానూ ఆకలితో అలమటించే జనాభాలో సగానికి సగం మంది రైతులే ఉంటున్నారు.

ఆహార రంగంలో స్వేచ్ఛావాణిజ్యం పేర కొనసాగుతున్నది నిజానికి స్వేచ్ఛావాణిజ్యం కాదు. అది ఆ పేరున తప్పుగా పిలువ బడుతున్నది. నిజానికి అదొక బలవంతపు, దౌర్జన్యపూరిత ప్రపంచీకరణ ఆహార వాణిజ్యం మాత్రమే. ఇది ఆహార రంగంలో భారతదేశం లాంటి వెనుకబడిన మూడవ ప్రపంచ దేశాల్లో ఆహార స్వావలంబనను, స్వయం సమృద్ధిని, ఆహార ప్రజాస్వామ్యాన్ని నాశనం చేసి ఆకలి సంక్షోభాన్ని మరింత తీవ్రం చేస్తున్నది. ప్రపంచ వాణిజ్య సంస్థ 'దోహా సదస్సు'లో జరిగిన చర్చల్లో ఏర్పడిన ప్రతిష్ఠంభన వల్ల ద్వైపాక్షిక ఒప్పందాల పేరన జరిగిన అనేక బలవంతపు ఒప్పందాల వల్ల ఆహార రంగంలో బహుళజాతి కార్పోరేట్ వ్యాపారసంస్థల ప్రమేయం పెరిగిపోయింది. ఉదాహరణకు వ్యవసాయరంగంలో 'విజ్ఞాన సహకారం' పేరన అమెరికా– ఇండియా మధ్య కుదిరిన ఒప్పందాన్ని ఆసరాగా చేసుకొని మోన్‌శాంటో, కార్గిల్, వాల్‌మార్ట్ లాంటి విదేశీ బహుళజాతి కార్పోరేట్ వ్యాపారసంస్థల ప్రమేయం భారతదేశ వ్యవసాయరంగంలో పెరిగిపోయి అనేక అనర్థాలకు దారితీస్తున్నది.

విషాదమేమంటే, మనదేశ ప్రధాని డా. మన్మోహన్‌సింగ్ స్వేచ్ఛా వాణిజ్య విధానాలు, ముఖ్యంగా పెరిగిపోతున్న ఆకలిసంక్షోభం సాకుగా ఆయన 2005లో అప్పటి అమెరికా అధ్యక్షుడు జార్జిబుష్‌తో చేసుకున్న అమెరికా– భారత వ్యవసాయ ఒప్పందాల మూలంగా ఇండియాకు విత్తనాల్ని సరఫరా చేసే గుత్తాధిపత్యాన్ని 'మోన్‌శాంటో' కంపెనీకి, ఆహారాన్ని సరఫరాచేసే గుత్తాధిపత్యాన్ని 'కార్గిల్' లాంటి ఇతర కంపెనీలకు, చిల్లర వర్తకంలో గుత్తాధిపత్యాన్ని 'వాల్‌మార్ట్' కార్పోరేట్ వ్యాపార సంస్థలకు స్వయంగా తన స్వహస్తాలతో అప్పజెప్పాడు. ఫిబ్రవరి 4, 2001న 'ఆహార సంక్షోభం', 'ఆహారకొరత'ల మీద జరిగిన ఒక సదస్సులో ప్రధానమంత్రి అయిన ఇదే పెద్దమనిషి తన ప్రసంగంలో – 'ఆహారఉత్పత్తుల సరఫరా కొరకు చిల్లర వాణిజ్యంలో పేరొందిన వాల్‌మార్ట్ లాంటి ప్రముఖ విదేశీ బహుళజాతి వ్యాపార సంస్థను రంగంలోకి తీసుకువచ్చి భారతదేశం పక్కకుతప్పుకొని ఒడ్డున కూర్చోవడం మేలు' అని మాట్లాడాడు. ప్రపంచీకరణ, పారిశ్రామికీకరణ, చిల్లర వాణిజ్యం ఆయా దేశాల రైతుల స్థానిక వ్యవసాయాల్నీ, జీవనాధారాల్నీ ధ్వంసం చేసి దాదాపు 50 శాతం ఆహార వృథాకు కారణమవుతున్నాయని పరిశోధనలు తెలియజేస్తున్నాయి.

అమెరికా దేశపు వ్యవసాయ వాణిజ్యకార్పోరేట్ సంస్థల అభివృద్ధి కోసం, వాటి మార్కెట్ల విస్తరణ కోసం, వాటి లాభాల కోసం అమెరికా ప్రభుత్వంతో పాటు భారతప్రభుత్వం కూడా పాటుపడుతున్నది. ఎంతగా అంటే చివరకు మనదేశ స్వప్రయోజనాల్ని, మనదేశ రైతుల ప్రయోజనాల్ని కూడా పణంగా పెట్టి మరీ వాటికంటకాగుతున్నది. ఆహారం కొరకు రైతులకు, ఇతర ప్రజలకు ఉన్న హక్కులను హరించివేసి కార్పోరేట్‌సంస్థల హక్కుల పేరన వాటి అడ్డూ ఆపూ లేని లాభాల కోసం మార్కెట్లను ఉద్దేశించడం జరుగుతున్నది. ఆహారపు హక్కు ముఖ్యం కావడానికి బదులు 'మార్కెట్లు" ముఖ్యమైపోయాయి.

గోదాముల్లో వృథాగా మూలనపడి ముక్కిపోతున్న ఆహార నిల్వలను ఆకలిగొన్న పేదప్రజలకు ఉచితంగా పంపిణీ చేయమని సాక్షాత్తూ భారత సుప్రీంకోర్టు ప్రభుత్వాన్ని ఆదేశించినపుడు ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ కోర్టు ఆదేశాలను ఖాతరుచేయకపోగా 'ప్రజలకు ఉచితంగా ఆహార ధాన్యాలను పంపిణీ చేస్తే రైతులకు పండించాలనే ఉత్సాహం చచ్చిపోతుందని, మార్కెట్ ధరల మీద, వేతనాల మీద ప్రతికూల ప్రభావం పడ్తుంద'ని సెలవిచ్చి ఆయన నిజస్వరూపమేమిటో నగ్నంగా బయటపెట్టుకున్నారు. సోనియాగాంధీ నేతృత్వంలో ఉన్న 'జాతీయసలహా కమిటీ' 'ఆహార భద్రతాచట్టం' ముసాయిదాను రూపొందించినప్పుడు 'ఆహారధాన్యాల సేకరణను అధికం చేయడం వల్ల బహిరంగ మార్కెట్లో ఆహారధాన్యాల ధరలు ఒడిదొడుకులకు లోనవుతాయ'ని ప్రధాని మన్మోహన్ అన్నారు. దీనర్థమేమిటంటే ప్రజలు అన్నమో రామచంద్రా అని ఆకలితో అలమటించి చచ్చిపోయినా ఫరవాలేదు కానీ, కార్పోరేట్ వ్యాపార సంస్థల లాభాలకు మాత్రం 'ధోకా' ఉండకుండా చూడాలని, ప్రజల ప్రాణాలకంటే కార్పోరేట్ వ్యాపార సంస్థల లాభాలు ముఖ్యమని అర్థం.

'మస్కట్' దేశ సందర్శనకు వెళ్లిన సందర్భంలో మనదేశ ప్లానింగ్ కమిషన్ వైస్–ఛైర్మన్ మాంటెక్‌సింగ్ అహ్లూవాలియా – 'మాదేశానికొచ్చి వ్యవసాయం చేసి మీదేశాలకు ఆహారధాన్యాలు ఎగుమతి చేసుకోండి' అని గల్ఫ్ దేశాలను ఆహ్వానించాడు. ఆయన ఆహ్వానం మేరకు 'నాదర్ ఇబ్రహీం గ్రూపు'నకు చెందిన 'బహ్రెయిన్' దేశపు కంపెనీ ఒకటి పూనాలోని 'సాంఘర్' అనే భారతీయ కంపెనీతో 400 ఎకరాల్లో అరటిపంట పండించడానికి ఒప్పందం చేసుకున్నది. విదేశీయులు ఇక్కడి భూములు కొనుగోలు చేయడానికి భారతచట్టాలు అనుమతించవు కనుక, భారతీయ కంపెనీలతో పొత్తులు పెట్టుకొని 'కాంట్రాక్టు వ్యవసాయం' చేయమని విదేశీ కార్పోరేట్ సంస్థల్ని అహ్లూవాలియా ప్రోత్సహిస్తున్నారు.

అమెరికాలో, యూరప్‌లో, గల్ఫ్ దేశాల్లో స్థానిక ధనవంతులకు ఇప్పటిదాకా ఆహారపంటలను పండిస్తున్న భూములను వాణిజ్యపంటల నిమిత్తం మార్పు చేస్తూ అక్కడిధనవంతులకు కట్టబెట్టడం 'ఆకలి' సమస్యకు పరిష్కారం కాకపోగా ఆహార సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేస్తుంది. ఇది అయితే గియితే భూకబ్జానో, ఆహారకబ్జానో అవుతుందేమో తప్ప, ఇది వ్యవసాయంలో పెట్టుబడుల్ని పెట్టడం కానే కానేరదు.

'ఆకలి' నుండి బయటపడాలంటే ఆహార వ్యవస్థా విధానంలోనే

*చిన్న రాష్ట్రాల మంచి చెడులను చర్చిస్తూ, తెలంగాణ అభివృద్ధికి సూచనలు ఇస్తున్నారు* **ఎం. డి. సర్దార్, మామిడాల శ్యామ్‌సుందర్, మునుకుంట్ల శ్రీనివాస్**

# తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం

**తా**ము వెనుకబడి పోయామని భావిస్తున్న ప్రజానీకం విడిపోవాలని కోరుతున్నపుడు అడ్డుపడటమెందుకు? దేశంలో ఎన్నో రాష్ట్రాలు విభజనకు గురికాలేదా? అసంతృప్తితో కలిసి ఉండే కంటే విడిపోవడం మెరుగుకదా? తెలుగు భాష అనే ఒక సెంటిమెంటు వాదన ముందుకు తెచ్చి బలవంతాన కలిపి ఉంచాలనుకోవడమెందుకు? వెనుకబడి ఉన్న తెలంగాణ తన నిధులను తానే పూర్తిగా ఖర్చు చేసుకోవడానికి తన వనరులు తనే ఉపయోగించుకోవడానికి, తన పాలన తనే నిర్వర్తించుకోవడానికి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడడంలో ప్రమాదమేమిటి?

అసలు పాలనా సౌలభ్యం కోసం చిన్న రాష్ట్రాలు ఏర్పరచడం అందరికి మంచిదికాదా? తద్వారా తమ ప్రత్యేక సంస్కృతులను కాపాడుకునే అవకాశాలు పెరగవా? హర్యానా వంటి చిన్న రాష్ట్రాలు బాగా అభివృద్ధి చెందడం నిజంకాదా? హిందీ మాట్లాడే ప్రజలు అనేక రాష్ట్రాలుగా ఉన్నట్లే తెలుగు మాట్లాడే ప్రజలు మాత్రం వేర్వేరు రాష్ట్రాలైతే ఇబ్బంది ఏమిటి? అనేవి సామాజిక, రాజకీయ విశ్లేషకుల ప్రశ్నలు.

చిన్న రాష్ట్రాలైతే నష్టమేంటి అనే ప్రశ్న? భాషా సంస్కృతులు ఒకటిగా ఉన్న ప్రజలు కేవలం పాలనా సౌలభ్యం పేరిట విడిపోవడం అవసరమే కాక అవాంఛనీయం అని కొందరి వాదన. భాషా రాష్ట్రాల ఏర్పాటుకు ఒక ప్రాతిపదిక ఉంది. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాల మధ్య అభివృద్ధిలో పరస్పర తేడాలున్నాయి. మరి ఆ ప్రాంతాలు కూడా విడిపోతామని డిమాండ్ చేయవచ్చు.

హిందీ మాట్లాడే ప్రాంతాలు అనేక రాష్ట్రాలుగా ఉండడానికి తెలుగు తదితర భాషల ప్రాతిపదికగా ఏర్పడే రాష్ట్రాలకు బొత్తిగా పోలికలేదు. హిందీ భాషా ప్రాంతాలలో భాషా ఉద్యమాలు జరగలేదు. ఆ రాష్ట్రాలు జనాభా సామిప్యత వంటి అంశాల ఆధారంగా ఏర్పడినవే. అనేక స్వదేశీ సంస్థానాలను కలిపి వేసి రాష్ట్రాలని పేరు పెట్టారు. అందుకే ఇప్పటికీ ఆ ప్రజలు తమ పూర్వపు సంస్థానాల పేర్లే చెప్పుకుంటూ ఉంటారు. హర్యానా రాష్ట్రాన్ని భాషా ప్రాతిపదికపైనే విడగొట్టారు. కాని బెంగాలీ, కన్నడ, మళయాళ, తమిళ రాష్ట్రాల సంగతి వేరు. ఆయా భాషల ప్రజల పోరాట క్రమంలో ఏర్పడిన రాష్ట్రాలవి. బెంగాల్‌ను విభజించాలని బ్రిటిష్‌వారు ప్రతిపాదించినపుడు అందుకు వ్యతిరేకంగా జాతీయోద్యమం విజృంభించిందని మరిచిపోరాదు. ఒకే సాంస్కృతిక వారసత్వం గల ప్రజలు వీలైనంతవరకు ఒకే పాలనా విభాగంగా ఉండడం వారి మధ్య ఐక్యతకు దేశ సమైక్యతకు కూడా మంచిది. మాతృభాష విద్యాబోధన ద్వారా మరింత అభివృద్ధి చెందడానికి వీలవుతుంది. అలాగాక చిన్న చిన్న ముక్కలు కావడమంటే ప్రజల ఐక్య పోరాట శక్తిని చేజార్చుకోవడం అవుతుంది. దేశంలో ఈనాడు ఉత్తరప్రదేశ్, బీహార్, పశ్చిమబెంగాల్, ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రాలకు ఉన్న ప్రతిష్ఠ, పట్టు చిన్న చిన్న రాష్ట్రాలకు ఉందా? ఇది కేవలం ప్రతిష్ఠ

---

సమూలమైన మార్పు అవసరం. ఒకేరకమైన మూస పంటల సాగు స్థానంలో వైవిధ్య భరితమైన పంటల సాగు చేపట్టాలి. ప్రమాదకరమైన రసాయనిక, క్రిమిసంహారక మందుల్ని విచక్షణారహితంగా కుమ్మరించే బదులు పర్యావరణ అనుకూల, జీవవైవిధ్య ప్రత్యామ్నాయాలను ఆచరించాలి. అధిక పెట్టుబడుల్ని కుమ్మరించే విధానం బదులు తక్కువ పెట్టుబడులతో కూడిన వ్యవసాయ సాగు పద్ధతుల్ని అనుసరించాలి. పిడికెడు కార్పొరేట్ సంస్థల కర్రపెత్తనం కింద అమలయ్యే కేంద్రీకృత, ప్రపంచీకరించబడిన ఆహారసరఫరా విధానాల్ని విడనాడి ఎక్కడికక్కడ స్థానిక వాతావరణ పరిస్థితులను, స్థానిక అవసరాలను, ధరల హెచ్చు తగ్గులను తట్టుకోగలిగిన వికేంద్రీకరించబడిన స్థానిక ఆహార వ్యవస్థా విధానాలను అనుసరించాలి. ఇటువంటి విధానమే భారతదేశపు జనాభాకంతటికీ ఆహారాన్ని సమకూర్చగలదు.

తక్కువ ఆహార విలువలు, తక్కువ పోషక విలువలు ఉన్న ఆహారాన్ని మాత్రమే ఉత్పత్తిచేయగల పారిశ్రామికీకరించబడిన మార్పులేని ఏకీకృతమూసపంటల సాగు విధానాల్ని విడనాడి, పర్యావరణ అనుకూలమైన, వైవిధ్యమైన 'ఆర్గానిక్' పంటలసాగు జాతీయ విధానాన్ని అనుసరించినట్లయితేనే – 2.4 బిలియన్ల గర్భిణీ స్త్రీలకు సరిపడా కెలోరీల ఆహారం, 2.5 బిలియన్ల గర్భిణీ స్త్రీలకు సరిపడా మాంసకృత్తులు, 1.5 బిలియన్ల గర్భిణీ స్త్రీలకు సరిపడా కెరోటిన్లు, 1.7 బిలియన్ల గర్భిణీ స్త్రీలకు సరిపడా ఫోలిక్‌యాసిడ్ ఉన్న పోషకాహారాన్ని అందించ గలుగుతాం. ఆహార సరఫరా వ్యవస్థలో ప్రజాస్వామ్య విధానాల్ని నిర్మించడం ద్వారా, విత్తనాలు, భూమి, ఆహారం తదితరాల్లో స్వావలంబనను, స్వయం సమృద్ధిని తిరిగి పొందడం ద్వారా మాత్రమే 'ఆకలి'ని జయించగలం.

*(రచయిత నవధాన్యట్రస్ట్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్, పర్యావరణ ఉద్యమకారిణి)*
*(స్వేచ్ఛానువాదం – డా. మాధవస్వామి, ఉద్యోగ క్రాంతి, కర్నూలు)* వీ

కోసం పదవుల కోసం కాదు, తద్వారా ప్రజాప్రయోజనాలు సాధించు కోవచ్చనేది ముఖ్యం. ప్రాంతీయ అసమానతలే సమస్య అయితే కేరళ కూడా మనలాగే కొచ్చిన్ మలబారు ప్రాంతాల కలయికగా ఏర్పడింది. అక్కడి పాలన అసమానతలు తగ్గించడానికి ప్రజా పోరాటాలకు పరోక్షంగా కృషిచేసింది. అందుకే అనతి కాలంలోనే ఆ భావాలు సమసిపోయాయి.

చిన్న రాష్ట్రాలైనంత మాత్రాన అభివృద్ధి జరిగిపోతుందనే వాదనలో ఏ మాత్రం పసలేదు. ఈశాన్య ప్రాంతంలో చిన్న రాష్ట్రాలే ఉన్నాయి. అవి ఏమాత్రం అభివృద్ధి చెందాయి ? హర్యానా చిన్న రాష్ట్రంగా ఉండి కూడా అభివృద్ధి చెందిందంటే అందుకు కారణం నీటిపారుదల, వ్యవసాయాభివృద్ధి, హరిత విప్లవ ప్రభావం తప్ప చిన్నది కావడం కాదు. హిమాచల్‌ప్రదేశ్ ఇప్పటికీ అంత అభివృద్ధి చెందలేదు. ఈశాన్య రాష్ట్రాలు ఇప్పటికీ దినసరి ఖర్చుల కోసం కేంద్రంపై ఆధారపడాల్సిందే. కొత్త రాష్ట్రం ఛత్తీస్‌గఢ్ తీసుకుంటే అక్కడ ఉన్న ఒకే ఒక పెద్ద పరిశ్రమ బాల్కోను ప్రైవేటీకరించాలని కేంద్రం ఏకపక్షంగా నిర్ణయించింది. రాష్ట్ర ప్రభుత్వం తానే తీసుకుంటామని హడావుడి చేసినా దానికి ఆ శక్తిలేదు కనుక కేంద్రం ఖాతరు చేయలేదు. నిధులు లేనప్పుడు చిన్న రాష్ట్రమైనా పెద్దదైనా తేడా ఉండదు. పైగా మరి చిన్న రాష్ట్రాలు పూర్తిగా కేంద్రం దయాదాక్షిణ్యాలపై ఆధారపడాల్సి వస్తుందనే విమర్శ కూడా లేకపోలేదు.

తెలంగాణ వెనుకబాటు విషయంలో భిన్నాభిప్రాయాలు లేకున్నా ఎవరికి వారు ఏవో లెక్కలు వినిపిస్తున్నారు. వీటిలో ఏది ఏమేరకు నిజం అనేది లోతుగా విమర్శనాత్మకంగా చూడవలసిన విషయం. అదే సమయంలో రాష్ట్రంలో మరికొన్ని ఇతర ప్రాంతాలు కూడా వెనుకబడి ఉన్నాయి. అభివృద్ధి చెందాయనుకున్న ప్రాంతాలలోకూడా కొన్ని జిల్లాలు మరీ వెనుకబడి ఉన్నాయి. వ్యవసాయికంగా ముందున్న ప్రాంతాలు పారిశ్రామికంగా చాలా వెనుకబడ్డాయి. తెలంగాణతోపాటు అన్ని వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధి చేయాల్సి ఉంది. గిరిజన ప్రాంతాల వంటివి అన్ని చోట్లా వెనుకబడి ఉన్నాయి. వాటి అభివృద్ధికి స్వయం పాలక మండలాలు ఏర్పాటు చేయవలసి ఉంది. పశ్చిమబెంగాల్ డార్జిలింగ్ కొండ ప్రాంతాన్ని త్రిపురలో గిరిజన ప్రాంతాలు అభివృద్ధి చేయడానికి అక్కడి ప్రభుత్వాలు ప్రత్యేక కౌన్సిళ్లను ఏర్పరచాయి. నిధులు కేటాయించి విస్తృతమైన అధికారాలు కల్పించాయి.

వెనుకబడిన తెలంగాణ అభివృద్ధి జరగాలంటే లోగడ జరిగిన పొరపాట్లు, పొరపాట్లు పోకడలు పునరావృతం కాకుండా అప్రమత్తంగా వ్యవహరించాలి. ఈ ప్రాంతపు రెవెన్యూ వసూళ్లు గ్రాంట్లు ఖర్చులపై అజమాయిషీ ఉండే చట్టబద్ధమైన ప్రాంతీయ అభివృద్ధి బోర్డులు కూడా పునరుద్ధరించాలి. 610 జీవో అమలును సమీక్షించి జనాభా ప్రాతిపదికగా ఉద్యోగాల కేటాయింపులో న్యాయం చేయాలి. తెలంగాణ రెవెన్యూ వసూళ్లు, ఖర్చులు, విద్య, వైద్య, ఉద్యోగ పరిస్థితులపై శ్వేతపత్రం ప్రకటించాలి.

అర్థవంతమైన భూ సంస్కరణలు అమలు చేయాలి. పేదలకు భూపంపిణీ చేయాలి. వ్యవసాయ విద్యుత్ చార్జీలపై సబ్సిడీ ఇవ్వాలి. నీటి తీరువా చార్జీకి అది మించిపోకుండా చూడాలి. తెలంగాణ వెనుక బాటుకు ప్రధాన కారణమైన ప్రాజెక్టుల జాప్యాన్ని ఎత్తిపోతల పథకాలు, కల్వకుర్తి, భీమా, నెట్టెంపాడు ఎత్తిపోతల పథకాలను పూర్తి చేయాలి.

శ్రీరాంసాగర్ రెండవ దశ, వరదకాలువ, ఎస్ఎల్‌బిసి, జూరాల ప్రాజెక్టులను సకాలంలో పూర్తిచేయాలి. ఇతర చిన్న మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టులకు ప్రాధాన్యతనిచ్చి పూర్తిచేయాలి. మూసివేసిన పరిశ్రమలను తెరిపించాలి. ఐడిపిఎల్, అజాంజాహీ, నిజాం చక్కెర ఫ్యాక్టరీ, ఆదిలాబాద్ సిమెంట్ ఫ్యాక్టరీ, స్పిన్నింగ్ మిల్లు వగైరాలను తెరిపించి ఆధునీకరించాలి. వరంగల్ జిల్లా భూపాలపల్లిలోని మెగా థర్మల్ విద్యుత్ ప్రాజెక్టును నిర్మించాలి. ప్రభుత్వ రంగాన్ని పరిరక్షించి ఉపాధి అవకాశాలు పెంచాలి. ఎస్.సి., ఎస్.టి., బి.సి. మహిళల రిజర్వేషన్లు సక్రమంగా అమలు చేయాలి.

ఇందుకు అనుగుణంగానే రైల్వే మీటర్ గేజ్ లైన్లను అమర్చాలి. ఇప్పటికే సర్వే జరిగిన కరీంనగర్ – ముఖేడ్ – నిజామాబాద్ లైను, కొత్తగూడెం – జడ్చర్ల – రాయచూర్ లైన్లు వెంటనే చేపట్టాలి. గ్రామీణ రోడ్లు అభివృద్ధి చేయాలి. విద్యా, వైద్య రంగాలలో తెలంగాణ అభివృద్ధికి చర్యలు తీసుకోవాలి. హైదరాబాద్‌లోని ప్రభుత్వ వైద్య సంస్థల ప్రైవేటీకరణ ధోరణులు విడనాడాలి. పేద ప్రజలకు ఉచిత వైద్యం అందేలా చూడాలి.

ఆస్పత్రులలో యూజర్ చార్జీలు రద్దుచేయాలి. ప్రతి మండలంలో ఒక జూనియర్ కాలేజీ, సాంకేతిక వృత్తి విద్యా సంస్థలు ఏర్పరచాలి. ఉత్తర తెలంగాణలోని ప్రభుత్వ మెడికల్ కాలేజిని ప్రారంభించాలి. ఈ విధమైన నిర్దిష్ట డిమాండ్లతో తెలంగాణ ప్రాంత అభివృద్ధి సాధించేందుకు కృషి చేయాలి. వెనుకబడిన తెలంగాణ ప్రాంతం కాని, ఇతర ప్రాంతాలు కాని అభివృద్ధి చెందడానికి తెలుగు ప్రజలందరూ ఒక్కతాటిపై నిలిచి ముందుకుసాగాలి.

నిజానికి ప్రతి సమస్యకు పరిష్కారం ఉంటుంది. పరిష్కారం లేనిదే సమస్య ఉండదు.

1. తెలంగాణ వెనుకబాటుతనానికి గల కారణాలను మూలాలలోనికి వెళ్లి క్షుణ్ణంగా పరిశీలించాలి.
2. కారణాలకు తగిన పరిష్కార మార్గాలను సాధ్యమైనంత తొందరగా చూపించాలి.
3. తెలంగాణ సమస్య పరిష్కారానికి ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు కంటే మరో సులువైన ప్రత్యామ్నాయ మార్గాన్ని అన్వేషించాలి.
4. తగిన రాజకీయ ప్రాతినిధ్యం కల్పించాలి.

*(రచయితలు కాకతీయ విశ్వవిద్యాలయ విద్యార్థులు)* వీ

వీక్షణం పత్రికను ప్రతి నెల 29–30 తేదీల్లో పోస్టు చేస్తాం. పత్రిక 7వ తేదీలోగా అందకపోతే మాకు తెలియపర్చండి.
చందా రెన్యువల్ చేసుకున్న వారికే పత్రికను పంపించడం జరుగుతుంది.

కార్యాలయం ఫోన్ : 040 - 66843495 (ఉ. 10.30 నుండి సా. 5.30 లోపు)

**చందా మనీ ఆర్డర్ ద్వారా పంపేవారు వారి చిరునామాతో పాటు ఫోన్ నంబర్ తప్పకుండా రాయండి.**

*స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా బ్రిటిష్ కాలంలో వచ్చిన పత్రికలనూ, అవి పాటించిన విలువలనూ, వాటి నిబద్ధతనూ వివరిస్తున్నారు* **సింగతి వెంకటేశం, సుందరగిరి శ్రీనివాస్**

# స్వాతంత్ర్యోద్యమంలో పత్రికల పాత్ర

**భా**రతదేశంలో తొలి ముద్రిత వార్తాపత్రిక 'బెంగాల్ గెజిట్'. దీనిని 29 జనవరి 1780న జేమ్స్ ఆగస్టన్‌హిక్కీ స్థాపించారు. తొలిసారిగా భారతీయుడు స్థాపించిన వంగభాషలో వెలువడిన 'బెంగాల్ గెజిట్' డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు 'వీరేశలింగం పంతులు సమగ్రపరిశీలన' గ్రంథంలోఈ పత్రికల వ్యవస్థాపన గురించి తెలుగు ప్రజానీకానికి వివరించారు. 1830 వరకు ఆంగ్లో ఇండియన్ పత్రికలే ప్రముఖ పాత్ర వహించాయి. క్రైస్తవమత వ్యాప్తికోసం ఆంగ్లేయులు భారతీయ భాషల్లో బైబిల్ అనువాదాన్ని, క్రైస్తవసాహిత్య ముద్రణను అవసరంగా భావించారు. మిషనరీల ద్వారా ముద్రణ కళను అభివృద్ధి చేశారు. 1818 నుంచి సిరంపూర్ మిషనరీలు ఆంధ్రదేశంలో బళ్లారి, విశాఖపట్నం, కాకినాడ, మచిలీపట్నం తదితర ప్రాంతాల్లో వివిధ లక్ష్యాలతో పత్రికల విస్తరణ జరిగింది. ఈ క్రమంలో స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా మహాత్మాగాంధీ 1928లో 'యంగ్ ఇండియా', 1933లో 'హరిజన్' ఆంగ్లభాష వార పత్రికలను ప్రారంభించారు. తర్వాత 'హరిజన్' పత్రిక హిందీ, గుజరాతీ భాషల్లోనూ వెలువడింది. అట్టడుగు కులాల ఉద్ధరణకోసం డా. అంబేద్కర్ 1920 జనవరి 31న 'మూక్‌నాయక్' పత్రికను, 3 ఏప్రిల్ 1927లో 'బహిష్కృత్ భారత్' పత్రికను బొంబాయి నుండి వెలువరించారు. తర్వాత కాలంలో అణగారిన జనాల సామాజిక న్యాయం, ఆర్థిక సమానత్వం నినాదాలతో 'సమత', 'జనత' పత్రికలను ఆయన ప్రారంభించారు.

ఆంగ్లేయులు 1740లో భారత రాజకీయాల్లో రంగప్రవేశం చేశారు. 1856 నాటికి యావద్భారతానికి సార్వభౌములయ్యారు. రైల్వే, తంతితపాలాల ద్వారా ప్రభుత్వ ఆధ్వర్యంలో భారతదేశం 'ఆసేతు హిమాచలం'గా పరిణమించింది. అనుసంధాన భాషగా 'ఇంగ్లిషు' ఉపకరించింది. 1773 రెగ్యులేటింగ్ చట్టంద్వారా ప్రభుత్వ ఆధ్వర్యంలో 'ప్రాచ్యవిద్య' నిర్ణయం జరిగింది. 1781లో 'కలకత్తా మదర్‌సా' వారెన్‌హేస్టింగ్స్ ప్రారంభించారు. 1792లో కారన్‌వాలిస్ కాశీలో సంస్కృత కళాశాల స్థాపించారు. కంపెనీ ఉద్యోగులకు భారతీయ భాషలను నేర్పేందుకు 1800నుంచి కలకత్తా, మద్రాసుల్లో బ్రిటిష్ ప్రభుత్వం కళాశాలల్ని స్థాపించింది. పాశ్చాత్య విద్య ప్రాముఖ్యం గురించి రాజారామ్‌మోహన్‌రాయ్ 1816లో కలకత్తాలో హిందూ కళాశాలను స్థాపించారు. 1818 నుంచి సిరంపూర్ బాప్టిస్టు మిషనరీలు దేశం నలుమూలలా కళాశాలలు ఏర్పాటు చేశాయి. 1835లో మెకాలే ఇంగ్లిషు విద్య ప్రబోధ చట్టం భారతీయుల్లో పాశ్చాత్యవిద్యకు బీజాలు నాటింది. దేశమంతా విద్యావ్యాప్తి జరగడంతో పత్రికల ద్వారా ప్రపంచ రాజకీయాలను తెలుసుకొనే అవకాశం ప్రజానీకానికి కలిగింది. ఈ నేపథ్యంలో అనేక భారతీయ పత్రికలు దేశం నలుమూలలా ఆవిర్భవించాయి.

## సంఘ సంస్కరణ - సామాజిక పునర్నిర్మాణాలు

భారతీయ 'సాంస్కృతిక పునరుజ్జీవం'లో భాగంగా రాజా రామ్‌మోహన్‌రాయ్ 'బ్రహ్మసమాజం' స్థాపించి సంఘసంస్కరణకు పూనుకున్నారు. అందుకు పత్రికారచనను సాధనంగా చేసుకున్నారు. ఆయన మార్గం దేశంలో అనేకమందిపై ప్రభావాన్ని చూపింది. శివప్రసాద్ శర్మ సంపాదకునిగా 1832లో 'బ్రాహ్మణికల్‌మేగజైన్'ను వంగ, ఆంగ్ల భాషల్లో 'బ్రాహ్మిణ్‌సేనాధి' 'సంవాది కౌముది' పత్రికలను ప్రచురించారు. వీటిద్వారా హిందూ మత పరిరక్షణ కోసం ప్రచారం చేశారు. ఆయన లక్ష్యం 'సతీసహగమనం' తక్షణ నిర్మూలనగా కొనసాగింది. మహారాష్ట్రలో జ్యోతిరావుపూలే, ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం పంతులు, రఘుపతివెంకటరత్నం నాయుడు, కుసుమధర్మన్న తదితరులు ఆయన్ని అనుసరించారు.

మహాత్మా జ్యోతిరావుపూలే నిమ్నకులాల ఉద్ధరణకు నడుం బిగించారు. 1873లో 'సత్యశోధక్ సమాజ్' స్థాపించారు. నిమ్నకులాల ప్రజలు ఏ విధంగా దోపిడికి గురవుతున్నారో వివరించేందుకు 'గులాంగిరీ' నాటకాన్ని రాశారు. కృష్ణారావ్ బాలేకర్ సంపాదకత్వంలో 'దీనబంధు' మాసపత్రికను నిర్వహించారు. లోకమాన్య తిలక్, వీర్ సావర్కర్‌ల జీవితచరిత్ర రాసిన ధనుంజయ్‌కీర్ పూలే జీవిత చరిత్రనూ రాశారు. భారత సామాజిక వ్యవస్థలో నిమ్నకులాల ఉద్ధరణకు నడుం బిగించిన తొలివ్యక్తి జ్యోతిరావు ఫూలేగా కీర్ పేర్కొన్నారు. రాజా రామ్‌మోహన్‌రాయ్ సంఘసంస్కరణ ఉద్యమ పితామహునిగా, ఫూలేని సామాజిక పునర్నిర్మాణానికి ఆద్యునిగా భారతీయ చరిత్రకారులు కీర్, వసంతమూన్‌లు పేర్కొన్నారు. వివిధ జాతులు, మతాలతో కూడిన భారతదేశంలో 'భిన్నత్వంలో ఏకత్వం' సాధనకు ఆయన కృషి చేశారు. స్వాతంత్ర్యోద్యమంలో ఆయన పత్రికలు కీలకపాత్ర పోషించాయి. రవీంద్రనాథ్ ఠాగూర్ చేత మహాత్మునిగా కీర్తించబడి యావత్ భారతీయులకు జాతిపితగా గాంధీ చరిత్రలో నిలిచారు.

డాక్టర్ అంబేద్కర్ నిమ్నకులాల ఉద్ధరణ లక్ష్యంగా కొల్హాపూర్ మహారాజా ఆర్థిక సహాయంతో 31, జనవరి 1920లో 'మూక్‌నాయక్' పక్షపత్రికను ప్రారంభించారు. నిమ్నకులాల దాస్య విమోచనకు కార్యాచరణ సందేశాలు, స్వాతంత్ర్యోద్యమ గమనాన్ని ఈ పత్రిక విశ్లేషించింది. ముస్లిం నాయకునిగా మహ్మదాలీ జిన్నా, హిందువుల నాయకునిగా గాంధీ రాజకీయ పోరాటాన్ని కొనసాగిస్తున్న కాలంలో అంబేద్కర్ నిమ్నకులాల అభ్యున్నతికి 1924 జూలై 20న బహిష్కృత్ హితకారిణి సభ ను ఏర్పాటు చేశారు. దీనికి సంఘీభావం ప్రకటించే నాయకులను ఆహ్వానించి, బొంబాయిలో సమావేశం నిర్వహించారు.

వారి మద్దతుతో నిమ్నకులాల బాలల కోసం పాఠశాలలు, హాస్టళ్లు స్థాపించారు. వారికి విద్యనందించడం, గ్రంథాలయాలు ఏర్పాటు చేయడం, సాంస్కృతిక సభలు నిర్వహించడం, వ్యవసాయంలోను, పరిశ్రమలోను శిక్షణ కోసం కేంద్రాలను నెలకొల్పారు. నిమ్నజాతుల సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లి వాటి పరిష్కారానికి కృషిచేశారు. 'సరస్వతీ విలాస్' పత్రిక ఈ సంస్థ ద్వారానే నిర్వహించారు. డాక్టర్ అంబేద్కర్ 1927, ఏప్రిల్3న 'బహిష్కృత్‌భారత్' మరాఠీ పత్రికను బొంబాయినుంచి ప్రారంభించారు. అక్టోబర్2,1930లో 'జనత–సమత' ప్రారంభించారు. "డాక్టర్ అంబేద్కర్‌కు భావప్రకటన, వాక్‌స్వాతంత్ర్యాల పట్ల గల ఆలోచన, ప్రజాస్వామిక, నిర్మాణాత్మక దృక్పథం భారత రాజ్యాంగ రచన ద్వారా అవగతమవుతుంది. ఆయన భారత రాజ్యాంగంలో 19వ అధికరణం ద్వారా వీటి ప్రాధాన్యతను పొందుపర్చిన విధానం ఆయన సామర్థ్యాన్ని నిరూపిస్తుంది" అని ఆర్‌సిఎస్ సర్కార్, ధనుంజయ్‌కీర్ వంటి రచయితలు పేర్కొన్నారు.

'నా ఆలోచనలు నిజమైనవి. అవి నా నుంచే ఉద్భవిస్తాయి. రచనలు అలా కాదు. ఇతరుల ఆలోచనలను కూడా కలుపుకొని చేసే ఉపఉత్పత్తి లాంటివి. నేను నా ఆలోచనలను ప్రచారం చేస్తాను. పత్రికా రచన నా వృత్తి కాదు' అని గాంధీ 18, ఆగస్టు 1946 'హరిజన' పత్రికలో పేర్కొన్నారు. స్వాతంత్ర్య సాధన తర్వాత తన పత్రికల ప్రచురణను ఆపేశారు. అందుకే గాంధీ 'నా జీవితమే నా సందేశం' అని పేర్కొన్నాడు. డాక్టర్ అంబేద్కర్ స్వతంత్ర భారతదేశానికి రాజ్యాంగ రచన పూర్తి కాగానే ఆయనా తన పత్రికలను నిర్వహించలేదు. ఇద్దరూ వ్యాపారం కోసం కాకుండా, లక్ష్యం కోసం పత్రికలను నిర్వహించారు. ఈకోవకు చెందిన పాత్రికేయులను, పత్రికలను ఈ దేశ జర్నలిజం చరిత్రలో వేళ్లమీద లెక్కించొచ్చు. ఈ పరిణామాలను బట్టి పాత్రికేయుని బాధ్యత కేవలం వార్తాసేకరణ మాత్రమే కాదు, ఆ ఘటన, పరిణామాలపై తన సందేశాన్ని లేదా పరిష్కారాన్ని చెప్పాల్సి ఉంటుందని అర్థం చేసుకోవచ్చు. సామాజిక, రాజకీయ, ఆర్థిక అంశాల పట్ల ప్రజానీకంలో మనోధైర్యాన్ని నింపడానికి పత్రికలు అవసరం. వారి స్థితిగతులు మారాలంటే భారతదేశానికి రాజకీయవిమోచన లభించాలి. అందుకే నా ఆలోచనలతోనే పత్రికలను రచన చేస్తాను" అని గాంధీ పేర్కొన్నారు.

'యాజమాన్యాల నియంత్రణలో పత్రికలు నిమ్నకులాల సమస్యలపై దృష్టి సారించడం లేదు. పత్రికలు ప్రజాస్వామ్యాన్ని ప్రజా సంక్షేమాన్ని రక్షించడానికి తగిన శక్తివంతమైన సాధనాలు. అందుకే పత్రికా రచనకు పూనుకున్నారు అంబేద్కర్' అని మహేష్‌చంద్ర గురు తన పరిశోధనా వ్యాసంలో పేర్కొన్నారు.

'మూక్‌నాయక్' పత్రిక తొలి సంచికలో –భారతదేశం కేవలం స్వాతంత్ర్యం సంపాదిస్తే సరిపోదు, దేశ పౌరులందరికీ మతం విషయంలోను, మనుగడ విషయంలోను సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా సమాన భాగస్వామ్యం లభిస్తేనే స్వాతంత్ర్యానికి అర్థం సిద్ధిస్తుంది. అలాగే దేశంలోని ప్రతి పౌరుడు సహజవనరుల్ని వినియోగించుకునే వాతావరణం ఏర్పడాలి. అదే నిజమైన స్వాతంత్ర్యం అని డాక్టర్ అంబేద్కర్ పేర్కొన్నారు.

*(ఫ్రీలాన్స్ రచయితలు)* వీ

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 4

*(గత సంచిక తరువాయి...)*

నిజాముల్-ముల్క్ (ఛిన్‌ఖులిచ్‌ఖాన్ అసఫ్‌జాహీ) పూర్తికాలం పరిపాలన (1724 నుంచి 1748) మొదలయ్యే కాలానికే మొఘలు సామ్రాజ్యం దాదాపు విచ్ఛిన్నదశకు చేరింది. మహాసామ్రాజ్యం స్థానంలో అనేక స్వతంత్ర, అర్ధస్వతంత్ర రాచరిక రాజ్యాలు, సంస్థానాలు ఏర్పడ్డాయి. ఈ భారతీయ పాలకుల మధ్య నిరంతర ఘర్షణలూ యుద్ధాలే కాకుండా, ఒక్కొక్క రాజ్యం లోపల కూడా సింహాసం కోసం, అధికారం కోసం, ఢిల్లీలో మొఘులుల మధ్య జరుగుతున్నట్లుగానే నిరంతరం పోరాటాలు జరుగుతుండేవి. ఈ స్థానిక పాలకులే పెద్దమొత్తంలో నజరానా చెల్లించే షరతు మీద ఢిల్లీ సుల్తాను నుంచి శిస్తు వసూలు చేసుకునే హక్కులు పొందేవారు. వాస్తవానికి ప్రజలదగ్గర వీరికి అంత పెద్దమొత్తంలో చెల్లించడానికి కావలసిన పంట పండేది కాదు, డబ్బు ఉండేది కాదు. నిజాం ముందుగా తను సుబేదారుగా ప్రకటించుకోగానే ఇలాంటి శిస్తు గ్రహీతల (రాజులు, జమీందార్లు)కు తన ఖజానా నుంచి డబ్బు ఢిల్లీ ఖజానాకు సర్దుబాటు చేయించి వీరందరినీ తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. చౌత్, సర్ దేశ్‌ముఖ్ వసూలుచేసే ఖమాయిష్‌దార్ల వ్యవస్థను రద్దు చేసి, వీరిని కఠినంగా అణచివేశాడు.

వ్యవసాయాన్ని అభివృద్ధి పరచడానికి తరచుగా గ్రామాలలో హఠాత్తు పర్యటనలు చేసిరైతుల కష్టాలను, ఇబ్బందులను తొలగించి పంటలు బాగా పండించే విధంగా వారిని ప్రోత్సహించేవాడు. పరిపాలనకు ఆర్థికపుష్టత ముఖ్యమని, అది సక్రమ రెవెన్యూ వ్యవస్థ వల్లనే వస్తుందని నిజాం గ్రహించాడు. మెజారిటీ ప్రజలు హిందువులు (90 శాతం) కాబట్టి, భూమిశిస్తు వసూలు చేయడానికి ప్రభుత్వం తరఫున ఉన్న హిందూ అధికారులను కొనసాగించడమే కాకుండా, కొత్తగాకూడా హిందూ అధికారులను నియమించాడు. తనకు ఆదాయాన్నిచ్చే రెవెన్యూ వ్యవస్థను క్రమబద్ధీకరించడానికి అదనంగా రాజమండ్రిలో ఒక గవర్నరును పరిపాలనా సౌలభ్యం కోసం నియమించాడు. నిజాము తన పాలనలో నున్న హైదరాబాదు రాష్ట్రాన్ని మొఘలులు అమలుచేసిన పద్ధతిలోనే (ఔరంగజేబు) పరిపాలనా కాలంలో ఉన్న పేర్లతో ఈ కింది విధంగా విభజించాడు.

హైదరాబాదు దక్కన్ → 6 సుబాలు→హైదరాబాదు రాష్ట్రం (1సుబా)
↓
– సర్కారులు (42జిల్లాలు)
↓
పరగణాలు లేదా మహలులు (కొన్ని గ్రామాలు కలిసి ఒక (205) పరగణా, కొన్నిసార్లు ఒక గంజి (మార్కెట్) కోట లేదా టంకశాల కూడా మహలుగా ఉండేది.
↓
– దేహ్ (పరగణాలోని కొన్ని గ్రామాలు లేదా పెద్ద గ్రామం)

రెవెన్యూ యంత్రాంగాన్ని ఒక్కో సుబాకు ఈ విధంగా నియమించాడు. పటిష్టమైన పరిపాలన రెవెన్యూ వ్యవస్థను బలోపేతం చేయడం ద్వారానే వస్తుందని, అందుకు అనుగుణంగా సైన్యాన్ని పరిపాలనా యంత్రాంగాన్ని రెండు విభాగాలుగా చేశాడు. (పట్టికలో)

రెవెన్యూ యంత్రాంగం ద్వారా నిజాము ఖజానాకు రకరకాల ఆదాయాలు జమ అయ్యేవి. 1) భూమిశిస్తు; 2) గ్రామంలోని ఇతర

హైదరాబాద్ దక్కన్

| సుబేదారు (నిజాము) | దివాను (ప్రధానమంత్రి) |
|---|---|
| సైన్యం, న్యాయవ్యవస్థ, నేరసంబంధ పాలన, పూర్తిస్థాయిలో అన్ని యంత్రాంగాలపై అధికారం | రెవెన్యూ వ్యవస్థ ద్వారా వచ్చే వివిధ ఆదాయాలపై, ఆయా యంత్రాంగాలపై పూర్తి అధికారం |
| ↓ | ↓ |
| ఫౌజుదారులు, మునసబు దారులు, ఖ్వాజీలు, మొదలగువారు (ఫౌజుదారులు సైన్యాన్ని నడిపించడమే కాకుండా కొన్నిసార్లు సుబేదారులుగా, అమల్ గుల్జారులుగా ఉండేవారు. నిజాము కూడా మొదట్లో దక్కన్‌కు సుబేదారుగా, కర్ణాటకకు ఫౌజుదారుగా (1713 –1715) ఉన్నారన్నది తెలిసినవిషయమే) | నాయబ్ దివాను |
| | ↓ |
| | అమల్ గుల్జార్ (సర్కారు) |
| | ↓ |
| | అమల్, షిక్‌దారులు, తహవిల్దార్‌లు, తహసిల్‌దారులు మొ॥ వారు (వీరికి నెల జీతం రు.15 నుండి మొదలయ్యేది) |
| | ↓ |
| | ఇతర కిందిస్థాయి రెవెన్యూ యంత్రాంగం (గ్రామరెవెన్యూ అధికార సిబ్బంది, దేశ్‌ముఖ్, దేశ్‌పాండే, ముఖద్దమ, పట్వారి, కులకర్ణి మొదలగువారు) |

రహదారి అటవీ ఉత్పత్తులు, ఖనిజాలు, ప్రకృతివనరులపై వచ్చే ఆదాయం; 3) జమీందార్లు, ప్రభుత్వ ఉద్యోగులు, ఇతర వ్యక్తుల ఆధీనంలోకి వచ్చిన భూములపై ప్రభుత్వంతో ఒప్పందం చేసుకున్న 'పేష్‌కాష్' (రెవెన్యూ వసూలు చేయడానికి అధికార ఉత్తర్వులు (సనద్) పొందడం కోసం ముందుగా కొంతసొమ్ము ప్రభుత్వానికి చెల్లించడం) ద్వారా వచ్చే ఆదాయం; 4) భగత్ (తోటలు); 5) ఓడరేవుల నుంచి ఎగుమతులు దిగుమతులపై వసూలు చేసే సుంకం; 6) మచిలీపట్నం, ఇతర సముద్రతీర ప్రాంతాలలో ఉత్పత్తి అయ్యే ఉప్పుపై గుత్తాధికారం ద్వారా వచ్చే రాబడి; 7) వజ్రాల గనులపై వచ్చే సుంకం, ఆదాయం; (8) టంకశాలలు.

భూమిశిస్తు, ఇతర ఆదాయాల ద్వారా ప్రభుత్వానికి లభించే సంపదను పొందడం కోసం నిజాము నియమించిన దివాన్లు, రెవెన్యూ క్రమబద్ధీకరణకూ నిర్ధారణకూ ఔరంగజేబు పాలన నుంచి పనిచేస్తున్న 'కానుంగో'ల దగ్గర ఉన్న రికార్డులనే ప్రాతిపదికగా తీసుకున్నారు. ముఖ్యంగా క్రీ.శ.1687లో గోల్కొండ రాజ్యం(మహమ్మద్‌నగర్) మొఘలు పరిపాలనలోకొచ్చిన తరువాత హైదరాబాదుకు దివానుగా పనిచేసిన (1689–90) మహమ్మద్‌షఫీ కాలంలో తయారుచేసిన జమ–ఇ–కమిల్ ను ప్రతిమహలుకూ, పరగణాకు రెవెన్యూ నిర్ధారించడానికి ప్రాతిపదికగా నిజాముల్ – ముల్క్ దివాన్లు తీసుకున్నారు. అప్పట్లో (జమ అయ్యే పన్ను) వసూల్‌ను ఆధారంగా చేసుకొని, ఇప్పటి మారిన పరిస్థితుల కనుగుణంగా ఆ సంవత్సరానికి కట్టాల్సిన పన్నును నిర్ధారించేవారు. సంవత్సరానికి భూమిశిస్తు నిర్ధారణ చేసిన తరువాత (ఖరీఫ్, రబీ సీజన్‌లకు), జమీందారు, శిస్తుగ్రహీతల వారీగా 'అమిల్'కు సమర్పించి, ఆయన సంతకం తీసుకొని, తరువాత దేశ్‌ముఖ్, దేశ్‌పాండ్యా తదితరులు సంతకాలు తీసుకున్న పిమ్మట న్యాయాధికారి (ఖ్వాజీ)తో సీలు వేయించి నిజాముకు సమర్పించే పద్ధతి అమలులో ఉండేది. ఏరకమైన పన్ను అయినా ప్రభుత్వ ఉద్యోగులే పన్ను వసూలు చేసే సందర్భంలో కూడా గ్రామీణ రెవెన్యూ యంత్రాంగం నుంచి ఇతర రెవెన్యూ అధికార యంత్రాంగం మాత్రమే పన్ను నిర్ధారణ చేసేది. వసూలు చేసే అధికారం ఉన్న జాగీర్దార్లు, మునసబుదార్లు, జమీందార్లు ఇతర శిస్తు గ్రహీతలకు పన్ను నిర్ధారణ చేసే అధికారం ఉండదు. కాని వీరి అనుమతి లేదా తెలియపరచడం కోసం మాత్రమే వారి సంతకం తీసుకునే ఆనవాయితీ ఉండేది.

రెవెన్యూ యంత్రాంగం తయారుచేసిన జమ–ఇ–కమిల్ (ప్రభుత్వానికి అన్నిరూపాలలో వచ్చే మొత్తం ఆదాయం) లో జాగీర్దారుల, ఇతర వ్యక్తుల స్వంత ఖర్చులు, సైన్యం నడపడానికయ్యే ఖర్చు, ఇనాముగా ఇచ్చిన భూముల రెమిషన్ పద్దులు, గ్రామాలు ఖాళీ చేసిన సందర్భాలలో పన్ను నుంచి ఆయా గ్రామాల మినహాయింపు పద్దు, పేష్‌కాష్ పద్ధతిపై ఇచ్చిన భూముల పన్ను ఆదాయ వివరాలు వాటి మినహాయింపులు పై బాకీ భూముల ద్వారా (రెవెన్యూ వసూలు చేసుకోవడానికి గాను మునసబుదారులకు కేటాయించడానికి రిజర్వుగా ఉంచిన ప్రభుత్వ భూములు – ఇవి సామాన్యంగా కొత్తగా గెలిచి ఆక్రమించుకున్న భూములో, జమీందార్లు, జాగీర్దార్లు చనిపోయినప్పుడు వారి నుంచి బదిలీ చేసుకున్న భూములో ఉండేవి) వచ్చే ఆదాయం పోగా ప్రభుత్వ ఖజానాకు జమ చేయాల్సిన మొత్తం వివరాలు ఉండేవి. ఒకసారి రెవెన్యూ యంత్రాంగం పన్ను నిర్ధారణ చేసిన తరువాత అందుకు అనుగుణంగానే పన్ను వసూలు జరుగుతుంది కాని, అందులో ఎలాంటి మార్పులు చేర్పులు చేసే అధికారం ఎవరికీ ఉండదు. గ్రామరెవెన్యూ యంత్రాంగం ప్రతినెలా పన్ను వసూలును సర్కారుకు పంపేది. సర్కారుల(జిల్లా) నుంచి అవి సుబాకు చేరేవి. శిస్తుగ్రహీతలు కూడా తమ దగ్గర వసూలయిన పన్ను మొత్తంలో తమ వంతుకు నమోదు కాబడిన మొత్తాన్ని మినహాయించుకొని మిగిలిన వసూలు మొత్తాన్ని నిజాము కేంద్ర ఖజానాకు జమచేయాలి. వీటితోపాటు జమీందార్లు, ఇతర అధికారం కలిగిన వ్యక్తులు మతసంబంధ కార్యాలకు ఇచ్చిన ఇనాము భూములలో ఏమైనా మార్పులు జరిపినా భూబదిలీలు జరిపినా ఆ వివరాలు కూడా నిజాముకు ప్రతి సంవత్సరం సమర్పించాలి.

శిస్తు గ్రామాలలో కాని, ఇతరచోట్ల గాని స్థూలంగా రెండు రకాలుగా ఉంటుంది.

1. మాల్ – పంటమీద వసూలు చేసే పన్ను. సాధారణంగా వర్షాధార పంటలకు నేల రకాన్ని, విస్తీర్ణాన్ని బట్టి పండిన పంటలో 1/3 వంతు నుంచి 1/2వంతు వరకూ శిస్తు నిర్ణయించేవారు. నిజాముల్–ముల్క్ పరిపాలనలో నీటిపారుదల వ్యవస్థలను ప్రభుత్వ పరంగానూ, ప్రైవేటువ్యక్తుల ద్వారానూ కల్పించడానికి విశేషంగా కృషి జరిగింది. తద్వారా వ్యవసాయాదాయం బాగా పెరిగింది. ప్రైవేటు వ్యక్తులు నీటిపారుదలను కలుగజేసిన భూములలో రైతులతో పాటు ప్రభుత్వం తన భూములకు కూడా నీరు పారించుకున్నా కూడా పదిశాతం (10 శాతం) పన్నును శిస్తురూపంలో వసూలుచేసేవారు. అదే విధంగా ఈ దసబంధం పన్నును ప్రభుత్వ నీటిపారుదల వ్యవస్థలకూ కూడా వర్తిస్తుంది. ఈ పన్ను పంట దిగుబడిపై, విస్తీర్ణం ఆధారంగా 10 శాతం వసూలు నిర్ధారింప జరిగేది.

బావుల ద్వారా, ఇతర నీటిపారుదల సౌకర్యాల ద్వారా కూరగాయలు, పండ్లు లాంటివి తోటలలో (భగత్) పండిస్తే పన్ను సుమారుగా 25శాతం నుంచి 50శాతం వరకూ వసూలు చేసేవారు. 1736–37 సంవత్సరాలలో లింగంపల్లి జిల్లా జమ–ఇ–కమిల్ రూ.53,628 అయితే అందులో కేవలం భగత్‌పద్దు కింద రావాల్సిన ఆదాయం రూ.14,322గా ఉంది. అంటే మొత్తం ఆదాయంలో 26.7 శాతంగా ఉంది.

2. ఇతర పన్నులు– వుజాహట్ – వ్యాపార లావాదేవీలు, మార్కెట్లు, ఇతర రవాణా సుంకాలు పట్టణాలలో కాని గ్రామాలలో కాని వృత్తికళాకారులు తయారుచేసిన కళాకృతులపై వ్యాపారం చేయడం వలన వచ్చే ఆదాయంపై విధించే పన్నును 'ముహరఫ' అంటారు. రహదారులలో సరుకుల రవాణాకు వసూలుచేసే తప్పనిసరి సుంకాన్ని 'సాయిర్ రహదారి' అంటారు. బజారులో సరుకులు అమ్మే వర్తకుల దగ్గరవారు పెట్టుకున్న స్థలంపై విధించే అద్దెను 'తెహ్–బజారి' అంటారు. 'కలాలి' అంటే పన్ను వసూలు చేసే గ్రామ సేవకులకు గ్రామస్థులు ఇచ్చే రుసుం. 'కాసుర్' అంటే తప్పులు, పొరపాట్లు, హెచ్చుతగ్గుల రూపంలో 5శాతం పన్నును తగ్గింపుగా తీసివేసిన పద్దు.

పన్నులోమెజారిటీ వాటాపంటపై వసూలు చేసే భూమిశిస్తే (మాల్) ఉండేది. మిగిలిన పన్నులు సహజంగా తక్కువగా ఉండేవి. 1736–37లో నల్గొండ సర్కారుకు అమిన్ గాను ఫౌజుదారు గాను ఉన్న మీర్‌మహమ్మద్ షరీఫ్‌ఖాన్ 'ఓరల్‌కొండ' పరగణాలో వసూలు చేసిన పన్ను వివరాలు ఇలా ఉన్నాయి–

| మాల్ | కలాలి | రహదారి | పట్టి (ఇతర పన్నులు) | మొత్తం |
|---|---|---|---|---|
| 981 (89.5%) | 53 (4.8%) | 26 (2.4%) | 35 (3.3%) | 1096 |

ప్రజలవద్ద నుండి పన్నుల వసూలు విధానం రెండురకాలుగా ఉండేది–

1. ప్రత్యక్ష వసూలు విధానం – ఉద్యోగులు, ఖిల్లాదార్లు, జాగీర్దార్లు, ఇతర పన్ను వసూల్ దార్లతో ప్రత్యక్షంగా డబ్బు రూపంలో

స్త్రీల విషయంలో సమాజంలో మౌలికంగా రావాల్సిన మార్పుతో పాటు భావజాలంలోను రావాల్సిన మార్పు గురించి వివరిస్తున్నారు **గైని రవీందర్, వడ్డెపల్లి లలిత, పంజాల అశోక్**

# స్వాతంత్ర్యానంతరం స్త్రీ స్థితి

**1949** లో శాఖాంతర, వర్ణాంతర వివాహాలు చట్టసమ్మతం చేస్తూ పార్లమెంట్ చట్టం చేసింది, హిందూ లా అంతటినీ క్రోడీకరించి ఒకే బిల్లుగా తయారుచేయాలని 1948 లో ప్రయత్నించగా ఆనాటి అధికార పక్షంలోని సనాతనవాదులు కొంతమంది అడ్డుకున్నారు. అప్పటికి ఆ ప్రయత్నం మానుకొని తరువాత దానిని నాలుగు ముక్కలుగా చేసి పార్లమెంట్ 1955-56లో చట్టాలు చేసింది. దాని ఫలితంగా 1955లో బహుభార్యాత్వాన్ని నిషేధించే చట్టం వచ్చింది. 1956లో భర్త ఆస్తిలో స్త్రీకి వాటా ఇస్తూ చట్టం వచ్చింది. 1961లో వరకట్న నిషేధ చట్టం వచ్చింది. అదే సంవత్సరం వ్యభిచార నిర్మూలనా చట్టం కూడా చేయబడింది. 1971లో కొన్ని సందర్భాలలో గర్భస్రావాన్ని ప్రభుత్వం చట్టసమ్మతం చేసింది. ఐక్యరాజ్యసమితి 1975వ సంవత్సరాన్ని మహిళా సంవత్సరంగా ప్రకటించింది. 1976లో సమాన పనికి సమాన వేతనం అనే చట్టం చేయబడింది. 1985 సెప్టెంబర్ 24న స్త్రీలకు తండ్రి ఆస్తిలో కుమారునితో సరిసమానంగా వాటా కల్పిస్తూ అప్పటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్.టి.ఆర్. శాసనసభలో బిల్లు ప్రవేశపెట్టి ఆమోదింపజేశాడు. దీనితో స్త్రీలకు మన రాష్ట్రంలో సంపూర్ణంగా ఆస్తి హక్కు వచ్చింది, ఈనాడు పురుషులకంటే స్త్రీకే ఆస్తి హక్కులు ఎక్కువ ఉన్నాయి. కానీ అవి సక్రమంగా అమలు జరగడం లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో స్త్రీవాద ఉద్యమాలు గురించి తెలుసుకొని అర్థం చేసుకోవాలంటే ముందు స్త్రీవాదం అంటే ఏమిటో తెలుసుకోవడం చాలా అవసరం. ఫెమినిజం అనే మాట మన ఆంధ్రదేశంలో గత 30 సంవత్సరాలుగా వినబడుతున్నా ఫెమినిజం సిద్ధాంతాన్ని తెలియజెప్పే ప్రామాణిక గ్రంథాలు చాలా తక్కువనే చెప్పాలి. ఫెమినిజానికి ఒక సిద్ధాంత స్వరూపమిచ్చి ఆ సైద్ధాంతిక బాటలో సమాజంలో సగమైన స్త్రీలు అనేక సామాజిక ఉద్యమాలను నడుపుతూ ఎన్నో విజయాలు సాధించారు.

ఫెమినిజం అంటే సిగరెట్లు తాగే, జుట్టు కత్తిరించుకునే, విశృంఖల స్వేచ్ఛను కోరే స్త్రీల గొడవ అని సాధారణ ప్రజానీకంతో పాటు విద్యాధికులు కూడా అనుకుంటారు. కాని ఇది పూర్తిగా అసత్యం. 'చారిత్రక అవగాహనతో స్త్రీల లొంగుబాటును విశ్లేషించి అది ఏ విధంగా తొలగించడానికి వీలవుతుందో తెలుసుకోవడమే ఫెమినిజం'. స్త్రీ జీవితంలో రాజకీయ, ఆర్థిక, లైంగిక, మానసిక అంశాలకి, స్త్రీల అనుభవానికి ఫెమినిజం మొట్టమొదటిసారిగా ఆలోచించడానికి బీజాలు వేసింది. ఫెమినిజం ప్రపంచాన్ని పునర్నిర్వచించి దాన్ని మానవతా దిశగా మలుపుతిప్పే ప్రయత్నం చేస్తుంది. ఆ దృష్ట్యా ప్రపంచ పురోగమనానికి ఫెమినిజం చాలా సహాయపడుతుంది.

గడచిన చరిత్ర మొత్తం పురుషానుభవాలను మాత్రమే పొందు పరచింది. నిర్లక్ష్యం చేయబడిన స్త్రీల చరిత్రను తిరిగి వెలికితెచ్చే ప్రయత్నం జరుగుతూ ఉంది. అటువంటి వారిలో 'ది క్రియేషన్ ఆఫ్ పెట్రియార్కీ' రాసిన గెర్డ్ లెర్నర్ ముఖ్యురాలు. ప్రపంచమంతా స్త్రీలు ప్రధానంగా నాలుగు పద్ధతుల్లో అణచివేయబడుతున్నారు. 1) ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి రంగంలో స్త్రీలకు ప్రాముఖ్యం లేకుండా చేయడం, 2) స్త్రీలను ఎక్కువగా సంతానోత్పత్తి సాధనాలుగా మాత్రమే పరిగణించడం. 3) స్త్రీల లైంగికత్వాన్ని క్రమబద్ధం చేసి అదుపులో పెట్టుకోవడం. 4) స్త్రీల పాత్ర పిల్లల్ని సాంఘిక జీవులుగా మలచడానికి మాత్రమే పరిమితం చేయడం.

అయితే ఈ కార్యక్రమాన్ని ప్రపంచంలోని అన్ని సంస్కృతులు, ధర్మాలు చాలా పకడ్బందీగా నిర్వహించాయి. చరిత్రలోని ప్రధాన నాగరికతలన్నీ పితృస్వామ్యాన్నే అవలంబించాయి. ఈ విషయం మనకు

---

పన్నును వసూలుచేసే విధానం. పన్ను వసూలుకు నియమింపబడిన వారు పన్నును సక్రమంగా వసూలు చేస్తానని, మొత్తం పన్ను వసూలు బాధ్యత తనదేననే అంగీకార పత్రాన్ని నిజాముకు రాసియివ్వాలి. 1723-24లో సికాకోల్ (శ్రీకాకుళం)కు అమిల్‌గా నియమించబడిన అన్వరుద్దీన్‌ఖాన్ పన్ను వసూలుకు తన అంగీకారాన్ని రాసిస్తూ, అందులో సగం మొత్తమైన రు.35,000 లను ప్రభుత్వ ఖజానాకు ముందుగానే జమచేశాడు.

2. పరోక్ష పన్ను వసూలు విధానం-పన్ను రూపంలో వసూలుచేసే డబ్బుకు బదులుగా ఉచితంగా వ్యవసాయం చేయించి పన్ను బకాయి దారులు, ఇతర రైతులనుండి పంటరూపంలో పన్ను వసూలు చేసే విధానం. ఇదిచాల తక్కువచోట్ల ఉండేది. అందులో కూడ ముఖ్యంగా నిజాం స్వంత భూములలో, ప్రభుత్వానికి చెందిన జాగీరు మహలులో, పన్నులు కట్టాల్సిన వ్యక్తులు లేదా రైతుల అనుమతి ముందుగా తీసుకొని, వారితోనే పన్నుకు బదులు వ్యవసాయం చేయించే పద్ధతి ఉండేది. ప్రభుత్వానికి సంబంధించిన ఈ భూములు సాధారణంగా మంచి సారవంతమైనవిగా ఉండేవి. ఉదాహరణకు రాజమండ్రి సర్కారులోని 24 మహలులలో 19 మహలులు ఖలీసా (ప్రభుత్వ భూములు) భూములుగా ఉండేవి. అదే మచిలీపట్నం సర్కారు లోని అన్ని మహలుల భూములూ ఖలీసా భూములే.

*(ఇంకావుంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

వీ

వెంటనే స్ఫురించాలంటే ఒక్కసారి మిలటరీ, పరిశ్రమలు, సాంకేతిక విజ్ఞానం, విశ్వవిద్యాలయాలు, శాస్త్ర పరిజ్ఞానం, రాజకీయాధికారం, ఆర్థిక రంగం గుర్తు తెచ్చుకోవాలి. అధికారంలోని ప్రతి మెట్టు మగవాళ్ల చేతుల్లోనే ఉంటాయి. అయితే ఈ అధికారాలని ఎప్పటికప్పుడు ఉపయోగిస్తూ స్త్రీలని అణచివేసే అవసరం లేకుండానే వాళ్లంతట వాళ్లుగా, ఆడవాళ్లే ఈ విభజనలోని పాక్షికతని ఒప్పేసుకునేలాగా చేస్తారు. చిన్నప్పటినుంచే సమాజాన్ని ఆడ, మగ, ప్రాంతాలుగా విభజించి వాళ్ళకి ఆ విభజనకనుగుణమైన పాత్రలిచ్చి, స్త్రీలని అవి చాలా సహజం అని భయపడేలాంటి శిక్షణ ఇస్తారు.

అందుకనే స్త్రీ పురుష పాత్రలను విభజించడంలో స్థూల విభజన చేసేసి అతి సులువుగా సైద్ధాంతిక ప్రతిపాదనలు చేసేవారు ప్రాచీన మేధావులు. ఈ సిద్ధాంతాలలో స్త్రీలను ప్రకృతికి దగ్గరగాను, పురుషుని సంస్కృతికి దగ్గరగానూ చూపెట్టే నేచర్/కల్చర్ సిద్ధాంతం ఒకటి కాగా, మరొకటి స్త్రీల పాత్రలను ఇంటికి పరిమితం చేసి గుర్తించే డొమెస్టిక్/పబ్లిక్ సిద్ధాంతం.

స్త్రీ తాలుకు శరీర నిర్మాణం, సంతానోత్పత్తి ఆమెను ప్రకృతికి దగ్గరగా ఉన్నట్టు కన్పింపజేశాయని స్త్రీలలాకాక మగవాళ్లు ఉత్పత్తికై వేరేగా సాంస్కృతికమైన ప్రయత్నాలు చేస్తారని అది సాంఘిక, రాజకీయ జ్ఞానాలుగా మలచబడుతుందన్నది ఈ సిద్ధాంతంలోని విషయం. ఈ సిద్ధాంతం గ్రీకుల కాలం నుండి పాశ్చాత్య వేదాంతంలో చోటు చేసుకుంది. దీనిని షెర్రీ – ఆర్ట్నర్ తీవ్రంగా ఎదుర్కొంది. స్త్రీలు పిల్లల్ని కనడం, వాళ్లను పెంచడం, వీటివల్ల ఎక్కువగా గృహ వాతావరణానికి అంటిపెట్టుకొని ఉండడం మూలంగా ఆవిడ వ్యవహారాలన్నీ కుటుంబం లోను, కుటుంబాల మధ్య సంబంధాలతోను నిండి ఉంటాయి. దీనికి విరుద్ధంగా మగవాళ్ల సాంఘిక జీవితంలో రాజకీయాలు మొదలయినవి చోటు చేసుకుంటాయి.

పై ప్రతిపాదనమీద కూడా విమర్శ ఉంది. అయినప్పటికి ఇది ఆడ, మగ శబ్దాలకి ప్రతీకలుగా వాడే పదాలని గురించి ఆలోచించడానికి అవి స్వతఃసిద్ధమైన శారీరక లక్షణాలు కావని, సాంస్కృతిక భావజాలమని తెలుసుకోవడానికి తోడ్పడుతుంది. అంతేకాక సంస్కృతీ నిర్మాణంలో స్త్రీ పురుషులిద్దరూ ఎలా చూడబడతారు అనే విషయమై చర్చకి కూడా ఇది నాంది పలికింది.

ఇంటికి సంబంధించి/ బయటికి సంబంధించినందునే స్త్రీ పురుషుల మధ్య ఉన్న ఈ విభజన కూడా ప్రకృతి/సంస్కృతి లాగే తల్లిగా పిల్లల్ని పెంచే స్త్రీ పాత్రని దృష్టిలో పెట్టుకొనే వచ్చింది. తల్లి–బిడ్డలు, వారిచుట్టూ, అల్లబడిన పనులూ, సంస్థలూ ఇవన్నీ 'డొమెస్టిక్ గానూ', ఆ తల్లి బిడ్డను తమలో కలుపుకోవడానికి, హోదా ఇవ్వడానికి, నిర్వహించడానికి పనికి వచ్చే సంస్థలూ, వ్యవహారాలూ 'పబ్లిక్' గాను రోసాల్డో నిర్వచిస్తుంది.

వివాహం తరువాత ఆడవాళ్లు ఒక కూటమి నుండి ఇంకో కూటమికి మార్పిడి అవుతారు. ప్రపంచంలోని చాలా సమాజాల్లో వివాహ పద్ధతులన్నీ పితృస్వామ్య నిర్మితాలే. వివాహం జరిగాక ఆడవాళ్లు తమ జన్మ సంబంధాలను వదలుకుని మగవాడి వెంట వెళ్లడం వలన తమపూర్వ సంబంధాల విచ్ఛిత్తి మూలంగా వాళ్లు తమ భర్తలపైన అన్ని విషయాలకీ ఆధారపడతారు. ఇలా ఆధారపడడంలోని ద్వంద్వ నీతిని గమనించకుండా ఉండడం కోసమూ, ప్రశ్నించకుండా ఉండడం కోసమూ ధర్మాలు, పాతివ్రత్యం దాన్ని మూలంగా చేసుకొని చెలామణీ అవుతున్న ఇతర భావజాలమూ పురుషులకు పనికొస్తాయి. అయితే అటువంటి యువకులకి మాత్రం భార్యలాగా వివాహం వలన తన జన్మ సంబంధాలకి దూరమయ్యే అవసరం సాంస్కృతికంగా ఉండదు. ఇది ప్రపంచవ్యాప్తంగా చాలాచోట్ల అమలులో ఉన్న పద్ధతి. పెళ్లికాగానే ఆడవాళ్లు అంతవరకూ ఉన్న ఇంటి పేరు మార్చుకోవడం, తాను ఎంత చదువుకుని సాంఘిక పాత్రని సమర్థవంతంగా నిర్వహించగలిగినప్పటికీ అవేమీ చేయకుండా, కుటుంబమూ, భర్త తనకి నిర్దేశించిన స్థానంలో ఇమిడిపోవడమూ మనం చూస్తూనే ఉన్నాం, అలా కాకుండా స్త్రీలు చొరవ తీసుకొని నిర్ణయాలు తీసుకున్నట్లు కన్పిస్తే వాళ్ళు సాంప్రదాయాన్ని ధిక్కరించిన వాళ్ళుగానూ, తలబిరుసు గల వాళ్లుగా, నమ్రత లేనివాళ్ళుగా గుర్తింపబడడం మనం గమనించవచ్చు అందువల్ల ఈ ఇబ్బందులేవీ ఎదుర్కోవడానికి ఆడవాళ్లు ఎక్కువగా సంసిద్ధులు కారు. దీనివల్ల ఆడవాళ్ల స్థానం సహజంగానే వెనక్కి నెట్టివేయబడి, ప్రాముఖ్యతని కోల్పోతుంది.

అలాగే పురుషస్వామ్యంలో స్త్రీల లైంగికత్వానికి ఏ విధమైన ప్రాముఖ్యతా ఉండదు. పెళ్లి సంబంధాలు కుదర్చడంలో మానసికమైన అంశాలకి ప్రాధాన్యత చాలా తక్కువగా ఉంటుంది. మగవాళ్లతో పోలిస్తే వివాహ విషయాల్లో ఆడవాళ్లకుండే ఇష్టాయిష్టాలు, స్వేచ్ఛ చాలా పరిమిత మైనవి. దీనివలన అటు తర్వాత జీవితంలో ఏర్పడే అనేకమైన మానసిక సమస్యలని వాస్తవంగా ఎదుర్కోవడంలో ఆడవాళ్లు విఫలమవుతూ ఉంటారు. ఇలాంటప్పుడు పెళ్లి కుదిర్చిన పెద్దలుగాని, కుటుంబంగాని రాజీ ధోరణి అవలంబించడమో, వాళ్లని మరింతగా ధర్మచట్రాల పరిధిలో బిగించడమో చేస్తారుగానీ, వాళ్ల సమస్యలకి ఏ విధంగానూ తోడ్పడరు. ఈ పరిస్థితి ఆడవాళ్లలో అనేక మానసికమైన మార్పులకు కారణమవుతుంది. ఇది క్రమంగా శారీరకమైన వ్యాధులకు దారితీస్తుంది.

ఎంగెల్స్ అభిప్రాయపడినట్టు పితృస్వామ్యమూ, పెట్టుబడిదారీ వ్యవస్థా, వ్యక్తిగత ఆస్తీ ఉన్న వ్యవస్థని కూలదోయడం స్త్రీల విముక్తిలో చాలా ముఖ్యమైన అంశమైనప్పటికీ ఈ విప్లవాత్మక చర్య ఒక్కటే స్త్రీ విముక్తికి పరిష్కారం కాదని దీనితోపాటు చాలా సంయమనంతోనూ, ఆలోచనాత్మకంగానూ స్త్రీ పురుషుల మధ్య మానసికమైన మార్పు అంత ప్రధానంగానూ రావాలి అనేది స్త్రీ వాదుల భావన. భౌతికంగా అంతర్గతంగా వ్యవస్థలో పైన ఎంగెల్స్ చెప్పిన మార్పు ఎంత ముఖ్యమో, సమాజంలోని భావ పరివర్తన కూడా అంతే ముఖ్యం. సమాజంలోని అన్ని రంగాలనుంచీ ఈ మార్పు రావాలి.

స్త్రీ విముక్తి కోసం ఆలోచించే ఫెమినిజం స్త్రీల ఆధీక్యతని ఏరకంగానూ బలపరచదు. స్త్రీ పురుష సమానత్వాన్ని మాత్రమే ఫెమినిజం కోరుకుంటుంది. చట్టపరంగా సమాన హక్కులు లభించినా, సాంఘిక, ఆర్థిక, మానసికమైన విషయాల్లో, మార్పులు తేలేకపోతే ఈ అసమానతలు ఎప్పటికీ కొనసాగుతూనే ఉంటాయి. అయితే కొందరు ఫెమినిజాన్ని మధ్యేమార్గపు రాజకీయ స్థితి అనే అనుమానాలను వ్యక్తం చేస్తున్నారు. కానీ ఇది ఫెమినిజాన్ని తప్పుగా అర్థం చేసుకోవడమే, తమ అణచివేతకు గల కారణాలని, తమ ఆలోచనలని సైద్ధాంతికంగా నిర్వచించడానికి స్త్రీలు చేసే ప్రయత్నమే ఫెమినిజం, స్త్రీ పురుష భేదాలు ప్రకృతిపరంగా ఉన్నప్పుడు స్త్రీ పురుషుల మధ్య ఈ తేడాలు ఉన్నవని ఒప్పుకోవడంలో జరిగే నష్టం ఏమీ లేదు. అలాంటప్పుడు స్త్రీలుగా తమ అనుభవాలని, తమ ఆలోచనలని చెప్పుకోగల అవకాశం ఆడవాళ్లకి ప్రత్యేకంగా ఉండాలనుకోవడంలో పొరపాటు లేదు. అందువల్ల ఫెమినిజం గురించి అపోహలని తొలగించుకొని, ఫెమినిస్టు దృక్పథాలనీ, వారి సైద్ధాంతిక విశ్లేషణలనీ అధ్యయనం చేయడం అభ్యుదయ దృక్పథం ఉన్నవాళ్లు చేయాలి.

*(రచయితలు కాకతీయ విశ్వవిద్యాలయ విద్యార్థులు)* వీ

మత విశ్వాసాలు ఒక సామూహిక ఆచరణగా మనసు పై కలిగించే ప్రభావాన్ని, అవి పాలకవర్గాలకు ఉపయోగ పడే విధానాన్ని వివరిస్తున్నారు **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# మతాల హిప్నాసిస్

మతభావనలను గురించి హేతువాదులు తీవ్రంగా విమర్శిస్తూ ఉంటారు. ఎవరేం చెప్పినప్పటికీ సామాన్య ప్రజలని మతం తీవ్రంగా ప్రభావితం చేస్తుందనడంలో సందేహంలేదు. దీనికిగల కారణాలు కొన్ని చారిత్రకమైనవి, ఇంకొన్ని సామాజికమైనవి, మరికొన్ని నాడీవ్యవస్థకు సంబంధించినవీను. కారణాలేవైనప్పటికీ మానవచరిత్రలో ఒకప్పుడు మతం చాలా ముఖ్యభూమికను నిర్వహించిందనడంలో సందేహం లేదు. ప్రకృతిని గురించిన అవగాహన అసమగ్రంగానూ, అస్పష్టంగానూ ఉన్న దశలో కొద్దికొద్దిగా పరిపక్వత చెందుతున్న మానవమేధస్సు అతీత శక్తులను గురించి ఉన్నవీ, లేనివీ కల్పించుకుని ఒక ప్రాపంచిక దృక్పథాన్ని రూపొందించుకుంది. ఇందులో అయోమయం ఎంత ఉన్నప్పటికీ ఇది ఆదిమసమాజాన్ని ఏకంచేసి, ప్రకృతి శక్తులది పైచెయ్యి అయిన దశలో మనుషులకు స్థైర్యాన్ని సమకూర్చిపెట్టింది.

ఇప్పటి లెక్కన ఆటవికదశలో మొదలైన పూజలూ, తంతులూ మనుషులకు కొంత అంతర్‌దృష్టిని కలిగించాయి. దానివల్ల వారి ఊహా శక్తి పెరిగింది. ఏ తెగకాతెగగా ఏకమైన మానవ సముదాయాలు కలిసి కట్టుగా గుహలవంటి ప్రదేశాల్లో మత ప్రక్రియల్లో పాల్గొనేవారు. ఆ చీకటి గుహల్లో వారు వెలిగించిన దీపాల వెలుగులో గోడలమీద గీసిన జంతువుల బొమ్మలు కదులుతున్న భ్రాంతి కలిగేది. వారు మోగించిన తప్పెటలూ, చరిచిన చప్పట్లూ, ఉచ్చరించిన రకరకాల శబ్దాలూ అన్నీ మారుమోగి అందరినీ ఒకరకమైన హిప్నాసిస్‌కు గురిచేసేవి. ఇదంతా వారిపై తీవ్రమైన ప్రభావం కలిగించిందనడంలో సందేహం లేదు. కొద్దిపాటి తేడాలతో ప్రపంచమంతటా ఇదే రకమైన పరిణామాలు జరిగాయని ఊహించవచ్చు. ఒకరికొకరు తారస పడినప్పుడు వివిధ తెగలు త్వరలోనే ఈ సంప్రదాయాలను అనుకరించి ఉంటారు.

ప్రపంచంలో వేలసంవత్సరాలుగా మతవిశ్వాసాలు ప్రచారంలో ఉంటూనే ఉన్నాయి. మతాలనేవి లేకుండా మనుషులకు జరగదనే నమ్మకానికి కారణం అదే. ప్రతి ప్రాంతంలోనూ తరతరాలుగా భగవంతుడి గురించీ, ఆధ్యాత్మికవిషయాల గురించీ దాదాపుగా ఒకే రకమైన భావాలు ప్రజల మనసుల్లో బలంగా నాటుకుని ఉన్నాయి. చిన్నప్పటినుంచీ ఇటువంటి ప్రభావానికి లోనయినవారికి వీటిని వదిలించుకోవాలంటే చాలా కష్టంగా అనిపిస్తుంది. అదీకాక ఇవన్నీ ప్రజల స్థానిక సంస్కృతీ సంప్రదాయాల్లో కలిసిపోయి ప్రతి సముదాయానికీ ఒక స్పష్టమైన గుర్తింపునిస్తాయి. మనదేశంలో దేవాలయాలే సమాజానికి సాంస్కృతిక కేంద్రాలుగా ఉండేవి.

జరిగినదేమిటంటే ఆదిమయుగంలో మతపరమైన భావనలు మనుషుల భావాలను ఎంత బలంగా ప్రభావితం చెయ్యగలవో గమనించిన పాలకవర్గాలన్నీ వీటిని తమకు పనికొచ్చే విధంగా వాడుకున్నాయి. ఇటువంటి ప్రతిపాదన ఏదో కమ్యూనిస్ట్ ప్రచారంలాగా అనిపిస్తుంది కాని ఇందులో అబద్ధమేమీ లేదు. ఉదాహరణకు క్రీ.పూ. రెండో శతాబ్దపు గ్రీక్ చరిత్రకారుడు పాలీబియస్ అప్పుడే మొదలైన రోమన్ సామ్రాజ్యం గురించి వివరిస్తూ "రోమన్ వ్యవస్థయొక్క ఔన్నత్యానికి ఆధారం మూఢ విశ్వాసాలే. ఊహల్లో, భావనల్లో సంభ్రమాశ్చర్యాలని కలిగించడానికి వ్యక్తిగత, సమష్టి జీవితాల్లోని ప్రతి అంశంలోనూ అవకాశం ఉన్నప్పుడల్లా వీటిని చొప్పించడం జరిగింది. ఏ ప్రాంతంలోనైనా సరే పామర జనానికి నిలకడ అనేది ఉండదు. వారికి ఉండేవల్లా అదుపులేని కోరికలూ, అర్థంలేని కోపాలూ, హింసాత్మక ఆవేశాలూను. వారిని అదుపులో ఉంచాలంటే కానరాని శక్తులపట్ల భయాలూ, తంత్రాలూ కలిగించడం అవసరం. భగవంతుడి గురించీ, మరణాంతర జీవితం గురించీ మన ప్రాచీనులు వారిలో భయాలు సృష్టించి పెట్టారంటే అదంతా తెలిసి చేసిన పనే" అని స్పష్టంగా చెప్పాడు.

మొరటుగా చెప్పాలంటే ప్రపంచాన్ని చూసినప్పుడల్లా వెర్రిబాగుల ప్రజానీకానికి ఎలాగో బెంబేలెత్తుతూ ఉంటుంది కనక వారిని ఆ అయోమయ పరిస్థితిలో కొనసాగనివ్వడమే పాలకవర్గానికి మంచిది. ఆ విధంగా అదుపు చేసిన పామరులు "బుద్ధిగా" మసలుకుంటూ సమాజ ప్రగతికి కారణ మయారు. ప్రకృతిలోని "వింతలకు" భయాందోళనలతో ఎవరికి తోచిన విపరీతపద్ధతిలో వారు స్పందించకుండా అందరూ ఒకే రకమైన (అబద్ధపు) విశ్వాసాలకు కట్టుబడ్డారు. చట్టానికి భయ పడనివారు సైతం దైవభీతివల్ల నీతికి తలఒగ్గడం జరిగింది. అందువల్ల సమాజంలో చాలావరకూ ప్రశాంతత ఏర్పడింది.

అన్యాయం జరిగినప్పుడల్లా బడుగువర్గాలవారు తిరగబడకుండా 'అతీతశక్తుల'పై నమ్మక ముంచి సహిస్తూ ఊరుకున్నారు. ఇలా జరగడం మంచిదా కాదా అన్న చర్చ ఇప్పుడు అనవసరమే కాని విజ్ఞానం వికసించిన ఆధునికయుగంలో జరిగినదాన్ని పునర్విమర్శ చేసుకోక పోవడం పొరబాటే అవుతుంది. ముఖ్యంగా మతం గురించిన తొలి భావనలన్నీ ఒకవిధమైన హిప్నాటిజంద్వారా రూపొందినవనేది గమనించాలి.

నిపుణులైన బి.వి. పట్టాభిరాం వంటివారిద్వారా హిప్నాటిజం అంటే ఏమిటో ఈ రోజుల్లో అందరికీ అర్థం అవుతోంది. హిప్నాసిస్‌కు లోనయిన మెదడు ఒకే ధోరణి కలిగిన ఆలోచనావస్థలో నిమగ్నమై, తక్కిన ప్రేరణలకు ఏ మాత్రమూ స్పందించకుండా ఉండిపోతుంది. ఆధునిక పద్ధతుల్లో హిప్నాసిస్ జరిగేటప్పుడు వ్యక్తులని విశ్రాంతిగా చీకటిలో కూర్చోబెట్టి, శక్తివంతమైన కాంతివంటి దాని కేసి

చూడమంటారు. హిప్నొటైజ్ చేస్తున్న వ్యక్తి మంద్రస్థాయిలో సూచనలను అందిస్తూ ఉంటాడు. మాటలను మళ్ళీ మళ్లీ పలకడం, హిప్నొటైజ్ చేస్తున్న వాడిమీద నమ్మకం ఉండడం హిప్నొటైజ్ అవడానికి తోడ్పడతాయి. చిన్నపిల్లలని జోకొట్టిన పద్ధతిలో మనసును నిద్రాణ స్థితిలోకి తీసుకెళతారు. మత ప్రార్థనల ప్రభావం ఇటువంటిదే. మూకుమ్మడిగా ప్రార్థనలూ, ఉచ్చాటనలూ చేయించే మత ప్రచారకులు ఒకేసారిగా అనేకమందిని హిప్నొటైజ్ చెయ్యగలరు. ఏ రకమైన వైవిధ్యమూ లేకుండా ఒకే స్థాయిలో ఉపన్యాసం దంచే టీచర్లు విద్యార్థులను నిద్రలోకి నెట్టడం మనకు తెలిసినదే. శారీరకంగా చూస్తే ఇటువంటి సుప్తచేతనావస్థకూ, సారాయి, గంజాయి వగైరాలవల్ల కలిగే మత్తుకూ పెద్దగా తేడా ఉండదు.

ఆటవికపూజల్లో గణాచార్లైనా, భక్తులను సంబోధించే ఆధునిక మతప్రచారకులైనా అవలంబించే పద్ధతుల్లో శ్రోతలనూ, ప్రేక్షకులనూ హిప్నొటైజ్ చేసే అంశాలు తప్పనిసరిగా ఉంటాయి. వీటిని సరిగ్గా గుర్తించనివారు అదంతా అతీతశక్తుల ప్రభావమేననుకుంటారు. తమాషా ఏమిటంటే వక్తలుకూడా అదే అపోహ కలిగి ఉంటారు. వ్యాపారంలోనూ, రాజకీయాల్లోనూ, వైద్యుల్లోనూ, ఇతరులని ప్రభావితం చేసే నాయకుల్లోనూ కూడా హిప్నొటైజ్ చేసే వైఖరి కొంతవరకూ పనిచేస్తుంది. ఇందులో వారు ఉపయోగించే మాటలూ, చేతలూ, వేషధారణా అన్నీ కలిసి ఉంటాయి. కొద్దిమందితప్ప మతవిషయాల గురించి ప్రసంగించే వారికి సామాన్యంగా కొంత ప్రత్యేకత కనిపిస్తూ ఉంటుంది. వింతచేష్టలూ, వాడి చూపులూ, కుంకంబొట్లూ, కంఠస్వరంలోని హెచ్చుతగ్గులూ అన్నీ వేరుగా ఉంటాయి. సత్యసాయిబాబావంటి వాడు మామూలు దుస్తులు ధరించి, జుట్టు కత్తిరించుకుని బోధలు చెయ్యడానికొస్తే జనం మెచ్చరు.

క్రైస్తవ ప్రచారకులు కొందరు గట్టిగా అరవడమూ, ఒకటే పదాలను మళ్లీమళ్లీ ఉచ్చరించడమూ, ప్రేక్షకులను ఊదరగొట్టి భయభ్రాంతులకు గురిచెయ్యడమూ కద్దు. ఎడతెగని ఈ దాడివల్ల వినేవారి చెవులకూ, చూసేవారి కళ్లకూ అలసట కలుగుతుంది. అసలే మానసికంగా లొంగడానికి సిద్ధంగా ఉన్న ప్రేక్షకులను ఈ పరిస్థితి మరింతగా కుంగదీస్తుంది. మన పద్ధతుల్లో గట్టిగా మోగే గుడిగంటలూ, అర్చకుల మంత్రాల ఆర్భాటమూ, అగరువత్తుల పొగా అన్నీ కలిసి ఒక ప్రత్యేక వాతావరణాన్ని సృష్టిస్తాయి. సినిమా దృశ్యాలకు నేపథ్య సంగీతం తోడైనట్టుగా ఇంద్రియాలపై ఈ ప్రేరణలన్నీ బలంగా పనిచేస్తూ ఉంటాయి. అన్నిటికన్నా ముఖ్యవిషయం ఏమిటంటే వీటికి గురవుతున్న వారు ఎటువంటి విమర్శనాత్మకధోరణీ లేకుండా లోబడడానికి సిద్ధమైమరీ వస్తారు. పూర్వకాలపు క్రూరమైన తంతుల్లో నరబలివంటివి జరుగుతున్నప్పుడు బలి కాబోతున్నవారుకూడా మారుమాట్లాడకుండా వధ్యస్థానానికి వచ్చేవారంటే ఈ హిప్నొసిస్ ఎంతదాకా వెళుతుందో అర్థం చేసుకోవచ్చు.

పల్లెటూళ్ళ జాతరల్లో తప్పెటల మోతలూ, జంతుబలుల గోలా వగైరాలన్నీ ఉంటాయి కాని అహింసకూ, ప్రశాంతతకూ చిహ్నాలైన దేవాలయాల్లో ఇదంతా జరుగుతుందనడం అతిశయోక్తిలా ఉంటుంది. కాని అక్కడి పద్ధతుల్లో బ్రహ్మోత్సవాలూ, ఊరేగింపుల ఆర్భాటమూ, ధూపదీప నైవేద్యాలూ, మంత్రోచ్చారణా, గంటల, శంఖాల మోతలూ వగైరాల హడావిడి ఉండనే ఉంటుంది. పైగా అక్కడికి వచ్చేవారంతా మతవ్యవస్థకు నిరభ్యంతరంగా వత్తాసు పలికేవారే.

మతప్రచారంలోని మరొక అంశం మనుషులను చిన్నస్థాయికి కుదించడం. ప్రాచీన ఈజిప్ట్ నాగరికతలోనైనా, అమెరికాఖండాల్లోని ఆదిమతెగల పద్ధతుల్లోనైనా, మన దేవాలయాల్లోనైనా సరే నిలువెత్తు విగ్రహాలూ, పెద్దపెద్ద గోపురాలూ తప్పనిసరిగా ఉంటాయి. ఏ గోమటేశ్వరుడి విగ్రహం ఎదుటనో నిలబడ్డవాడికి దైవికశక్తి" తనకన్నా ఎంత పెద్దదో కళ్ళకు కట్టినట్టుగా అనిపిస్తుంది. మన దేవుళ్ళుకూడా మనుషుల అవతారాలు ఎత్తినప్పటికీ సందర్భానుసారంగా అప్పుడప్పుడూ భక్తులకు తమ "విశ్వరూపం" చూపిస్తూ ఉంటారు. సామాన్యులను అణచిఉంచడానికి అవసరమైన పద్ధతులన్నీ ఎప్పుడో అమలులోకి వచ్చేశాయి.

ఖైదీల చేత నిజం ఒప్పించడానికి పోలీసులు ఉపయోగించే అమానుష పద్ధతులన్నీ పరోక్షంగా మతప్రచారంలోకూడా పనిచేస్తాయి. అందులో కీలకమైనది అందినవారిని ముందుగా మానసికంగా బలహీనుల్ని చెయ్యడం. అలాగే ప్రమాదకరమైనవీ, క్రూరమైనవీ అయిన వన్య ప్రాణులని మచ్చిక చెయ్యడానికీ, తమపై తిరగబడకుండా చూడడానికీ వాటికి శిక్షణనిచ్చేవారు కొన్ని పద్ధతులని అవలంబిస్తారు. వాటిని భయపెట్టి, కంగారుపెట్టి, చీకాకుపరచడానికి రకరకాల చప్పుళ్లు బిగ్గరగా చేస్తూ ఉండడం, సర్కస్ వంటి వాటిలో బేండ్ మోతలు మోగిస్తూ ఉండడం అందులోని భాగాలే. మనుషుల భావాలను అనువుగా మల్లించడానికి కూడా ఇటువంటి పద్ధతులు పనికొస్తాయి. మతాలన్నీ బలపడిన ప్రస్తుతకాలంలో ఇంతగా శ్రమపడనవసరంలేదుగాని మతభావనలు మొదటగా తలెత్తిన యుగంలో ఇవి పనిచేశాయని ఊహించవచ్చు. అప్పటి పూజల తంతుల్లో చిందులు వెయ్యడమూ, తప్పెటలూ, రకరకాల చిప్పతాళాలూ మోగించడమూ ఎక్కువగా ఉండేది. ఇవన్నీ భక్తుల్లో ఒకరకమైన పూనకాన్నీ, మత్తునూ కలిగించేవి.

అన్నిటికన్నా ముఖ్యమైనది కళ్లుమూసుకోవడం. దృష్టికి సంబంధించిన ప్రేరణలు లేని పరిస్థితిలో మెదడు హిప్నొటైజ్ కావడం మరీ తేలిక అవుతుంది. తలవంచడమూ, నమస్కరించడమూ, మోకరిల్లడమూ, సాష్టాంగ పడడమూ అన్నీ మానసికమైన లొంగుబాటుకు శారీరక నిదర్శనాలే. సామాన్యంగా పూజల్లో ఒక్కరూ పాల్గొనడం అరుదుగా జరుగుతుంది. వందలూ, వేలసంఖ్యలో సాటివారంతా పూజలు చెయ్యడం, ఊరేగింపుల్లో తిరగడం మాస్ హిస్టీరియాను కలిగిస్తాయి. ఇలాంటివి ఒకవంక ఐకమత్యభావననూ, సంఘటితం అయిన వైఖరినీ కలిగిస్తాయనేది నిజమే. కాని పాతుకుపోయిన వ్యవస్థకు ఎదురు చెప్పకుండా గుడ్డిగా అనుసరించే గొర్రెలమంద మనస్తత్వానికి బలం చేకూరడం కూడా జరుగుతుంది.

ఈ సమావేశాల్లో పాల్గొంటూ భక్త్యావేశంతో ఊగిపోయేవారికి ఒళ్లుతెలియదు. బుగ్గల్లోనూ, నాలుకమీదా, శరీరంమీదా సూదులూ, శూలాలూ గుచ్చుకు తిరిగేవారూ, నిప్పులమీద నడిచేవారూ, రక్తం కారేటట్టు కొరడాలతో తమను తాము కొట్టుకునేవారూ, కేకలుపెడుతూ, ఊగిపోతూ, నోట్లో నురగలు కక్కుకుని నేలమీదపడి గుడ్లు తేలవేసేవారూ అందరూ హిప్నొసిస్‌లోని వివిధ దశలను సూచించేవారే. ఇందులో అతీంద్రియ శక్తుల ప్రమేయమేదీ ఉండదు. మతభావనలన్నీ మెదడులోని వివిధ భాగాలూ, నాడీకేంద్రాలూ కలిగించే చిత్తభ్రమే. 'స్వేచ్ఛగా' మతాలను అవలంబిస్తున్నా మనుకునేవారు ఈ వాదనతో ఏకీభవించక పోవచ్చుగాని వారిమీద కొన్ని వందలతరాల సామాజిక ప్రభావం ఉందనేది వారు గుర్తించరు.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## గోధ్రా కేసులో మరణ శిక్షలు

ఫిబ్రవరి 27, 2002న జరిగిన గోధ్రా రైలు దహనం ఘటనలో 59 మంది మరణించారు. ఈ కేసుపై అహ్మదాబాద్ సబర్మతీ సెంట్రల్ జైలులోని సెషన్స్ కోర్టు ఫిబ్రవరి 22న వాదనలను పూర్తి చేసి తీర్పునిచ్చింది. ఈ కేసులో న్యాయస్థానం 253 మంది సాక్షులను విచారించింది. మొత్తం 94 మంది నిందితుల్లో 63 మందిని కోర్టు నిర్దోషులుగా ప్రకటించింది. 31 మందిని దోషులుగా గుర్తించింది. అందులో 20 మందికి యావజ్జీవ శిక్ష విధించింది. 11 మందికి మరణ శిక్ష విధించింది. ఈ కేసు విచారణకు 9 సంవత్సరాల కాలం పట్టింది. ఇదే కేసులో రెండు కమిషన్లు రెండు వాదనలు వినిపించాయి. గుజరాత్ ప్రభుత్వం వేసిన నానావతి కమిషన్ రైలు దహనం కుట్ర అని పేర్కొంది. అప్పటి రైల్వే శాఖ మంత్రి లాలు ప్రసాద్ యాదవ్ నియమించిన యు.సి. బెనర్జీ కమిషన్ మాత్రం ఈ దుర్ఘటన ప్రమాదవశాత్తు జరిగిందని నివేదిక ఇచ్చింది.

## ఐదు రాష్ట్రాల్లో ఎన్నికలు

ఐదు రాష్ట్రాల ఎన్నికల షెడ్యూల్‌ను ఎన్నికల ప్రధాన కమిషనర్ వై.వి. ఖురేషీ ఫిబ్రవరి 28న ప్రకటించారు. ఐదు రాష్ట్రాల్లో పది విడతలుగా ఎన్నికలు జరుగనున్నాయన్నారు. తమిళనాడు, పుదుచ్చేరి, కేరళలో ఏప్రిల్ 13న పోలింగ్ జరుగుతుందని ప్రకటించారు. ఈశాన్య రాష్ట్రమైన అసోంలో పోలింగ్ రెండు విడతల్లో ఏప్రిల్ 4,11 తేదీల్లో జరుగనుందన్నారు. పశ్చిమబెంగాల్‌లో ఆరు విడతలుగా ఏప్రిల్ 18, 23, 27, మే 3, 7, 10 తేదీల్లో పోలింగ్ జరుగనుందన్నారు. ఎన్నికలు జరుగుతున్న ఐదు రాష్ట్రాల్లో 14.39 కోట్ల మంది తమ ఓటు హక్కును వినియోగించుకుంటారన్నారు. మే 13న ఫలితాలను ప్రకటిస్తారు.

## ముగిసిన బోఫోర్స్ కేసు

1980లో బోఫోర్స్ శతఘ్నుల కొనుగోలులో ఒట్టవియో క్వత్రోచికి ముడుపులు అందయాన్న ఆరోపణలకు సంబంధించిన కేసు గత 25 సంవత్సరాలుగా కొనసాగుతుంది. క్వత్రోచీపై దాఖలు చేసిన అభియోగాలను ఉపసంహరించుకునేందుకు మార్చ్ 3న ఢిల్లీలోని తీస్‌హజారీ కోర్టు మెజిస్ట్రేట్ వినోద్ యాదవ్ సి.బి.ఐ.కి అనుమతి ఇచ్చారు. 25 ఏళ్లుగా నడుస్తున్న ఈ కేసుకు రు. 250 కోట్ల ఖర్చు అయ్యింది.

## థామస్ నియామకం చెల్లదు

అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న పి.జి. థామస్‌ను కేంద్ర విజిలెన్స్ కమిషనర్‌గా నియమించడం చెల్లదంటూ సర్వోన్నత న్యాయస్థానం తీర్పునిచ్చింది. క్రిమినల్ కేసు ఎదుర్కొంటున్న వ్యక్తిని సి.వి.సి.గా నియమించడంపై ప్రధాని నేతృత్వంలోని ఉన్నత స్థాయి కమిటీని తప్పుపట్టింది. వ్యవస్థాగత, వ్యక్తిగత నైతిక నిష్ఠలు సి.వి.సి. నియామకానికి గీటురాయిగా ఉండాలని సుప్రీంకోర్టు అభిప్రాయపడింది.

## 2011-12 బడ్జెట్

కేంద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ 2011-12 ఆర్థిక సంవత్సర బడ్జెట్ ఫిబ్రవరి 1న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టారు. సాధారణ ప్రజల బతుకులను దుర్భరం చేస్తున్న నిత్యావసరాల ధరలు, దేశీయ ఆర్థిక రంగాన్ని విశేషంగా ప్రభావితం చేస్తున్న అంతర్జాతీయ ముడి చమురు ధరలు, దేశ ప్రజల ఆగ్రహానికి కారణమైన అవినీతి, న్యాయస్థానాలు కూడ అడుగుతున్న నల్లధనంపై బడ్జెట్‌లో స్పష్టంగా ఎక్కడాలేదు. వ్యవసాయం, మౌలిక వసతుల రంగానికి కొంత ప్రాధాన్యత నిచ్చే ప్రయత్నం చేశారు. రు. 12,57,729 కోట్లతో 2011-12 బడ్జెట్‌లో ద్రవ్యలోటు 4,12,817 కోట్లు వృద్ధి రేటు 8.9 శాతం.

## లైంగిక నేరాలకు ఏడేళ్ల జైలు

పదహారేళ్ల లోపు బాలలపై హింస, అత్యాచారం, లైంగిక వేధింపులకు పాల్పడేవారికి ఇకపై 5 నుండి 7 సంవత్సరాల జైలు శిక్ష, రు. 50 వేల జరిమానా విధించబడుతుంది. ఈ మేరకు ప్రత్యేకంగా రూపొందించిన లైంగిక నేరాల నుంచి బాలల రక్షణ బిల్లు 2011ను కేంద్ర మంత్రివర్గం మార్చ్ 2న ఆమోదించింది.

## అసోంలో బి.ఎస్.ఎఫ్ జవాన్ల మృతి

అసోం అసెంబ్లీకి ఎన్నికల సందర్భంలో బోడో, ఉల్ఫా వర్గాలు జరిపిన దాడుల వల్ల 11 మంది మరణించారు. అందులో 8 మంది బి.ఎస్.ఎఫ్ జవాన్లు, ఒక పోలీసు అధికారి, ఇద్దరు ఉల్ఫాకు చెందిన వారుగా గుర్తించారు. కోక్రఝూర్ జిల్లాలోని భూటాన్ సరిహద్దుల్లోని ఉల్టాపానీ అటవి ప్రాంతంలో బి.ఎస్.ఎఫ్ వాహనంపై ఉల్ఫా వర్గాలు ఆయుధాలతో దాడి చేశారని, అందులో 8 మంది జవాన్లు చనిపోయారని బి.ఎస్.ఎఫ్ ప్రతినిధి తెలిపారు. తీన్‌సుకియా జిల్లాలోని ఎన్‌కౌంటర్‌లో పోలీసు అధికారి, ఇద్దరు ఉల్ఫాకు చెందినవారు మరణించారు. వీ

## న్యూజిలాండ్‌లో భూకంపం

న్యూజిలాండ్ దక్షిణ నగరం క్రైస్ట్‌చర్చ్‌లో ఫిబ్రవరి 22న భూకంపం సంభవించింది. భూకంపం ధాటికి ఎన్నో భవనాలు, రోడ్లు కూలిపోయాయి. సుమారు 65 మంది మరణించగా, అనేక మంది గాయపడ్డారు. ఇంకా అనేక మంది శిథిలాల కింద చిక్కుకుపోయారు.

## దేశాధ్యక్షుడి పదవీకాలం కుదింపు

ప్రజాభీష్టానికి అనుకూలంగా ఈజిప్ట్ రాజ్యాంగాన్ని తిరగరాసే ప్రక్రియకు అక్కడి ఆపద్ధర్మ సైనిక ప్రభుత్వం ప్రయత్నాలు మొదలు పెట్టింది. మేలో పార్లమెంట్‌కు సార్వత్రిక ఎన్నికలు జరపే అవకాశాలు ఉన్నాయి. దేశాధ్యక్షుడి పదవీ కాలాన్ని ఆరేళ్ల నుంచి నాలుగేళ్లకు కుదించడం, ఎవరైనా దేశానికి రెండు సార్లు మాత్రమే అధ్యక్షుడియ్యేలా పరిమితి, దేశాధ్యక్షుడిగా ఎంపిక కాబోయే వ్యక్తి ఈజిప్ట్‌కు చెందిన తల్లిదండ్రులకు మాత్రమే జన్మించాలనే నిబంధనలు తదితర ప్రతిపాదనలు ఉన్నాయి.

## బహ్రెయిన్ పార్లమెంట్ దిగ్బంధం

గల్ఫ్‌లో అతి చిన్న రాజ్యమైన బహ్రెయిన్‌లో ప్రజాందోళనలు కొనసాగుతున్నాయి. రాజు హమద్ బిన్ ఇసా అల్ ఖలీఫాకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్యం కోసం ఉద్యమిస్తున్న ఆ దేశ పౌరులు ఫిబ్రవరి 28న పార్లమెంట్‌ను దిగ్బంధించారు. రాచరికం పోయి ప్రజాస్వామ్య పాలన కావాలని అక్కడి పౌరులు ఈజిప్ట్ తరహా పోరాటం చేస్తున్నారు.

## చే గెవెరా సహచరుడి మృతి

చే గెవెరాతో కలిసి మోటారు బైక్‌పై లాటిన్ అమెరికాలో పర్యటించిన ఆల్బర్ట్ గ్రానడో (88) క్యూబాలో మార్చ్ 6న మరణించారు. లాటిన్ అమెరికా దేశాల్లోని పేదరికాన్ని, సామాజిక అసమానతలను అధ్యయనం చేసేందుకు చే గెవెరా చేపట్టిన మోటార్ సైకిల్ యాత్రలో ఈయన కూడా కీలకపాత్ర పోషించారు. వైద్య విద్యార్థులైన వీరిద్దరూ 1951లో చేపట్టిన మోటారు సైకిల్ యాత్ర తొమ్మిది నెలలో ఎనిమిది వేల కిలోమీటర్లు పర్యటించారు. 1959లో క్యూబా నియంత బటిస్టాకు వ్యతిరేకంగా ఫిడైల్ కాస్ట్రో నాయకత్వంలో జరుగుతున్న విప్లవంలో పాల్గొన్నారు. గ్రానడో 8 ఆగస్ట్ 1922న అర్జెంటీనాలో జన్మించారు. చే గెవెరాతో కలిసి తన అనుభవాలను గ్రానడో ఒక పుస్తకం రాశారు. ఆయన చివరి కోరిక మేరకు అస్థికలను క్యూబా, అర్జెంటీనా, వెనిజులాలో కలపమన్నారు.

## అపర కుబేరుడు ముబారక్

ప్రపంచ కుబేరులను తలదన్నే విధంగా ఈజిప్ట్ మాజీ అధ్యక్షుడు హోస్నీ ముబారక్ ఆస్తులు కూడబెట్టుకున్నాడు. ప్రపంచ వ్యాప్తంగా ఆయన ఆస్తుల విలువ ముప్పై ఒక లక్షల కోట్ల రూపాయలు (70 బిలియన్ డాలర్లు) ఉన్నాయని బ్రిటిష్ పత్రిక ది గార్డియన్ తెలిపింది. ఇలా ప్రపంచంలో ఇప్పటి వరకు అత్యధిక ధనవంతులైన మెక్సికన్ వ్యాపారవేత్త కార్లోస్ స్లిమ్‌ను, మైక్రోసాఫ్ట్ వ్యవస్థాపకుడు బిల్‌గేట్స్‌ను ముబారక్ వెనక్కు నెట్టారు.

## చైనాలో రాజకీయ కుబేరులు

సామ్యవాదాన్ని సమర్థవంతంగా అమలు చేస్తున్నామని చెబుతూ పేద, గొప్ప తారతమ్యాలు ఏమాత్రం లేవంటూ పాలన సాగిస్తున్న చైనాలోని నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ (ఎన్.పి.సి.)లోనే 38 మంది కోటీశ్వరులు ఉన్నారు. అమెరికా కాంగ్రెస్‌తో పోల్చితే ఎన్.పి.సి.లో అత్యధిక స్థాయిలో కుబేరులుండి తాము ఎవరికి తీసిపోమని చైనా రాజకీయ బిలియనీర్లు నిరూపించారు.

## యెమెన్‌లో ఘర్షణలు

ప్రజాస్వామ్య సంస్కరణలు ప్రవేశపెట్టాలనీ, అధ్యక్షుడు అలీ అబ్దుల్లా సలేహ్ దిగిపోవాలనీ యెమెన్ రాజధాని సనాలో మార్చ్ 18న శాంతియుతంగా నిరసన తెలుపుతున్న ప్రజలపై సాయుధ దళాలు విచక్షణా రహితంగా కాల్పులు జరిపారు. ఈ దాడిలో 46 మంది మరణించారు. నాలుగు వందల మందికి పైగా గాయపడ్డారు. అధ్యక్షుడు సలేహ్ జాయింట్ మీటింగ్ పార్టీ (జె.ఎం.పి.) సభ్యులను చర్చలకు పిలిచారు. విదేశీ జోక్యానికి జె.ఎం.పి. ససేమిరా ఒప్పుకోకపోవడంతో చర్చలు విఫలమయ్యాయి.

## జపాన్‌లో భూకంపం, సునామీ

జపాన్‌లోని ఫుకుషిమా తీరాన సముద్రంలో మార్చ్ 11న భారీ భూకంపం సంభవించింది. ఇది రిక్టర్ స్కేల్‌పై 8.9గా నమోదయింది. ఈ భూకంపం సునామీకి దారితీసింది. ఫుకుషిమా నగరం మొత్తం నేలమట్టమయింది. దాదాపు ఇరవై ఐదు వేల మంది చనిపోయారు. అపారమైన ఆస్తి నష్టం సంభవించింది. భూకంపం వల్ల ఫుకుషిమాలోని పదకొండు అణు రియాక్టర్‌లలో విద్యుత్ సరఫరా ఆగిపోవడంతో మూడు అణు రియాక్టర్లు పేలిపోయాయి. దీంతో ప్రమాదకర స్థాయిలో రేడియో ధార్మికత వెలువడడం మొదలయింది. ఇది హిరోషిమా, నాగసాకీ, చెర్నోబిల్‌ల సంఘటనల ప్రమాద తీవ్రతను దాటిపోయే ప్రమాదం కనిపిస్తోంది. ఇది జపాన్‌కి మాత్రమే కాకుండా చుట్టుపక్కల దేశాలకు కూడా పెనువిపత్తుగా మారింది. జపాన్‌కు ప్రపంచ దేశాలు అన్ని రకాలు సహాయం అందించడానికి ముందుకు వచ్చాయి.

## పాకిస్తాన్‌లో మంత్రి హత్య

పాకిస్తాన్ మైనార్టీ వ్యవహారాల మంత్రి షహ్బాజ్ భట్టీని మార్చ్ 2న గుర్తు తెలియని వ్యక్తులు కాల్చి చంపారు. వివాదాస్పద మతదూషణల వ్యతిరేక చట్టంలో మార్పులు చేయాలని కోరినందుకే ఆయనను చంపేశారని తెలుస్తోంది. భట్టీ మంత్రివర్గంలో ఏకైక క్రైస్తవుడు. తంజిమ్ ఆల్ ఖైదా తెహ్రిక్ తాలిబన్ పంజాబ్ అనే ఉగ్రవాద సంస్థ ఈ హత్య చేసింది. వారు కాల్పులు జరిపిన తరువాత ఘటనా స్థలంలో కొన్ని కరపత్రాలు వదిలి వెళ్లారు. అందులో మహ్మద్ ప్రవక్తను అవమానపర్చిన వారెవరికైనా మరణదండన తప్పదని హెచ్చరిక చేశారు. ఈ హత్యను పాకిస్తాన్ అధ్యక్షుడు అసిఫ్ అలీ జర్దారీ, ప్రధానమంత్రి యూసుఫ రజా గిలానీతో ఖండించారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 ఫిబ్రవరి 2011 నుండి 20 మార్చ్ 2011 వరకు 20 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 2052)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 6 | – | 23 | 24 | 3 | 4 | 2 | 2 | 2 | 2 | 3 | 4 | 1 | 24 | 33 | – | – | – | 4 | – |
| హైదరాబాద్ | – | – | – | 15 | 14 | – | – | – | – | 5 | 4 | 2 | – | 3 | 33 | 18 | – | – | – | 10 | – |
| కరీంనగర్ | – | 8 | 2 | 14 | 25 | 12 | 17 | – | 4 | 7 | 2 | 2 | 5 | 4 | 25 | 22 | – | – | – | 6 | 1 |
| ఖమ్మం | – | 2 | – | 8 | 17 | 5 | 2 | 2 | 2 | 6 | 3 | 12 | 2 | 2 | 28 | 18 | – | – | – | – | 1 |
| మెదక్ | – | 3 | 1 | 3 | 25 | 2 | 5 | 4 | 2 | 6 | 1 | 4 | – | – | 28 | 25 | – | – | – | 1 | 0 |
| మహబూబ్‌నగర్ | – | 4 | – | 12 | 18 | 3 | 3 | – | 6 | 8 | 8 | 12 | 20 | 7 | 36 | 15 | – | – | – | 6 | – |
| నల్గొండ | – | 1 | – | 24 | 19 | – | 4 | 1 | – | 6 | 3 | 3 | 2 | 12 | 63 | 36 | – | – | – | 6 | – |
| నిజామాబాద్ | – | – | – | 4 | 19 | – | – | 1 | – | 1 | 3 | 4 | 3 | 7 | 24 | 18 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 4 | – | 12 | 18 | 7 | 5 | 1 | 3 | 8 | 5 | 5 | 4 | 3 | 41 | 20 | – | – | – | – | – |
| వరంగల్ | – | 5 | – | 9 | 8 | 12 | 9 | 7 | 2 | 2 | – | – | 2 | 16 | 20 | 5 | – | – | – | – | 3 |
| అనంతపూర్ | – | 10 | 3 | 21 | 15 | 8 | 8 | – | 1 | 2 | 12 | | 4 | 9 | 3 | 24 | 2 | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 9 | 5 | 8 | 7 | – | – | – | 6 | 5 | – | – | 38 | – | – | – | – | – | – |
| కర్నూలు | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| గుంటూరు | – | 4 | – | 5 | 10 | 3 | – | – | 2 | – | 4 | 3 | 1 | 2 | 4 | 12 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 7 | 12 | – | – | – | 1 | 1 | – | 1 | 7 | 4 | 23 | 6 | – | – | – | – | 1 |
| కడప | – | 4 | 1 | 8 | 7 | 2 | 4 | 2 | 3 | 4 | 2 | 3 | 2 | 3 | 22 | 5 | – | – | – | – | – |
| ప్రకాశం | – | 12 | 5 | 7 | 4 | 5 | 7 | – | 2 | 3 | – | – | – | 7 | 28 | – | – | – | – | – | – |
| శ్రీకాకుళం | 1 | 1 | 1 | 4 | 3 | 3 | 3 | 6 | – | – | 4 | 6 | – | – | 19 | 11 | 2 | – | – | – | – |
| విజయనగరం | – | 1 | – | 3 | 2 | – | – | – | 1 | 4 | – | 2 | 5 | 1 | 23 | 2 | – | – | – | – | 1 |
| తూర్పు గోదావరి* | – | 4 | – | 14 | 22 | 4 | 9 | – | 2 | 4 | 9 | 10 | 15 | 2 | 53 | 49 | – | – | – | 9 | – |
| **మొత్తం** | **1** | **69** | **13** | **202** | **267** | **74** | **87** | **26** | **33** | **69** | **68** | **77** | **76** | **83** | **535** | **319** | **4** | **–** | **–** | **42** | **7** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్

*తూర్పు గోదావరి జిల్లా సమాచారం జనవరి 21 నుంచి మార్చ్ 20 వరకు



అసహజ మరణాల సూచి

## వెలువడ్డాయి

## సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

# ముదునూరి భారతి రచనలు (ఇంగ్లిష్‌లో)




క్రైసిస్ అండ్ డెవలప్‌మెంట్ ఇన్ మార్క్సియన్ ఫ్రేమ్‌వర్క్

పేజీలు 106, వెల రు. 80




ఇండివిద్యువల్, సబ్ గ్రూప్స్, గ్రూప్స్ అండ్ ఫ్రీడమ్

పేజీలు 60, వెల రు. 75




మెథడాలజీ ఆఫ్ సోషల్ ఎంక్వైరీ

పేజీలు 208, వెల రు. 150




ఇన్ సర్చ్ ఆఫ్ మెథడ్

పేజీలు 368, వెల రు. 200




ఆన్ ఎద్యుకేషన్

(ఆర్.ఎస్. రావుతో కలిసి)

పేజీలు 142, వెల రు. 100

ప్రతులకు, వివరాలకు :


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్

హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 117 - April 2011
● RNI Regn.No.APTEL/2003/11482● Published on 29/03/2011 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణం విస్తరించడానికి సహకరించండి!
# మీ మిత్రులందరికీ పరిచయం చేయండి!!
# మీ వంతుగా చందాలు చేర్పించండి!!

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు ఎనిమిది సంవత్సరాలుగా మీరు అందిస్తున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు. మీ నిత్యజీవితంలో, కుటుంబ సభ్యులతో, పని స్థలంలో, స్నేహితులతో, భిన్నాభిప్రాయాలున్న వారితో మాట్లాడుతున్న ప్రతి సందర్భంలోనూ వీక్షణంలోని వ్యాసాలు, అభిప్రాయాలు మీకు ఉపయోగపడతూనే ఉన్నాయి. ఈ పత్రిక నిలదొక్కుకుని పది కాలాలపాటు నిలబడాలని మీరు కోరుకుంటున్నారని మాకు తెలుసు. తెలుగు సమాజానికి అవసరమయిన విభిన్న ఆలోచనలను అందించే పత్రికగా వీక్షణం ఇంకా విస్తరించాలని కూడా మీరు కోరుకుంటూ ఉంటారు. కాని, వీక్షణం ఆర్థిక పరిస్థితి సుస్థిరంగా లేదు. వీక్షణంను నిలబెట్టడానికి మీరు తక్షణమే పూనుకుని చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి.

- ❖ మీ బంధుమిత్రుల దగ్గర, మీ పనిస్థలంలో, మీరు మాట్లాడే ప్రతిచోటా, సామాజిక రాజకీయ విషయాల చర్చ వచ్చిన ప్రతిచోట ఆ విషయాల మీద వీక్షణం అవగాహన కలిగిస్తుందని ప్రస్తావించండి. వీక్షణం చదవడం ఎంత అవసరమో చెప్పండి.
- ❖ మీ చందా చెల్లించడంతోపాటు, మీ మిత్రుల కొరకు కానుకగా చందా చెల్లించండి. వారిని చందా చెల్లించమని కోరండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న గ్రంథాలయానికి వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని తెప్పించడానికి ప్రయత్నాలు చేయండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న విద్యాలయాలలో, కళాశాలలో, ముఖ్యమైన ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయాలలో, స్వచ్ఛంద సంస్థల, యువజన సంస్థల కార్యాలయాలలో వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని వారిచేత చందాలు కట్టించండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న వీక్షణం శ్రేయోభిలాషులు, విద్యా సంస్థల నిర్వాహకులు, వ్యాపారవేత్తల దగ్గర వీక్షణంకు ప్రకటనలు సేకరించండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న పత్రికల ఏజెంటు వీక్షణం తెప్పిస్తున్నారో లేదో కనుక్కుని తెప్పించేలా చూడండి.

## చందా వివరాలు

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

**వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్**

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao